


# CHIRASMARANEEYULU (First Part)

Telugu title of this book is CHRASMRANEEYULU.

In this book brief life Sketches (each two pages) of 100 Muslim Heroes who fought against British. It started from Bengal Nawab Sirajuddowla of 1757 Palsy War to 1947 Shaik Moula Saheb of Andhrapradesh was given. Almost all sketches are having photos of freedom fighters.

This Book contains total 224 pages of 1/8$^{th}$ Demmy Size with Multi colour title. It was published in 2008. The same was Published second time in the year 2009.

Three more Parts of this book is Planed and May come out with in one or two Years if circumstances allowed

# చిరస్మరణీయులు

( బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో పాల్గొన్న ముస్లిం యోధులు )



## సయ్యద్ నశీర్ అహమ్మద్



సయ్యద్ నశీర్ అహమ్మద్



**సయ్యద్ నశీర్ అహమ్మద్**, 1955 డిసెంబరు 22న నెల్లూరు జిల్లా పుదిడి గ్రామంలో జన్మించారు. తల్లి సయ్యద్ బీబీజాన్, తండ్రి సయ్యద్ మీరా మొహిద్దీన్. పుదిడిలో ప్రాథమిక విద్య తరువాత కావలి, నరసరావుపేట, భోపాల్, చిత్రదుర్గ, గుంటూరు ప్రాంతాలలో ఉన్నత విద్యాభ్యాసం చేశారు.

1984లో ప్రభుత్వ ఉద్యోగానికి రాజీనామా చేసి న్యాయవాద వృత్తిలోకి ప్రవేశించారు. 'ఉదయం' దినపత్రిక నరసరావుపేట విలేఖరిగా పనిచేస్తూ, పది సంవత్సరాల కాలంలో ఆ పత్రిక విజయవాడ ఎడిషన్ న్యూస్ కో-ఆర్డినేటర్ స్థాయికి ఎదిగారు. ఆ తరువాత సిటీకేబుల్ నెట్ వర్క్ ప్రైవేట్ లిమిటెడ్' (విజయవాడ)లో న్యూస్, న్యాయ వ్యవహారాల సమన్వయకర్తగా బాధ్యతలు నిర్వహించారు. అనంతరం 'వార్త' దినపత్రిక గుంటూరు న్యూస్ బ్యూరో ఇన్‌చార్జ్‌గా 2004 వరకు పనిచేశారు.

సమాజాన్ని అధ్యయనం చేయడం ద్వారా పరిశీలనా దృష్టిని, సేవాభావాన్ని అలవర్చుకున్న ఆయన విద్యార్థి దశ నుండి పలు సాంఘిక, సాహితీ, సేవా సంస్థల కార్యక్రమాలలో భాగస్వాములయ్యారు. సామాజిక కార్యకర్తగా అంధ విద్యార్థుల, వికలాంగుల, కుష్టురోగ పీడితుల సమస్యల పరిష్కారం కోసం, వారి ఆరోగ్యం-అభ్యున్నతికి కృషి చేస్తున్నారు.

గత మూడు దశాబ్దాలుగా నశీర్ రాసిన వ్యాసాలు, కవితలు, కథానికలు రాష్ట్రంలోని దాదాపు అన్ని పత్రికలలో చోటుచేసుకున్నాయి. భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్రను వివరిస్తూ కొన్ని ప్రామాణిక చరిత్ర గ్రంథాలను వెలువరించిన ఆయన చరిత్రకారుడిగా కూడా ప్రజలు, పండితుల ప్రశంసలందుకున్నారు.

భారత ముస్లిం జనసముదాయాల సామాజిక- ఆర్థిక -రాజకీయ స్థితిగతుల మీద విస్తృత అధ్యయనం చేస్తున్నారు. జాతీయ, అంతర్జాతీయ సంస్థలలో సభ్యునిగా పలు సభలు, సదస్సులు, సమావేశాలలో పాల్గొన్నారు. ఆయన మంచి వక్త మాత్రమే కాకుండా నటుడు, చిత్రకారుడు, కార్టూనిస్టుగా కూడా సుప్రసిద్ధుడు.

భారత దేశంలోని అన్ని సాంఘిక జనసముదాయాల మధ్య సద్భావన, సహజీవనం, స్నేహం మరింత పటిష్టం కావాలని, సమాజంలో సామరస్యం, సుహృద్భావ వాతావరణం మరింతగా వికసించాలని ఆకాంక్షించే సయ్యద్ నశీర్ అహమ్మద్ మానవతావాది, అన్ని రకాల అసమానతలు తొలగిపోవాలని ఆకాంక్షించే లౌకిక ప్రజాస్వామ్యవాది.

-ప్రచురణకర్తలు

# చిరస్మరణీయులు

( బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో పాల్గొన్న

ముస్లిం యోధులు )

## సయ్యద్ నశీర్ అహమ్మద్

**ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్**

**వినుకొండ-522 647**

**పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి**
**ఆర్థిక సహాయంతో ముద్రితం.**


**చిరస్మరణీయులు**

(బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో పాల్గొన్న ముస్లిం యోధులు)

సయ్యద్ నశీర్ అహమ్మద్





ప్రథమ ముద్రణ : నవంబర్ 2008

ముఖచిత్రం : వజ్రగిరి జెస్టిస్, వినుకొండ.

ముద్రణ : మిత్రా ప్రింటింగ్ ప్రెస్, విజయవాడ

**పుస్తకాలకు :**

**ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్**

శివప్రసాద్ వీధి, కొత్తపేట,

వినుకొండ-522 647, గుంటూరు జిల్లా.

దూరవాణి : 9440241727

**మరియు**

అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలు.

**వెల :**

సాధారణ ప్రతి : రు. 100-00

గ్రంథాలయ ప్రతి : రు. 125-00

# ఇందులో....

◆ ◆ ◆




ఆచార్య పి.రామలక్ష్మి M.A., Ph.D

చరిత్ర - పురావస్తు విభాగం,

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు


# పరిచయవాక్యం

విభిన్న సాంఘిక జనసముదాయాల మధ్య సంయమనం, సమన్వయం, సామరస్యం సాధించాలనుకున్న శక్తులు సకారాత్మక ధోరణిలో కృషి సాగించటం వాంఛనీయం. చరిత్రలోని వాస్తవికతను ప్రజల ముందుకు తెచ్చి ఉమ్మడి కృషి, త్యాగాలలో ఆయా సముదాయాల పాత్రను సవివరంగా, చారిత్రక ఆధారాలతో సహా ప్రజా బాహుళ్యానికి వెల్లడి చేయడం అభిలషణీయమైన చరిత్ర రచనా విధానం. చరిత్రలోని వాస్తవాలు తెలిసి త్యాగమయ పోరాటాలలో సాటి జనసమూహాల భాగస్వామ్యాన్ని తెలుసుకున్న సమకాలీన సమాజంలో సదవగాహన-సద్భావన వృద్ధిచెంది సమాజాన్ని అశాంతికి గురిచేసే ఘర్షణ వైఖరి స్థానంలో శాంతి-సామరస్యం-సౌభ్రాతృత్వ వాతావరణం మరింతగా పరిఢవిల్లుతుంది.

ఈ గ్రంథ రచయిత సయ్యద్ నశీర్ అహ్మద్ సరిగ్గా ఇదే మార్గంలో లక్ష్యసాధన దిశగా కృషి ఆరంభించి, అందుకు చరిత్ర రచనను సాధనం చేసుకున్నారు. ఆ ప్రయత్నంలో భాగంగా భారత స్వాతంత్రోద్యమంలో ముస్లింలు నిర్వహించిన మహోన్నత పాత్రను వెలికి తీసి, ప్రతి అంశాన్ని విడమర్చి వివరిస్తూ ఇప్పటివరకు తెలుగులో వెలువరించిన ఏడు గ్రంథాలలో కూడా ఈ లక్ష్యమే స్పష్టమౌతుంది. ఆ కారణంగా నశీర్ రాసిన ఏడు చరిత్ర గ్రంథాలలో నాలుగు గ్రంథాలు మూడుసార్లు, మూడు గ్రంథాలు రెండుసార్లు పునర్ముద్రణ పొందాయి.

ప్రస్తుత గ్రంథం **చిరస్మరణీయులు** కూడా ఆ లక్ష్యసాధనలో భాగంగా రూపు దిద్దుకుంది. ఈ గ్రంథం బ్రిటీష్ ప్రభుత్వాన్ని ఎదిరించిన ముస్లిం యోధులు, ముస్లిం స్త్రీమూర్తుల గురించి, మానవీయ విలువలకై శ్రమించిన వారి జీవిత ఘట్టాలను సంక్షిప్తంగా తెలియజేస్తోంది. రచయిత ఎంతో శ్రమించి, ఎన్నో ఆధారాలను సేకరించి సులభశైలిలో చారిత్రక వాస్తవాలను ఉటంకిస్తూ సాగించిన రచనారీతి అందరిని చదివింప జేస్తుంది. లౌకిక విలువల కోసం పాటుపడిన నాటితరం జీవితాలను వివరించడం ద్వారా, నేటి తరానికి ఆ విలువల ఆవశ్యకతను రచయిత తెలియజేస్తున్నారు.

సామాన్య ప్రజానీకానికి మాత్రమే కాకుండా, చరిత్రలో ప్రవేశమున్న వారికి సహితం తెలియని స్వాతంత్ర్యసమరయోధుల జీవితాలను, వారి జీవితాలలోని ప్రత్యేక ఘట్టాలను **చిరస్మరణీయులు** ద్వారా రచయిత పరిచయం చేస్తున్నారు. స్వాతంత్ర్యోద్యమం లోని వివిధ దశలలో ఆ యోధులు నిర్వహించిన అత్యంత ప్రాధాన్యత గల పాత్రను తగిన ఆధారాలతో సహా ఈ గ్రంథాన్ని రచయిత రూపొందించారు. ఈ పరిచయం క్లుప్తంగా రెండు పేజీలకు మించకున్నా వ్యక్తుల ప్రాముఖ్యతకు ఎక్కడా ఏమాత్రం లోటు రానివ్వకుండా రచయిత నశీర్ అహమ్మద్ తగిన జాగ్రత్తలు తీసుకున్నారు.

1757లో ఆంగ్లేయుల కుటిలత్వాన్ని ఆదిలోనే గ్రహించి వారి ఆటకట్టించేందుకు యత్నించిన బెంగాలు నవాబు సిరాజుద్దౌలా, మీర్ ఖాశిం‌ల నుండి ఆరంభమై బ్రిటీషర్ల సామ్రాజ్యవిస్తరణ కాంక్షను తొలిదశలోనే పసిగట్టి స్వదేశీయులను హెచ్చరించడమే కాకుండా చివరి క్షణం వరకు ఆంగ్లేయులను అడుగడుగునా అడ్డుకున్న హైదర్ అలీ, టిపూ సుల్తాన్‌ల వీరోచిత పోరాటాల విశేషాలతో **చిరస్మరణీయులు** ప్రారంభమౌతుంది. ఆనాడు బ్రిటీషర్లకు, వారికి తొత్తులుగా వ్యవహరిస్తూ ప్రజలను పీడిస్తున్న మహాజనులు, జమీందార్లకు వ్యతిరేకంగా ప్రజలను సమాయత్తం చేసి పోరుబాటన నడిపించి, అంగ్లేయాధికారులను ఖంగు తిన్పించిన ప్రజా పోరాట నాయకులైన సయ్యద్ అహ్మద్ బరేల్వీ, టిటూమీర్, హాజీ షరియతుల్లా, దూదూమియా లాంటి యోధుల సమాచారాన్ని ఈ గ్రంథం అందిస్తుంది.

1857 నాటి పోరాటానికి నాయకత్వం వహించిన మొగల్ పాదుషా బహుద్దూర్ షా జఫర్ నుండి ఆనాటి పోరాటాలకు వ్యూహకర్తగా వ్యవహరించిన అజీముల్లా ఖాన్, ప్రథమ స్వాతంత్ర్య సమరయోధుల సర్వసేనాని భక్త్‌ఖాన్, ఆంగ్లేయ సైన్యాలను ముప్పు తిప్పలు పెట్టిన మౌల్వీ అహమ్మదుల్లా ఫైజాబాది నుండి సామాన్య సైనికులు పఠాన్ సలాబత్ ఖాన్ తదితరులు మాతృభూమి విముక్తి కోరుతూ సాగిన పోరాటంలో నిర్వహించిన త్యాగమయ సాహసోపేత పాత్రను **చిరస్మరణీయులు** వెల్లడిస్తుంది.

ఈ సంగ్రామంలో పురుషులతోపాటుగా వీరోచితంగా పోరాడిన బేగం హజరత్ మహల్, మృత్యువులో సహితం ఝాన్సీరాణిని నీడలా అనుసరించిన ముందర్, విలాసవంతమైన జీవితాన్ని వదలి కాన్పూరు అధినేత నానా సాహెబ్ పక్షాన చేరి స్వయంగా రణరంగంలో పాల్గొన్న బేగం అజీజున్ లాంటి మహిళల స్ఫూర్తిదాయక కథనాలు వారి చిత్రాలతో సహా ఈ గ్రంథంలో చోటుచేసుకున్నాయి.

మన రాష్ట్రంలో ప్రజల మీద ఆంగ్లేయులు సాగిస్తున్న ఆధిపత్యానికి వ్యతిరేకంగా ప్రజలతో కలసి హైదరాబాద్ రెసిడెన్సీ మీద సాహసోపేత దాడి చేసిన పఠాన్ తుర్రేబాజ్ ఖాన్, మౌల్వీ అల్లావుద్దీన్‌లను, అంధులైనప్పటికి కడప కేంద్రంగా ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యం మీద పోరాటానికి పకడ్బందీగా పథక రచన చేసిన షేక్ పీర్ షా సాహసం గురించిన ఆసక్తిదాయక వివరాలు ఈ గ్రంథంలో ఉన్నాయి.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం తరువాత 28 ఏండ్లకు ఉనికిలోకి వచ్చిన 1885 నాటి భారత జాతీయ కాంగ్రెస్ సమావేశాలకు హాజరైన రహిమతుల్లా సయాని, జాతీయ కాంగ్రెస్‌కు తొలిదశలోనే అధ్యక్ష పీఠం అలంకరించిన జస్టిస్ బద్రుద్దీన్ తయ్యాబ్జీలతో ఆరంభమై ఆ తరువాత సాగిన అహింసాయుత, సాయుధ పోరాటాలలో పాల్గొని స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో తమదైన ముద్రను స్థిరపర్చుకున్న ప్రముఖుల వివరాలను 'చిరస్మరణీయులు' వెల్లడిస్తుంది.

ఆ తరువాత జాతీయోద్యమ కాలంలో ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉద్యమించిన యోధులలో ఖిలాఫత్ ఉద్యమ సారథులుగా ఖ్యాతిగాంచిన అలీ సోదరులు, దశాబ్దాలుగా ప్రవాస జీవితం గడిపిన మౌల్వీ ఒబైదుల్లా సింధీ, ప్రవాస భారత ప్రభుత్వ ప్రథమ ప్రధానిగా బాధ్యతలు స్వీకరించిన బర్కతుల్లా భోపాలి, ఉత్తేజపూరిత ప్రసంగాలతో సభికులను తనవైపుకు ఆకట్టుకుంటూ జాతీయోద్యమంలో 'చిచ్చర పిడుగు' గా ఖ్యాతి గాంచిన మౌలానా హస్రత్ మోహాని, గుజరాత్‌లో గాంధీజీ సాగించిన ప్రయోగాలకు నాయకత్వం వహించిన జస్టిస్ అబ్బాస్ తయ్యాబ్జీలు లాంటి చిరస్మరణీయులు ఈ గ్రంథంలో తారసపడతారు.

గోవధను నిషేధించాలని కోరిన హకీం అజ్మల్ ఖాన్, మౌలానా మజహర్రుల్ హఖ్, సాయుధ పోరాటంలో భాగంగా నాయకుడి కోసం నేరభారాన్నంతా తాను మోసి ఉరికంబం ఎక్కడానికి సిద్దపడ్డ 'కాకోరి వీరుడు' అష్ఫాఖుల్లా ఖాన్, సాయుధపోరాటానికి వ్యూహరచన గావించిన మౌలానా ముహమ్మద్ హసన్, చివరిశ్వాస వరకు హిందూ, ముస్లింల ఐక్యత కోసం శ్రమించిన డాక్టర్ ముక్తార్ అహమ్మద్ అన్సారి లాంటి యోధులకు సంబంధించిన అత్యంత విలువైన సమాచారంతోపాటుగా ఆనాడు దేశ విభజనను వ్యతిరేకిస్తూ, హిందూ, ముస్లిం ఐక్యతను ప్రగాఢంగా వాంఛిస్తూ అ విశ్రాంత ప్రయత్నాలు చేసిన పలువురు వ్యక్తుల కృషి ఈ గ్రంథంలో నమోదయ్యింది.

బీహార్ రాష్ట్రం చంపారన్‌లో గాంధీజీని విషాహారం నుండి రక్షించిన బతఖ్ మియా అన్సారి లాంటి సామాన్యులు, జాతీయ కాంగ్రెస్‌ను ప్రభావితం చేయగలిగినంతగా, ఆంగ్లేయుల పెత్తనానికి వ్యతిరేకంగా రైతాంగ పోరాటాన్ని నిర్వహించిన షేక్ ముహ్మద్ గులాబ్ లాంటి రైతు నాయకులకు సంబంధించి చాలావరకు వెలుగులోకి రాని విశేషాలను ఈ గ్రంథంలో ఆధారాలతో సహా రచయిత పాఠకుల ముందుంచారు.

ఈ గ్రంథంలో పురుషులతోపాటుగా పోరుబాట సాగిన మహిళలకు రచయిత తగిన ప్రాముఖ్యత కల్పించారు. ముస్లిం మహిళలు పర్దా చాటున మాత్రమే ఉంటారన్న అపోహను బద్దలు కొడ్తూ అనేకమంది ముస్లిం మహిళలు బహిరంగ జీవనంలోకి ప్రవేశించి, బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో పాల్గొనడమేగాక ఇతరులను సయితం ఉత్తేజపర్చిన తీరు-తెన్నులు ఈ పుస్తకంలో చూస్తాం. అవసరం వచ్చినప్పుడు మాతృభూమి సేవల కోసంగాను వ్యక్తిగత బంధనాలను కూడా త్రోసిపుచ్చుతూ మహిళలు కూడా శాంతియుత -సాయుధ పోరాటాలలో పాల్గొన్న వైనాన్ని కళ్ళకు కట్టినట్టు రచయిత వివరించారు. బ్రిటిష్ వ్యతిరేక ఉద్యమకారులైన మహిళల జీవితాలను పరికిస్తే ముస్లిం మహిళ గురించి ప్రచారంలోఉన్న సంకుచిత భావాలు చాలా వరకు దూరం కాగలవు.

జాతీయోద్యమకారుల చేత '**అమ్మా**' అన్పించుకుని, జాతీయోద్యమ స్ఫూర్తిని రగిల్చిన ఆబాదిబానో బేగం, ప్రముఖ విప్లవకారుడు ఖుదీరాం బోసుకు ఆశ్రయమిచ్చి, తన అసలు పేరుతో కాకుండా '**ఖుదీరాం కి దీదీ**' పేరుతో ప్రసిద్ధికెక్కిన ఖుదీరాం కి దీదీ, సింధ్-నౌఖాళీ ప్రాంతాల్లో మతకల్లోలాలు చెలరేగినప్పుడు, మహాత్ముని ఆదేశాల మేరకు ఆ ప్రాంతాలలో పర్యటించి, హిందూ-ముస్లింల ఐక్యత కోసం కృషి చేయడం మాత్రమే కాకుండా చివరకు 20 రోజులపాటు సత్యాగ్రహ దీక్ష సాగించి గాంధీజీ నిజమైన

వారసురాలిగా పేర్గాంచిన గాంధీ దంపతుల ఇష్టపుత్రిక బీబి అమతుస్సలాం ఈ గ్రంథంలో కన్పిస్తారు.

భర్తతో కలసి విభజన వ్యతిరేకోద్యమాన్ని సాగించిన పంజాబుకు చెందిన షఫాతున్నీసా బీబి, అకుంఠిత దీక్షతో నిర్వహించిన సేవా కార్యక్రమాలకు గాను మహాత్ముని నుండి ప్రత్యేకంగా వందనాలు అందుకున్న షంషున్నీసా అన్సారి, జుగాంతర్ విప్లవదళ యోధురాలైన రజియా ఖాతూన్, వితంతువులు పైజామా కుర్తా ధరించరాదన్న సంప్రదాయవాదుల నిషేధాజ్ఞలను ఉల్లంఘించి ఖద్దరు బట్టలు ధరించి ఉద్యమించిన సుగరా ఖాతూన్, ఉమ్మడి ప్రయోజనాల ముందు వ్యక్తిగత జీవితాలు ఏమాత్రం ప్రధానం కావంటూ ' **మా మాతృభూమి స్వేచ్ఛాస్వాతంత్ర్యాల నిమిత్తం పోరాడుతున్న నా భర్త జీవితం తొలుత ఈ జాతి సొత్తు; ఆ తరువాత మాత్రమే నాది, మరెవరిదైనా**' అని ప్రకటించి సంచలనం సృష్టించిన బేగం ఆలం తారసపడతారు. అపూర్వ ధైర్య సాహసాలతో పోరాటాలలో పాల్గొన్న మహిళల వివరాలు చాల మంది దృష్టికి రాని అంశాలే !

మనరాష్ట్రానికి సంబంధించి కూడా చాలా అమూల్యమైన సమాచారాన్ని రచయిత అందించారు. 1885లో అఖిల భారత జాతీయ కాంగ్రెస్ ఏర్పడగానే నిజాం ఆదేశాలను ఖాతరు చేయకుండా హైద్రాబాదు రాష్ట్రం నుండి సభ్యత్వం స్వీకరించిన ప్రప్రథమ ముస్లింగా ఖ్యాతిగాంచిన ముల్లా అబ్దుల్ ఖయ్యూం ఖాన్, డాక్టర్ సరోజిని నాయుడు తండ్రి అఘోరనాథ్ చట్టోపాధ్యాయతో కలసి హిందూ-ముస్లింల ఐక్యతకు కృషిచేశారు. మన్యం పోరాట వీరుడు అల్లూరి సీతారామరాజుకు పరోక్షంగా సహాయ సహకారాలు అందించిన బ్రిటీష్ ప్రభుత్వాధికారి ఫజులుల్లా ఖాన్, ఖద్దరు విక్రయశాలను ఆరంభించి 'ఖద్దర్ ఇస్మాయిల్' గా పేర్గాంచిన ముహమ్మద్ ఇస్మాయిల్, నేతాజి సుభాష్ చంద్రబోస్‌కు వ్యక్తిగత కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహించిన అబిద్ హసన్ సఫ్రాని లాంటి యోధుల గురించి, స్వాతంత్ర్యం లభించాక నిజాం సంస్థానం నుండి వేరుపడి స్వతంత్ర రిపబ్లిక్‌ను ప్రకటించిన 'పరిటాల రిపబ్లిక్' స్థాపనలో తనదైన ఉత్తేజకర పాత్రవహించిన షేక్ మౌలా సాహెబ్ జీవిత విశేషాలు సమకూర్చడంలో రచయిత శ్రమ అర్థమవుతుంది. జాతీయోద్యమంలో పురుషులతోపాటుగా పరోక్షంగా పాల్గొన్న హజరా బీబి లాంటి మహిళల జీవిత విశేషాలను రచయిత ఈ గ్రంథంలో పొందుపర్చారు.

స్వాతంత్ర్యోద్యమ కాలంలో ఒకవైపున బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా జాతీయోద్యమంలో ప్రధాన పాత్ర వహిస్తూ, సంఘం సంస్కరణకు, సత్సంఘం నిర్మాణానికి ప్రాధాన్యతనిస్తూ, సామ్యవాద వ్యవస్థ స్థాపనకు పాటుపడిన ఉద్యమకారుల గురించి కూడా రచయిత వివరించారు.

1919లో బ్రిటిష్ ప్రభుత్వాన్ని శత్రువుగా పరిగణించి దేశం వదలి వెళ్ళాలని ముస్లింలు తీసుకున్న నిర్ణయం మేరకు కొందరు దేశం విడిచి వెళ్ళారు. అలా వెళ్ళిన వాళ్ళు సానుకూల పరిస్థితులకు నోచుకోక అష్టకష్టాలు పడి అటునుండి రష్యా వెళ్ళి, సామ్యవాద వ్యవస్థపట్ల ఆకర్షితులయ్యారు. అలా ఆకర్షితులై షౌకత్ ఉస్మాని భారత కమ్యూనిస్టు పార్టీ నిర్మాణంలో పాలుపంచుకున్నారు. దక్షిణ భారత దేశంలో రహస్యంగా కమ్యూనిస్టు పార్టీ నిర్మాణానికి సిద్ధపడి వచ్చి పుచ్చలపల్లి సుందరయ్య, కంభంపాటి సీనియర్‌కు కమ్యూనిజాన్ని పరిచయం చేసిన అమీర్ హైదర్ ఖాన్, సామ్యవాద వ్యవస్థ నిర్మాణం కోసం అహర్నిశలు కృషి చేసిన కాకాబాబు ముజఫర్ అహమ్మద్ లాంటి ప్రముఖుల గురించి ఈ గ్రంథంలో ఉన్న ఆసక్తికర విషయాలు మనల్ని ఆకట్టుకుంటాయి.

జమిందారి కుటుంబం నుండి వచ్చినప్పటికీ సోషలిస్టు భావాల పట్ల ఆకర్షితులై జమిందారీ వ్యవస్థ రద్దుకు కృషి చేసిన జాతీయ కాంగ్రెస్ నేత రఫీ అహమ్మద్ కిద్వాయ్, క్విట్ ఇండియా, సైమన్ వ్యతిరేక ఉద్యమాలలో సింహంలా విక్రమించిన సామ్యవాది యూసుఫ్ మెహర్ అలీ లాంటి నేతలు, కార్మికుడిగా జీవితం ఆరంభించి, జాతీయోద్యమంలో ప్రవేశించి ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ వ్యవస్థాపకులలో ఒకరై, ఉపాధ్యక్షులుగా సేవలు అందించిన అబిద్ అలీ లాంటి యోధుల జీవిత విశేషాలు ఆకట్టుకుంటాయి. ఈ గ్రంథంలో ప్రచురించిన వంద మంది స్వాతంత్ర్యసమరయోధులలో అత్యధికుల చిత్రాల వలన వారి కృషి, త్యాగం పాఠకుల హృదయాల మీద చెరగని ముద్ర వేస్తుంది.

ఈ విధంగా మానవీయ-లౌకిక విలువల కోసం జీవితాలను ధారపోసిన వంద మంది స్వాతంత్ర్యసమర యోధుల విశేషాలను అందించిన **చిరస్మరణీయులు** గ్రంథానికి పరిచయవాక్యం రాసే అవకాశం నాకు లభించినందుకు సంతోషిస్తూ, చరిత్రకారులు, రచయిత సయ్యద్ నశీర్ అహమ్మద్ గారికి శుభాభినందనలు తెలుపుతున్నాను. ◆




డాక్టర్ జి.సాంబశివారెడ్డి

**M.A., M.Ed., Ph.D**

**చరిత్రశాఖాధ్యక్షులు, SBVR కళాశాల, బద్వేల్.**


# ఆప్తవాక్యం

**2**004లో విజయవాడ లయోలా కళాశాలలో ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెస్ సదస్సు జరిగినప్పుడు మిత్రులు మహబూబ్ బాషా ద్వారా సయ్యద్ నశీర్ అహమ్మద్ గారు పరిచయమయ్యారు. ఆ తర్వాత నాగార్జునసాగర్, కడప తదితర చోట్ల జరిగిన చరిత్ర సదస్సులలో నశీర్‌ని కలవడం జరుగుతున్నది. మిత్రులు నశీర్ రచనా కార్యకలాపాలను గూర్చి బాషా చెబుతున్నప్పుడు ఎంతో ఆశ్చర్యానికి లోనయ్యాను. క్రమక్రమంగా ఆయన గూర్చి మరిన్ని వివరాలు తెలియడమూ, ప్రత్యక్షంగా ఆయనను కలవడమూ, ఆయనతో ఆలోచనలు పంచుకోవడమూ జరిగి అభిమానం పెరిగి, ఆప్తంగా మారింది. మంచివాడితో స్నేహం సాయంకాలపు నీడలాగా పెరుగుతుందని ఎవరో కవివర్యులు అన్నట్టుగా నశీర్ అహమ్మద్‌తో స్నేహం దినదిన ప్రవర్ధమానమవుతూ వస్తోంది.

ఒక 'జాతి'గా 'భారతజాతి'ని రూపొందించడానికి చారిత్రక జ్ఞానం అనివార్యం. భారత జాతీయ అస్తిత్వానికి చరిత్ర జ్ఞానం ఆయువుపట్టు అన్నా అతిశయోక్తికాదు. భారత జాతి ఏ విధంగా రూపొందిందన్న విషయం తెలుసుకోవడం భారతీయులందరి కర్తవ్యం. 'సుసంపన్నమైన బహువిధమైన మన దేశ వారసత్వ సంపద' పట్ల గర్వించాలంటే ఏయే సాంఘిక సముదాయాలు, ఏయే విధంగా యిక్కడి చరిత్ర, సంస్కృతులను సుసంపన్నం చేశాయో మనం తెలుసుకోవాలి. ఇలా తెలుసుకున్నప్పుడు వివిధ సాంఘిక సముదాయాలకు ఒకరి పట్ల ఒకరికి గౌరవం, సహానుభూతి యేర్పడతాయి. ఇలాంటి భావాలే జాతీయ విలువల్ని రూపొందిస్తాయి. ఇలాంటి రచనలు మనకెంతగానో అవసరం.

కానీ దురదృష్టవశాత్తు ఈ పని సవ్యంగా సాగడం లేదు. భారత దేశ నిర్మాణంలో అవిభాజ్య భాగాలైపోయిన ముస్లింల చరిత్ర విస్మరణకు గురైపోతుండడం దీనికొక ఉదాహరణగా చూడవచ్చు. ఋణాత్మక భావనలో ముస్లింలు చరిత్ర భారాన్ని మోయాల్సి రావడం మిక్కిలి శోచనీయం. 'సెక్యులర్' భారతంలో ముస్లింలు దినదినమూ అంచులకు నెట్టివేయబడుతున్న వైనం మనందరికీ తెలిసిందే! మనకు సాధారణంగా తెలిసిన విషయాలనే జస్టిస్ సచార్ కమిటీ గణాంకాల ఆధారంతో ఋజువు పర్చింది. తనకు ప్రమేయం లేకుండా జరిగిన చరిత్ర వల్ల చేకూడిన పుట్టుమచ్చల భారాన్ని భారత ముస్లింలు మోస్తున్నారు.

ఇలాంటి దయనీయ పరిస్థితులు ఒకవైపున అప్రతిహతంగా సాగిపోతూంటే యింకోవైపు కొన్ని ముస్లిం వ్యతిరేకశక్తులు పనిగట్టుకుని వీరిపట్ల విద్వేషాలను రెచ్చగొడుతున్నాయి. దీనికై చరిత్రను వక్రీకరిస్తున్నాయి. 'కమల నాగులు' పడగలిప్పి కసిదీర బుసలు కొట్టడం, తమ రథచక్రాల కింద అసలు చరిత్రను నలిపివేయడం సమీప గతంలో చూసి మనం దిగ్భ్రమకు గురయ్యాం. భారతీయ మిశ్రమ సాంస్కృతిక విలువల్ని కాలరాసి విషమయం చేయ్యాలని ఈ నయవంచక శక్తులు శతవిధాల ప్రయత్నిస్తున్నాయి; అడపాదడపా విజయవంతమవుతున్నాయి. పసిపిల్లల మెదళ్ళని దురాక్రమిస్తున్నాయి.

సరిగ్గా ఈ సందర్భంలోనే నశీర్ గారి చరిత్ర పుస్తకాలు వెలుగు చూస్తున్నాయి. వాటి చారిత్రక ప్రాధాన్యత కూడా ఈ నేపథ్యంలోనే ఏర్పడుతుంది. 'ముస్లింలు విదేశీయులు', 'దేశద్రోహులు', 'ఇక్కడి సంస్కతిని మంటగలిపారు', 'నాశనం చేయడం మినహా ఈ దేశానికి ముస్లింలు చేసిందేమీ లేదు' మొదలైన కలుపు మొక్క ఆలోచనలు దాదాపుగా 'ప్యాసివ్' ఆమోదం పొందుతున్న సందర్భంలో భరతమాతను దాస్యశృంఖాల నుండి విముక్తం చెయ్యడానికి ఉరికొయ్యలు, చెఱసాలలు, ఫిరంగి కుహరాలను ముద్దాడిన ముస్లింల చరిత్రను కళ్ళకు కట్టినట్లు దృశ్యీకరిస్తున్న నశీర్‌గారి కృషిని ప్రశంసించకుండా ఎలా ఉండగలం !

ఒకటికాదు, రెండు కాదు సుమారు ఏడు పరిశోధనాత్మక చరిత్ర గ్రంథాలను అతి తక్కువ కాలంలో వెలువరించడం వెనుక ఎంతకృషి ఉందో మళ్ళీ మళ్ళీ చెప్పాల్సిన అవసరం లేదు. ఈ పుస్తకాలు పలు ముద్రణలు పొందుతున్నాయంటే అవి పాఠకుల ఆదరణ ఏమేరకు చూరగొంటున్నాయో తెలుస్తుంది. ప్రముఖ విశ్వవిద్యాలయాల్లోని ప్రొఫెసర్లు సైతం చేయలేకపోయిన / పోతున్న పనిని నశీర్ అహమ్మద్ ఒక్కరుగా చేసుకురావడం ఎవరికైనా ఆశ్చర్యం కలిగించకమానదు.

నశీర్ మనుషులను ప్రేమిస్తారు; మనుషులు నిర్మించిన చరిత్రను మరీ ప్రేమిస్తారు. పుంఖానుపుంఖాలుగా ఆయన కలం నుండి జాలువారుతున్న రచనలు ఈ విషయాన్నే నిరూపించి, అయన కర్తవ్యపరాయణతకూ, సామాజిక నిబద్ధతకూ, దీక్షాదక్షతలకు అద్దం పడ్తున్నాయి. మన భావిభారత పౌరులకు వివిధ సాంఘిక జనసముదాయాల ఆత్మార్పణలను, త్యాగాన్ని సాధికారికంగా పరిచయం చేయడం ద్వారా రాజ్యాంగంలో పొందుపర్చుకున్న లౌకిక విలువల్ని కాపాడుకొని, సౌభ్రాతృత్వ పుష్పాలను పూయించగలం. ఈ బృహత్తర కార్యాన్ని ఫలప్రదంగా నిర్వహిస్తున్న **ఏకలవ్యుడ్ని** మనసారా అభినందిసున్నాను.

**ఆగే బడో నశీర్ సాబ్ ... హమ్ సబ్ ఆప్‌కే సాత్ హై౦.**



**సయ్యద్ నశీర్ అహమ్మద్**
**శివప్రసాద్ వీధి, కొత్తపేట**
**వినుకొండ - 522 647.**

# రచయిత మాట

బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో పాల్గొని తమదైన సాహసోపేత, త్యాగాలతో పునీతులైన ముస్లిం యోధుల గురించి సంక్షిప్త సమాచారంతో పుస్తకం రాయమని చాలా కాలంగా మిత్రులు, విజయవాడకు చెందిన సామాజిక కార్యకర్త హబీబుర్ రెహమాన్ కోరుతూ వచ్చినందున **చిరస్మరణీయులు** రాశాను. ఒక్కసారిగా వందమంది స్వాతంత్ర్య సమర యోధుల జీవిత చరిత్రలను ఒక గ్రంథంలోనే చదవగల అవకాశం పాఠకులకు కల్పిస్తే బాగుంటుందన్న మిత్రుని సలహా ఈ పుస్తకాన్ని రూపొందించేందుకు మరింతగా నన్ను పురికొల్పింది.

ఆంగ్లేయుల పాలనను తుదముట్టించేందుకు 1757 నుండి 1947 వరకు సాగిన పోరాటాలలో పాల్గొన్న వంద మంది యోధుల గురించి సంక్షిప్తంగా **చిరస్మరణీయులు** లో వివరించాను. ఈ పోరాటాలలో పాల్గొన్న సామాన్య సైనికుడి నుండి సంస్థానాధీశుని వరకు, సామాన్య ప్రజల నుండి ప్రముఖుల వరకు ప్రాతినిధ్యం కల్పిస్తూ తగిన ప్రాథమిక సమాచారంతోపాటుగా విశేషాంశాలను కూడా జోడించ ప్రయత్నించాను.

ప్రథమ స్వాతంత్ర సంగ్రామానికి ముందు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజలను సమీకరించి ఉద్యమించిన ప్రజా పోరాటాల నేతలు, ఆ తరువాత ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల పెత్తనాన్ని తిరస్కరిస్తూ పోరుబాట పట్టిన నవాబులు, సంస్థానాధీశుల వివరాలను, ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం, జాతీయోద్యమంలో భాగంగా సాగిన శాంతియుత-సాయుధ పోరాటాలలో భాగస్వాములైన సమర యోధులు, చివరకు ఇండియన్ యూనియన్ లో నైజాం సంస్థానం విలీనం కోరుతూ సాగిన ఉద్యమంలో భాగస్వాములైన యోధుల వివరాలు కూడా సమకూర్చాను.

మాతృభూమిని వలసపాలకుల నుండి విముక్తం చేసేందుకు ఉద్యమించిన అసంఖ్యాక స్వాతంత్ర్యసమరయోధులలో ఈ పుస్తకం కోసం వంద మంది వరకు పరిమితం చేయడం చాలా కష్టతరమయ్యింది. కనుక ఇందులో స్థానం కల్పించలేక పోయిన స్వాతంత్ర్య సమర యోధుల పోరాటాల చరిత్రలను భవిష్యత్తులో మరో గ్రంథంలో పొందుపర్చడానికి ప్రయత్నిస్తాను.

బ్రిటీషర్లకు వ్యతిరేకంగా పోరాడిన యోధుల చిత్రాలు కూడా ఈ గ్రంథంలో ఎంతో శ్రమకోర్చి సమకూర్చాను. ఆ చిత్రాలు, ఫోటోల సేకరణలో భారత ప్రభుత్వం ప్రచురించిన పలు గ్రంథాలు, ఇతర చరిత్ర గ్రంథాలు, నా పర్యటనలు ఉపకరించాయి. నాకు లభించిన సమాచారం, సమకూరిన ఫోటోలు, చిత్రాల ఆధారంగా వినుకొండకు చెందిన ప్రముఖ చిత్రకారులు వజ్రగిరి జెస్టిస్ సహకారంతో ఆయా యోధుల చిత్రాలను తిరిగి గీయించి **చిరస్మరణీయులు**లో పొందుపర్చాను.

ఈ పుస్తకానికి పరిచయవాక్యం రాసిచ్చిన **ప్రొఫెసర్ పి.రామలక్ష్మి** (ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు), ఆప్తవాక్యం రాసిచ్చిన **డాక్టర్ ఎస్.సాంబశివారెడ్డి** (చరిత్ర శాఖాధ్యక్షులు, యస్.బి.వి.ఆర్ కళాశాల, బద్వేల్, కడప జిల్లా) లకు, ఈ గ్రంథాన్ని ఆమూలాగ్రం చదివి పలు సూచనలు చేసిన మిత్రులు **పెద్ది సాంబశివరావు** (గుంటూరు), చక్కని ముఖచిత్రం రూపొందించిన చిత్రకారులు **వజ్రగిరి జెస్టిస్,** పుస్తకం గెటప్‌ను తీర్చిదిద్దిన మిత్రులు, చిత్రకారులు **అబ్దుల్లా** (విజయవాడ), నా ప్రతి ప్రయత్నానికి తన సమ్మతితోపాటుగా తగిన సహకారం అందించే నా జీవిత భాగస్వామి **షేక్ రమిజా భాను**లకు ధన్యవాదాలు.

ఈ పుస్తక ప్రచురణకు కొంత వరకు ఆర్థిక సహాయం అందించిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం (హైదరాబాద్) వారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు.

ఈ పుస్తక రచనకు పలు గ్రంథాలు, పత్రికలు, వ్యక్తుల, సంస్థల నుండి ప్రత్యక్షంగా / పరోక్షంగా సమాచార సహకారం-సహాయం స్వీకరించాను. ఆ కారణంగా ఈ పుస్తక సృష్టి 'వ్యష్టి' కృషి అనే కంటే 'సమష్టి' ప్రయత్నంగా భావిస్తూ, ఆయా వ్యక్తులు, గ్రంథాల రచయితలు, ప్రచురణకర్తలకు నా ప్రత్యేక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. ఈ గ్రంథాన్ని చదివిన పాఠక మిత్రుల నుండి మార్పులు-చేర్పులు, సూచనలు-సలహాలను, తప్పొప్పులను వినమ్రంగా ఆహ్వానిస్తున్నాను. ◆

# అంకితం




అమ్మకు.



# 1. బెంగాలు నవాబు సిరాజుద్దౌలా

## (1733- 1757)

**ఆం**గ్లేయుల కుయుక్తులను ఆరంభంలోనే గ్రహించి వారి దుర్మార్గాన్ని అరికట్టేందుకు ఉపక్రమించి, **'భారత స్వాతంత్ర్య సాయుధ సమరేతిహాసంలో అరుణపుటల్ని తెరిచిన'** పాతికేళ్ళు దాటని యోధుడు, బెంగాలు నవాబు సిరాజుద్దౌలా.

1733లో సిరాజుద్దౌలా జన్మించారు. తల్లి అమీనా బేగం, తాత బెంగాలు నవాబు అల్లావర్దీ ఖాన్. తాత నుండి సిరాజ్‌కు ముషిరాబాద్ రాజధానిగా గల బెంగాలు రాజ్యం లభించింది. ఆయన రాజ్యాభిషేకం ఇష్టంలేని శక్తులు ఆరంభం నుండే కుట్రలు చేయడం ఆరంభించాయి. ఆ అనుకూల పరిస్థితులను గ్రహించిన ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు నవాబు అభీష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తూ ప్రజలను, వర్తక- వ్యాపారులను, రైతులను దోచుకోవటం ప్రారంభించేసరికి నవాబు సిరాజ్ మండిపడ్డారు. కంపెనీ దుశ్చర్యలను అరికట్టేందుకు పూనుకున్నారు. ఆ ప్రయత్నాల తొలి దశలో ఆయన విజయం సాధించినా, ఆయనలోని శత్రువును క్షమించే ఔదార్యం ఆ తరువాత ఆయనకు మాత్రమే కాక భారతదేశ భవిష్యత్తుకు ప్రమాదకరంగా పరిగణించింది.

ఈ వాతావరణంలో సిరాజ్ పెద్దమ్మ ఘసిటీ బేగం, ఆమె దత్తకుమారుడు షౌకత్ జంగ్, ఆయన మద్దతుదారుడు దివాన్ రాజ్ వల్లభ్ కుమారుడు కృష్ణదాసు, సిరాజ్





సర్వసేనాని, బంధువు మీర్‌జాఫర్, ప్రముఖ వ్యాపారులు మానిక్ చంద్, అమీచంద్, ప్రముఖ బ్యాంకరు జగత్ సేథిలు కలసి నవాబుకు వ్యతిరేకంగా, రాబర్టు క్లయివుతో చేతులు కలిపి కుట్ర పన్నారు.

ఈ కుట్రలు-కుయుక్తులు తెలియని సిరాజుద్దౌలా ఆంగ్లేయుల పీచమణచడానికి 50 వేల భారీ సైన్యంతో బయలుదేరి **ప్లాసీ** గ్రామం వద్దకు చేరుకున్నారు. ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యం మొత్తం మూడు వేల రెండు వందలు కాగా వీరిలో 950 మంది మాత్రమే ఆంగ్ల సైనికులు. 150 మందితో 10 ఫిరంగిదళాలు, 2 వేల వంద మంది భారతీయ సైనికులు పాల్గొన్నారు. సిరాజుద్దౌలా సైన్యంలో 50 జతల ఎడ్ల ఏర్పాటు కలిగిన భారీ ఫిరంగుల దళం, 50 వేల సైనికులతో కాల్బలం, 18 వేల అశ్విక దళాలు ఉన్నాయి. ఆ బలగాలతో భారతదేశ భవిష్యత్తును నిర్దేశించిన 'ప్లాసీయుద్ధం' 1757 జూన్ 23న ఆరంభమైంది. ఆంగ్లేయుల మదమణచాలనుకున్న సిరాజుద్దౌలాకు సన్నిహితులైన సేనానులు మీర్ మదన్, మోహన లాల్‌లు రాబర్టు క్లయివు సైన్యాల మీద అగ్నిగోళాలు విసురుతూ పోరాడుతుండగా మీర్ మదన్ గాయపడి కన్నుమూయటంతో సిరాజుద్దౌలా సేనలు ఖంగుతిన్నాయి.

చివరకు రాబర్టు క్లయివుతో కుదిరిన ఒప్పందం మేరకు ఆంగ్ల సైన్యాలకు అనుకూలంగా మీర్ జాఫర్, మరోసేనాని రాయ్ దుర్లభ్‌లు సిరాజుద్దౌలాను ఒంటరిని చేసి యుద్ధభూమిని విడిచి పెట్టడంతో దిక్కుతోచని పరిస్థితులలో సిరాజ్‌కు పరాజయం అనివార్యమైంది. ఈ విషయం తెలుసుకున్న సిరాజుద్దౌలా ఆశ్చర్యపోయారు. ఆయన యుద్ధభూమి నుండి బయటపడి జూన్ 24న రాజధాని ముషిరాబాద్ చేరుకుని, అక్కడి వాతావరణం కూడా వ్యతిరేకంగా ఉండటంతో భార్య లుత్‌ఫున్నీసా, విశ్వాసపాత్రుడైన మరొక సేవకుడ్ని వెంట పెట్టుకుని ప్రాణరక్షణ కోసం అంతఃపురం వదలిపెట్టారు.

ఈలోగా ఆంగ్లేయుల చలువతో బెంగాలు నవాబుగా నియమితుడైన మీర్ జాఫర్ తన కుమారుడు మీర్ మీరాన్‌ను సైన్యంతో సహా పంపి సిరాజుద్దౌలాను వెంబడించి వేటాడమన్నాడు. ఆ ఆదేశాల మేరకు సిరాజుద్దౌలాను నిర్బంధించి తెచ్చి 1757 జూలై 2న రాజదర్బారులో బహిరంగంగా అతని శిరస్సును ఖండించి నేల దొర్లించాడు. ఈ విధంగా **'బ్రిటీషు దుష్టులను కత్తిపట్టి ఎదిరించిన మొనగాడు'** గా ఖ్యాతిగాంచిన బెంగాలు నవాబు సిరాజుద్దౌలా బ్రిటీష్ వ్యతిరేక పోరాటాల చరిత్ర గ్రంథంలోని ప్రప్రథమ పుటను సొంతం చేసుకుని చిరస్మరణీయులయ్యారు. ◆



# ౨. నవాబు మీర్ ఖాశిం

## (- 1777)

**ఆం**గ్లేయులను భరతగడ్డ మీద నుంచి పూర్తిగా తరిమికొడితే గాని వారి దోపిడి నుండి స్వదేశీయులకు విముక్తి కల్పించలేమని భావించి, రాజ్యక్షేమం, ప్రజల సౌభాగ్యం ఆకాంక్షిస్తూ, ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల మీద సమర శంఖాన్ని పూరించి, చివరి వరకు పోరుబాటలో సాగిన యోధులు మీర్ ఖాశిం.

ఆంగ్లేయులతో చేతులు కలిపి ప్లాసీ యుద్ధంలో నమ్మకద్రోహానికి పాల్పడిన మీర్ జాఫర్‌కు కంపెనీ పాలకులు తిలోదకాలు ఇచ్చాక బెంగాలు గద్దె మీద జాఫర్‌కు స్వయాన మేనల్లుడైన మీర్ ఖాశింను కూర్చోపెట్టాలని గవర్నర్ వాన్సిటర్ట్ నిర్ణయం మేరకు 1760 సెప్టెంబరు 27న మీర్ ఖాశిం బెంగాలు నవాబు అయ్యారు.

ఆ సమయంలో ప్లాసీ యుద్ధ విజయంతో చెలరేగిపోయిన ఈస్ట్ ఇండియా కంపెనీ గుమాస్తాలు, దస్తావేజుల రాతగాళ్ళు, వర్తకులు అపరిమిత అధికారాలతో, అంతు లేని ధనకాంక్షతో రాబర్టు క్లయివు ఆరంభించిన ధనసంచయాన్ని కొనసాగిస్తూ ఇష్టా రాజ్యంగా ప్రవర్తించసాగారు. ఈ అనుచిత ప్రవర్తన వలన స్వదేశీ వర్తకం ఇబ్బందుల్లో పడింది. రైతులు, వర్తకులు, ఉత్పత్తిదారులు ఇక్కట్లు పడసాగారు. అధికారుల అనుచిత ఆజ్ఞలను ప్రజలు పాటించాల్సి వచ్చింది. కంపెనీ అధికారుల, ఆంగ్ల ఉద్యోగుల, వర్తకుల చిత్తానికి





వ్యతిరేకంగా వ్యవహరించటం ప్రజలకు ప్రాణాంతకమయ్యింది. ఆంగ్ల అధికారుల అభిమతాన్ని, పెత్తనాన్ని ఏమాత్రం నిరసించినా ప్రజలకు ముళ్ల కొరడాలతో దెబ్బలు, జైలుశిక్షలు, చిత్రహింసలు అనునిత్యం అనివార్యమయ్యాయి.

ఆ సమయంలో బెంగాలు నవాబుగా అధికారాలను చేపట్టగానే మీర్ ఖాశిం స్వతంత్రంగా వ్యవహరించడం ఆరంభించారు. ప్రజల హితవుకు భిన్నంగా ఆంగ్లేయులు, వారి వత్తాసుదారులు సాగిస్తున్న దుర్మార్గాలను సహించలేకపోయారు. ఆ వాతావరణంలో మిన్నకుంటే లాభం లేదనుకున్న మీర్ ఖాశిం కంపెనీ అధికారుల, ఉద్యోగుల నిర్వాకాన్ని ఎండగడ్తూ కంపెనీ ఉన్నతాధికారుల కౌన్సిల్‌కు 1762 మేలో లేఖ రాశారు. ఆ లేఖకు కంపెనీ పాలకుల నుండి అనుకూల స్పందన లేకపోగా ఆంగ్లేయుల దోపిడీ, వేధింపులు మరింత పెరిగాయి. గత్యంతరం లేని పరిస్థితులలో కంపెనీ పాలకులతో మీర్ ఖాశిం ఘర్షణకు సిద్దపడి 1762లో తన రాజధానిని ముషీరాబాదు నుండి మాంఘీర్ (Monghyr) కు మార్చారు. ఆంగ్లేయులకు ప్రసాదించిన ప్రత్యేక అనుమతులను రద్దుచేశారు. ఈ నిర్ణయంతో మండిపడిన కంపెనీ అధికారి ఎల్లీస్ (Ellis), నవాబు రాజ్యంలోని పాట్నా పట్టణాన్ని చుట్టుముట్టి స్వాధీనం చేసుకోనడానికి ప్రయత్నించగా మీర్ ఖాశిం తన బలగాలతో ఆంగ్ల మూకలను మట్టికరిపించి తరిమికొట్టారు.

ఈ విధంగా ఆంగ్లేయులు ప్రారంభించిన పోరాటం క్రమంగా యుద్ధంగా రూపు దిద్దుకుని, 1763 జూన్ 10న మీర్ ఖాశిం ఆంగ్లేయులను ఎదుర్కొన్నారు. ఆ యుద్ధంలో ఆంగ్లేయులది పైచేయి కావటంతో మీర్ ఖాశిం రణభూమి నుండి తప్పుకుని అయోధ్య చేరుకున్నారు. స్వజనుల పాలిట శాపంగా మారిన ఆంగ్లేయులను ఎలాగైనా తమ దేశం నుండి తరిమికొట్టాలనుకున్న మీర్ ఖాశిం అయోధ్య నవాబు షుజావుద్దౌలా, ఢిల్లీ చక్రవర్తి షా ఆలం-2 ల బలగాలతో కలసి మరోమారు కంపెనీ సైన్యాలతో బక్సర్ అను ప్రాంతంలో తలపడ్డారు. ఆ చరిత్రాత్మక యుద్ధంలో ఆంగ్లేయుల కుతంత్రం వలన షుజావుద్దౌలా, షా ఆలం సైన్యాలు పూర్తిగా రణరంగంలోకి దిగకపోగా, ఇతరులు మీర్ ఖాశింకు నైతికమద్దతు ఇవ్వటం వరకు పరిమితమయ్యి ప్రేక్షకపాత్ర నిర్వహించారు.

ఆ కారణంగా మీర్ ఖాశిం నాయకత్వంలో ఉమ్మడి సేనలు ఎంతగా పోరాడినా, సమన్వయం కరువుకావటంతో1764 అక్టోబరు 22న మీర్ ఖాశిం బలగాలకు పరాజయం తప్పలేదు. ఆంగ్లేయ శత్రువుకు ఏమాత్రం లొంగకుండా రణభూమి నుండి తప్పుకుని రహస్య ప్రదేశాలలో సంచరిస్తూ, మళ్ళీ పోరాటం చేసేందుకు విఫల ప్రయత్నాలు చేస్తూ, ఆ క్రమంలో 1777లో ఢిల్లీ సమీపాన మీర్ ఖాశిం కన్నుమూశారు. ◆



# 3. హైదర్ అలీ ఖాన్

## (1722-1782)

**రా**జ్యవిస్తరణ కాంక్షతో రగిలిపోతున్న పరాయిపాలకుల పన్నాగాలను గ్రహించి ఆ శక్తులకు, ఆ శక్తుల తొత్తులకు వ్యతిరేకంగా జీవిత చరమాంకం వరకు పోరాడి 'అరివీర భయంకరుడు'గా విశ్వరూపం చూపిన మొనగాడు హైదర్ అలీ ఖాన్.

**దక్షిణ భారతదేశ నెపోలియన్** గా ఖ్యాతిగడించిన హైదర్ అలీ 1722లో కర్నాటక రాష్ట్రం దేవనహల్లి గ్రామంలో జన్మించారు. తండ్రి ఫతే మొహమ్మద్ అలీ, తల్లి మజిదాన్ బేగం. చిన్నతనం నుండి యుద్ధ విద్యల పట్ల ఆసక్తి చూపిన హైదర్ అలీ ఆయా విద్యలలో మంచి ప్రావీణ్యత సంపాదించారు. విద్యాగంధం లేకపోయినా, ఆయనకు కుశాగ్రబుద్ధి, అసమాన ధారణశక్తి, ధృఢ సంకల్పం, పలు పనులను ఏకకాలంలో నిర్వహించగల సామర్థ్యం, కార్యదక్షత, ధైర్యసాహసాలు సహజ లక్షణాలయ్యాయి.

1749లో జరిగిన దేవనహల్లి ముట్టడిలో పాల్గొన్న యువకుడు హైదర్ అలీ ప్రదర్శించిన ధైర్యసాహసాలకు ముగ్ధుడైన మైసూరు రాజ్య మంత్రి నంజరాజ్ ఆయనను 'ఖాన్' బిరుదుతో సత్కరించి, చిన్న సైనికదళం నాయకుడ్ని చేశాడు. ఆక్కడి నుండి 1758లో సర్వసైన్యాధిపతిగా ఎదిగి 1761నాటికి హైదర్ అలీ మైసూరు పాలకులయ్యారు. ఆ అనూహ్య ఎదుగుదల నచ్చని మరాఠాలు, నైజాం నవాబు, పరాయి పాలకులైన





బ్రిటీషర్లకు దోస్తులుగా మారి హైదర్ అలీ మీద పలుమార్లు దండయాత్రలు చేశారు. ఈ దాడుల తొలిదశలో హైదర్ కొంత నష్టపోయినప్పటికి ఆ తరువాతి కాలంలో ప్రథమ, ద్వితీయ మైసూరు యుద్ధాలలో అరివీర భయంకరంగా వ్యవహరించి శత్రువును పలుమార్లు చావుదెబ్బ తీసి ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాధికారులకు సింహస్వప్నమయ్యారు.

సర్వమత సమవర్తనుడైన హైదర్ అలీ, **పాలకుడు ముస్లిం అయినంత మాత్రాన ప్రభుత్వం ఆ మతానికి చెందినది ఏ మాత్రం కాదని** ప్రకటించి, అన్ని మతాల పట్ల సమాదరణ చూపారు. మతాలతో సంబంధం లేకుండా ప్రజలకు సమన్యాయం పంచారు. పలు మసీదులు నిర్మించిన ఆయన మఠాలు, పీఠాధిపతుల పట్ల ఎంతో ఔదార్యాన్ని చూపుతూ వాటి నిర్వహణకూ, పూజారుల, మఠాధిపతుల జీవన పరిస్థితుల మెరుగుదలకూ ధన, కనక, వస్తు, వాహనాలను అందించటమే కాక ఆలయాల నిర్మాణాలకు ఆర్థిక సహకారం అందిస్తూ, ఆయా నిర్మాణ పనులను స్వయంగా పర్యవేక్షించారు.

ప్రజారంజకంగా పాలన చేస్తున్న హైదర్ అలీని రెచ్చగొట్టి ద్వితీయ మైసూరు యుద్ధానికి బ్రిటీషర్లు శ్రీకారం చుట్టారు. 1780 జూలై మాసంలో మహాసేనను తీసుకుని శత్రువు ఆటకట్టించేందుకు కుమారుడు టిపూ సుల్తాన్ సమేతంగా బయలుదేరిన హైదర్ ఆర్కాటును పాదాక్రాంతం చేసుకోగా ఇటు టిపూసుల్తాన్ మద్రాసుకు 50 మైళ్ళ దూరంలో ఉన్న కంజీవరాన్ని సునాయాసంగా గెలుచుకున్నారు. ఆ విజయాలతో భయకంపితుడైన గవర్నర్ జనరల్ వారెన్ హేస్టింగ్స్ అదనపు బలగాలను, అవసరానికి మించిన ధనమిచ్చి సర్వసైన్యాధ్యక్షుడు Sir Eyre Cooteను హైదర్ మీదకు ఉసిగొల్పాడు. ఒకవైపున విదేశీ శత్రువుతో హైదర్ పోరాడుతుండగా పాలెగాండ్లు, మలబారు నాయర్లు, నిజాం మద్దతుతో తిరుగుబాటును ప్రకటించగా హైదర్, టిపూ తలోదిక్కుగా సాగి వారిని ఎదుర్కొన్నారు. చరిత్రాత్మక ద్వితీయ మైసూరు యుద్ధం జయాపజయాలతో సాగుతుండగా వర్షాకాలం రావటంతో 1782 నాటికి యుద్ధమేఘాలు తాత్కాలికంగా అంతరించాయి.

ఆ యుద్ధం నాటికి హైదర్ అలీ వయస్సు 60 ఏండ్లు. ఆ వయస్సులో కూడా అసమానమైన వేగంతో, ఆయాసరహితంగా వందల మైళ్లు అశ్వారూఢుడై ముందుకు సాగుతూ పలు పోరాటాలు సాగించి అద్భుత విజయాలకు చిరునామాగా ఖ్యాతిగాంచిన హైదర్ అలీ మృత్యువుతో సాగించిన పోరాటంలో మాత్రం విజయం సాధించలేక పోయారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని చిత్తూరు జిల్లా నరసింగరాయుని పేట వద్ద యుద్ధభూమిలో 1782 డిసెంబరు 7న హైదర్ అలీ ఖాన్ కన్నుమూశారు. ◆



# 4. మజ్నూషా ఫకీర్

## (-1787)

**ఇండియాలో** అడుగిడిన బ్రిటీషర్లు మెల్లగా ప్రజల మీద పెత్తనం, దోపిడికి పాల్పడటం ప్రారంభించేసరికి రగిలిన ఆగ్రహావేశాల నేపథ్యంలో 1765లో విజృంభించిన **ఫకీర్లు తిరుగుబాటుకు** నాయకత్వం వహించిన యోధులు మజ్నూషా ఫకీర్.

బెంగాల్ పరగణాలోని కాన్పూరు సమీపాన గల మాఖన్‌పూర్ గ్రామానికి చెందిన మజ్నూషాను ప్రజలు **మంజూ షా** అని కూడా పిలుచుకున్నారు. ధార్మిక వ్యవస్థాపరంగా చూస్తే ఈయన **మదారి** సాంప్రదాయానికి చెందిన ఫకీర్. మదారి తెగలో **గురు-శిష్య** సంబంధాలు చాలా పటిష్టంగా ఉంటాయి.

ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులు, అధికారులు, వడ్డీవ్యాపారులు, జమిందారులు చేస్తున్న దోపిడి, దాష్టికాలను గమనించిన గురువు దర్వేష్ హమీద్ ఆదేశాల మేరకు మజ్నూషా పలు ప్రాంతాలను సందర్శించారు. ఆ సందర్భంగా ప్రజల కష్టసుఖాలను తెలుసుకున్న ఆయన తన లక్ష్యాలను ప్రజల ముందుంచగా ఆంగ్లేయుల రాక్షసచర్యలను సహించలేక ప్రజలు, క్షామపీడితులు మజ్నూషా వెంట నడిచేందుకు సిద్ధమయ్యారు.

ఆనాడు ఈస్ట్ ఇండియా కంపెనీ దోపిడీ,పెత్తనాలకు వ్యతిరేకంగా తిరగబడిన ఫకీర్లకు నాగా సన్యాసుల స్నేహహస్తం లభించటంతో ఈ తిరుగుబాట్లను **ఫకీర్లు-సన్యాసుల** తిరుగుబాట్లుగా చరిత్ర నామకరణం చేసింది. నాగా సన్యాసుల నాయకులు భవాని పాథక్‌తో మజ్నూషా సత్సంబంధాలను సాగించారు. జమిందారులు, వడ్డీ వ్యాపారులైన మహాజన్లు, కంపెనీ పాలకులు, అధికారుల మీద దాడులు జరిపి పేదవర్గాల ప్రజలకు ఆర్థిక భారం నుండి విముక్తి కల్గించి కంపెనీ పాలకులను ఖంగు తినిపించారు.





సన్యాసులు-ఫకీర్లను దోపిడీ దొంగలుగా, దుండగులుగా కంపెనీ పాలకులు ముద్రవేసినా ప్రజలు మాత్రం తమ రక్షకులుగా భావించి గౌరవించారు. మజ్నూషా పిలుపునిస్తే ఏ క్షణాన్నైనా వేలాది మంది సాయుధులైన ప్రజలు కంపెనీ బలగాలను ఎదుర్కొనేందుకు రాగలరని కంపెనీ పాలకులకు అధికారులు రాసిన డైరీలు నివేదికలలో స్పష్టంగా పేర్కొన్నారంటే, మజ్నూషా పట్ల ఉన్న ప్రజాభిమానం అర్థమౌతుంది.

ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనను సవాల్ చేస్తూ సాగిన పోరాటాలలో కంపెనీ సాయుధ దళాల ఉన్నతాధికారులను మజ్నూషా పలుమార్లు మట్టికరిపించారు. ఆయన ధాటికి తట్టుకోలేక కంపెనీ సైన్యాధికారులు బ్రతుకు జీవుడా అంటూ పారిపోయిన సందర్భాలు చాలా ఉన్నాయి. ప్రజల పక్షంగా కార్యకలాపాలను నిర్వహించేందుకు తన పూర్వీకుల గ్రామమైన మస్తాన్‌ఘర్‌ను ఎంచుకుని దశాబ్దాల పాటు విరామమెరుగక తన కార్యక్రమాలను విజయవంతంగా మజ్నూషా నిర్వహించారు.

1786 డిసెంబర్ 29న మజ్నూషాను ఎలాగైనా పట్టుకోవాలని బొగ్రా (BOGRA) జిల్లా ముంగ్రా గ్రామంలో విడిది చేసిన లెఫ్టినెంట్ బ్రినాన్స్ బలగాలు, ఆయన స్థావరాన్ని చుట్టు ముట్టాయి. ఈ పోరులో మజ్నూషా తీవ్రంగా గాయపడి కదనరంగం నుండి తప్పుకుని మాఖన్‌పూర్‌కు చేరుకున్నారు. మజ్నూషా ను అరెస్టు చేయడానికి ఇంతకంటే మంచి అదను దొరకదని కంపెనీ అధికారులు భారీ సంఖ్యలో సాయుధ బలగాలను దించి, అంగుళం అంగుళం గాలించటం ప్రారంభించారు. పరిస్థితి ప్రమాదకరంగా మారినప్పటికీ, శత్రువు తమను అన్నివైపుల నుండి చుట్టుముట్టి ఉన్నందున, మజ్నూషాను చికిత్స నిమిత్తం మరొక ప్రాంతానికి తరలించటం సహచరులకు ఏమాత్రం సాధ్యం కాకపోవటం ఆయనకు ప్రాణాంతకమయ్యింది.

సుదీర్ఘ పోరాట చరిత్రలో పలుమార్లు శతృవు వలయం నుండి చాకచక్యంగా తప్పించుకున్న ఆ యోధునికి మృత్యువుకు టోకరా ఇవ్వటం ఈసారి సాధ్యం కాలేదు. చివరకు తన పూర్వీకుల గడ్డ మాఖన్‌పూరులోని ప్రియమైన మస్తాన్‌ఘర్‌లో సహచరులు, అనుచరులు, ప్రియజనుల మధ్య 1787లో మజ్నూషా ఫకీర్ కన్నుమూశారు. ◆



# 5. టిపూ సుల్తాన్

## (1750-1799)

**ఉ**త్తర భారతాన్ని హస్తగతం చేసుకున్న ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులు, దక్షణాదిని ఆక్రమించుకోవటానికి కుట్రలు, కుయుక్తులు పన్నుతున్న సందర్భంగా సామ్రాజ్యవాద శక్తుల రాజ్యవిస్తరణ కాంక్షను బహిర్గతం చేస్తూ స్వదేశీయులను ఏకం కమ్మని పిలుపునిచ్చిన దార్శనికుడు, **మైసూరు పులి** గా ఖ్యాతిగాంచిన టిపూ సుల్తాన్.

1750 నవంబర్ 10న కర్ణాటక రాష్ట్రంలోని కోలార్ జిల్లా దేవనహళ్ళి గ్రామంలో ఆయన జన్మించారు. తండ్రి హైదర్ అలీ, తల్లి శ్రీమతి ఫాతిమా ఫక్రున్నిసా. చిన్నతనంలోనే యుద్ధకళను ఔపోసన పట్టిన టిపూ తండ్రితోపాటుగా యుద్ధరంగంలో ప్రవేశించ ఆసక్తిచూపారు. ఆ క్రమంలో 1769-72 వరకు మరాఠాలతో హైదర్ అలీ సాగించిన యుద్ధాలలో పాల్గొని, అసమాన ధైర్యసాహసాలు ప్రదర్శించారు.

1782 డిసెంబరు 7న యుద్ధభూమిలో తండ్రి హైదర్ అలీ కన్నుమూయగా టిపూ మైసూరు రాజ్యలక్ష్మిని చేబట్టి టిపూ సుల్తాన్ అయ్యారు. ఆ రోజున టిపూ ప్రజలను ఉద్దేశించి మాట్లాడుతూ, **'మిమ్మల్ని వ్యతిరేకించినట్టయితే నేను నా స్వర్గాన్నీ, నాజీవితాన్నీ, నా సంతోషాన్నీ కోల్పోవచ్చు. ప్రజల సంతోషం లోనే నా సంతోషం. నా ప్రజల సంక్షేమం లోనే నా సంక్షేమం ఇమిడి ఉంది. నాకిష్టమైందల్లా మంచిదని నేను భావించను. నా**





**ప్రజలకు ఏది ఇష్టమో దానిని నా అభీష్టంగా భావిస్తాను...నా ప్రజలకు ఎవరు శత్రువులో వారు నాకూ శత్రువులు. నా ప్రజలతో ఎవరు కలహిస్తారో, వారు నాతో యుద్ధం ప్రకటించినట్లే'** అని స్పష్టం చేసిన టిపూ చివరి వరకు ఆ మాటను పాటించారు. నిజాం నవాబు, మరాఠాలను నిత్యం ఎదుర్కొంటూ తన రాజ్యాన్ని ఉత్తరాన కృష్ణానది నుంచి, దక్షిణాన దిండిగల్ వరకు అంటే సుమారు 400 మైళ్ళ పొడవున, పశ్చిమాన మలబారు నుంచి, తూర్పున తూర్పు కనుమల వరకు సుమారు 300 మైళ్ళు విస్తరింప చేశారు. టిపూ మొదటి రెండు మైసూరు యుద్ధాలలో తండ్రి మార్గదర్శకత్వంలో పాల్గొనగా ఆ తరువాత ఆయన 17 సంవత్సరాల పాటు సాగించిన పరిపాలన కాలంలో జరిగిన చివరి మూడవ, నాల్గవ మైసూరు యుద్ధాలలో స్వయంగా పాల్గొన్నారు.

ఆధునిక వ్యాపార, వ్యవసాయ, పారిశ్రామిక రంగాలను టిపూ బహుదా ప్రోత్సహించారు. నీటి పారుదల సౌకర్యం కల్పించేందుకు అధికశ్రద్ధ వహించారు. పన్ను వసూలుకు నూతన పద్ధతులు ప్రవేశపెట్టారు. చిన్న చిన్న నేరాలను చేసినవార్ని సంఘ ప్రయోజనాలకు పనికొచ్చేలా వినూత్న శిక్షలు విధించారు. కన్నడ, తెలుగు, మరాఠీ, అరబ్బీ, పర్షియన్, ఉర్దూ, ఫ్రెంచ్, భాషలను నేర్చుకున్న ఆయన విద్యావ్యాప్తి కోసం చాలా కృషి సల్పారు. విశ్వవిద్యాలయం ఏర్పాటును ఆకాంక్షించారు. మంచి చదువరి అయిన టిపూ తన సైన్యం కోసం Fauji Akhbar అను వారపత్రికను నిర్వహించారు. టిపూ స్వమతం పట్ల అభిమానం గల ప్రభువు తప్ప, మత దురభిమాని కాదు. రాజ్య పాలనా వ్యవహారాలలో ఆయన మతాతీతంగా వ్యవహరించారు. మసీదు-మందిరాల మధ్యగాని, హిందూ-ముస్లింల మధ్యగాని ఏమాత్రం తేడా చూపించ లేదు.

టిపూ ఔన్నత్యాన్ని చూసి అసూయా ద్వేషాలతో రగిలి పోతున్న నిజాం నవాబు, మరాఠాలు టిపూకు వ్యతిరేకంగా ఏకం కావటమే కాక కంపెనీ పాలకులతో చేతులు కలిపి భారీ బలగాలతో 1799 మే4 ఉదయం శ్రీరంగపట్నం పైన విరుచుకపడ్డారు. టిపూ తన బలగాలతో శత్రువు మీద విక్రమించినా, టిపూ దివాన్ మీర్ సాధిక్ ఆంగ్లేయులతో చేతులు కలిపి కోటలోకి శతృసైన్యాలు సునాయాసంగా ప్రవేశించడానికి దారి చూపాడు. ఈ విషయాన్ని టిపూ గ్రహించేలోగా పరిస్థితులు చేతులు దాటిపోయాయి. **'నక్కలాగా వంద సంవత్సరాలు బ్రతికే కంటే సింహంలా ఒక్క రోజు బ్రతికినా చాలు'** అని గర్జిస్తూ టిపూ శత్రుసైన్యాల మీద విరుచుకుపడ్డారు. ఆ పోరాటంలో తీవ్రంగా గాయపడి సొమ్మసిల్లిన టిపూను ఆంగ్లసైనికుడొకడు తుపాకితో కాల్చటంతో ఆంగ్లేయులను భయకంపితుల్ని గావించిన టిపూ సుల్తాన్ 1799 మే4న కన్నుమూశారు. ◆

# 6. సయ్యద్ అహమ్మద్ బరేల్వి

## (1786-1831)

**భా**రత స్వాతంత్ర్యసంగ్రామంలో భాగంగా అర్థ శతాబ్దిపాటు బ్రిటీష్ వలస పాలనకు వ్యతిరేకంగా రాజీలేని పోరాటం సాగించి స్వాతంత్ర్య సమర యోధులకు ప్రేరణగా నిలచిన **వహాబీ ఉద్యమ** నిర్మాత సయ్యద్ అహమ్మద్ బరేల్వి.

16వ శతాబ్దంలో అరేబియా తత్త్వవేత్త అబ్దుల్ వహాబ్ ప్రారంభించిన శుద్ధ ఇస్లాం ధార్మిక సంప్రదాయ ఉద్యమం **వహాబీ ఉద్యమం** గా ఖ్యాతి చెందింది. ఆ ఉద్యమాన్ని ఇండియాకు పరిచయం చేసిన సయ్యద్ అహమ్మద్ 1766లో ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని రాయబరేలి జిల్లా బరేలి గ్రామంలో జన్మించారు. 1803లో విద్యాభ్యాసం పూర్తి చేసి, టోంక్ (Tonk) నవాబు అమీర్ ఖాన్ సైన్యంలో చేరారు. అమీర్ ఖాన్ పక్షాన పలు పోరాటాలలో, యుద్ధాలలో పాల్గొని రణరంగ ఎత్తుగడలలో మంచి ప్రావీణ్యం సంపాదించి సాహసోపేత యుద్ధ వీరుడిగా ఖ్యాతి గడించారు.

ఆనాడు సాగుతున్న ఇస్లామిక్ పునరుద్ధరణ ఉద్యమాలకు మార్గదర్శకత్వం వహిస్తున్న ప్రముఖ ఇస్లామిక్ తత్వవేత్తలు షా వలీయుల్లా (1703-62), అయన కుమారుడు అబ్దుల్ అజీజ్ (1746-1823)ల ధార్మిక సిద్ధాంతాల పట్ల అహమ్మద్ ఆకర్షితులయ్యారు. ఆ సిద్ధాంతాల సారాన్ని ప్రజలకు వివరిస్తూ మీరట్, ముజఫర్‌నగర్, షహరాన్‌పూర్





జిల్లాలలో, ఆ తరువాత అలహాబాద్, బెనారస్, కాన్పూరు, లక్నో, రోహిల్‌ఖండ్‌లలో పర్యటించారు. ఈ ధార్మిక ప్రచార పర్యటనల సందర్భంగా అన్నివర్గాల సామాన్య ప్రజలు ఎదుర్కొంటున్న ధార్మిక-లౌకిక సమస్యలను గమనించారు.

ఆ తరువాత మక్కా వెళ్ళి 1824 ఏప్రిల్‌లో స్వదేశం తిరిగి వచ్చాక, స్థానికంగా నెలకొనియున్న రాజకీయ, సాంఘిక, ధార్మిక పరిస్థితుల నేపథ్యంలో వహాబీల ధార్మిక మార్గం ప్రకారం శుద్ధ ఇస్లాంనూ, ప్రవక్త మార్గాన్నీ ముస్లింలు తు.చ. తప్పకుండా అనుసరించేలా చూడాలంటే, అది ఇస్లామిక్ రాజ్యంలో మాత్రమే సాధ్యమని, అందువల్ల ఇండియాలో పాలన సాగిస్తున్న ఆంగ్లేయులను తరిమి వేయాలని నిర్ణయించారు. అ లక్ష్యసాధన కోసం బలగాల సమీకరణకు దేశమంతా పలు పర్యటనలు చేశారు. ఈ పర్యటనలలో ప్రజలకు తన తాత్విక, ఆర్థిక, రాజకీయ సిద్ధాంతాలు, విధానాలను వివరించారు. ఆయనకు భారీ అనుచరవర్గం ఏర్పడింది. ఈ పర్యటనల సందర్భంగా పలుచోట్ల వహాబీ కేంద్రాలను ఏర్పాటుచేశారు. ఆ కేంద్రాలకు సమర్థులైన నిర్వాహకులను నియమించి, వహాబీ తత్వ ప్రచారం చేయాల్సిందిగా, బ్రిటీషర్ల మీద ధర్మపోరాటం సాగించాల్సిందిగా ఉద్బోధించారు.

ఆ తరువాత మతపరమైన, రాజకీయ విధానాలను అమలు పర్చేందుకు సరైన స్థావరం కోసం అన్వేషణ సాగించారు. ఆ అన్వేషణ పర్యవసానంగా వాయవ్య సరిహద్దు ప్రాంతాలలోని కొన్ని ప్రాంతాలను ఎంపిక చేసుకున్నారు. 1826 జనవరి 17న బ్రిటీషర్ల మీద, ఆ శక్తులకు తొత్తులుగా మారిన స్వదేశీ శిక్కు పాలకుల మీద అంతిమ పోరు సాగించేందుకు రాయ్‌బరేలి నుండి నిర్దేశించుకున్న స్థావరానికి సయ్యద్ అహమ్మద్ బరేల్వి బయలుదేరారు. ఆయన ఆదేశాల మేరకు ప్రాణాలను తృణప్రాయంగా భావించి త్యాగం చేయగల భారీ శిష్యగణం బరేల్వి వెంట కదిలింది. పది మాసాలపాటు మూడు వేల మైళ్ళ మేరకు సాగిన 'లాంగ్‌మార్చ్' తరువాత 1826 నవంబరు 20న పెషావర్ చేరుకుని అక్కడ దానిని ప్రధాన స్థావరం చేరుకున్నారు. ఈ మేరకు గమ్యస్థానం చేరుకోగానే సయ్యద్ అహమ్మద్ స్వతంత్ర్య రాజ్యస్థాపనకు శ్రీకారం చుట్టి ఆంగ్లేయులకు వత్తాసు పలుకుతున్న పంజాబ్ అధినేతల మీద యుద్ధాన్ని ప్రకటించారు. అప్పటి నుండి పలు పోరాటాలు సాగినా 1831లో బాల్‌కోట్ వద్ద మహారాజా రంజిత్ సింగ్‌తో నిర్ణయాత్మక యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో తన అనుచరులతో కలసి శత్రువుతో వీరోచితంగా పోరాడుతూ 1831 మే 6న సయ్యద్ అహమ్మద్ బరేల్వి 'షహీద్' అయ్యారు. ◆



# 7. టిటూ మీర్

## (1782-1832)

**భా**రతావనిలో వలసవాదుల పాలన ప్రారంభమైన నాటినుండి బ్రిటీష్ శక్తులకు వ్యతిరేకంగా పలు తిరుగుబాట్లు జరిగాయి. ఈ పోరాటాల చరిత్రలో ప్రత్యేక స్థానం పొందిన వహాబి ఉద్యమానికి సమరశీలత జోడించి, చివరకు స్వాతంత్ర్య సమరంలో భాగంగా సాగిన పలు పోరాటలకు ప్రేరణగా నిలచిన కార్యశూరులు టిటూ మీర్.

బెంగాల్‌లోని నర్కేల్‌బరియా ప్రాంతంలోని హైదర్‌పూర్ లేక చాంద్‌పూర్ లో 1782లో టిటూమీర్ జన్మించారు. తల్లి పేరు రొఖయాబి. తండ్రి పేరు మీర్ నిస్సార్ అలీ. సన్నకారు రైతు కుటుంబం. చిన్నతనంలో వస్తాదుగా పేర్గాంచిన ఆయన కుస్తీ పోటీలలో పాల్గొంటు మంచి వస్తాదుగా ఖ్యాతిగడించారు. పలు చిన్న చిన్న ఉద్యోగాలు చేశారు. 1823 ప్రాంతంలో మక్కాను సందర్శించిన ఆయన ఇండియాలో వహాబి ఉద్యమ వ్యవస్థాపకులు సయ్యద్ అహమ్మద్ బరేల్విని, ఫరాజి ఉద్యమ నిర్మాత హాజీ షరియతుల్లాను మక్కాలో కలిశారు. ఈ ముగ్గురు నాయకుల కలయిక బ్రిటీషర్లకు వ్యతిరేకంగా **వహాబీ- ఫరాజీ** ఉద్యమ స్రవంతులు పోరుబాటన ఉధృతంగా సాగటానికి ఉపయోగపడింది.

మక్కా నుండి తిరిగి వచ్చాక నర్కేల్‌బరియా దగ్గర గల హైదర్‌పూరులో స్థిరనివాసం ఏర్పాటు చేసుకుని, ధార్మిక ప్రచారం కోసం పర్యటనలు గావించిన టిటూ మీర్ ఈస్ట్





ఇండియా కంపెనీ అధికారులు, జమీందారులు-మహాజనులు ప్రజల మీద సాగిస్తున్న అకృత్యాలను, దోపిడీని స్వయంగా చూశారు. ప్రజల ఆక్రందనలు విన్నారు. ఆ సమస్యల పరిష్కారం కోసం, దోపిడీ శక్తుల అట కట్టించేందుకు నిర్ణయించుకున్నారు. ఆ క్రమంలో శుద్ధ ధార్మిక ప్రచారంతోపాటుగా ప్రాపంచిక సమస్యల పరిష్కారం కోసం, పరాయి పాలకుల పెత్తనాన్ని తుడిచి పెట్టేందుకు టిటూమీర్ నడుంకట్టారు.

ఆ దిశగా ఉద్యమించిన టిటూమీర్ జమీందారుల దౌర్జన్యాల మీద ధ్వజమెత్తారు. క్రూరులైన జమీందారులకు మద్దతుగా నిలుస్తున్న ఆంగ్లేయులను, పోలీసు -సైనిక బలగాలను సాయుధంగా ఎదుర్కొన్నారు. ఈ మేరకు ప్రజల పక్షంగా పలు పోరాటాలకు ఆయన స్వయంగా నాయకత్వం వహించారు. ఈ కార్యకలాపాల నిర్వహణ కోసం పటిష్టమైన ప్రత్యేక వ్యవస్థలను కూడా ఏర్పాటు చేశారు. పలు ప్రభుత్వ కచ్చేరీల మీద, **గడ్డం పన్ను** అంటూ ముస్లింలను వేధించిన జమీందారుల ప్రాసాదాల మీద దాడులు జరిపారు. తొలిదశలో ఆచార సాంప్రదాయాలను అవమానపర్చారన్న కసితో జరిగిన దాడులు ఆ తరువాత దిశను మార్చుకున్నాయి. ఈ దాడులలో ఆంగ్లేయ సైన్యాలు, పోలీసు బలగాలు టిటూమీర్ అనుచరుల శౌర్యప్రతాపాలు, తెగువ ముందు నిలువలేక పరాజయాన్ని అంగీకరిస్తూ పలుమార్లు పలాయనం చిత్తగించాయి.

ఈ విజయాలతో ఆత్మవిశ్వాసం పెరిగిన టిటూమీర్ అనుచరులు ఆంగ్లేయాధికారులకు తమ దాడుల సమాచారం ముందుగా తెలిపి మరీ వచ్చి ప్రభుత్వ కచ్చేరీల మీద, జమీందారుల మీద దాడులు నిర్వహించారు. ఈ చర్యల మూలంగా మతాలతో సంబంధం లేకుండా అన్ని మతాల, వర్గాల, పేద ప్రజానీకం వేల సంఖ్యలో ఆయన వెంట నడిచారు. ఆ కారణంగా భారీ సంఖ్యలో బలగాలు చేకూరటంతో, కార్యకలాపాలు మరింతగా విస్తరిచటం, శతృవు నుండి ప్రమాదం పొంచి ఉండటంతో, అనుచరులకు ఆశ్రయం కల్పించేందుకు నర్కేల్‌బరియాలో వెదురు కర్రలతో కట్టుదిట్టమైన కోటను నిర్మించుకున్నారు. అక్కడ సహచరులకు సాయుధ శిక్షణ కల్పించి సుమారు దశాబ్దం పాటు ఆంగ్లసైన్యాలను ఎదుర్కొంటూ కంపెనీ పాలకులను ఖంగుతిన్పించారు.

చివరకు 1831 నవంబర్ 19న, పోరాట ప్రవీణులుగా ఖ్యాతిగాంచిన ఆంగ్లేయ సైన్యాధికారులు భారీ బలగాలలో, ఆయుధాలతో అన్నివైపుల నుండి నర్కేల్‌బరియాలోని వహాబీల కోటను ముట్టడించగా శతృసైన్యాలతో వీరోచితంగా పోరాడుతూ తీవ్రంగా గాయపడి కుప్పకూలిపోయిన టిటూమీర్ చికిత్స పొందుతూ 1832వ సంవత్సరం ఆరంభంలో కన్నుమూశారు. ◆



# 8. హాజీ షరియతుల్లా

## (1780-1840)

**స్వా**తంత్ర్యోద్యమ చరిత్రలో విప్లవకారులకు స్ఫూర్తిని ప్రసాదించిన ఉద్యమాలలో ఫరాజీ తిరుగుబాటు ప్రముఖ స్థానం పొందింది. ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులు భారత దేశంలో నిలదొక్కుకుంటున్న సమయంలో బ్రిటీషర్ల మీద తిరుగుబాటు ప్రకటించి ప్రజలను, ప్రధానంగా గ్రామీణ రైతాంగాన్ని, చేతి వృత్తులవారిని ఏకం చేసి పోరుబాటన నడిపించిన ఫరాజీ ఉద్యమనేత హాజీ షరీయతుల్లా.

1780లో తూర్పు బెంగాల్‌లోని ఫరీద్‌పూర్ జిల్లా, బహదూర్ గ్రామంలో ఆయన జన్మించారు. తండ్రి అబ్దుల్ జాలిబ్. తండ్రిది చేనేత వృత్తి. షరియతుల్లా 18వ ఏటనే మక్కా వెళ్ళి ధార్మిక గ్రంథాలను అధ్యయనం చేసి పండితుడిగా రాటుదేలారు. అ సందర్భంగా వహాబీ ఉద్యమ నిర్మాత సయ్యద్ అహమ్మద్ బరేల్వి, మహాయోధుడు టిటూమీర్‌లను కలుసుకున్నారు. ఆ చర్చల పర్యవసానంగా తనదైన ధార్మిక-లౌకిక మార్గాన్ని నిర్దేశించుకుని 1802లో ఫరీద్‌పూర్ చేరుకున్నారు.

స్వదేశం చేరుకోగానే మక్కాలో నిర్ణయించుకున్న లక్ష్యాల సాధనకు ప్రస్తుత బంగ్లాదేశ్ రాజధాని ఢాకా సమీపాన గల నవాబారి గ్రామాన్ని కేంద్రంగా చేసుకుని ధార్మిక బోధనలతో ఆరంభించి క్రమంగా మాతృదేశాన్ని ఆంగ్లేయుల పాలన నుండి విముక్తం చేయడానికి





ప్రజలను ఉద్యమదిశగా ప్రేరేపిస్తూ ముందుకు సాగారు. ఆయన ఉద్యమం **ఫరాజీ ఉద్యమం**గా, ఆయన అనుచరులు **ఫరాజీలు**గా చరిత్రకెక్కారు.

ఫరాజీ ఉద్యమాన్ని ఉధృతం చేసేందుకు షరియతుల్లా గావించిన పర్యటనలలో గ్రామీణులు, ప్రధానంగా రైతులు, కుల వృత్తులను అనుసరిస్తున్న కుటుంబాలు పడుతున్న వెతలకు ఆంగ్లేయ పాలకవర్గాలు, వారి తొత్తులైన జమీందారులు, మహాజనులు, అధికారులు ప్రధాన కారణమని షరియతుల్లా గ్రహించారు. ఆ వర్గాల పీడన నుండి ప్రజలను తద్వారా తమ గడ్డను విముక్తం చేసేందుకు ఆయన సిద్ధపడ్డారు. ఆ ప్రయత్నంలో షరియతుల్లా సాధించిన విజయాల వలన **ఫరాజీ ఉద్యమం** బాగా విస్తరించి భారీ అనుచర వర్గం ఏర్పడింది. ఆ అనుచరులతో ఆయన ప్రజల పక్షంగా పలు పోరాటాలు సాగించి ఆంగ్లేయుల మీద, స్వదేశీ జమీందారులు, ప్లాంటర్ల మీద విజయాలు సాధించారు.

ఆంగ్లేయ ప్లాంటర్లు, జమీందారులు, మహాజనుల దోపిడీకి వ్యతిరేకంగా తిరుగుబాటుకు షరియతుల్లా ప్రజలకు పిలుపునిచ్చారు. ఆయన పిలుపుకు స్పందించిన ఫరాజీలు ఎక్కడ అరాచకం, అవినీతి, అన్యాయం ఉంటే అక్కడల్లా ప్రత్యక్షమయ్యారు. ప్రజాకంటకుల ఆటకట్టించి ప్రజలకు అభిమానపాత్రులయ్యారు. అవాంఛనీయ శక్తులకు అండగా నిలుస్తున్న ఆంగ్లేయ పాలకవర్గాల అణిచివేత వికృతరూపం ధరించే కొద్ది ప్రజలు మతం, కులం, వృత్తులకు అతీతంగా షరియతుల్లాకు చేరువయ్యారు. ఆంగ్లేయుల పెత్తనం, జమీందారుల దోపిడి, ప్లాంటర్ల కిరాతక చర్యల నుండి తమను కాపాడేందుకు తరలి వచ్చిన రక్షకుడిగా షరీయతుల్లాను, ఆయన సహచరులను అభిమానించి గౌరవించారు.

ఉద్యమబాటన ప్రజలకు మార్గదర్శకత్వం వహిస్తూ, పాలకవర్గాల చట్టపరమైన ఉచ్చులలో చిక్కుకోకుండా హాజీ షరియతుల్లా జాగ్రత్త పడినందున పోలీసులు, చట్టాలు, కోర్టులు ఆయన దరి చేరలేక పోయాయి. అరాచకాన్ని ఎదుర్కోవటం మాత్రమే కాకుండా ప్రజలలో స్వేచ్ఛాకాంక్షను, స్వతంత్ర భావాలను ఉద్దీపింపచేయడంలో షరియతుల్లా ప్రబోధాలు, ఆయన నిర్మించిన ఫరాజీ ఉద్యమం ఎంతగానో ఉపయోగపడింది.

అర్థశతాబ్దికి పైగా ఉధృతంగా సాగి, మరో అర్థశతాబ్ది పాటు సమకాలీన సమాజాన్ని ప్రభావితం చేసిన హాజీ షరియతుల్లా సాహసోపేతమైన చర్యలు స్వాతంత్ర్యోద్యమంలోని సాయుధ పోరాట యోధులకు ప్రేరణగా నిలిచాయి. ఆది నుండి అంతం వరకు ప్రజల పక్షం వహించి పరాయి పాలకులకు, స్వదేశీ దోపిడిదారులకు వ్యతిరేకంగా బలమైన ఉద్యమాన్ని నిర్మించిన ఫరాజీ ఉద్యమ నిర్మాత హాజీ షరియతుల్లా 1840లో కన్నుమూశారు. ◆



# ౨౨. సర్దార్ హిక్మతుల్లా ఖాన్

## ( - 1857 )

స్వదేశీ పాలకులూ, ప్రజలు మాత్రమే కాకుండా ఈస్ట్ ఇండియా కంపెనీలోని ఉన్నతాధికారులు కూడా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్నారు. మాతృభూమి మీద ఉన్న ప్రేమతో ఆయుధం పట్టి ముందుకు సాగిన అలనాటి యోధానుయోధులలో ఈస్ట్ ఇండియా కంపెనీ ఉన్నతాధికారి అయిన సర్దార్ హిక్మతుల్లా ఖాన్ ప్రముఖులు.

1857లో ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ఫతేపూర్ జిల్లాకు డిప్యూటి కలెక్టర్‌గా బాధ్యతలు నిర్వహిస్తున్నారు హిక్మతుల్లా ఖాన్. స్వదేశీయుల మత సంబంధిత వ్యవహారాలలో ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారుల జోక్యాన్ని వ్యతిరేకించిన ఆయన 1857లో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ప్రజ్వరిల్లగానే డిప్యూటీ కలెక్టర్ పదవిని త్యజించి కంపెనీ పాలకుల తరిమివేతకు 1857 జూన్ 10న సమర శంఖారావం పూరించారు.

ఈ ప్రతికూల పరిస్థితులకు దిమ్మెర పోయిన కంపెనీ ప్రభుత్వం తేరుకొనేలోపు ఫతేపూర్‌ను ఆధీనంలోకి తెచ్చుకుని కంపెనీ జైళ్ళలోని ప్రజలను విడుదల చేసి, ఖజానాలోని తొమ్మిది లక్షల రూపాయలను స్వాధీనం చేసుకుని స్వతంత్ర పాలనకు అంకురార్పణ చేశారు. సర్దార్ హిక్మతుల్లాకు దరియాన్‌సింగ్, శివదయాల్‌సింగ్, బాబా గయాదిన్ దుబే, మౌల్వీ లియాఖత్ ఆలీ, మౌల్వీ అహ్మదుల్లా, జనరల్ తిక్కా సింగ్, జ్వాలా ప్రసాద్ లాంటి





యోధులంతా అండగా నిలిచారు.

ఈ పరిణామాలను ఉపేక్షిస్తే బ్రిటీష్ ఆధిపత్యానికి భరతగడ్డ మీద నూకలు చెల్లగలవని భయపడిన లార్డ్ కానింగ్, తిరుగుబాటును కర్కశంగా అణిచివేయాల్సిందిగా అధికారులకు ఆఘమేఘాల మీద ఆదేశాలిచ్చాడు. ఆ ఆదేశాలందుకున్న అధికారులు ప్రజల మీద, తిరుగుబాటు యోధుల మీద విరుచుకుపడి చిత్రహింసలకు, కాల్చివేతలకు గురిచేశారు. అయినా స్వాతంత్ర్య సమరయోధులు వెనక్కు తగ్గలేదు. స్వదేశీపాలకులపై దాడులకు, కుయుక్తులకు పేర్గాంచిన జనరల్ హ్యావ్‌లాక్, జనరల్ రోనాల్డ్‌లను రప్పించి, తిరుగుబాటు యోధులను అణిచి వేసేందుకు లార్డ్ కానింగ్ ప్రత్యేక ఆదేశాలిచ్చాడు. ఆ ఆదేశాలు అందుకున్న కంపెనీ సైన్యాలు ముందుకు కదిలాయి. ఆంగ్లసైన్యాలు వస్తున్నాయన్న వర్తమానం అందుకున్న హిక్మతుల్లా మాతృభూమి రక్షణలో ప్రాణాలర్పించడానికి సిద్ధమైన వీరసైనికులతో కలసి పోరుకు సిద్ధమయ్యారు.

స్వతంత్ర పాలనను పరిరక్షించుకోడానికి తెగింపుతో నిలచిన సర్దార్ హిక్మతుల్లా అనుచరులతో నేరుగా తలపడటం అసాధ్యమని గ్రహించిన ఆంగ్ల సైన్యాధికారులు ఎత్తులు వేసి, ఆయన అనుచరులలో పదవులకు, ధనానికి ప్రలోభపడే ద్రోహులను చేరదీసి ఆశలు చూపి లోబర్చుకున్నారు. అనంతరం జనరల్ హ్యావ్‌లాక్ నాయకత్వంలో కంపెనీ సైన్యం కొంతమేరకు బలహీనపడిన హిక్మతుల్లా ఖాన్ దళాలపై విరుచుకు పడింది. సర్దార్ అనుచరులు కంపెనీ బలగాలను వీరోచితంగా ఎదుర్కొన్నప్పటికి కుయుక్తులతో పోరాటం సాగించిన కంపెనీ బలగాలదే చివరకు పైచెయ్యి అయ్యింది.

ఆ సమయంలో సహచరుల సలహా మీద హిక్మతుల్లా ఖాన్ పోరాట భూమి నుండి తప్పుకున్నారు. ఆయనను బంధించేందుకు బ్రిటీష్ సైన్యాధికారులు తమ బలగాలతో వెంటాడారు. చివరకు నమ్మక ద్రోహులిచ్చిన సమాచారంతో కంపెనీ బలగాలు హిక్మతుల్లా ఖాన్ రహస్యంగా గడుపుతున్న ప్రాంతాన్ని చుట్టుముట్టి ఆయనను నిర్బంధించాయి. ఆయన పట్ల అత్యంత కిరాతకంగా వ్యవహరించి, ఆ తరువాత విచారణ తంతు జరిపించిన కంపెనీ పాలకులు ఆయనకు ఉరిశిక్ష విధించారు.

ఆ తీర్పు మేరకు 1857 జూలై 12న హిక్మతుల్లా ఖాన్‌ను ఫతేపూర్‌లోని ప్రస్తుత ముస్లిం ఇంటర్ కళాశాల వద్ద గల చింతచెట్టుకు బహిరంగంగా ఉరితీశారు. ఆ మహావీరుని భౌతికకాయాన్ని ఖననం చేయకుండా వారం పాటు చెట్టుకు వ్రేలాడదీశారు. ఆనాడు సర్దార్ హిక్మతుల్లా ఖాన్ వెంట నడిచిన యోధులను మాత్రమే కాకుండా పిల్లలు-పెద్దలు అని చూడకుండా ప్రతి ఒక్కరినీ వెంటాడి, వేటాడి కిరాతకంగా వధించారు. ◆



# 10. మౌల్వీ పీర్ అలీ ఖాన్

## ( 1820 - 1857 )

**మాతృభూమి కోసం బలికావటం తన భూమి పట్ల గల ప్రేమకు నిదర్శనం,** అంటూ ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆయుధాన్ని అందుకుని పోరుబాటన సాగిన యోధులలో మౌలానా పీర్ అలీ ఖాన్ ఒకరు.

1820లో బీహార్ రాష్ట్రం అజీమాబాద్ జిల్లా ముహమ్మద్‌పూర్‌లో పీర్ అలీ ఖాన్ జన్మించారు. తండ్రి మొహర్ అలీఖాన్. చిన్నతనంలోనే జ్ఞానతృష్ణ తీర్చుకోడానికి బయలు దేరిన పీర్‌అలీ అరబిక్, పర్షియన్, ఉర్దూ భాషలలో పాండిత్యం సంపాదించి, చివరకు పాట్నాలో పుస్తక విక్రేతగా స్థిరపడి స్థానికంగా ఉన్న విప్లవ మండలిలో సభ్యులయ్యారు.

1857లో ఆంగ్లేయ ప్రభుత్వం మీద తిరుగుబాటు ప్రకటితం కాగా, ఆ పోరులో భాగంగా ఆత్మగౌరవం, తిరుగుబాటుతత్వం గల స్వదేశీ పాలకులను, నాయకులను సమైక్యం చేసేందుకు ఆయన విఫలప్రయత్నం చేశారు. ప్రభుత్వాధికారి మౌల్వీ మహది ద్వారా అందిన 50 తుపాకులతో, శ్రీరంగపట్నం యుద్ధంలో టిపూ రూపొందించిన తెలుపు-నీలి రంగు పతాకాన్ని తమ తిరుగుబాటు పతాకంగా ప్రకటించి అనుచరులతో కలసి దానాపూర్ ఆంగ్లేయ సైనిక స్థావరం మీద దాడిచేశారు.

ఈ పరిణామాలతో ఆగ్రహించిన బ్రిటీష్ సైనికాధికారులు పీర్ అలీ దళాన్ని





మట్టుపెట్టేందుకు విస్తృతంగా గాలింపు ప్రారంభించి, పీర్ అలీని ఆయన దళసభ్యులు 43 మందిని 1857 జూలై 4న అరెస్టు చేశారు. మౌలానా అలీని చిత్రహింసలకు గురిచేసి, ఆస్తులను జప్తు చేశారు. ఆయన మీద కుట్రకేసు నమోదు చేశారు. **పాట్నా కుట్రకేసు** గా చరిత్ర ప్రసిద్ధిపొందిన ఈ కేసులో ఆయన వాదనకు అవకాశం ఇవ్వకుండా విచారణ పూర్తి చేసి 9 మందికి ఉరిశిక్ష, 5 గురికి జీవిత కారాగార శిక్ష, మిగిలిన వారికి వివిధరకాల శిక్షలు విధిస్తూ ఆంగ్లేయాధికారి విలియం టేలర్ తీర్పు ప్రకటించాడు. ఆ తీర్పు మేరకు మౌలానా పీర్ అలీ ఖాన్‌ను ఉరి తీయడానికి ఏర్పాట్లు పూర్తి చేస్తూ మరోవైపు విప్లవోద్యమం రహస్యాలు వెల్లడిస్తే ఉరిశిక్ష రద్దుకు సిఫారసు చేస్తామని, ఆయనను అందలం ఎక్కిస్తామనీ అధికారులు పలు ఆశలు చూపసాగారు.

ఆ సందర్భంగా, తనను మభ్యపెడుతున్న అధికారుల వైపు తృణీకారంగా చూస్తూ, **ప్రతి ఒక్కరి జీవితంలో ఒక్కొక్కసారి ప్రాణాలను రక్షించుకోడానికి తెలివిగా ప్రవర్తించాల్సిన అవసరం వస్తుంది. అయితే అన్ని సమయాలలో ప్రాణాలు కాపాడు కోవడమే ప్రధానం కాదు. కొన్ని సమయాలలో ఆశయాల కోసం, మాతృభూమి గౌరవ ప్రతిష్టల కోసం జీవితాలను పణంగా పెట్టాల్సి వస్తుంది. మాతృభూమి కోసం బలి కావటం తన భూమి పట్ల గల ప్రేమకు నిదర్శనమౌవుతుంది...నా సహచరులను నా కళ్ళ ముందే ఉరి తీశారు. ఇంకా చాలా మందిని ఉరి తీయగలరు. నన్నూ చంపగలరు. అయితే ఒక విషయం గుర్తుంచుకోండి. బలమైన స్వేఛ్ఛాకాంక్షతో, స్వాతంత్ర్యం కోసం రక్తతర్పణలకు సిద్ధమౌతున్న ఈ పుడమి తల్లి బిడ్డలను నిలువరించటం మీకు కాదు కదా, మరే శక్తికీ సాధ్యం కాదు. ఈ రణంలో చిందిన మా రక్తపుబిందువుల వలన స్వాతంత్ర్య సమర యోధుల శరీరాలలో అగ్ని పుడుతుంది. ఆ అగ్నిజ్వాలల వేడిమిలో మీ ప్రభుత్వం, మీరూ మాడి మసైపోవటం తథ్యం,** అని భారత దేశంలోని బ్రిటీష్ పాలకుల భవిష్యత్తును మౌలానా పీర్ అలీ ఖాన్ ప్రకటించారని ఆయనకు ఉరిశిక్ష ప్రకటించిన విలియం టేలర్ ఆనాటి సంఘటనను పూసగుచ్చినట్టు నమోదు చేశాడు.

ఆ సమాధానంతో మరింత మండిపడిన ఆంగ్ల సైనికాధికారులు మౌల్వీని ఉరి తీసేందుకు ఏర్పాట్లు చకచకా పూర్తి చేశారు. చిత్రహింసల వలన ఆయన శరీరం రక్తసిక్తమైంది. ఆయన చేతులకు, కాళ్ళకు బిగుతైన బేడీలు వేశారు. ఆయన మాత్రం తన కోసం పొంచివున్న మృత్యుదేవతను ధిక్కరిస్తూ వీరోచితహాసంతో ఉరివేదిక మీద నిలబడ్డారు. ఆ తరువాత ఉరితాడును ముద్దాడిన మౌలానా పీర్ అలీ ఖాన్ మరణాన్ని కూడా ఎంతో హుందాగా స్వాగతిస్తూ 1857 జూలై 7న అమరులయ్యారు. ◆



# 11. మౌలానా ముహమ్మద్ బాఖర్

## (1780-1857)

ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో అగ్నికణాల్లా ఎగిసిపడుతున్న వీరులను ఉత్సాహపర్చడంలో పత్రికలు, పాత్రికేయులు బహుముఖ పాత్రవహించారు. ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల చర్యల మీద అక్షరాగ్నులు కురిపిస్తూ, తిరుగుబాటు వీరులను ప్రోత్సహించిన ఆనాటి పాత్రికేయులలో మౌలానా ముహమ్మద్ బాఖర్ అగ్రగామి.

1780లో ముహమ్మద్ బాఖర్ ఢిల్లీలో జన్మించారు. తండ్రి మొహమ్మద్ అక్బర్. చిన్ననాటనే ధార్మిక-ప్రాపంచిక విషయాల పట్ల అత్యంత ఆసక్తి చూపిన బాఖర్‌లో స్వతంత్ర భావనలు చిగురించాయి. ప్రసిద్ధ ఢిల్లీ కాలేజీ విద్యార్థిగా ఉన్నత విద్యను పూర్తి చేసిన బాఖర్ కొంతకాలం ఉన్నత ఉద్యోగాలు చేసినా చిన్నతనంలోనే హృదయంలో నాటుకున్న స్వేఛ్చా, స్వాతంత్ర్య బీజాలు, స్వజనులు అనుభవిస్తున్న బానిసత్వం, ఆయనను ఆ ఉద్యోగాలలో నిలువరించలేకపోయాయి.

స్వతంత్ర జీవనం మాత్రమే కాకుండా, ప్రజలకు మార్గదర్శకం వహించగల వృత్తిని చేపట్టాలన్న దృక్పథంతో మౌలానా బాఖర్ జర్నలిజం వైపు మొగ్గు చూపారు. బ్రిటీష పాలకుల దుష్ట సంకల్పాన్నీ, అధికారుల దాష్టీకాలనూ ఎండగడ్తూ, ప్రజలకు వాస్తవాలు తెలిపి చైతన్యవంతుల్ని చేయాలన్న లక్ష్యంతో 1836లో **ఢిల్లీ ఉర్దూ అఖ్బార్** వారపత్రికను





ఆరంభించారు. ఈ పత్రిక అతి కొద్ది కాలంలోనే అన్ని వర్గాల ప్రజలను ఆకట్టుకుంది. ప్రముఖ కవులు బహద్దూర్ షా జఫర్, మిర్జా గాలిబ్, హఫీజ్ గులాం రసూల్, మిర్జా మొహమ్మద్ అతీ భక్త్, మిర్జా హైదర్ షికో, మిర్జా జీవన్ భక్త్, మిర్జా నూరుద్దీన్ లాంటి ప్రసిద్ధ కవులు-రచయితలు **ఢిల్లీ ఉర్దూ అఖ్బార్** కు రాశారు.

1857 మే 10న ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ప్రారంభం కాగానే, మే 17 నుండి బాఖర్ పత్రిక సంగ్రామానికి సంబంధించిన అన్ని ప్రాంతాల విశేషాలను **'సంగ్రామ విశేషాలు'** శీర్షికన ప్రచురించటం ఆరంభించింది. ఈ సంచికలో **'రాఖిం ఆసిం'** అను పేరుతో ఆంగ్లేయుల చర్యలను ప్రశ్నిస్తూ, పోరాటయోధుల చర్యలను సమర్ధిస్తూ సుదీర్ఘ లేఖను ఆయన ప్రకటించారు. చివరకు ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధులకు, నేతలకు, తిరుగుబాటును ప్రోత్సహించే ప్రజలకు, కవులు, రచయితలకు **ఢిల్లీ ఉర్దూ అఖ్బార్** వేదిక అయ్యింది. మొగల్ పాదూషా బహదూర్ షా జఫర్ కూడా ఆ పత్రిక ద్వారా ప్రజలకు సందేశాలు, సమాచారం పంపించారు.

పరాయి పాలకుల మీద విజయం సాధించాలంటే హిందూ-ముస్లిం ఐక్యత అత్యవసరమని ప్రకటిస్తూ, ఆ లక్ష్యాన్ని సాధిచేందుకు పురాణాలు, చరిత్రను ఉంటంకిస్తూ, పురాణ పురుషులు, చారిత్రక వ్యక్తుల ధైర్యసాహసాలను ఉదాహరిస్తూ **ఢిల్లీ ఉర్దూ అఖ్బార్** వ్యాసాలు ప్రచురించింది. ఆంగ్లేయ పాలకులను తరిమి కొట్టాల్సిందిగా ప్రజలను, స్వదేశీ సైనిక యోధులను ఉత్తేజపర్చుతూ శరపరంపరగా వ్యాసాలు, వ్యాఖ్యానాలు ప్రచురించడం వలన అహంకారం దెబ్బతిన్న ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు బాఖర్‌ను ఢిల్లీలోని తమ **ప్రథమ శత్రువు**లలో ఒకరుగా పరిగణించారు.

చివరకు 1857 సెప్టెంబరు 18న ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం విఫలం కావటంతో డిసెంబరు 14న మౌలానా మహమ్మద్ బాఖర్‌ను ఆంగ్లేయాధికారులు నిర్బంధించారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న పలువుర్ని నిరాయుధులను చేసి నిర్ధాక్షిణ్యంగా కాల్చి చంపిన దుష్టచరిత్ర గల మేజర్ హడ్సన్ విచారణ పేరుతో మౌలానా బాఖర్‌ను భయానక చిత్రహింసలకు గురిచేసి డిసెంబరు 17న కాల్చివేశాడు.

ఆంగ్లేయుల కబంధహస్తాల నుండి మాతృభూమి విముక్తి కోసం సాగిన సాయుధ పోరాటంలో కలాన్ని ఆయుధంగా చేతపూని అక్షరాగ్నులతో శతృవును దహించివేస్తూ చివరికి ఆంగ్లేయుల దాష్టీకానికి ప్రాణాలు బలిపెట్టిన ప్రప్రథమ పత్రికా సంపాదకుడిగా, మౌలానా ముహ్మద్ బాఖర్ పత్రికా ప్రపంచంలో నూతన అధ్యాయాన్ని సృష్టించి చిరస్మరణీయ ఖ్యాతిని గడించి భవిష్యత్తు తరాలకు ఆదర్శమయ్యారు. ◆

# 12. షేక్ పీర్ షా

**( - )**

**ప**రాయి పాలన స్థానంలో స్వదేశీయుల పాలనను స్థిరంచేయాలన్న ఆకాంక్ష బలంగా ఉన్నట్టయితే ఏ అంగవైకల్యం కూడా అటువంటి స్థిరచిత్తులను అశక్తుల్ని చేయలేదని నిరూపించి చరిత్రలో ప్రత్యేక అధ్యాయాన్ని సృష్టించుకున్న యోధుడు షేక్ పీర్ షా.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం కడప జిల్లా పూర్వపు సిద్దవట్టం తాలూకా యల్లంపేట గ్రామ నివాసి షేక్ పీర్ షా. ఆయన పుట్టుకతో అంధులు. 1857లో ఆరంభమైన తిరుగుబాటులో భాగంగా పరాయిపాలకులను వెళ్ళగొట్టాలన్న దృఢసంకల్పంతో ముందుకు సాగారు. ఆ పథకంలో భాగంగా కడపకు 20 మైళ్ళ దూరంలో ఉన్న కడప చేరుకున్నారు. కడపలోని స్థానికులతో, ప్రభుత్వ సైన్యాగారానికి చెందిన 30వ పటాలంలోని స్వదేశీ సిపాయిలతో షేక్ పీర్ షా సంబంధాలు ఏర్పర్చుకున్నారు.

ఈ సందర్భంగా హిందూ-ముస్లింల మతమనోభావాల ను అగౌరవపర్చేలా కంపెనీ సైనికాధికారుల చర్యలను వివరిస్తూ స్వదేశీ సైనికులలో బ్రిటీషు సైనికాధికారుల పట్ల వ్యతిరేకభావనలను ప్రోదిచేశారు. ఈ సందర్భంగా ఆంగ్లేయులకు మద్దతు పలుకుతున్న నైజాం నవాబు చర్యలనుకూడా ఆయన నిశితంగా విమర్శించారు.

1857లో ప్రథమ స్వాతంత్ర్య సమరం ఆరంభం కాగానే స్వదేశాభిమానం గల యోధులను పూర్తిగా తిరుగుబాటుకు ప్రేరేపిస్తూ, ఆంగ్లేయ ప్రభుత్వం కూలిపోతుందని,





స్వదేశీయుల పాలన తిరిగి నెలకొనబడుతుందని, తిరుగుబాటు సిద్ధం కావాలని సందేశాలు పంపారు. ఈ తిరుగుబాటుకు రాష్ట్రంలో హిందూ- ముస్లింలు కలిసి జరుపుకునే మొహర్రం పండుగ రోజైన 1857 ఆగస్టు 28ని ముహూర్తంగా నిర్ణయించారు.

ఈ మేరకు 30వ పటాలానికి చెందిన హిందూ-ముస్లిం సిపాయీలు : హవల్దార్ వరదరాజులు, లాన్స్‌నాయక్ పరుశురాం, సిపాయి వీరాస్వామి, దలాయత్ యల్లప్ప, సుబేదార్ మేజర్ మహమ్మద్ అష్రాఫ్, దలాయత్ సత్యాజీ, జమేదార్ సి.జగ్గయ్య, హవల్దార్ మహమ్మద్ గౌస్, మౌల్వీ అబ్దుల్ అజీజ్ హుస్సేన్‌లను సంసిద్ధం చేశారు. తిరుగుబాటు ముహర్తాన్ని పెట్టి ఒక్కమ్మడిగా ఆంగ్లేయాధికారుల మీద విరుచుకు పడాలని సహచరులకు సూచిస్తూ పథకం సిద్ధం చేశారు.

ఈ పథకం అమలు జరిగేలోపున ఆ విషయాన్ని గూఢచారుల ద్వారా పసికట్టిన ఆంగ్లేయాధికారులు తక్షణమే రంగంలోకి దిగారు. షేక్ పీర్ షాతో తిరుగుబాటు ఆలోచనలను పంచుకున్నా స్వదేశీ సైనికుల మీద కన్నేసి, వారిలో ఒకరిని నయానా భయాన నచ్చ చెప్పి, లంచమిచ్చి రహస్య మంతనాల సారాంశాన్ని పూర్తిగా రాబట్టారు. ఆ సమాచారంతో తిరుగుబాటుకు కుట్ర జరుగుతుందన్న విషయం తెలియగానే కంగారుపడిన ఈస్ట్ ఇండియా సైనికాధికారులు అప్రమత్తులయ్యారు. ఈ తిరుగుబాటు పథకాన్ని రూపొందించింది ఒక గ్రామీణుడని, మతప్రసక్తి లేకుండా స్వదేశీ సైనికులను ఏకం చేసి తిరుగుబాటును దాదాపు విజయవంతం చేయగల స్థాయికి చేర్చిన ఆ వ్యక్తి పుట్టు అంధుడని తెలుసుకున్న ఆంగ్లేయాధికారులు నివ్వెరపోయారు. ఆఘమేఘాల మీద బలగాలతో బయలుదేరి వచ్చి షేక్ పీర్ షాను అరెస్టు చేశారు.

ఆ తరువాత తిరుగుబాటుకు సన్నద్ధులైన వారందర్ని అదుపులోకి తీసుకున్నారు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటుకు కుట్రను పన్నారన్న నేరారోపణతో షేక్ పీర్ షా మీద విచారణ జరిపారు. ఆ సందర్భంగా షేక్ పీర్ షా గురించి ప్రస్తావిస్తూ- He effects to be blind, whether so or not, his other senses are evidently keen, and I therefore deem it my duty to sentence the Prisioner Shaik Peer Shah to 10 years' imprisonment, with hard labour in Irons'(The Freedom Struggle in Andhra Pradesh (Andhra), Volume I, Govt. of AP, Hyderabad,1997,Page.161-163 ) అని వ్యాఖ్యానిస్తూ 10 సంవత్సరాల కఠిన కారాగారశిక్షను విధించారు. ఆ తీర్పు మేరకు షేక్ పీర్ షాను కడప జైలు నుండి మధుర లేక తిరున్వేలి జైలుకు తరలించారు. ◆



# 13. బేగం అజీజున్

## (1832-1858)

**స్వ**ప్రయోజనాలను ఆశించకుండా మాతృభూమి మీదగల ప్రేమాభిమానాలతో మాత్రమే తమ ధన, మాన, ప్రాణాలను తృణప్రాయంగా భావించి ఆంగ్లేయ సైన్యాలతో పోరాడుతూ అమరత్వం పొందిన సామాన్యులలో అసామాన్యురాలుగా ఖ్యాతిగాంచిన యోధురాలు బేగం అజీజున్.

1832లో ఉత్తరప్రదేశ్ రాష్ట్రం బితూర్‌లో జన్మించిన అజీజున్ తండ్రి హుసేన్ ఖాన్, తల్లి హమీదా బాను. అజీజున్ మంచి రూపసి. ప్రసిద్ధ నర్తకి ఉమ్రావ్‌జాన్ బృందంలో చేరి నాట్యంలో మంచి అభినివేశాన్ని సాధించిన ఆమెకు స్వజనం మీద పెత్తనం సాగిస్తున్న ఆంగ్లేయులంటే పరమ ద్వేషం. బ్రిటీష్ సైన్యంలో సుబేదారుగా పనిచేస్తున్న షంషుద్దీన్ పరాయి ప్రభుల కొలువు నుండి తొలిగి కాన్పూరు పాలకుడు నానా సాహెబ్ పక్షంలో చేరేంత వరకు ఆయన స్నేహాన్ని అంగీకరించని దేశభక్తి ఆమెది.

మహాయోధుడు నానా సాహెబ్ పీష్వా అంటే అజీజున్‌కు భక్తి, గౌరవం. స్వదేశీ సంస్థానాలను అక్రమంగా ఆక్రమించుకుంటున్న ఆంగ్ల పాలకులంటే అసహ్యం. ఆ అసహ్యత నుండి పరదేశీయులు సాగిస్తున్న అధర్మాన్ని, అన్యాయాన్ని ఎదుర్కోవాలన్న ప్రగాఢవాంఛ ఆమెలో అంకురించింది. ఆ కోర్కె మరింతగా బలపడి 1857 జూన్ 7న





కాన్పూరులో తిరుగుబాటు ఆరంభం కావటంతో కార్యరూపం ధరించింది. ఆమె ఒక్క క్షణం కూడా అలశ్యం చేయకుండా అతి విలాసవంతమైన జీవితాన్ని వదిలి, సన్నిహితుడు షంషుద్దీన్‌తో కలసి నానా సాహెబ్ పక్షాన ఆంగ్లేయుల మీద పోరుకు సిద్ధమయ్యారు.

ఆత్మీయ మిత్రుడు షంషుద్దీన్ సహకారంతో ఆయుధాలను ఉపయోగించటం, గుర్రపు స్వారి చేయడం అజీజున్ నేర్చుకున్నారు. ఆమె పూర్తిగా సైనిక దుస్తులు ధరించి సంచరిస్తూ మాతృదేశ భక్తిభావాలు గల యువతులను సమీకరించి, ప్రత్యేక మహిళా సైనిక దళం ఏర్పాటుచేసి తుపాకి పేల్చటం, కత్తి తిప్పటం, గుర్రపు స్వారీ చేయటంలో ప్రత్యేక శిక్షణ కల్పించారు. ఆమె తన బలగంతో కాన్పూరు నగరంలోని ప్రతి ఇల్లూ తిరుగుతూ యువకుల్లో రోషాగ్నిని ప్రజ్వరిల్లచేస్తూ, యుద్ధభయంతో సైన్యంలో చేర నిరాకరించిన వారి చేతులకు స్వయంగా గాజులు తొడిగి, వారిని సైన్యంలో చేరేలా ప్రేరణ కలిగించి నానా సాహెబ్ బలగాలను పెంచారు. ఆ క్రమంలో పోరాట యోధులకు ఆహారం, ఆయుధాలను, బట్టలు సమకూర్చి పెట్టటం, సైనికుల మధ్యన సమాచారం అందజేసే సంధానకర్తల్లా వ్యవహరించటం, శత్రుసైనికుల కదలికల మీద నిఘా ఉంచి వారి గమనాగమనాన్ని తిరుగుబాటు నేతలకు చేరవేయడం, ఆంగ్లేయులతో సాగుతున్న పోరాటంలో గాయపడిన వీరసైనికుల చికిత్సకు సంబంధించిన కార్యక్రమాలను ప్రత్యేక శ్రద్ధతో నిర్వహించేందుకు యువతీ-యువకులతో ప్రత్యేక దళాలను ఏర్పాటుచేసి నానా సాహెబ్‌కు ఎనలేని సహాకారం అందించారు.

ఆంగ్ల సైనికులతో సాగిన పలు పోరాటాలలో ఆమె స్వయంగా పాల్గొన్నారు. ఈ మేరకు రణరంగంలో శత్రువు పరిమార్చుతూ తీవ్రంగా గాయపడి పట్టుబడినా కూడా ఏమాత్రం అధైర్యపడకుండా ఆంగ్ల సైన్యాధికారితో **'బ్రిటీష్ పాలన అంతం చూడాలన్నది తన లక్ష్యం'** అని ప్రకటించడంతో ఖంగుతిన్న ఆంగ్ల సైన్యాధికారి General Havelock ఆమెను కాల్చివేయాల్సిందిగా ఆదేశాలిచ్చాడు.

ఆ ఆదేశాలను విన్న అజీజున్ చిరునవ్వు చిందిస్తూ ఆంగ్ల సైనికుల తుపాకులకు ఎదురొడ్డి నిల్చున్నారు. ఆమెకేసి గురి పెట్టబడ్డ తుపాకులు ఒక్కసారిగా గర్జించటంతో ఆమె ఉచ్ఛ్వాస-నిశ్వాసలు అనంతవాయువులలో కలసిపోయాయి. ఆ చివరి క్షణంలో కూడా పరాయి పాలకుల మీద పోరాటం సాగించిన అజీజున్ తన నేత మీద గౌరవాన్ని వ్యక్తంచేస్తూ **'నానా సాహెబ్ జిందాబాద్'** అని చేసిన సింహనాదం ఆంగ్లేయ సైనికులను మాత్రమే కాకుండా సైన్యాధికారులను కూడా భయకంపితులను చేసింది. ◆

# 14. ముందర్

## ( - 1858)

1857 నాటి సంగ్రామంలో మాతృభూమిని బ్రిటీషు పాలకుల నుండి విముక్తి చేయడానికి ప్రజలు కులమతాలకు అతీతంగా పోరులో పాల్గొన్నారు. ఆయా ప్రాంతాలలోని స్వదేశీ పాలకుల పక్షాన తిరుగుబాటు చేసిన యోధులు తమ ధనమాన ప్రాణాలను పణంగా పెట్టి నాయకుల వెంట నడిచారు. ఆ విధంగా స్వదేశీ పాలకులతో కలసి తిరుగుబాటులో పాల్గొని అమరత్వం పొందిన ముస్లిం యువతులలోముందర్ ఒకరు.

ఝాన్సీ రాణి లక్ష్మీబాయి వెన్నంటి నిలచి శత్రువుతో పోరాడిన సాహస యువతి ముందర్. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రముఖ పాత్ర వహించిన ఝాన్సీ రాణి లక్ష్మీబాయి అమరత్వం పొందిన తీరు గురించి ప్రధానంగా రెండు కథనాలు ఉన్నాయి. ఆ కథనాలలో ఒకటి రాణి లక్ష్మీబాయి బ్రిటీషర్ల తుపాకి గుండ్లకు బలైందన్నది. ఈ విషయాన్ని చాలామంది చరిత్రకారులు అంగీకరిస్తున్నారు. ఆ కథనం ప్రకారంగా ఝాన్సీ రాణి లక్ష్మీబాయికి అంగరక్షకుల్లా ఇరువురు యువతులు మగ వేషాల్లో ఆమెను ఎల్లప్పుడూ వెన్నంటి ఉండేవారు. ఆ ఇద్దరిలో ఒకరు ముందర్. ఆమె రాణితో పాటు బ్రిటీష్ సైనికాధికారుల తుపాకి గుళ్ళకు బలయ్యారు.





ఝాన్సీ విజయం గురించి అప్పటి సెంట్రల్ ఇండియా ప్రాంతానికి గవర్నర్ జనరల్ ప్రతినిధి అయినటువంటి రాబర్ట్ హెమిల్టన్ 1858 అక్టోబర్ 30న అప్పటి భారత ప్రభుత్వ కార్యదర్శి ఎడ్‌సన్‌కు ఒక లేఖ రాశాడు. ఆ లేఖలో రాణి లక్ష్మీబాయి ఏ విధంగా పోరాడింది, ఏవిధంగా కన్నుమూసింది వివరంగా తెలిపాడు. ఆ కథనం ప్రకారంగా, **రాణి వెన్నంటి ఒక ముస్లిం యువతి గుర్రం మీద అనుసరించేది. కొతాకి సరాయి ప్రాంతంలో రాణి తోపాటుగా ఆమెకు తుపాకి గుండ్లు తగిలాయి. ఆమె రాణితోపాటుగా ఒకేసారి నేలకొరిగిందని** అతడు వివరించాడు.

ఈ విషయాన్ని Dr. Surendra Nath Sen తన EIGHTEEN FIFTY SEVEN గ్రంథంలో రాబర్ట్ హెమిల్టన్ వివరణను, '.. The Rane was on Horse back, and close to her was the female (a Mohomaden) who seems never to have left her side on any occasion, these two were struck by bullets and fell ' (Page 295) అని ఉటంకించారు. ఈ లేఖలో ఎక్కడా కూడా ఆ యువతి ఎవరన్న విషయంగాని, ఆమె పేరు ఏంటన్నది మాత్రం పూర్తిగా ప్రస్తావించలేదు.

ఆ కారణంగా ముందర్ అజ్ఞాత యోధురాలుగా మిగిలిపోయింది. ఝాన్సీ గురించి ప్రస్తావించినప్పుడల్లా ముస్లిం యువతి అని మాత్రమే పేర్కొనడంతో ఆమె వివరాలు గుప్తంగా ఉండిపోయాయి. కాగా ఈ విషయాన్ని డాక్టర్ పి.యన్. ఛోప్రా కొంత స్పష్టపర్చారు. భారత ప్రభుత్వం 1973లో ప్రచురించిన Who's who of Indian Martyrs, Vol. 3, Page.102 లో మాత్రం ఝాన్సీ రాణితో పాటుగా పలు పోరాటాలలో పాల్గొన్న ఆ ముస్లిం మహిళ గురించి ప్రస్తావిస్తూ డాక్టర్ ఛోప్రా ఈ క్రింది విధంగా పేర్కొన్నారు.

'..Fought by the side of Maharani Lakshmi Bai during the battles against the British at Jhansi, Koonch, Kapi and Gwalior, Killed in the battle at Kotah-ki-sarai in Gwalior, where the Rani attained martyrdom. Her Body was also cremated in the garden of Baba Ganga Das at Gwalior on June 17, 1857 '.

ఈ వివరణలను, చరిత్ర గ్రంథాలలో వ్యక్తమవుతున్న కథనాలకు అన్వయించుకుని చూస్తే ఆ అజ్ఞాత యోధురాలు పేరు '**ముందర్**' గా భావించవచ్చు. ఝాన్సీ రాణి లక్ష్మీబాయి అంగరక్షకురాలుగా వ్యవహరించిన ముందర్ ఆమె వెంట చివరికంటా సాగి ఆంగ్లేయులతో వీరోచితంగా పోరాడుతూ రాణితోపాటుగా 1858 జూన్ 16న నేలకొరిగారు. ◆



# 15. మౌల్వీ అహ్మదుల్లాషా ఫైజాబాది

## (1787-1858)

బ్రిటీషర్ల పై కత్తిగట్టి వారి సైనిక బలగాలను పలుమార్లు మట్టికరిపించి ఆంగ్లేయ శిబిరాలలో దడ పుట్టించిన యోధుడుగా ఖ్యాతిగాంచి, ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో అగ్రస్థానం పొందిన అసమాన పోరాట వీరుడు మౌల్వీ అహ్మదుల్లా ఖాన్.

మౌల్వీ అహ్మదుల్లా ఖాన్ తండ్రి ముహమ్మద్ అలీ ఖాన్. ప్రస్తుతం చెన్నయ్‌గా పిలువబడుతున్న చెన్నపట్నంలో 1787–88లో జన్మించారు. మౌల్వీ అసలు పేరు సయ్యద్ అహ్మద్ అలీ ఖాన్. చిన్నతనంలోనే ఆయన ధార్మిక, లౌకిక విద్యలో సాధించిన విద్వత్తు ఫలితంగా 'మౌల్వీ'గా ప్రసిద్ధిగాంచారు. స్వదేశీ భాషలలోనే కాకుండా ఆంగ్ల భాషా పరిజ్ఞానాన్ని కూడా సంతరించుకున్న ఆయన పలు యుద్ధవిద్యలలో ఆరితేరారు.

ఒకసారి నైజాం నవాబు ఆహ్వానం మేరకు హైదరాబాదుకు విచ్చేసిన సందర్భంగా మౌల్వీ అహమ్మదుల్లా ప్రతిభను గమనించిన బ్రిటీష్ సైనికాధికారులు ఆయనను ఇంగ్లాండుకు ఆహ్వానించారు. ఆ ఇంగ్లాండు పర్యటన తరువాత ఆయన మక్కా–మదీనా, ఇరాక్, ఇరాన్, తదితర ప్రాంతాలను కూడా పర్యటించి స్వదేశం చేరుకున్నారు. స్వదేశం వచ్చిన మౌల్వీ అహ్మదుల్లా ఖాన్ **సూఫీ** సిద్ధాంతాల పట్ల ఆకర్షితులై ఖాద్రి సంప్రదాయానికి చెందిన సయ్యద్ ఫుర్‌ఖాన్ అలీ షా (Syed Furqan Ali Sha) శిష్యులయ్యారు. గురువాజ్ఞ





మేరకు గ్వాలియర్ ప్రాంతంలో సూఫీ భక్తి తత్త్వాన్ని ప్రచారం చేస్తూ బానిసత్వానికి వ్యతిరేకంగా, స్వదేశీయుల మీద విదేశీ శక్తుల పెత్తనాన్ని నిరసిస్తూ, దాన్ని అంతం చేసేందుకు ధర్మయుద్ధానికి సిద్ధం కావాల్సిందిగా ప్రజలను ప్రేరేపిస్తూ ప్రసంగాలు చేస్తుండటంతో, ఆయన మీద ఆంగ్లేయాధికారులు రాజద్రోహం నేరం మోపి నిర్బంధించారు.

ఆ సమయంలో 1857 నాటి సమరం ఆరంభమయ్యింది. ఆ సమరంలో భాగంగా మౌల్వీ అహ్మదుల్లా బ్రిటీష్ బలగాలతో తలపడటం ఆరంభించి పలు పోరాటాలలో అజేయులుగా నిలచి ఆంగ్లేయ సైన్యాలను మట్టికరిపించారు. ఆంగ్లేయులతో తలపడుతున్న ప్రతి స్వదేశీ యోధునికి ఆయన సహాయ సహకారాలు అందించారు. సర్దార్ హిక్మతుల్లా, అవధ్ రాణి బేగం హజరత్ మహల్, రోహిల్ ఖండ్ అధినేత ఖాన్ బహుదూర్ ఖాన్, మొగల్ రాకుమారుడు ఫిరోజ్ షాలు ఆంగ్లేయుల మీద సాగించిన పోరాటాలలో మౌల్వీ ప్రత్యక్షంగా పాల్గొన్నారు. ఆ కారణంగా ఆ యోధుడి శిరస్సును తెచ్చిచ్చిన వారికి 50,000 రూపాయల భారీ నజరానాను ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రకటించింది.

ఐక్య పోరాటాల ద్వారా మాత్రమే బలమైన శత్రువును తరిమి వేయగలమని విశ్వసించిన మౌల్వీ స్వదేశీ పాలకులను ఏకం చేసే ప్రయత్నాలలో భాగంగా షాజహాన్‌పూర్ జిల్లాలోని పోవెన్ (POWAIN) రాజు జగన్నాథ సింహాతో చర్చలు జరిపేందుకు వెళ్ళారు. అ సందర్భంగా **'రాజా ప్రక్కనే ఉన్న అతడి సోదరుడు మౌల్వీ పై గురిచూసి కాల్పులు జరిపాడు. ఆ దుర్మార్గుని హస్తాలలో మౌల్వీ హతుడైపోయాడు. ఆ పిరికిపందలు..మౌల్వీ శిరస్సు ఖండించి, దాని పై గుడ్డ కప్పుకొని చేరువనే 13 మైళ్ళ దూరాన ఉన్న బ్రిటీషు ఠాణా షాజహన్‌పూరుకు తీసుకువెళ్ళారు...రక్తం ఓడుతున్న ఆ పవిత్ర శిరాన్ని ఆ నీచులు ఆంగ్లేయుల ముందు కానుకగా ఉంచి వారి పాదాల చెంత మోకరిల్లారు..నీచమైన దేశ ద్రోహానికి తలపడిన ఆ పోవెన్ పశువుకు 50 వేల రూపాయల పారితోషికం లభించింది!'** ఆ విధంగా మౌల్వీ 1858 జూన్ 15న అమరులయ్యారు.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో మహా యోధుడిగా, అద్వితీయ దేశభక్తుడిగా ఆంగ్లేయ సైన్యాధికారుల చేత కూడా ప్రశంసలు పొందిన మౌల్వీ అహమ్మదుల్లా షా ఫైజాబాది మరణ వార్తను ఖచ్చితంగా ధృవపర్చుకున్నాక **ఉత్తర భారతదేశంలో బలిష్టమైన శత్రువును** అంతం చేశామని బ్రిటీష్ సైన్యాధికారులు ఆనందపడ్డారు. చివరివరకు ఆంగ్లేయ సైనికులను సంహరిస్తూ ముందుకు సాగిన మౌల్వీ అహమ్మదుల్లా షా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో అసమాన యోధులుగా ఖ్యాతి గడించి చరిత్రలో తనదైన ప్రత్యేక ముద్రతో చిరస్మరణీయులయ్యారు. ◆



# 16. పఠాన్ తుర్రేబాజ్ ఖాన్

## (- 1859)

**ఆ**ధునిక ఆయుధాలు కలిగి, అపారమైన సైనిక బలగాలున్న బ్రిటీష్ పాలకులను ఎదుర్కోవటం మృత్యువును వాటేసుకోవడమేనని స్వదేశీ యోధులకు స్పష్టంగా తెలిసినా, తమ ప్రాణాలను తృణప్రాయంగా భావించి పరాయి పాలకులను తరిమికొట్టేందుకు నడుంకట్టిన యోధులలో పఠాన్ తుర్రేబాజ్ ఖాన్ (Pathan Turrebaz Khan) ఒకరు.

పఠాన్ తుర్రేబాజ్ ఖాన్ ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాద్ నివాసి పఠాన్ రుస్తుం ఖాన్ కుమారుడు. బ్రిటీష్ సైన్యంలో సైన్యాధికారిగా బాధ్యతలు నిర్వర్తించిన ఆయన పరాక్రమాలకు పెట్టింది పేరైన రొహిల్లా సైనిక పటాలానికి చెందిన నాయకుడు.

ఉత్తర హిందూస్థానంలో ఆరంభమైన తిరుగుబాటు పవనాలు తిన్నగా దక్షిణ హిందూస్థానాన్ని కూడా తాకాయి. ఆంగ్లేయులకు హితుడుగా మారిన నైజాం నవాబు వారి అభీష్టం మేరకు నడుచుకుంటున్నా, బ్రిటీష్ పాలకుల నుండి మాతృగడ్డను విముక్తి చేయమని యవతీ యువకులను, భారతీయ సైనికులను, స్వదేశీ పాలకులను ధార్మికపెద్దలు ప్రోత్సహిస్తున్న వాతావరణం. ఆ వాతావరణంలో బానిసత్వం నుండి విముక్తికై పోరాడమని హైదరాబాద్‌కు చెందిన మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ తుర్రేబాజ్ ఖాన్‌కు ఉద్బోధించారు. ఆ ప్రేరణతో ఆంగ్లేయుల మీద పోరాటానికి నడుం కట్టిన తుర్రేబాజ్ ఖాన్ మౌల్వీ





అల్లావుద్దీన్ సహకారంతో చరిత్రాత్మక మక్కా మసీదు నుండి బయలుదేరి, బ్రిటీష్ ఆధిపత్యానికి చిహ్నమైన **హైదరాబాద్ రెసిడెన్సీ** మీద సుమారు ఐదు వందల మంది సాహసికులతో 1857 జూలై 17న సాహసోపేతమైన దాడి చేశారు.

ఆ దాడిలో వీరోచితంగా పోరాడిన పలువురు సహచరులను కోల్పోయిన ఖాన్, బ్రిటీష్-నిజాం బలగాలకు 1857 జూలై 22న పట్టుబడ్డారు. ఆయనకు ప్రభుత్వం ద్వీపాంతరవాస శిక్ష విధించి, యావదాస్తిని పాలకులు స్వాధీనం చేసుకున్నారు. బ్రిటీష్ పాలకులు విధించిన ఆ శిక్ష అమలు జరిగేలోగా తనకు కాపలాగా పెట్టిన సెంట్రీలలో కూడా మాతృభూమి పట్ల గౌరవాభిమానాలను ప్రోదిచేసిన పఠాన్ తుర్రేబాజ్ ఖాన్ 1859 జనవరి 18న జైలు నుండి తప్పించుకున్నారు. ఈ చర్యతో ఆగ్రహించిన ప్రభుత్వం తుర్రేబాజ్ ఖాన్‌ను సజీవంగా గానీ నిర్జీవంగా గానీ పట్టితెచ్చిన వారికి 5వేల రూపాయల నగదు నజరానాను జనవరి 19న ప్రకటించింది.

ఆ ప్రకటనతో అప్రమత్తులైన తుర్రేబాజ్ ఖాన్ రహస్యంగా ప్రజలలో తిరుగుతూ, బ్రిటీష్ సేనలపై తిరిగి దాడులకు ప్రయత్నాలు చేయసాగారు. ఖైదు నుండి తప్పించుకున్న ఖాన్‌ను ఎలాగైనా పట్టుకుని అంతం చేయాలన్న పట్టుదలతో బ్రిటీషు సైన్యాలు, నిజాం సేనలు నిఘాను తీవ్రతరం చేశాయి. చివరకు నిజాం నవాబు ప్రకటించిన నజరానాకు ఆశపడిన కుర్‌బాన్ అలీ అను నమ్మకద్రోహి తుర్రేబాజ్ ఖాన్ ఆచూకిని బహిర్గతం చేశాడు. ఆ సమాచారంతో 1859 జనవరి 24న, మెదక్ జిల్లాలోని తూఫ్రాన్ అను గ్రామం మీద నిజాం, బ్రిటీష్ సైన్యాలు విరుచుకుపడ్డాయి.

ఆధునిక ఆయుధాలతో చీమలదండు వలె వచ్చిపడుతున్న నిజాం, ఆంగ్ల సైనికులను తూఫ్రాన్‌లో తలదాచుకుంటున్న తుర్రేబాజ్ ఖాన్ ఒంటరిగా ఎదుర్కొన్నారు. ఆ పోరాటంలో శత్రువు తుపాకి గుండ్లకు తుర్రేబాజ్ ఖాన్ ఎరయ్యారు. ఆ తరువాత ఆ యోధుని మృతదేహాన్ని బ్రిటీషు సైన్యాలు హైదరాబాదుకు తరలించాయి. ఆయన భౌతిక కాయానికి అంత్యక్రియలు ఏవీ జరపకుండా బలమైన ఇనుప సంకెళ్ళతో కట్టేసి ప్రస్తుతం సుల్తాన్ బజారు పోలీసు స్టేషన్ ఉన్న చోట బహిరంగంగా వేలాడదీశారు.

ప్రజలలో తిరుగుబాటు ఆలోచనలు ఏమాత్రం పొడచూపకుండా భయోత్పాతం కల్గించేందుకు అత్యంత కర్కశ చర్యలకు పాల్పడిన పాలకులు చరిత్ర హీనులుగా ఈనాటికి ప్రజల శాపనార్థాలను పొందుతుండగా, మహాయోధుడు తుర్రేబాజ్ ఖాన్ మాత్రం స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రపుటలలో గౌరవప్రదమైన స్థానం పొంది చిరస్మరణీయులయ్యారు. ◆



# 17. ముహమ్మద్ భక్త్ ఖాన్

## (- 1859)

ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామానికి ప్రధాన కేంద్రంగా నిలిచిన ఢిల్లీకి తరలివచ్చిన స్వదేశీ యోధులకు, ప్రజలకు నాయకత్వం వహించి, బ్రిటీష్ సైనిక బలగాలను ఏకోన్ముఖంగా ఎదుర్కొనగల సమర్ధుడి అవసరాన్ని తీర్చిన మహాయోధులు ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ వీరుల సర్వసేనానిగా మహమ్మద్ భక్త్‌ఖాన్ చరిత్ర సృష్టించారు.

ఉత్తరప్రదేశ్ రాష్ట్రం అయోధ్యలోని సుల్తాన్‌పూర్‌లో మహమ్మద్ భక్త్‌ఖాన్ జన్మించారు. తండ్రి పేరు అహమ్మదుల్లా ఖాన్. బ్రిటీష్ సైన్యంలో చేరి 40 సంవత్సరాల సుదీర్ఘ అనుభవాన్ని సొంతం చేసుకున్న ఆయన 1857లో రోహిల్ ఖండ్‌లో ఖాన్ బహుదూర్ ఖాన్ నేతృత్వంలో ఆంగ్లేయాధికారుల భరతం పట్టి స్వతంత్ర ప్రభుత్వ పతాకాన్ని రెపరెపలాడించారు. ఆ తరువాత బరెల్లీలోని ఈస్ట్ ఇండియా కంపెనీ ఖజానాను స్వాధీనం చేసుకుని, సైనిక బలగాలను సమకూర్చుకున్న భక్త్ ఖాన్ మొగల్ పాదుషా బహదూర్ షా జఫర్‌కు బాసటగా నిలవడానికి, తన బలగాలు, అపార ఖజానాతో ఢిల్లీ చేరుకున్నారు.

ఆయన ఢిల్లీ చేరుకునేసరికి స్థానికంగా ఏర్పడిన అవాంఛనీయ పరిస్థితుల మూలంగా సమర్థుడైన నాయకుడి కోసం ఎదురు చూస్తున్న చక్రవర్తి జఫర్ ఆయనను స్వదేశీ సేనలకు సర్వసేనానిగా నియమించారు. ఢిల్లీ నగర సంరక్షణ బాధ్యతలను ఆయనకు





అప్పగిస్తూ ఆయన ఏది మంచిదనుకుంటే అది చేసేందుకు అనుమతిచ్చారు. సర్వ సైన్యాధిపతిగా బాధ్యతలను స్వీకరించగానే సైనికబలగాల పరిస్థితులను చక్కదిద్ది సైనికుల అభిమానాన్ని పొందారు. ఆ మీదట ప్రజలపై ఎటువంటి దాష్టీకాలకూ పాల్పడరాదని, దొంగతనాలకు, దోపిడీలకూ పాల్పడితే చేతులు నరికి వేస్తామని, నేరస్థుల పట్ల కఠినంగా వ్యవహరిస్తామని ప్రకటించి ఢిల్లీలోని అస్తవ్యస్థ పరిస్థితులను అదుపులోకి తెచ్చారు.

ఢిల్లీ నగరంలోని వ్యవహారాలను చక్కదిద్దాక పరిపాలన వైపు దృష్టి సారించిన ఆయన ప్రజాస్వామిక పద్ధతులకు శ్రీకారం చుట్టి **మహాపరిపాలనా మండలి** ఏర్పరిచారు. అందుకు అవసరమైన **రాజ్యాంగ విధానాన్ని** రూపొందించారు. స్వతంత్ర్య పాలనకు, వ్యక్తుల మధ్యన బేధాభిప్రాయాలు, స్వార్థం అంటరాదన్న ముందుచూపుతో చక్కని రాజనీతిజ్ఞతను ప్రదర్శించారు. ఢిల్లీలో బ్రిటీషర్ల మీద సాధించిన విజయంతో స్వదేశీ సైనికులు సరిపెట్టుకుని స్థిమిత పడితే లాభం లేదని భావించి ఢిల్లీ పరిసర ప్రాంతాలలోని సంస్థానాలలో కూడా బ్రిటీషర్ల పెత్తనాన్ని పూర్తిగా అంతం చేయాలన్నారు.

ఆ దిశగా భక్త్‌ఖాన్ ప్రయత్నాలు చేస్తుండగా రాకుమారులు, రాజకుటుంబీకులు, వాణిజ్య ప్రముఖులు ఆయన మీద చక్రవర్తికి పితూరీలు చెప్పటం ఆరంభించటంతో అవాంఛనీయ పరిస్థితులను అర్థం చేసుకున్న భక్త్ ఖాన్ స్వచ్ఛందంగా సర్వసైన్యాధిపతి స్థానం నుండి తప్పుకుని స్వంత సైనికబలగాల అధినేతగా పోరాటాలలో పాల్గొన్నారు. బ్రిటీషర్ల వ్యూహాలు తెలిసిన భక్త్ ఖాన్ శతృవు దాడులను తిప్పికొట్టడంలో ఎంతో నేర్పు ప్రదర్శించారు. కదనరంగంలో అద్వితీయ శౌర్యప్రతాపాలను చూపారు.

ఢిల్లీ పరాజయం తప్పదని తేలిపోగా చక్రవర్తిని కలిసి, తనతోపాటుగా అయోధ్యకు రావాల్సిదిగా కోరారు. చెప్పుడు మాటల వలన చక్రవర్తికి భక్త్‌ఖాన్ సలహా రుచించలేదు. భక్త్‌ఖాన్ తన సహచరులతో అయోధ్యకు వెళ్ళి బేగం హజరత్ మహల్ సైన్యంతో కలసి ఆంగ్లేయుల మీద సాగుతున్న పోరాటంలో పాల్గొన్నారు. చివరకు లక్నో పరాజయం వలన బేగం హజరత్ మహల్‌తో కలసి నేపాల్ పర్వత ప్రాంతాలలోకి తప్పించుకున్నారు. అక్కడ నుండి కూడా ఆంగ్లేయుల మీద పోరుకు మళ్ళీ సన్నాహాలు చేస్తుండగా నేపాల్ అధినేత జంగ్ బహదూర్ సహాయనిరాకరణ వలన అవి సఫలం కాలేదు.

ప్రథమ స్వాతంత్ర్య సమరంలో అద్వితీయ కార్యదక్షత, రాజనీతిజ్ఞత, దార్శినికత ప్రజాస్వామిక దృష్టి, ధైర్యసాహసాలను ప్రదర్శించి, శత్రువు చేత కూడా శభాష్ అన్పించుకున్న మహమ్మద్ భక్త్ ఖాన్ ఊపిరి ఉన్నంత వరకు ఆంగ్లేయులతో పోరాడుతూ 1859 మే 13న కదనరంగంలో నేలకొరిగారు. ◆



# 18. అజీముల్లా ఖాన్

## (1834 - 1859)

**స్వ**దేశీ పాలకులు, సంస్థానాధీశులు బ్రిటీష్ పాలకులపై మండిపడుతున్న రోజుల్లో శక్తి కంటే యుక్తి మంచి ఫలితాలనిస్తుందని అనుభవపూర్వకంగా తెలుసుకుని ఆంగ్లేయ మేధావులకు ఏ మాత్రం తీసిపోని విధంగా 1857నాటి పోరాటాలకు వ్యూహరచన చేసిన మేధావులలో ఒకరుగా అజీముల్లా ఖాన్ ఖ్యాతిగాంచారు.

1834లో ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో జన్మించిన అజీముల్లా బాల్యం తన తల్లి ఆయాగా పనిచేసే అనాథ శరణాలయంలో గడిచింది. తొలిరోజుల్లో ఒక ఆంగ్లేయుని ఇంట పనివాడిగా చేరి పొట్టగడుపుకుంటూ కాలం గడిపిన ఆయన ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలను నేర్చుకున్నారు. ఆ భాషల మీద పట్టు లభించాక, ఆంగ్లేయుల ప్రవృత్తి తెలిశాక ఆయన వారి సేవకు తిలోదకాలిచ్చారు. ఆ తరువాత కాన్పూరు విద్యాలయంలో విద్యార్థిగా చేరి, తన అసాధారణ ప్రతిభ వల్ల అదే విద్యాలయం అధ్యాపకుడయ్యారు.

ప్రభుత్వ విద్యాలయంలో అధ్యాపకుడిగా అజీముల్లా పనిచేస్తుండగా అయన ప్రతిభ గురించి విన్న కాన్పూరు అధినేత నానా సాహెబ్ పీష్వా ఆయనను తన పక్షాన వకీలుగా బాధ్యతలు నిర్వహించేందుకు ఆహ్వానించాడు. నానా పక్షాన వాదించేందుకు అజీముల్లా ఇంగ్లాండు వెళ్ళి అక్కడ రెండేళ్ళు గడిపారు. ఆ సందర్భంగా బ్రిటీషర్ల రాజకీయాలను,





ప్రవర్తనను, వ్యవహార సరళిని గమనించిన ఆయన కొంతకాలం తరువాత ఇండియాకు తిరిగి వస్తూ భవిష్యత్తును దృష్టిలో పెట్టుకుని పలు దేశాలను పర్యటించారు. ఈ పర్యటనలో మాల్టా చేరుకున్నప్పుడు, ఆంగ్లో-ఫ్రెంచి సైన్యాలను రష్యా సైన్యాలు మాల్టా వద్ద పరాజయం పాల్జేయడం తెలుసుకున్నాకున్నారు. ఆ కారణంగా రష్యా సైనికపాటవాన్ని పరిశీలించేందుకు ఆయన తన ప్రయాణం దిశను మార్చుకుని కానిస్టాంటునోపుల్ వెళ్ళారు.

ఆ తరువాత ఫ్రాన్స్, క్రిమియాలను సందర్శించి ఆయా దేశాల రాజకీయాలను, యుద్ధ ప్రక్రియలను, నాయకుల ఎత్తులు, జిత్తులను అధ్యయనం చేశారు. ఆ దేశాల ప్రజానీకం స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల పట్ల వ్యక్తంచేసిన అభిప్రాయాలు, ఆకాంక్షలు, ఆ లక్ష్యాల సాధన కోసం వారు సాగించిన పోరాటాలు ఆయనలో దాగి ఉన్న స్వతంత్ర-స్వేచ్ఛాయుత ఆలోచనలకు మరింతగా పదునుపెట్టాయి. ఈ సందర్భంగా బ్రిటీష్ పాలనాధికారానికి చరమగీతం పాడేందుకు తమతో సహకరించే దేశాల అధినేతలతో రహస్య స్నేహ సంబంధాలను కూడా కుదుర్చుకునేందుకు ఆయన ప్రయత్నించారు.

ఇండియా తిరిగి వచ్చాక నానాసాహెబ్‌తో తన ఆలోచనలను పంచుకుని 1857 నాటి కాన్పూరు తిరుగుబాటుకు వ్యూహరచన చేశారు. ఆంగ్లేయ వ్యతిరేక పోరాటాల ప్రయత్నాలను ముమ్మరం చేశారు. ఈ మేరకు స్వదేశీ పాలకులకు, సైనికులకు నానా సాహెబ్ పేరిట ఆయన లేఖలు రాశారు. స్వదేశీ పాలకులంతా ఐక్యంగా ఆంగ్లేయుల మీద ఎందుకు ధ్వజమెత్తాలో ఆ లేఖలలో వివరించారు. ప్రజలలో దేశభక్తి భావనలను పెంపొందించేందుకు, ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజలను కూడగట్టేందుకు **పయామే ఆజాది** అను పత్రికను కూడా ఆయన హిందీ, ఉర్దూ భాషల్లో వెలువరించారు.

అజీముల్లా ఖాన్ ఆనాటి పోరాటాలలో నానా సాహెబ్‌తో పాటు స్వయంగా తానూ పాల్గొనడమే కాకుండా, బేగం హజరత్ మహల్, మౌల్వీ అహ్మదుల్లా ఖాన్, ఝూన్సీలక్ష్మీ బాయి, మొగల్ రాకుమారుడు ఫిరోజ్ షా, తాంతియా తోపేలకు మేధోపరమైన సేవలందించారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం పరాజయం అంచుకు చేరుకునేసరికి తిరుగుబాటు యోధులైన, నానా, హజరత్ మహల్, ఫిరోజ్ షా తదితరులతోపాటుగా నేపాల్ అడవుల్లోకి నిష్క్రమించారు.

ప్రమాదకర ప్రతికూల పరిస్థితులలో కూడా ఆంగ్లేయులకు వ్యతిరేకంగా తుదకంటా పోరాడేందుకు అవసరమైన బలగాలను, ఆర్థిక సాధన సంపత్తిని సమకూర్చుకునే ప్రయత్నంలో అష్ట కష్టాలు పడుతూ, నేపాల్ లోని భుట్‌వాల్ (Bhutwal) ప్రాంతంలో అజీముల్లా ఖాన్ 1859 అక్టోబరు మాసంలో కన్నుమూశారు. ◆



# 12. దూదు మియా

## (1819- 1860)

**బెం**గాల్‌లో ప్లాసీ–బక్సర్ యుద్ధాల తరువాత తమ పునాదులను పటిష్టం చేసుకున్న ఆంగ్లేయులు చలాయిస్తున్న ఆధిపత్యం, అంతులేని దోపిడీని సహించలేక తిరగబడిన ప్రజలకు సమర్ధవంతమైన నాయకత్వం అందించి ప్రజా పోరాటాలు సాగించిన యోధులలో దూదుమియా లేక దాదూ మియా ఒకరు.

బ్రిటీష్ వ్యతిరేక పోరాటల చరిత్రలో సుస్థిర స్థానం సంపాదించుకున్న **ఫరాజీ ఉద్యమానికి** అంకురార్పణ చేసిన హజీ షరియతుల్లా ఇంట 1819లో దూదు మియాగా పేర్గాంచిన ముహమ్మద్ మోసిన్ జన్మించారు. తండ్రిని మించిన తనయునిగా ఖ్యాతి గాంచిన ఆయన బ్రిటీషర్లు, వారి తొత్తులకు వ్యతిరేకంగా ఫరాజీలను పోరుబాటన నడిపించి, భారత స్వాతంత్ర్యసంగ్రామ చరిత్రలో ప్రత్యేక స్థానం సంపాదించి పెట్టారు. చిన్ననాటనే తండ్రిబాటను అందిపుచ్చుకున్న దూదు మియా ధార్మిక చింతనతో పాటుగా సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితుల పట్ల అవగాహన సంతరించుకుని 1839లో తండ్రి స్థానంలో ఫరాజీ ఉద్యమం నేతగా బాధ్యతలు చేపట్టారు. అపూర్వ కార్యదక్షత, చక్కని ఉద్యమ నిర్మాణ కౌశల్యం ప్రదర్శిస్తూ, దూదుమియా పరుగులు పెడుతున్న ఫరాజీ ఉద్యమాన్ని తీర్చిదిద్ది సకారాత్మక మలుపుతిప్పారు. ప్రజాకంటకులైన ఆంగ్లేయాధికారులకు,





జమీందారులకు, ప్లాంటర్లకు, మహాజనులకు (వడ్డీ వ్యాపారస్థులు) వ్యతిరేకంగా పోరాటాలు సాగించేందుకు పటిష్టమైన సమరశీల వ్యవస్థలను రూపొందించారు. ప్రజా వ్యతిరేక శక్తులకు అండగా నిలుస్తున్న బ్రిటీష్ ప్రభుత్వాన్ని ఎదుర్కోవడానికి ఫరాజీలను పోరాట యోధులుగా తీర్చిదిద్ది, ఆంగ్లేయుల, వారి తాబేదార్ల ఆగడాలను అడ్డుకున్నారు.

ఫరాజీ ఉద్యమ వ్యవస్థను పటిష్టం చేసిన దూదుమియా ఫరీద్‌పూర్‌ను కేంద్రంగా చేసుకుని కార్యకలాపాలు నడిపారు. ప్రజాస్వామ్య రీతిలో పంచాయితీల వ్యవస్థను ఏర్పాటు చేశారు. దూదు మియా ఆజ్ఞలు భగవంతుని ఆజ్ఞలతో సమానంగా భావించి ఫరాజీలు తు.చ తప్పక అమలు చేశారు. ఆ కారణంగా ఆ వ్యవస్థను state with in the state గా చరిత్రకారులు అభివర్ణించారు. **దూదుమియా పిలుపిస్తే క్షణాలలో హాజరుకావడానికి 50 వేల మంది ఎల్లప్పుడు సిద్ధంగా ఉంటారు** అని ఆంగ్లేయాధికారులు తమ నివేదికలలో వెల్లడించడాన్ని బట్టి వ్యవస్థాపరంగా ఆయన ఉద్యమ నిర్మాణ దక్షత వెల్లడవుతుంది.

దూదుమియా ఉద్యమాన్ని ఏ విధంగానూ నిలువరించలేకపోయిన ఆంగ్లేయులు, ఆయన పోరాట పటిమ ముందు నిలబడలేకపోయిన ఆంగ్లేయుల అనుచరవర్గం దూదు మియా మీద, ఫరాజీ ఉద్యమకారుల మీద పలు క్రిమినల్ కేసులను పెట్టించి వారికి శిక్షలు పడేలా శతవిధాల విఫల ప్రయత్నాలు చేశారు. చివరకు దూదుమియాను జైలులో కూడా పెట్టించారు. అధికారులు వారి తొత్తులు ఆయన మీద చేసిన ఆరోపణలను రుజువు చేయలేక పోవటంతో ఆ కేసులన్నింటినీ న్యాయస్థానాలు కొట్టివేశాయి.

ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ సమయంలో ఫరాజీలు విజృంభించగలరని భయపడ్డ ప్రభుత్వం దూదుమియాను, ఆయన అనుచరులను పెద్ద సంఖ్యలో జైళ్ళల్లో కుక్కింది. అయినా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఫరాజీల జాడలు చాలా స్పష్టంగా కన్పించాయని ఆంగ్లేయాధికారుల రికార్డులు వెల్లడించాయి. జైలు నుండి విడుదలైన దూదుమియా ప్రస్తుత బంగ్లాదేశ్ రాజధాని ఢాకాను స్థిరనివాసం చేసుకుని ఫరాజీల ధార్మిక, లౌకిక సిద్ధాంతాలను పరిపుష్టం చేయడంలో గడిపారు.

చివరిక్షణం వరకు ఆంగ్లేయుల ఆగడాలను, అధికారుల పెత్తనాన్ని వ్యతిరేకించిన ఆయన ప్రజల హృదయాలలో నిలచిపోయారు. ఈనాటికి తూర్పుబెంగాల్ ప్రాంతాలలో ఫరాజీ సాంప్రదాయాలను పాటించే జనావళి కన్పించటం అందుకు సాక్ష్యంగా నిలుస్తున్నాయి. ప్రముఖ చరిత్రకారుడు డాక్టర్ తారాచంద్‌చే **ఫిరంగీల పాలనను తుడిచి పెట్టాలని జీవితాంతం శ్రమించిన పోరాటయోధుడు**, గా కీర్తించబడిన దూదుమియా 1860లో అస్తమించారు. ◆



# ౨౦. ఖాన్ బహదూర్ ఖాన్

## (1787 - 1860)

**మా**తృభూమిని పరాయి పాలకుల కబంధహస్తాల నుండి విముక్తం చేసేందుకు తిరుగుబాటు శంఖారావం పూరించి, హిందూ-ముస్లిం ఐక్యసంఘటనతో స్వతంత్ర పాలన ఏర్పాటు చేసి, స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో సుస్థిర స్థానాన్ని సొంతం చేసుకున్న స్వదేశీ పాలకులలో రొహిల్‌ఖండ్ అధినేత ఖాన్ బహదూర్ ఖాన్‌ది ప్రత్యేక స్థానం.

ఆనాడు హిందూ-ముస్లింల ఐక్యతకు ప్రతీకగా నిలచిన ఖాన్ బహదూర్ ఖాన్ 1787లో జన్మించారు. బ్రిటీషర్లు కల్పించిన అధికార పదవిని వదులుకొని సుమారు 70 సంవత్సరాల వయస్సుడైన ఖాన్‌సాబ్ రణరంగ ప్రవేశం చేసి, 1857 మే 31న రోహిల్‌ఖండ్ రాజధాని బరేలిలో స్వతంత్ర బావుటాను ఎగురవేశారు. రొహిల్ ఖండ్‌లోని ప్రజానీకమంతా ఏకమై ఖాన్ నాయకత్వంలో స్వతంత్ర పాలనకు ప్రాణ ప్రతిష్ట చేసి కంపెనీ పాలకులు, అధికారులను మట్టికరిపించారు.

ఈ సందర్భంగా రోహిల్ ఖండ్ ప్రజలను ఉద్దేశించి ఖాన్ బహదూర్ మాట్లాడుతూ **భారతదేశ ప్రజల్లారా!** అని సంబోధించటం చరిత్ర సృష్టించింది. **మన పవిత్ర స్వాతంత్ర్య దినోత్సవం ఉదయించింది. ఇంగ్లీషు వారు మోసాలకు పాల్పడవచ్చు. ముస్లింలకు వ్యతిరేకంగా హిందువులనూ, హిందువులకు వ్యతిరేకంగా ముస్లింలనూ రెచ్చగొడతారు.**





**ముస్లింలారా ! మీరు పవిత్ర ఖురానును గౌరవిస్తున్నట్టయితే, హిందువుల్లారా ! మీరు గోమాతను ఆరాధిస్తున్నట్టయితే, మీలోని స్వల్ప విభేదాలను మరచి ధర్మయుద్ధంలో చేతులు కలపండి. ఒకే పతాకం కింద పోరాడండి. మన హిందూస్థాన్ మీద ఆంగ్లేయుల పెత్తనం సృష్టించిన మరకలను మీ రక్తంతో శుభ్రం చేయండి**, అంటూ తన రాజ్యంలోని హిందూ-ముస్లిం జనసముదాయాలకు ఆయన పిలుపునిచ్చారు.

స్వతంత్రతకు ప్రతీక అయినటువంటి ఆకుపచ్చ జెండా రోహిల్‌ఖండ్‌లో రెపరెపలాడటం చూసి ఆంగ్లేయులు అదిరిపడ్డారు. మాతృదేశాభిమానులైన రోహిల్లా ప్రజానీకం జాతి, మత ప్రసక్తి లేకుండా ఏకగ్రీవంగా ఖాన్ బహదూర్ ఖాన్‌ను తమ అధినేతగా అంగీకరించారు. అత్యంత నిజాయితీపరుడిగా ఖ్యాతిగాంచిన శోభారాం ప్రధాన మంత్రిగా, బ్రిటీష్ సైన్యంలోని స్వదేశీ సైనికులచే తిరుగుబాటు చేయించిన కార్యసాధకుడు మహమ్మద్ భక్త్ ఖాన్ సేనానిగా ప్రజా సముదాయం సమక్షాన బాధ్యతలు స్వీకరించారు. ఈ త్రయం ఎంతో దూరదృష్టితో, చక్కని అవగాహనతో, అద్వితీయ ధైర్యసాహసాలతో ప్రజలకు చక్కని పాలనను అందచేస్తూ రోహిల్‌ఖండ్ వాసుల హృదయాలను చూరగొంది.

బరేలి రాజధానిగా రోహిల్‌ఖండ్ స్వతంత్ర్య రాజ్యాన్ని పటిష్టం చేసుకున్నాక హిందూ, ముస్లింల ఐక్యత కోసం ఖాన్ బహదూర్ ఖాన్ పలు చర్యలు చేపట్టారు. ప్రజానీకం మత మనోభావాలను గౌరవిస్తూ ముస్లింల పర్వదినాన హిందూ సోదరుల మనోభావాలను గౌరవిస్తూ, గోవుల ఖుర్బాని నిషేధించారు. ఖాన్‌సాబ్ స్ఫూర్తితో ముస్లింలకు వ్యతిరేకంగా హిందువులను మభ్యపెట్టి, రెచ్చగొట్టి, డబ్బు సంచులతో ప్రజల దేశభక్తిని కొనుగోలు చేసేందుకు ఆంగ్లేయులు సాగించిన ప్రయత్నాలను ప్రజానీకం త్రిప్పికొట్టారు. ఈ విషయాన్ని స్వయంగా ఆంగ్లేయాధికారులే తమ నివేదికలలో పేర్కొన్నారు.

చివరకు అపార సైనిక బలగాలతో ఆంగ్లేయసైన్యాధిపతులు బరేలిని చుట్టు ముట్టారు. ప్రజల మద్దతుతో ఖాన్ చివరి నిమిషం వరకు పొరాడి, గత్యంతరం లేని పరిస్థితులలో కొద్దిపాటి సైన్యంతో 1858 మే 5న బరేలీ నుండి నేపాల్ అడవుల్లోకి తప్పుకున్నారు. చివరకు ఆంగ్లేయుల అనుకూలుడు నేపాల్ పాలకుడు జంగ్ బహుదూర్ రోహిల్లా నేతను బ్రిటీషర్లకు అప్పగించగా, విచారణ జరిపి ఖాన్‌కు, ఆయన తోపాటుగా తిరుగుబాటులో పాల్గొన్న 243 మందికి ఉరిశిక్ష విధించారు. ఆ శిక్షలను బరేలీలోని బ్రిటీష్ కమీషనర్ పాత కార్యాలయం ఆవరణలో గల పెద్ద మర్రిచెట్టు వద్ద 1860 మార్చి 20న ఏకకాలంలో నిర్వహించడంతో సహచరులు, అనుచరులతోపాటుగా ఖాన్ బహదూర్ ఖాన్ **మా తుజేఁ సలాం** అంటూ మాతృభూమిలో ఐక్యమయ్యారు. ◆



# 21. పఠాన్ సలాబత్ ఖాన్

## (1831- 1861)

ప్రపంచ చరిత్రలోనే మహోజ్వల ఘట్టంగా భాసించిన భారత స్వాతంత్ర్య సంగ్రామంలో అద్వితీయమైన సాహసాలతో ఆత్మార్పణకు కూడా వెనుదీయని వీర సైనికులలో పఠాన్ సలాబత్ ఖాన్ ఒకరు.

ఉత్తరప్రదేశ్‌లోని మొరాదాబాద్ జిల్లా సంభాల్ లోని సామాన్య కుటుంబంలో పఠాన్ సలాబత్ ఖాన్ 1831లో జన్మించారు. ఆయన తండ్రి పఠాన్ అబ్దుల్లా ఖాన్. చిన్ననాటి నుండే ధైర్యసాహాసాలను ప్రదర్శిస్తూ గ్రామస్తులను ఆకట్టుకున్న సలాబత్ సైనికుడిగా కోటా రాజ్యంలో ఉద్యోగం చేబట్టారు. ఆయన కోటా సైన్యంలోని గోవర్థన్ నాయకత్వంలోని పటాలంలో సభ్యులయ్యారు.

1857 మే మాసంలో భారతదేశం అంతటా ఎగిసిపడిన తిరుగుబాటు జ్వాలల ప్రభావం ఉత్తరప్రదేశ్ ప్రాంతంలో తీవ్రంగా ఉంది. ఆ సమయంలో ఈస్ట్ ఇండియా కంపెనీ రాజకీయ ప్రతినిధి మేజర్ బుర్టన్ (MAJOR BURTON) నివాస గృహం మీద కోట రాజ్యంలోని స్వదేశీ సైనికుల దళం దాడి చేయటం ద్వారా 1857 అక్టోబరు 15న తిరుగుబాటు బావుటాను ఎగురవేసింది. తిరుగుబాటు యోధుల ధాటికి తట్టుకోలేక మేజర్ బుర్టన్ బ్రతుకు జీవుడా అంటూ ఆయుధాలు, అనుచరులతో బంగ్లాలో దాక్కున్నాడు.





అతడ్ని బంగ్లా నుండి బయటకు రప్పించేందుకు శతవిధాల ప్రయత్నించి, చివరకు ఆ బంగ్లాను స్వదేశీ బలగాలు చుట్టుముట్టి తగులబెట్టినా ఆంగ్లేయుడు మాత్రం బయటకు రాలేదు. బంగ్లాలోకి ప్రవేశించి ఆ ఆంగ్లేయుడ్ని, అతడి అనుచరుల్ని ఎదుర్కొని, బంధించి బయటకు తీసుకురావటం చాలా ప్రమాదకరం కావడంతో స్వదేశీ సైనికుల దళ నేతలు ఏంచేయాలన్న మీమాంసలో పడ్డారు.

ఆ సమయంలో ప్రమాదకరమైన ఆ సాహస కార్యాన్ని నిర్వహించేందుకు పఠాన్ సలాబత్ ఖాన్ ముందుకు వచ్చారు. ఒక నిచ్చెన ద్వారా తిన్నగా ఆంగ్లేయుడు ఆయుధాలతో దాక్కొని ఉన్న బంగ్లా కప్పు మీదకు చేరుకుని, అతని అనుచరుల కంటబడకుండా అకస్మాత్తుగా బుర్టన్ ఎదుట ఆయన నిలిచారు. ఆ అనూహ్య సంఘటన నుండి తేరుకొని ఖాన్ పై బుర్టన్ దాడి చేయగా లాఘవంగా తప్పించుకున్న సలాబత్ ఆ ఆంగ్లేయాధికారిని లొంగదీసుకున్నారు. ఈ సందర్భంగా సలాబత్ ఖాన్ చూపిన తెగువ, సాహసానికి ఎంతో సంతసించి, సలాబత్ శౌర్యప్రతాపాలకు గౌరవ చిహ్నంగా, తిరుగుబాటుకు నాయకత్వం వహిస్తున్న లాలా జై దయాల్ భట్నాగర్ ప్రత్యేక జ్ఞాపికను బహూకరించారు.

1858 మార్చిలో మేజర్ జనరల్ రాబర్ట్స్ నాయకత్వంలోని సైనిక దళాలు కోట సంస్థానాన్ని స్వదేశీ దళాల నుండి స్వాధీనం చేసుకున్నాయి. ఆ సమయంలో తిరుగుబాటు దళాలతోపాటుగా సలాబత్ ఖాన్ గ్వాలియర్ వెళ్ళారు. ఆ తిరుగుబాటు దళాలు బ్రిటీష్ దళాలతో ఝబియా పట్టాన్ (JHABIA PATTAN) అను చోట జరిపిన పోరాటంలో సలాబత్ ఖాన్ పాల్గొన్నారు. ఆ పోరాటం తరువాత ఆయన ఆంగ్లేయుల నిఘా నుండి తప్పించుకుని, లక్నో గుండా నేపాల్ పర్వత ప్రాంతాలలోకి వెళ్ళిపోయారు.

ఆ అడవుల్లో తిరుగుబాటు యోధులతో కలసి రెండు సంవత్సరాలు గడిపారు. ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల తొత్తులైన జంగ్ బహుదూర్ లాంటి పాలకుల వలన ప్రతికూల పరిస్థితులు ఎదురుకావటంతో ప్రవాసం నుండి బయటపడి తిరిగి కోటా రాజ్యంలో ప్రవేశిస్తుండగా శత్రు సైనికుల కంటబడ్డారు. కంపెనీ సేనలు ఆయనను చుట్టుముట్టి అరెస్టు చేశాయి. ఆయన మీద రాజద్రోహం నేరారోపణ చేసి, చిత్రహింసలకు గురిచేశాక, విచారణ నడిపి 1861 ఆగస్టు 10న ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులు ఆయనకు మరణదండన ప్రకటించారు. ఆ శిక్ష ప్రకారం 1861 అక్టోబరు 23న కోటా లోని బ్రిటీష్ అధికార ప్రతినిధి నివాసం ఎదుట ఇతర తిరుగుబాటు యోధులతోపాటుగా పఠాన్ సలాబత్ ఖాన్‌ను బహిరంగంగా ఉరితీశారు. ◆



# 22. బహదూర్ షా జఫర్

## (1775- 1862)

**భా**రతీయులలో ఆంగ్లేయుల పట్ల పెల్లుబికిన ఆగ్రహానికి ప్రతీక ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం. ఆ మహత్తర చారిత్రాత్మక పోరాటానికి నాయకత్వం వహించిన ఖ్యాతిని సొంతం చేసుకుని, భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ప్రత్యేక స్థానాన్ని పదిలం చేసుకున్న చివరి మొగల్ పాలకుడు బహదూర్ షా జఫర్.

బహదూర్ షా జఫర్ మొగల్ చక్రవర్తుల వరుసలోని 14వ చక్రవర్తి రెండవ అక్బర్ షా, ఆయన భార్య రాజపుత్ర వంశానికి చెందిన లాల్‌బాయిలకు 1775 అక్టోబరు 24న జన్మించారు. బహదూర్ షా జఫర్‌కు సాహిత్యం, కళల మీద ఎక్కువ మక్కువ. విజ్ఞానార్జనతోపాటుగా పలు యుద్ధ విద్యలలో ఆయన సుశిక్షితులయ్యారు.

ఆంగ్లేయుల పెత్తనం అతిశయించడంతో అసంతృప్తిగా ఉన్న ఆయన మీరట్‌లో కంపెనీ అధికారుల మీద తిరగబడిన సైనికులు అక్కడ నుండి ఢిల్లీకి వచ్చి 1857 మే 11న ఢిల్లీ ఎర్రకోటలోకి ప్రవేశించడంతో ఆయన కేంద్రంగా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ఊపందుకుంది. ఆయన మే 12న దర్బారు నిర్వహించి, చక్రవర్తి హోదాలో పలు నియామకాలు చేస్తూ ఆంగ్లేయుల మీద జఫర్ యుద్ధం ప్రకటించారు.

ఆ తరువాత మహా పరిపాలనా వ్యవహార మండలిని ఏర్పాటు చేశారు. హిందూ-





ముస్లింలను తేడా లేకుండా, విధేయత, సమర్ధలను బట్టి పలువురికి బాధ్యతలను అప్పగించారు. హిందూ-ముస్లిం ఐక్యతావశ్యకతను గ్రహించిన ఆయన ఏ మతస్థుని మనోభావాలకు విఘాతం కలుగకుండా పలు విప్లవాత్మక చర్యలను తీసుకున్నారు. పరాయి పాలకులను పారద్రోలమని, వారికి ఏమాత్రం సహకరించవద్దని ఇటు స్వదేశీ సైనికులకు, అటు ప్రజలకు బహదూర్ షా జఫర్ తన చారిత్రాత్మక ప్రకటన ద్వారా విజ్ఞప్తి చేశారు.

ఆంగ్లేయుల తరిమివేత తరువాత, ఢిల్లీ బయట పలు ప్రాంతాలలో సాగుతున్న తిరుగుబాట్లను గమనించిన బహదూర్ షా జఫర్, ఆ యోధులందర్నీ ఢిల్లీకి రమ్మని ఆహ్వానించారు. ఆంగ్లేయులను పూర్తిగా పరాజితులను చేసేందుకు ఈ పోరాటంలో తమతో కలసి రావాల్సిందిగా కోరుతూ పాటియాలా, బల్లభ్‌ఘర్, బహదూర్‌ఘర్, జైపూరు, ఉదయపూరు, అల్వార్ రాజులకు, ఝజ్జర్ నవాబుకు లేఖలు రాశారు. ఆ లేఖలో, దేశం విముక్తమయ్యాక పాలనాధికారాలను స్వదేశీపాలకులకు అప్పగిస్తానని పేర్కొన్నారు. ఆ క్రమంలో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామానికి స్ఫూర్తి కేంద్రంగా మారిన ఢిల్లీని తమ పట్టునుండి జారిపోనివ్వరాదని తిరుగుబాటు యోధులు, ఎలాగైనా పునరాక్రమించుకోవాలని ఆంగ్లేయాధికారులు వేసిన ఎత్తుల మధ్య 1857 సెప్టెంబరు 14 వరకు దాదాపు 72 పోరాటాలు సాగాయి.

1857 సెప్టెంబరులో ఢిల్లీ పోరాటం చివరి దశకు చేరుకుంది. ఆంగ్లేయులు తమ బలగాలన్నిటిని కూడదీసుకుని ఢిల్లీ మీద విరుచుకుపడ్డారు. ఆ భీషణ పోరాటంలో తిరుగుబాటు యోధులు ఎర్రకోట రక్షణకు చేసిన యత్నాలు పూర్తిగా విఫలం కావటంతో కంపెనీ సైన్యాలు ఢిల్లీ రక్షణ వలయాన్ని ఛేదించుకుని సెప్టెంబరు 14న ఎర్రకోటలోకి చొచ్చుకువచ్చి సెప్టెంబరు 19న ఎర్రకోటను పునరాక్రమించుకున్నాయి. గత్యంతరం లేక చక్రవర్తి జఫర్ తన పరివారంతో సెప్టెంబరు 20న హుమాయూన్ సమాధి భవనం వద్ద తలదాచుకోగా ఆయనను 21న అరెస్టు చేశారు. అనంతరం విచారణ జరిపి బహదూర్ షాను నేరస్థుడిగా ప్రకటించి 1858 డిసెంబరు 4న రంగూన్‌కు పంపారు.

ఈ విధంగా భారత దేశంలోని తిరుగుబాటు శక్తుల ఐక్యతకు కేంద్ర బిందువుగా నిలచిన చక్రవర్తి, ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం నాయకులు బహదూర్‌షా జఫర్ రంగూన్ జైలులో మాతృభూమిని తలచుకుంటూ, **జఫర్ నీ వెంతటి దురదృష్టంతుడివి ! నువ్వెంతగానో ప్రేమించిన మాతృభూమిలో నీ సమాధి కోసం రెండు గజాల చోటుకు కూడా నీవు నోచుకోలేదు** అని వాపోతూ 1862 నవంబరు 7న కన్నుమూశారు. ◆



# 23. ముహమ్మద్ షేర్ అలీ

## (1842-1872)

**స్వా**తంత్ర్య సంగ్రామంలో ఉమ్మడి ఉద్యమాలు, వ్యక్తిగత పోరాటాలూ జమిలిగా సాగాయి. ప్రజలు ఏకోన్ముఖంగా సాగి నిర్వహించిన ఉద్యమాలలో బలమైన స్వేచ్ఛా కాంక్ష వ్యక్తం కాగా, వ్యక్తిగత పోరాటాలలో మాతృదేశం పట్ల ప్రగాఢమైన ప్రేమ, పరాయి పాలకుల పట్ల తిరుగులేని ద్వేషం, అత్యున్నత స్థాయి ధైర్యసాహసాలు బహిర్గతమయ్యాయి. ఈ మేరకు వ్యక్తిగత త్యాగాల బాటన నడిచిన యోధులలో మహమ్మద్ షేర్ అలీ ఒకరు.

ప్రస్తుత పాకిస్థాన్‌లోని పెషావర్‌లో 1842లో జన్మించిన మహమ్మద్ షేర్ అలీ చిన్ననాటనే పరాయి పాలకులకు వ్యతిరేకంగా **వహాబీ యోధులు** సాగిస్తున్న పోరాటాలతో ఉత్తేజితులయ్యారు. 1863లో పెషావర్ నుండి అంబాల వచ్చి స్థిరపడ్డారు. అంబాలలో జరిగిన ఘర్షణల కారణంగా 1868 ఏప్రియల్ 2న ఆయనకు ఉరిశిక్ష పడింది. అలీ మంచి ప్రవర్తన వలన ఆ శిక్షను కాస్తా ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు ద్వీపాంతరవాస శిక్షగా మార్చి 1869లో ఆయనను అండమాన్ జైలుకు పంపారు.

ఆ విధంగా అండమాన్ జైలుకు చేరుకున్న షేర్ అలీ వహాబీ ఉద్యమ కార్యకర్తగా దేశంకోసం, స్వజనుల కోసం ఏమీ చేయకుండానే జైలులో ఇరుక్కుపోయానని మదన పడ్డారు. వహాబీ యోధుల మీద ఆంగ్లేయాధికారులు సాగిస్తున్న దమనకాండను ఆయన





సహించలేకపోయారు. మాతృదేశాన్ని ఆక్రమించుకుని స్వదేశీయుల మీద పెత్తనం చలాయిస్తున్న ఆంగ్లేయుల మీద ప్రతీకారం తీర్చుకోవాలనుకున్నారు. ఆ లక్ష్యం దిశగా తగిన పథకం రూపొందించుకుని, తన ఎత్తుగడలను మార్చి జైలులో మంచిగా ప్రవర్తిస్తూ ఆంగ్లేయాధికారులకు సన్నిహితులయ్యారు. ప్రతిఫలంగా లభించిన స్వేచ్ఛతో జైలులోని ఖైదీలకు క్షవరం చేసేందుకు అంగీకారం పొంది అవసరమైన సామాగ్రి సంపాదించుకున్నారు. ఆ సామాగ్రిలో భాగంగా లభించిన క్షుర కత్తిని శత్రుసంహారానికి ఉపయోగించుకోవాలని నిర్ణయించుకుని, అదను కోసం ఎదురు చూడసాగారు.

1872 ఫిబ్రవరి 8న బ్రిటీష్ వైశ్రాయ్ లార్డ్ మేవ్ అండమాన్ జైలుకు వచ్చాడు. ఆ అవకాశాన్ని వృధాగా పోనివ్వదలచుకోలేదు. క్షురకర్మల సామాగ్రిలో ఉన్న పదునైన కత్తిని తయారుగా ఉంచుకుని **షేర్** లాగా వేట కోసం కాపుకాశారు. ఆంగ్లేయుడు లార్డ్ మేవ్ జైలులోని గదులను సందర్శిస్తు వస్తున్న సమయంలో ఆకలిగొన్న సింహంలా మేవ్ మీద లంఘించి అతడ్ని హతమార్చి షేర్ అలీ తన చిరకాల లక్ష్యాన్ని నెరవేర్చుకున్నారు.

ఆ తరువాత జరిగిన విచారణలో లార్డ్ మేవ్‌ను అంతం చేసింది తానేనని స్పష్టంగా అంగీకరిస్తూ, నా **మాతృభూమి విముక్తి కోసం ఏనాడయితే నేను పోరాట దీక్ష చేపట్టానో, ఆనాడే నా ప్రాణం మీద తీపిని వదలుకున్నాను...మన శత్రువులలో ఒకరిని నేను అంతం చేశాను...నేను నా కర్తవ్యాన్ని నిర్వహించాను...నా పవిత్ర కార్యంలో భగవంతుని వద్ద మీరంతా నాకు సాక్ష్యం** అని షేర్ అలీ ప్రకటించారు.

చివరకు విచారణ తంతును పూర్తిచేసిన న్యాయస్థానం షేర్ అలీకి మరణదండన విధించింది. ఈ మేరకు 1872లో ఉరిశిక్ష అమలు జరిగిన రోజున ఆయన మాట్లాడుతూ, **నేను చేసిన పని పట్ల కించిత్తు బాధపడటంలేదు...ఎంతో గర్విస్తూ, మరణాన్ని స్వీకరిస్తున్నాను** అన్నారు. చివరకు ఏమాత్రం బాధ-భయం లేకుండా ఖురాన్ గ్రంథంలోని ఆయత్‌లను మననం చేసుకుంటూ షేర్ అలీ ఉరిత్రాడును స్వయంగా స్వీకరించి మృత్యువును ఆనందంగా కౌగలించుకున్నారు.

ఆ యోధుని సాహసాన్ని స్మరిస్తూ, ఆ తరువాతి కాలంలో **మాతృదేశ విముక్తి కోసం వలస పాలకులతో పోరాడిన ప్రతి విప్లవకారుడు షేర్ అలీ ధైర్యసాహసాలను, నిబద్ధతను ఆదర్శంగా తీసుకున్నారు** అని ప్రముఖ చరిత్రకారుడు శాంతిమోయ్ రాయ్ తాను రాసిన Freedom Movement and Indian Muslims గ్రంథంలో ముహమ్మద్ షేర్ అలీకి ఘనంగా నివాళులు అర్పించారు. ◆



# 24. బేగం హజరత్ మహల్

## (- 1874)

**మా**తృభూమి కోసం ప్రాణాలను పణంగా పెట్టి, ఏ దశలో కూడా శత్రువుతో రాజీపడకుండా ఆంగ్లేయ బలగాలతో తలపడిన రాణులు చరిత్రలో అరుదుగా కన్పిస్తారు. అటువంటి అరుదైన ఆడపడుచులలో అగ్రగణ్యురాలు బేగం హజరత్ మహల్.

ఆమె ఉత్తర భారతదేశంలోని అత్యంత సంపన్నవంతమైన అవధ్ రాజ్యం అధినేత నవాబ్ వాజిద్ అలీషా భార్య. ఆమె స్వస్థలం ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ఫైజాబాద్. ఆమె చిన్నప్పటి పేరు ముహ్మది ఖానం. ఆమె అందచందాల గురించి విన్న వాజిద్ అలీ షా ముగ్ధుడై ఆమెను ఏరి కోరి మరీ వివాహమాడారు. వివాహం తరువాత ఆమె ఇఫ్తికారున్నీసా బేగం, ఆ తరువాత హజరత్ మహల్ అయ్యారు. ఆ దంపతులకు మీర్జా బిర్జిస్ ఖదిర్ బహదూర్ అను కుమారుడు కలిగాడు.

1856 ఫిబ్రవరి 13న నవాబ్ వాజిద్ అలీషాను ఆంగ్లేయులు నిర్భందించి, మార్చి 13న కలకత్తా పంపి అక్రమంగా అవధ్‌ను ఆక్రమించుకున్నారు. ఈ చర్య వలన ప్రజలలో తీవ్ర అసంతృప్తి రగులుకుంది. ఆ అసంతృప్తికి ఆలంబనగా బేగం హజరత్ మహల్ నిలబడ్డారు. ఆమెకు అండదండలుగా ప్రజలు, కులమతాల ప్రసక్తి లేకుండా స్వదేశీ యోధులు, వివిధ ప్రాంతాల పాలకులు నడిచారు. 1857 మే 31న అవధ్ రాజ్యం రాజధాని





లక్నోలోని ఛావనీలో బేగం నాయకత్వాన స్వదేశీ యోధులు, ప్రజలు స్వాతంత్ర్యాన్ని ప్రకటించున్నారు. స్వతంత్రతకు చిహ్నంగా ఫిరంగులు పేల్చారు. ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనాధికారం, ఆంగ్ల అధికారుల ఆనవాళ్ళు లక్నో గడ్డ మీద లేకుండా చేశారు.

1857 జూలై 5న బేగం హజరత్ మహల్ తన బిడ్డ బిర్జిస్ ఖదీర్‌ను అవధ్ నవాబుగా ప్రకటించారు. ఆ నిర్ణయాన్ని పలువురు ప్రముఖులు, ప్రజలు బలపర్చారు. ఆ ప్రోత్సాహంలో 1,80,000 మంది సైనికులను సమకూర్చుకుని లక్షలాది రూపాయలను వ్యయంచేసి లక్నో కోటగోడలను బేగం పునర్మించారు. ఆమె ఏనుగునెక్కి బిడ్డడు బిర్జిస్ ఖదిర్‌తో పాటుగా పనులను పర్యవేక్షిస్తూ, సైనిక కార్యకలాపాలను గమనిస్తూ ఇటు ప్రజలలో అటు సైనికులలో ఉత్సాహన్ని నింపుతూ మంచి ప్రజాదరణ పొందారు.

మతం, కులం, ప్రాంతాల ప్రసక్తి లేకుండా పౌర, సైనికాధికార ప్రముఖులైన ముమ్మూఖాన్, మహారాజ బాలకృష్ణ, బాబూ పూర్ణచంద్, మున్షీ గులాం హజరత్, మహమ్మద్ ఇబ్రహీం ఖాన్, రాజా లాలా సింహ్, రాణా జిజియా లాల్, రాజా మాన్‌సింగ్, రాజా దేశిబక్ష్ సింగ్, రాజా బేణిప్రసాద్ లాంటి వారితో ఉన్నతస్థాయి కమిటీని ఏర్పాటు చేశారు. ఢిల్లీలోని మొగల్ చక్రవర్తి బహదూర్ షా జఫర్ ప్రతినిధిగా బిర్జిస్ ఖదీర్‌ను ప్రకటించారు. ప్రజల అండతో బ్రిటీషు బలగాలతో ఢీ అంటే ఢీ అంటూ కంపెనీ పాలకులకు చెమటలు పట్టిస్తూ బేగం హజరత్ మహల్ సుమారు 10 మాసాల పాటు ప్రత్యక్ష పాలన చేసి ప్రజలను, ఇతర స్వదేశీపాలకులను ఉత్తేజితుల్ని చేశారు. 1858 నవంబర్ 1న విక్టోరియా మహారాణి ప్రకటన విడుదల చేయగా అందుకు సమాధానంగా తన చారిత్రాత్మక ప్రకటన 1858 డిసెంబర్ 31న విడుదల చేశారు.

1859 మార్చిలో భారీ బలగాలతో అన్ని వైపుల నుండి ఆంగ్ల సైన్యాధికారులు లక్నోను చుట్టుముట్టారు. భయంకర యుద్ధం సాగింది. పరాజయం తప్పని పరిస్థితులలో సహచరుల ఒత్తిడి మేరకు నానా సాహెబ్ పీష్వా తదితర తిరుగుబాటు నేతలతో కలిసి ఆమె నేపాల్ అడవుల్లోకి వెళ్ళిపోయారు. ఆమెను తిరిగి లక్నోకు రప్పించేందుకు బ్రిటీష్ ప్రభుత్వం లక్షలాది రూపాయలను నజరానా ఆశ చూపినా, స్వతంత్ర అవధ్ రాజ్యం తప్ప మరొటి తన లక్ష్యం కాదంటూ ఆ ప్రతిపాదనను నిర్ద్వందంగా తిరస్కరించారు.

చిట్టచివరి వరకు స్వతంత్ర రాజ్యం కోసం ప్రయత్నిస్తూ, ఖజనాతోపాటు సహచరులు కూడా తరిగిపోగా నిస్సహాయ పరిస్థితులలో అతి సామాన్య జీవితం గడుతూ ఆ మంచు కొండల శిఖరాల మీద రెపరెపలాడుతున్న అవధ్ రాజ్యం ఛత్రఛాయలో 1874 ఏప్రిల్‌లో బేగం హజరత్ మహల్ కన్నుమూశారు. ◆



# 25. షెహజాదా ఫిరోజ్ షా

## (1832- 1877)

**మా**తృభూమిని విముక్తం చేసేందుకు సాగిన సుదీర్ఘ స్వాతంత్ర్య పోరాటంలో సామాన్యుల నుండి సంస్థానాధీశులు, రాజుల నుండి రాజకుమారుల వరకు పాల్గొన్నారు. ఆ పరంపరలో భాగంగా అత్యంత సుఖమయమైన జీవితాన్ని త్యజించి, కంఠంలో ఊపిరి ఉన్నంతవరకు బ్రిటీషర్లతో పోరాడి భారత స్వాతంత్ర్యపోరాటాల చరిత్రలో నూతన అధ్యాయాన్ని సృష్టించిన యోధులు మొఘల్ రాకుమారుడు ఫిరోజ్ షా.

మొఘల్ పాదుషా షా ఆలం మనుమడు మిర్జా నిజాం భక్త్ కుమారుడు ఫిరోజ్ షా. 1832లో ఢిల్లీలో జన్మించిన ఆయన 1855 మేలో మక్కాకు వెళ్ళి 1857 మేలో స్వదేశం వచ్చేసరికి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ నినాదం అంతటా ప్రతిధ్వనిస్తోంది. ఆ శంఖారావంతో ఉత్తేజం పొంది 1857 జూన్‌లో గ్వాలియర్ సంస్థానంలోని మాండిసోర్‌ను కేంద్రంగా చేసుకుని ఆంగ్లేయుల మీద పోరుకు ఆయన సిద్ధమయ్యారు.

బ్రిటీషర్ల అనుకూలుడైన గ్వాలియర్ సంస్థానాధీశుడు ప్రభుభక్తిని చాటుకునేందుకు మాండిసార్ వదలి వెళ్ళాల్సిందిగా ఫిరోజ్ షాను ఆదేశించాడు. ఆ హెచ్చరికలను ఖాతరు చేయని ఫిరోజ్ షా నగరం బయట మకాం చేశారు. ఆయన ప్రయత్నాల ప్రభావంతో మాతృభూమి కోసం ప్రాణాలు త్యాగం చేసేందుకు ప్రజలు, యువకులు, స్వదేశీ సైనికులు





మొత్తం మీద 18వేల మంది సిద్ధమయ్యారు. ఆ స్వదేశీ యోధులతో రణ నినాదం చేసిన ఫిరోజ్ షా ప్రజలకు ఏమాత్రం నష్టం కలగకుండా ధర్మబద్ధంగా పోరాటానికి సిద్ధం కావాల్సిందిగా తన అనుచరులకు, సైనికులకు పిలుపునిచ్చారు.

1857 ఆగస్టు 26న ఆయుధాలను చేతబూని ఫిరోజ్ షా నాయకత్వంలో ప్రజలు దాడిచేసి మాండిసోర్‌ను ఆంగ్లేయుల నుండి స్వాధీనం చేసుకుని రెండు సంవత్సరాల పాటు అవిచ్ఛిన్నంగా పోరుబాటన సాగారు. ఆయన స్వయంగా పోరాటాలకు నాయకత్వం వహించి రానోడ్, దానసా, షికాం, ఇంద్రాఫుర్ ప్రాంతాలలో కంపెనీ అధికారులను మట్టికరిపించారు. ఈ సందర్భంగా అవధ్ అధినేత్రి బేగం హజరత్ మహల్, కాన్పూరు నాయకులు నానా సాహెబ్‌లకు ఆయన క్రియాశీలక తోడ్పాటు అందించారు. ఆ ఐక్య సైన్యాలు కంపెనీ సైన్యాల మీద పలు విజయాలను సాధించాయి. ఆ విజయానందంతో ఢిల్లీ వెళ్లి అక్కడ ఆంగ్ల సైన్యాలతో జరుగుతున్న పోరాటంలో పాల్గొనాలని భావించి సహచరులతో సహా ఢిల్లీకి పయనం కాగా, మార్గమధ్యంలోనే ఢిల్లీ తిరిగి ఆంగ్లేయుల స్వాధీనమైనదన్న విషాద వార్త అందడంతో ఫిరోజ్ షా హతాశులయ్యారు.

1859 జనవరి 14న జైపూర్ సమీపాన చీమలదండులా కదలి వచ్చిన ఆంగ్లేయ సైన్యాలతో సాగిన పోరాటంలో ఫిరోజ్ షా వెనుకంజ వేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. చివరకు తాంతియాతోపే తోపాటుగా ఫిరోజ్ షా అటవీ ప్రాంతంలోకి తప్పుకున్నారు. ఈ ప్రతికూల పరిస్థితులేవీ ఫిరోజ్ షాకు నిరాశ కల్గించలేదు. సిరోంజ్ అడవుల్లో తలదాచుకున్న ఫిరోజ్ షా మళ్ళీ పోరుకు తయారయ్యారు.ఆయనను లొంగదీసుకునేందుకు ఆంగ్లేయాధికారులు చేసిన ప్రయత్నాలు ఎంతమాత్రమూ ఫలించలేదు.

చివరకు ఆంగ్లేయ గూఢచారుల కన్నుగప్పి ఆయన ఆఫ్ఘనిస్తాన్ వెళ్ళిపోయారు. 1860 నాటికి ఫిరోజ్ షా కాందహార్ చేరుకుని, అక్కడ నుండి 1862లో టెహరాన్ వెళ్లారు. మార్గమధ్యంలో పలువురు రాజులను కలిసి తమ స్వతంత్ర పోరాటానికి సహాయం కోరారు. చిన్నపాటి సహచరుల దళంతో సంచారం సాగిస్తూ ఆయుధాలను సమకూర్చు కునేందుకు ఆయన చేస్తున్న ప్రయత్నాలను పసిగట్టిన బ్రిటీష్ ప్రభుత్వం అడుగడుగునా అడ్డుకుంది. గట్టి నిఘా ఏర్పాటు చేయటంతో బ్రిటీషర్ల కన్నుగప్పి తన కార్యకలాపాలు కొనసాగించటం మొఘల్ రాకుమారుడు ఫిరోజ్‌కు కష్టమైపోయింది. సంక్లిష్టతరమైన పలు మజిలీల తరువాత 1875లో మక్కా చేరుకుని, అక్కడా పలు ఇక్కట్లను ఎదుర్కొంటూ 1877 డిసెంబరు 8న షెహజాదా ఫిరోజ్ షా అంతిమశ్వాస విడిచారు. ◆



# 26. మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్

## (-1884)

**ద**క్షణ భారత దేశంలో బలమైన నైజాం సంస్థానంలో ఆంగ్లేయుల పెత్తనానికి వ్యతిరేకంగా ప్రజలను తిరుగుబాటుకు ప్రోత్సహించటమే కాకుండా స్వయంగా పోరాటంలో అగ్రభాగాన నిలచిన ధార్మిక నేతలలో మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ ప్రముఖులు.

ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రాజధాని, పూర్వ నైజాం సంస్థాన కేంద్రమైన హైదరాబాద్ ఆయన నివాసస్థలం. మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ జననం, తల్లి తండ్రుల వివరాలు, బాల్యం గురించి సమాచారం అందుబాటులో లేదు.

1857 ప్రథమ స్వాతంత్ర్య పోరాటం ప్రారంభం కాగానే హైదరాబాద్‌లోని నిజాం నవాబు కూడా బ్రిటీష్ వ్యతిరేక పోరులో భాగస్వాములవుతారని స్వేఛ్ఛాపిపాసులైన ప్రజలు, నాయకులు ఆశించారు. ప్రథమ స్వాతంత్ర్య సమరంలో చేరకపోగా తిరుగుబాటును అణిచేందుకు ఆంగ్లేయులకు అండగా నిజాం నిలిచారు. ఆ వాతావరణంలో రంగప్రవేశం చేసిన మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్, తుర్రేబాజ్ ఖాన్ లాంటి ప్రముఖులతో కలసి హైదరాబాదు కేంద్రంగా తిరుగుబాటు కార్యకలాపాలను ముమ్మరం చేశారు.

నిజాం సంస్థానంలో భాగమైన ఔరంగాబాదులో తిరుగుబాటుకు శ్రీకారం పలికి అక్కడ నుండి హైదరాబాద్ వచ్చిన యోధులు చిద్దాఖాన్ ఆయన అనుచరుల విడుదల





చేయాలన్న వినతిని నిజాం మన్నించక పోవటంతో ఖిన్నులైన ప్రజలు 1857 జూలై 17న మక్కా మసీదులో పెద్దసంఖ్యలో సమావేశమయ్యారు. ఈ సమావేశంలో బ్రిటీష్ రెసిడెన్సీ మీద దాడి చేయాలని మౌల్వీ అల్లావుద్దీన్ ఇతర నేతలు నిర్ణయించారు.

ప్రస్తుత కోటి సెంటరులోని మహిళా కళాశాల భవనం ఆనాటి బ్రిటీష్ రాజ్య ప్రతినిధి నివాసం (బ్రిటీష్ రెసిడెన్సీ). మక్కా మసీదు నిర్ణయం మేరకు ఆ రోజు మధ్యాహ్నం 4 గంటల సమయానికల్లా మౌల్వీ అల్లావుద్దీన్, పఠాన్ తుర్రేబాజ్ ఖాన్‌ల నాయకత్వంలో 5 వందల మంది యోధులు రణనినాదం చేస్తూ ప్రస్తుత సుల్తాన్ బజారు నుండి బ్రిటీష్ ఆధిపత్యానికి చిహన్నమైన రెసిడెన్సీ మీద దాడికి ఉపక్రమించారు. ఈ దాడి విషయం నిజాం ద్వారా ముందుగా తెలుసుకున్న ఆంగ్లేయాధికారులు వ్యూహాత్మకంగా వ్యవహరించి, అదనపు బలగాల సహాయంతో దాడిని తిప్పికొట్టారు. ఆ రాత్రంతా ఇరుపక్షాల మధ్య కాల్పులు సాగాయి. అనువుగాని వాతావరణం ఏర్పడేసరికి తెల్లవారు జామున స్వదేశీ యోధులు, దాడిని విరమించుకుని రణస్థలం నుండి నిష్క్రమించారు.

దక్షణాదిలో జరిగిన ప్రధాన సంఘటనగా చరిత్ర ప్రఖ్యాతిగాంచిన ఆ దాడి పట్ల ఆగ్రహించిన నిజాం నవాబు, ఆంగ్లేయాధికారులు స్వదేశీ యోధుల పనిపట్టాలని నిర్ణయించుకున్నారు. నగరంలోని తిరుగుబాటు యోధులు, ప్రజల మీద నిజాం–ఆంగ్ల సైన్యాలు విరుచుకుపడ్డాయి. మౌల్వీ అల్లావుద్దీన్‌ను పట్టిచ్చిన వారికి 4 వేల రూపాయల నజరానాను ప్రభుత్వం ప్రకటించింది. నిజాం సైనికుల కన్నుగప్పి హైదరాబాద్ నుండి మౌల్వీ తప్పించుకున్నారు. అజ్ఞాతంలోకి వెళ్ళిన ఆయన బెంగుళూరు తదితర ప్రాంతాలలో రహస్యంగా సంచరిస్తూ ఒకటిన్నర సంవత్సరం పాటు పీర్ మహమ్మద్ అను సన్నిహితుని వద్ద గడిపారు. స్వంతగడ్డ, స్వజనుల మీద ఆంగ్లేయుల పెత్తనానికి చరమగీతం పాడేందుకు సయ్యద్ ఖిక్కూ, సయ్యద్ లాల్, మహమ్మద్ అలీ లాంటి తిరుగుబాటు నాయకులతో మౌల్వీ అజ్ఞాతంలో కూడా సంప్రదింపులు జరుపుతూ గడిపారు.

బ్రిటీష్ ప్రభుత్వానికి బలమైన మద్దతుదారుని సంస్థానంలో జరిగిన తిరుగుబాటు, దాడి పట్ల ఏమాత్రం ఉపేక్ష వహించరాదనుకున్న ఆంగ్లేయాధికారులు మౌల్వీ కోసం వేటను ముమ్మరం చేశారు. చివరకు మౌల్వీ అల్లావుద్దీన్‌ను ఆంగ్లేయులు నిర్భంధించ గలిగారు. అనంతరం విచారణ తంతును జరిపించి ఆయనకు ద్వీపాంతరవాస శిక్ష విధించి, 1859 జూన్ 28న అండమాన్ దీవులలోని సెల్యులర్ జైలుకు పంపించారు. ఆ జైలులో పాతికేళ్ళు దుర్భర నిర్బంధ జీవితం గడిపిన మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ 1884లో కన్నుమూశారు. ◆



# 27. మౌల్వీ లియాఖత్ అలీ

## (1817-1892)

1857 నాటి తిరుగుబాటును తొలుత సిపాయీలు ఆరంభించినా, అన్నివర్గాల ప్రజలు అందులో భాగస్వాములయ్యారు. ఆ క్రమంలో తమ కలాలకు శలవు చెప్పి ఖడ్గాలను చేతపట్టి పోరాటంలో పాల్గొన్న పండితులలో మౌల్వీ లియాఖత్ అలీ ఒకరు.

ఉత్తర ప్రదేశ్ రాష్ట్రం అలహాబాద్ జిల్లా చాయిల్ తహసిల్‌లోని మహాగాంవ్ లోని చేనేత కార్మికుల కుటుంబంలో లియాఖత్ అలీ 1817 అక్టోబర్ 5న జన్మించారు. తల్లి అమీనాబి, తండ్రి సయ్యద్ మెహర్ అలీ. చిన్నతనంలోనే లియాఖత్ ధార్మిక పరిజ్ఞానం తోపాటుగా బ్రిటీష్ వ్యతిరేకతనూ సంతరించుకున్నారు. ఆయన బ్రిటీష్ సైన్యంలో చేరి భారతీయ సైనికుల మనస్సుల్లో ప్రభుత్వ వ్యతిరేకతను నూరిపోయసాగారు. అది పసికట్టి ఆయనను సైన్యం నుండి బహిష్కరించారు. ఆ తరువాత మౌల్వీ స్వగ్రామం మహాగాంవ్ కేంద్రంగా ప్రజలకు ధార్మిక మార్గదర్శనం చేస్తూ ఉపాధ్యాయునిగా బ్రిటీష్ వ్యతిరేక ప్రచారాన్ని పున:ప్రారంభించి స్వదేశీ పాలన పునఃప్రతిష్టకోసం, న్యాయమైన హక్కుల సాధన కోసం ప్రజలు ధర్మపోరాటం సాగించాలని ఉద్బోధ చేయసాగారు.

అలహాబాద్ ప్రాంతంలోని బ్రిటీష్ వ్యతిరేక వర్గాలన్నిటిని ఐక్యం చేసి ఒక వేదిక మీదకు తెచ్చి కంపెనీ పాలకుల మీద సమరశంఖారావం పూరించారు. 1857 జూన్





6న మౌల్వీ తన బలగాలతో అలహాబాద్ పట్టణంలో ప్రవేశించి కంపెనీ అధికారులను తరిమికొట్టి నగరాన్ని స్వాధీనం చేసుకున్నారు. ఢిల్లీ చక్రవర్తి బహదూర్ షా జఫర్ ప్రతినిధిగా ప్రకటించుకుని పట్టణంలోని కౌసర్‌బాగ్ కేంద్రంగా చేసుకుని పాలనా వ్యవహారాలను సాగించారు. మౌల్వీ పరిపాలనా దక్షతను, అన్ని సాంఘిక జనసముదాయాల పట్ల ఆయన చూపుతున్న సమానతను గమనించి గ్రామాలకు గ్రామాలు తరలి వచ్చి ఆయనకు మద్దతు తెలిపాయి. ప్రజలు, స్వదేశీ సైనికులు, శిష్యవర్గం, ప్రముఖులు ఆయన వెంట నడిచారు. తద్వారా అపార ప్రజాబలం సంపాదించుకున్న మౌల్వీ తన పరగణాలో ఆంగ్ల అధికారుల ఛాయలు కూడా లేకుండా చేసి స్వదేశీయుల పాలనను పునఃస్థాపితం గావించారు.

ఈ సందర్భంగా ప్రజలలో, స్వదేశీ సైనికులలో దేశభక్తిని పెంపొందించటమే కాకుండా ఆంగ్లేయుల దుర్నీతిని ఎండగడ్తూ హిందూ-ముస్లి-శిక్కుల మధ్య ఐక్యతను కాంక్షిస్తూ, **పయాం-యే-అమల్** శీర్షికతో ఆయన రాసిన ప్రబోధగీతం మరో స్వాతంత్ర్య సమరయోధులు అజీముల్లా ఖాన్ సంపాదకత్వంలోని **పయామే ఆజాది** అను ఉర్దూ పత్రికలో ప్రచురితమై ప్రజలను, పోరాట యోధులను ఉత్తేజితుల్ని చేసింది.

అలహాబాద్ నగరాన్ని స్వాధీనం చేసుకున్నా బ్రిటీషర్ల ఆధీనంలో మిగిలిపోయిన అలహాబాద్ కోటను పట్టుకోడానికి ఆయన చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. అంతలో అలహాబాద్‌ను తిరిగి స్వాధీనం చేసుకునేందుకు అపార సైనిక బలగాలతో సైనికాధికారి జనరల్ నీల్ (General Neill) జూన్ 11న దాడి జరిపాడు. ఈ పోరాటంలో స్వయంగా పాల్గొన్న మౌల్వీ ప్రతికూల పరిస్థితులలో జూన్ 17న యుద్ధభూమి నుండి తప్పుకున్నారు. కంపెనీ బలగాలను సవాల్ చేసి మట్టికరిపించి, స్వతంత్ర పాలనకు అంకురార్పణ చేసిన ఆయనను ఏమాత్రం విడిచి పెట్టరాదని నిర్ణయించిన కంపెనీ పాలకులు మౌల్వీని పట్టిస్తే ఐదు వేల రూపాయలు ముట్టచెబుతామని నజరానా ప్రకటించారు.

ఆ ప్రకటనతో అప్రమత్తులైన మౌల్వీ బ్రిటీష్ అధికారుల కళ్ళుగప్పి మారు వేషాలతో సంచరిస్తూ మళ్ళీపోరుకు శక్తియుక్తులను సమీకరించటం ఆరంభించారు. ఆ సమయంలో ఒక నమ్మక ద్రోహి అందించిన సమాచారం మూలంగా మౌల్వీ కంపెనీ సైన్యాల బారిన పడ్డారు. ఆ సందర్భంగా జరిగిన విచారణలో **మాతృదేశాన్ని ఆంగ్లేయుల పెత్తనం నుండి విముక్తం చేసేందుకు మాత్రమే తాను ఆయుధం అందుకున్నానని** చాలా స్పష్టంగా ఆయన ప్రకటించారు. చివరకు ఆయన మీద రాజద్రోహ నేరం మోపి, ఆజన్మాంత ద్వీపాంతరవాస శిక్ష విధించి, అండమాన్ దీవులకు పంపగా 1892 మే 17న మౌల్వీ లియాఖత్ అలీ తనువు చాలించారు. ◆



# 28. మీర్జా బిర్జిస్ ఖదీర్

## (1845-1893)

**మా**తృభూమిని పరాయిపాలకుల పెత్తనం నుండి విముక్తం చేసేందుకు పన్నెండు సంవత్సరాల చిన్న వయస్సులో అనునిత్యం నీడలా వెంటాడుతున్న ఆంగ్లేయ శత్రువును ఎదుర్కొంటూ స్వతంత్రపాలన సాగించిన అవధ్ రాజ్యాధినేత మీర్జా బిర్జిస్ ఖదీర్.

1845లో బేగం హజరత్ మహల్, అవధ్ చివరి నవాబు వాజిద్ అలీ షా లకు జన్మించిన బిర్జిస్ ఖదీర్ అసలు పేరు మొహమ్మద్ రంజాన్ అలీ బహదూర్. ఆంగ్లేయులు అక్రమంగా చేజిక్కించుకున్న అవధ్ రాజ్యాన్ని తల్లి మార్గదర్శకత్వంలో పునరాక్రమించుకుని స్వదేశీయుల అంగీకారంతో 1857 జూలై 7న ఆయన స్వతంత్ర పాలకుడయ్యారు. మాతృభూమి కోసం ప్రాణాలు త్యజించడానికి సిద్ధమైన ప్రజలు, స్థానిక నాయకులు, సిపాయిల సహకారంతో 1,80,000 మందితో కూడిన బలగాలను సమకూర్చుకున్నారు. తల్లి హజరత్ మహల్ సమర్థవంతమైన మార్గదర్శకత్వం, స్వదేశీయుల శౌర్యప్రతాపాల ఫలితంగా లక్నో నుండి ఆంగ్లేయాధికారులు పలాయనం చిత్తగించగా 10 మాసాల పాటు అవిచ్ఛిన్నంగా మీర్జా బిర్జిస్ ఖదీర్ పేరిట స్వతంత్ర పాలన సాగింది.

ఆ సందర్భంగా 1858 నవంబర్ 1న విక్టోరియా మహారాణి విడుదల చేసిన ప్రకటనకు ధీటుగా స్వదేశీయులలో ధైర్యాన్ని ప్రోదిచేస్తూ, విదేశీయుల కుయుక్తులను





బహిర్గతం చేస్తూ బిర్జిస్ ఖదీర్ పేరిట 1858 డిసెంబర్ 31న చారిత్రాత్మక ప్రకటన విడుదల చేశారు. అతి పిన్న వయస్కుడైన బిర్జిస్ ఖదీర్ బలగాల చేతిలో కలిగిన ఘోర పరాభవాన్ని ఆంగ్లేయులు జీర్ణించుకోలేకపోయారు. సత్వరమే లక్నోను పట్టుకోవలసిందిగా లార్డ్ కానింగ్ జారీ చేసిన ఆదేశాల మేరకు బ్రిటీష్ సైన్యాధిపతులు కోలిన్ క్యాంప్‌బెల్, జనరల్ హ్యావ్‌లాక్, జనరల్ ఓట్రాంలు భారీ సైనిక బలగాలతో లక్నోను చుట్టుముట్టారు. అత్యంత కీలక సమయంలో సిక్కులు, గూర్ఖాలు ఆంగ్ల బలగాలకు అండగా నిలిచారు. లక్నో ప్రజలు, స్వతంత్ర అవధ్ సైనికులు ప్రాణాలకు తెగించి పోరాడినా కంపెనీ సైనిక బలగాలను జయించటం అసాధ్యమయ్యింది. చివరకు సహచరుల ఒత్తిడి మేరకు మీర్జా ఖదీర్‌తో సహా బేగం హజరత్ మహల్ నేపాల్ పర్వతాలలోకి నిష్క్రమించారు.

నేపాల్ పర్వతసానువుల్లో ఎదురైన ప్రతికూల వాతావరణం, అనారోగ్యం మూలంగా తన సైన్యాధికారులు, సైనికుల సంఖ్య త్వరితగతిన తరిగిపోగా 1874లో హజరత్ మహల్ మరణించారు. ఆర్థికంగా అతి క్లిష్ట సమయాన్ని ఎదుర్కొంటున్న సమయంలో కలకత్తాలో బ్రిటీషర్ల నిర్బంధంలో ఉన్న ఖదీర్ తండ్రి నవాబు వాజిద్ అలీషా కన్నుమూశారు. ఆయన మరణంతో అవధ్ వారసుడిగా బిర్జిస్ ఖదీర్ రూపంలో మిగిలిన ఏకైక అడ్డును తొలగించుకునేందుకు ఆంగ్లేయులు కుటిల యత్నాలను ప్రారంభించారు. బిర్జిస్‌కు ఆశ చూపించి లొంగదీసుకునేందుకు విఫలప్రయత్నాలు చేస్తూ, తమ అనుయాయుడైన నేపాల్ రాజు జంగ్ బహుదూర్ ద్వారా బిర్జిస్ ఖదీర్ మీద ఒత్తిడి పెంచారు.

చివరకు గత్యంతరం లేక బిర్జిస్ ఖదీర్ అజ్ఞాతం నుండి బయటకు వచ్చారు. రాజ కుటుంబం ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారం కోసం కలకత్తా రావాల్సిందిగా కంపెనీ అధికారులు ఆయనకు ఆహ్వానం పంపారు. కుటుంబ సమేతంగా ఆయనను అంతం చేయాలన్న దురుద్దేశ్యంతో కూడిన ఆంగ్లేయుల కుట్రను గ్రహించలేకపోయిన బిర్జిస్ పూర్తి పరివారంతో కలకత్తా వచ్చారు. 1893 ఆగస్టు 13న కుమారుడు ఖుర్షీద్ ఖదీర్, కుమార్తె జమాల్ ఆరా బేగంతోసహా ఆంగ్ల అధికారులిచ్చిన విందులో ఆయన పాల్గొన్నారు. ఆ విందులో విషాహారాన్ని ఆరగించటంతో బిర్జిస్ ఖదీర్ తన ఇరువురు బిడ్డలతో సహా ప్రాణాలు విడిచారు. భార్య మొహబత్ ఆరా బేగం, చిన్నకుమార్తె హుస్నా అదా బేగం ఆ విందుకు రాకపోవటంతో ఆ ప్రాణాంతక కుట్ర నుండి బతికి బయటపడ్డారు. ఈ విధంగా చివరి వరకు స్వతంత్ర అవధ్ కోసం తపించి, ఒంటరి పోరాటం సాగించిన మీర్జా బిర్జిస్ ఖదీర్ 1893 ఆగస్టు 13న ఆంగ్లేయుల భయానక కుట్రకు బలయ్యారు. ◆



# 28. రహిమతుల్లా యం. సయానీ

## (1847-1902)

1885లో భారత జాతీయ కాంగ్రెస్ ప్రప్రథమ సమావేశానికి మొత్తం 72 మంది ప్రముఖులు హాజరు కాగా, అందులో ఇరువురు ముస్లింలున్నారు. ఆ ఇద్దరిలో ఒకరు రహిమతుల్లా ముహమ్మద్ సయానీ కాగా మరోకరు అబ్దుల్లా ధర్మాసి.

బొంబాయిలోని ఒక అత్యంత సంపన్న వ్యాపార కుటుంబంలో 1847 ఏప్రిల్ 5న జన్మించిన రహిమతుల్లా తండ్రి పేరు ముహమ్మద్ సయానీ. ఆంగ్ల భాష పట్ల ముస్లిం సమాజంలో వ్యతిరేకత వ్యక్తమవుతున్న రోజుల్లో 1868లో పోస్టు గ్రాడ్యుయేషన్ డిగ్రీని సాధించిన తొలిముస్లింగా ఖ్యాతిగాంచిన సయాని 1870లో న్యాయశాస్త్రం పూర్తి చేసి బొంబాయిలో సమర్థుడైన న్యాయవాదిగా పేరు ప్రఖ్యాతులు గడించారు.

న్యాయవాదిగా రాణిస్తూ సంఘసేవా కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొంటూ ప్రజల మన్నన పొందిన ఆయన 1876లో బొంబాయి మున్సిపల్ కార్పోరేషన్‌కు ప్రజాప్రతినిధిగా ఎన్నియ్యారు. ఆ క్రమంలో అంచెలంచెలుగా ఎదుగుతూ 1888లో బొంబాయి కార్పోరేషన్ మేయర్ పదవి చేపట్టారు. ఆ తరువాత ప్రాంతీయ రాజకీయాల నుండి జాతీయ రాజకీయాల మీద దృష్టి నిల్పిన సయానీ 1885లో కలకత్తాలో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ ప్రారంభోత్సవ సమావేశానికి హాజరయ్యారు.





ఆనాడు సర్ సయ్యద్ అహమ్మద్ సాగించిన కాంగ్రెస్ వ్యతిరేకత ప్రచార హోరును తట్టుకుంటూ, సయ్యద్ సంధించిన ప్రశ్నలకు ధీటుగా సమాధానాలిస్తూ, ముస్లింలు జాతీయ కాంగ్రెస్‌లో తప్పక చేరాలని, ఉమ్మడి పోరాటాలలో భాగస్వామ్యం ఉన్నప్పుడే ఉమ్మడి సంపద నుండి వాటా పొందడానికి ముస్లింలకు అర్హత, హక్కు లభిస్తుందని వాదించారు. భారత జాతీయ కాంగ్రెస్ పక్షాన నిలచిన ఆనాటి ప్రముఖులలో రహిమతుల్లా యం. సయానీ అగ్రగణ్యులుగా జాతీయోద్యమ నిర్మాణానికి గట్టి పునాదులు వేశారు.

1888లో బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యునిగా ఎంపికైన రహిమతుల్లా 1896 వరకు ఆ పదవిలో కొనసాగారు. ఆ తరువాత 1896లో ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు ఎంపికయ్యారు. ఆయన ఏ పదవిలో ఉన్నా ప్రజల పక్షం మాత్రమే వహించారు. ప్రజలకు సంబంధించిన సమస్యల మీద బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా బలంగా గొంతు విన్పించడానికి ఏమాత్రం వెనుకాడని ఆయన ప్రజా సమస్యలను సాధికారికంగా విశ్లేషిస్తూ పరిష్కారాలను కూడా సూచిస్తూ ప్రజలచేత–అధికారులచేత **భళీ** అన్పించుకున్నారు.

1893లో బొంబాయి ప్రాంతీయ కాంగ్రెస్ సమావేశాలకు, 1896 డిసెంబరులో కలకత్తాలో జరిగిన జాతీయ కాంగ్రెస్ 12వ సమావేశానికి అధ్యక్షత వహించిన ఆయన దేశంలోని అన్ని సాంఘిక జనసముదాయాల మధ్య ఐక్యత కోసం, మత సామరస్యం – శాంతి కోరుతూ ఆచరణాత్మకంగా విశేష కృషి సల్పారు.

భారతదేశ సంపద తరలింపుకు గురవుతున్న విషయం, తద్వారా జరుగుతున్న నష్టాన్ని విశ్లేషణాత్మకంగా వివరించారు. ప్రతి సంవత్సరం భారతదేశం నుండి తరలిపోతున్న సంపదకు సమానంగా వాణిజ్య ప్రయోజనం భారతీయులకు దక్కడం లేదని గణాంకాలతో ప్రకటించారు. పన్నుల విధింపు విషయంలో బ్రిటీష్ ప్రభుత్వం భారతీయుల మీద మోపుతున్న భారాన్ని, చూపుతున్న వివక్షను సాధికారికంగా నిలదీశారు. సివిల్, మిలటరీ వ్యవస్థలలో అనుత్పాదక వ్యయం గణనీయంగా తగ్గాల్సిన అవసరాన్ని ప్రకటించారు. వ్యవసాయం, కరువు తదితర సమస్యలను బాగా అధ్యయనం చేసి **ఆకలిని మించిన తిరుగుబాటు** ఉండదని సైద్ధాంతికంగా వివరిస్తూ రహిమతుల్లా ప్రభుత్వాన్ని హెచ్చరించారు.

ఈ విధంగా భారతదేశాన్ని బ్రిటీషర్ల బానిసత్వం, దోపిడి నుండి విముక్తం చేసేందుకు, భారతీయుల స్థితిగతులలో మార్పు కోసం, సామరస్యం, శాంతి– సౌభాగ్యాల కోసం ఆహర్నిశలు శ్రమించి **'భారత దేశపు నిజమైన ముద్దుబిడ్డడు'** గా ఖ్యాతిగాంచిన రహిమతుల్లా ముహమ్మద్ సయాని 1902 జూన్ 4న అంతిమ శ్వాస విడిచారు. ◆



# 30. జస్టిస్ బద్రుద్దీన్ తయ్యాబ్జీ

## (1844-1906)

**మా**తృభూమిని విదేశీయుల పాలననుండి విముక్తం చేయాలన్న సంకల్పంతో మూడుతరాల వ్యక్తులు విముక్తి పోరాటంలో పాల్గొన్న విశిష్ట చరిత్ర కలిగిన **తయ్యాబ్జీ** కుటుంబలోని ప్రముఖులు జస్టిస్ బద్రుద్దీన్ తయ్యాబ్జీ.

మహారాష్ట్రలోని కాంబేలో1844 అక్టోబర్ 8న బద్రుద్దీన్ తయ్యాబ్జీ జన్మించారు. తండ్రి తయ్యాబ్ ఆలీ, తల్లి అమినా తయ్యాబ్జీ. స్వదేశీ విదేశీ వ్యాపారాలలో తనదైన సామ్రాజ్యాన్ని సృష్టించుకున్న తయ్యాబ్ ఆలీ బిడ్డలకు ఆధునిక, ఆంగ్ల భాషల్లో చదువులు చెప్పించారు. చిన్న వయస్సులో ఉర్దూ, పర్షియన్, అరబ్బీ, గుజరాతి, మరాఠి భాషలను, కొద్దిగా ఆంగ్ల భాషను నేర్చుకున్న బద్రుద్దీన్ 1860లో లండన్ వెళ్ళి కొంతకాలం తరువాత ఇండియా వచ్చి 1865లో మోతి బేగంను వివాహమాడారు. 1867లో మళ్ళీ లండన్ వెళ్ళి న్యాయశాస్త్రంలో పట్టా పుచ్చుకుని బొంబాయి వచ్చి ప్రాక్టీస్ అరంభించారు. అతి కొద్ది కాలంలోనే అత్యధిక సంపాదన గల బారిస్టర్‌గా పేరుగాంచారు.

బొంబాయి కార్పొరేషన్‌లో సాగుతున్న అవినీతికి, హద్దులు మీరిన ఆంగ్లేయ అధికారుల పెత్తనానికి, పేదల నివాస ప్రాంతాలలో కనీస సౌకర్యాల కల్పనలో అధికారగణం చూపుతున్న అలసత్వానికి వ్యతిరేకంగా **త్రీస్టార్స్** గా ఖ్యాతిగాంచిన మిత్రులు





ఫిరోజ్‌షా మెహతా, కాశీనాథ్ తెలంగ్‌లతో కలసి 1871లో ప్రారంభించిన ఆందోళన ద్వారా ఆయన ప్రజాసేవారంగంలో అడుగుపెట్టారు. ఆ క్రమంలో 1873లో బద్రుద్దీన్ తయ్యాబ్జీ బొంబాయి కార్పోరేటర్‌గా, 1882లో బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యునిగా ఎంపికయ్యారు. ప్రజా ప్రతినిధిగా భాధ్యతలను నిర్యహిస్తూనే భారతీయుల భవిష్యత్తుకు విఘాతం కల్గించగల బ్రిటీష్ ప్రభుత్వ చర్యలను, చట్టాలను ప్రతిఘటిస్తూ **త్రీస్టార్స్**‌తో కలసి విజయవంతంగా పలు పోరాటాలు చేస్తూ ప్రజాభిమానం మూటగట్టుకున్నారు.

1885 డిసెంబర్‌లో భారత జాతీయ కాంగ్రెస్ ఏర్పడిన తరువాత బద్రుద్దీన్ తయ్యాబ్జీ ఆ సంస్థతో పూర్తిగా మమేకమయ్యారు. భారత జాతీయ కాంగ్రెస్ విధివిధాన నిర్ణయాలలో, నిర్మాణం రూపకల్పనలో బద్రుద్దీన్ ప్రధాన పాత్ర నిర్వహించారు. 1887లో మద్రాసులో జరిగిన కాంగ్రెస్ జాతీయ సమావేశాలకు బద్రుద్దీన్ అధ్యక్షత వహించారు. ముస్లింలను కాంగ్రెస్‌కు దూరంగా ఉంచాలని ప్రయత్నించిన సర్ సయ్యద్ అహమ్మద్, సయ్యద్ అమీర్ ఆలీ, నవాబు అబ్దుల్ లతీఫ్‌ల వాదనలను ఆయన సమర్థవంతంగా తిప్పి కొట్టారు. 1895లో ఉన్నత న్యాయస్థానం న్యాయమూర్తిగా బాధ్యతలు స్వీకరించే వరకు భారత జాతీయ కాంగ్రెస్ పెరుగుదల, పటిష్టతకు తయ్యాబ్జీ ఎంతగానో శ్రమించారు.

ప్రజా జీవనరంగాలన్నిటిని రాజకీయాలు మాత్రమే ప్రభావితం చేయలేవని భావించిన తయ్యాబ్జీ సాంఘిక, విద్యా, ఆర్థిక రంగాలలో పురోభివృద్ధిని కోరుకున్నారు. ఆ దిశగా కృషిసాగిస్తూ ముస్లిం సమాజంలో సంస్కరణలను ఆశించారు. ఆడపిల్లలకు ఆధునిక విద్య అవసరమన్నారు. ఆయన ఆశించిన సంస్కరణలన్నిటినీ తన కుటుంబం ద్వారా ఆచరించి చూపారు. ముస్లిం సమాజాన్ని అన్ని రంగాలలో ప్రగతిపథంలో చూడాలన్న ఆకాంక్షతో సేవా-విద్యా-ఆర్థిక సంస్థలను స్థాపించి పలు సేవలందించారు.

న్యాయశాస్త్ర ప్రవీణుడుగా ఖ్యాతిగడించిన తయ్యాబ్జీ 1902లో బొంబాయి హైకోర్టు యాక్టింగ్ ప్రధాన న్యాయమూర్తిగా నియమితులయ్యారు. 1906లో అనారోగ్యం వలన ఇంగ్లాడ్ వెళ్ళారు. ఆ సమయంలో ప్రధాన న్యాయమూర్తిగా ఆయన నియామకాన్ని క్రమబద్ధం చేస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది.

ఈ విధంగా అటు జాతీయవాదిగా, ఇటు ప్రధాన న్యాయమూర్తిగా, మరోవైపు ప్రజా సేవకుడిగా అపూర్వ సేవలందించి **'ఆయన మొదట భారతీయుడు, ఆ తరువాత ముస్లిం, తుదకు విశ్వమానవుడు'** అని చరిత్రచే ఘనంగా కీర్తించబడిన జస్టిస్ బద్రుద్దీన్ తయ్యాబ్జీ 1906 ఆగస్టు 19న ఇంగ్లాండులో కన్నుమూశారు. ◆



# 31. ముల్లా అబ్దుల్ ఖయ్యూం ఖాన్

## (1853-1906)

ప్రభువు ఆగ్రహానికి గురికాక తప్పదని తెలిసినా ప్రజలపక్షం వహించి, జాతీయోద్యమంలో భాగంగా బ్రిటీషు-నిజాం వ్యతిరేక పోరాటాల దిశగా ప్రజల్ని మేల్కొల్పిన తొలితరం వైతాళికులలో ముల్లా అబ్దుల్ ఖయ్యూం ప్రముఖులు.

ముల్లా అబ్దుల్ ఖయ్యూం 1853లో మద్రాసులో జన్మించారు. ఆయన ఎనిమిది సంవత్సరాల వయస్సులో ఆయన తల్లితండ్రులు హైదరాబాదుకు వచ్చి నైజాం సంస్థానంలో స్థిరపడ్డారు. అబ్దుల్ ఖయ్యూం దారుల్ ఉలూంలో పర్షియన్, అరబ్బీ భాషలను నేర్చుకున్నారు. ఆ తరువాత ఉత్తరప్రదేశ్‌లోని మీర్జాపూరు వెళ్ళి ఉన్నత విద్య పూర్తి చేసి వచ్చిన ఆయన 1875లో హైదరాబాద్ సంస్థానంలో ఉద్యోగిగా ప్రవేశించారు. ప్రతిభా సంపన్నుడైన ముల్లా అబ్దుల్ ఖయ్యూం అచిరకాలంలో ఉన్నతాధికారిగా ఎదిగారు.

1880లో సరోజినీ నాయుడు తండ్రి డాక్టర్ అఘోరనాథ్ చటోపాధ్యాయతో ఆయనకు కలిగిన పరిచయం హిందూ-ముస్లింల మధ్య ఐక్యతకు ప్రతీకగా నిలచి, హైదరాబాదు సంస్థానంలో ప్రముఖ చారిత్రక సంఘటనలకు, పరిణామాలకు కారణం అయ్యింది. ప్రజోపకర కార్యక్రమాల పట్ల చిన్నతనం నుండి శ్రద్ధ చూపుతూ వచ్చిన ఆయన ప్రభుత్వాధికారిగా బాధ్యతలు నిర్వహిస్తూ ప్రజలలో విద్యావాప్తికి, నవ్య చైతన్యానికి





ప్రాధాన్యతనిచ్చి కృషి చేశారు. ఆ దిశగా కృషి సాగించేందుకు పలు సంస్థలను, సంఘాలను స్థాపించారు. ఆ సంస్థలను ఆర్థికంగా ఆదుకున్నారు. డాక్టర్ అఘోరనాథ్‌తో కలసి, 1883 నాటి **చందా రైల్వే పథకం వ్యతిరేక పోరాటం**లో పాల్గొని నైజాం నవాబు ఆజ్ఞలను సామాన్యప్రజలు కూడా వ్యతిరేకించ వచ్చన్న చైతన్యాన్ని కల్గించారు. ఈ విధంగా హైదరాబాద్ సంస్థానంలో పునర్వికాస ఉద్యమానికి పథనిర్దేశకులుగా సుప్రసిద్ధులయ్యారు. ఆ కారణంగా నిజాం ఆగ్రహానికి గురైన అబ్దుల్ ఖయ్యూం హైదరాబాదు నగరం వదలి కొంత కాలం మద్రాసులో తలదాచుకోవాల్సి వచ్చింది.

1885లో భారత జాతీయ కాంగ్రెస్ స్థాపన జరగ్గానే హైదరాబాద్ సంస్థానం నుండి సభ్యత్వం స్వీకరించిన మొట్టమొదటి ముస్లిం నేతగా ఆయన చరిత్ర సృష్టించారు. సర్ సయ్యద్ అహమ్మద్ ఖాన్ సాగిస్తున్న కాంగ్రెస్ వ్యతిరేక ప్రచారాన్ని ఎదుర్కొంటూ Safir-e-Deccan అను పత్రికలో వ్యాసాలు రాశారు. 1905లో ఓ కరపత్రం ప్రచురించి తన విమర్శకుల నోళ్ళు మూయించారు. నైజాం నవాబు తాఖీదులను ఖాతరు చేయకుండా ముస్లింలను మాత్రమే కాకుండా సర్వజనులను భారత జాతీయ కాంగ్రెస్‌లో చేరమన్నారు.

1905లో బెంగాలు విభజన వ్యతిరేకోద్యమంలో ప్రముఖపాత్ర వహించిన ఆయన స్వదేశీ ఉద్యమానికి జవసత్వాలు అందించటంలో తోడ్పడ్డారు. ప్రజా ఉద్యమాల విజయం కోసం హిందూ-ముస్లింల ఐక్యతావసరాన్ని గుర్తించిన ఆయన ఆ దిశగా ముమ్మరంగా కృషి సాగించి, **'ఆయన హిందూ-ముస్లింల ఐక్యతా ప్రవక్త మాత్రమే కాకుండా ఐక్యతకు సజీవరూపం'** అని ప్రజలు, ప్రముఖుల నుండి ప్రశంసలు పొందారు.

అబ్దుల్ ఖయ్యూం ధార్మికంగా ఇస్లాం అనురక్తుడైన ముస్లిం అయినప్పటికి ఆయనలో పరిఢవిల్లిన పరోపకార భావనలు, దేశభక్తి సుగంధాలు, విశ్వమానవ సౌభ్రాతృత్వ గుభాళింపులు, ఆయనను **'గొప్ప ముస్లిం, గొప్ప భారతీయుడు, మరియు గొప్ప మనీషి'** గా సరోజినీ నాయుడుచే అభివర్ణింప చేశాయి. ప్రజల సంక్షేమాన్ని, ప్రజా చైతన్యాన్ని ఆశిస్తూ, పునర్వికాసం కోసం అబ్దుల్ ఖయ్యూం వ్యక్తీకరించిన పోరాట రూపాలు ఆయనకు బ్రిటీష్-నిజాం వ్యతిరేక పోరాట యోధులలో ప్రముఖ స్థానాన్ని సంతరింపజేశాయి.

ఈ విధంగా అధికారిగా ఉద్యోగ బాధ్యతలు సమర్థవంతంగా నిర్వహిస్తూ, జీవిత పర్యంతం అటు ప్రజలలో విద్యావ్యాప్తికి, నవ చైతన్యానికి, ఇటు జాతీయోద్యమానికి తనను తాను పూర్తిగా అంకితం చేసుకున్న ముల్లా అబ్దుల్ ఖయ్యూం ఖాన్ చివరివరకు ఆ మార్గాన ప్రయాణం చేస్తూ 1906 అక్టోబరు 27న చివరిశ్వాస విడిచారు. ◆

# 32. ఖుదీరాం కి దీది

**(-)**

**బ్రి**టీష్ వలసపాలకుల బానిసత్వం నుండి స్వదేశాన్ని విముక్తం చేసి, స్వరాజ్యాన్ని స్థాపించాలనే ఉత్సాహంతో యువతరం ఆయుధాలు చేపట్టి విస్ఫులింగాలై బ్రిటీష్ ప్రభుత్వం, ఆంగ్లేయాధికారుల మీద విరుచుకుపడుతున్న **అగ్నియుగం** రోజులవి.

విప్లవకారుల అణిచివేతకు పలు చట్టాలను రూపొందించి విప్లవోద్యమాన్ని దుంపనాశనం చేయడానికి అన్ని రకాల అధికారాలను ప్రసాదించి పోలీసు అధికారులను ఆంగ్లేయ ప్రభుత్వం ప్రజల మీదకు ఉసికొల్పింది. విప్లవకారులకు సహాయపడుతున్నారని ఏ మాత్రం అనుమానం వచ్చినా అటువంటి వారిని అక్రమంగా నిర్బంధించి, తీవ్రంగా హింసించి అంతం చేస్తున్న భయానక వాతావరణమది.

బ్రిటీష్ పోలీసుల దాష్టీకాలను భరించలేక కుటుంబ సభ్యులే విప్లవకారులైన తమ బిడ్డలతో సంబంధాలు వదులుకుంటున్న పరిస్థితులలో పోలీసు చర్యలకు భయపడకుండా విప్లవయోధుడు ఖుదీరాం బోసుకు అండగా నిలవడమే కాకుండా ఆయనకు ఆశ్రయం కల్పించి ఆమె ఆదుకున్న యోధురాలు **ఖుదీరాం కి దీది**. ఆ ఉద్యమకారుని పట్ల అంతటి సాహసోపేత ఆదరణ చూపినందున ఆమెను ఆయన **దీది** (అక్కయ్య) అని సంభోదించారు. ఆయన సంబోధన కారణంగా ఆమె ఖుదీరాంకు మాత్రమే కాకుండా అందరికీ **ఖుదీరాం**





**కి దీది** అయ్యారు. ఆమె అసలు పేరు తెలియదు. చరిత్ర ఆమెను **ఖుదీరాంకి దీది** (ఖుదీరాం అక్కయ్య) గా మాత్రమే గుర్తించింది. ఆ పేరుతోనే ఆమె స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో గణుతికెక్కారు. ఆమె ప్రముఖ విప్లవకారులు మౌల్వీ అబ్దుల్ వహీద్ చెల్లెలు. అన్నకు తగ్గ చెల్లెలుగా ఆమె కూడా బ్రిటీష్ ప్రభుత్వం వ్యతిరేక పోరాటాలలో పాల్గొని ఆనాటి పోరాట యోధులకు అండదండలందించారు. (Freedom Movement and Indian Muslims, Santimoy Ray, PPH, New Delhi,1993, Page. 34)

విప్లవ యోధులను పొట్టనపెట్టుకుంటున్న ఆంగ్లేయాధికారులను మట్టుబెట్టాలని ప్రయత్నిస్తున్న భయమెరుగని విప్లవయోధుడు ఖుదీరాంను మీద ఆంగ్లేయాధికారి కెన్నడీ (Kennedy) భార్యను హత్య చేసారన్నది ఆరోపణ. బ్రిటీష్ మహిళను హత్యగావించాడని ఆగ్రహంతో రగిలిపోతున్న అధికారులు ఖుదీరాం బోసు సమాచారం కోసం, ప్రజలపై, విప్లవోద్యమ సానుభూతిపరులపై విరుచుకుపడి, విధ్వంసం సృష్టిస్తున్నారు, చిత్రహింసల పాల్జేస్తున్నారు. ఆ పరిస్థితులలో ఆమె ఖుదీరాంను రక్షించపూనుకోవటం సాహసం.

ఆ విషయాన్ని పోలీసులు ఏమాత్రం పసిగట్టినా, ఖుదీరాంతోపాటుగా ఆమె కూడా దారుణ చిత్రహింసలకు గురికావటమేకాక ప్రాణాలను కూడా అర్పించాల్సి వచ్చేది. ఆ భయానక వాతావరణంలో కూడా ఆమె భయపడలేదు. అక్కయ్యకు ఏమాత్రం కష్టం-నష్టం కలిగించటం ఇష్టంలేక కొంతకాలం తరువాత ఖుదీరాం ఆమె వద్ద నుండి వెళ్ళి పోయారు. ఆ తరువాత అరెస్టయ్యారు. ప్రభుత్వం ఆయనను చాలా కాలం నిర్బంధంలో ఉంచింది. ఆ సమయంలో కూడా జైలులో నున్న ఖుదీరాం క్షేమసమాచారాలను తెలుసుకోడానికి ఆమె ఎంతో తెగింపుతో ప్రయత్నించారని ఆ యోధురాలి సాహసాన్ని వివరిస్తూ చరిత్రకారుడు Santimoy Ray, తన Freedom Movement and Indian Muslims (Page. 34) లో బహువిధాల ప్రశంసించారు.

చివరకు విప్లవ యోధుడు, పిన్నవయస్కుడైన ఖుదీరాంను ముజఫర్‌పూర్ జైలులో 1908 ఆగస్టులో ఉరితీశారు. ఆ యోధుడికి ఉరిశిక్ష విధించిన విషయం తెలుసుకున్న ఆమె బ్రిటీష్ ప్రభుత్వం నుండి ఎదురయ్యే తీవ్ర పరిణామాలను కూడా ఏమాత్రం ఖాతరు చేయకుండా ప్రభుత్వాన్ని, పోలీసు వర్గాలను తీవ్రంగా విమర్శించారు.

ఈ విధంగా అత్యంత కష్టకాలంలో విప్లవకారులకు అండగా నిలచి, కోరి తెచ్చుకున్న కష్టనష్టాలను చిరునవ్వుతో భరించిన ఆ యోధురాలు భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో **ఖుదీరాం కి దీది** గా చిరస్మరణీయమైన ఖ్యాతిని స్థిరపర్చుకున్నారు. ◆



# 33. మౌల్వీ అబ్దుల్ రసూల్

## (1872-1917)

**జా**తీయోద్యమానికి బలమైన పునాదిగా మారిన బెంగాలు విభజన వ్యతిరేక పోరాటంలో భాగస్వామ్యం వహించి తమ జీవితాలను చిరస్మరణీయం చేసుకున్న జాతీయోద్యమకారులలో మౌల్వీ అబ్దుల్ రసూల్ అగ్రగణ్యులు.

1872లో మౌల్వీ రసూల్ సంపన్న కుటుంబంలో జన్మించారు. తండ్రి మౌల్వీ గులాం బెంగాలులో జమీందారు. 1889లో ఇంగ్లాండ్ వెళ్ళి 1898లో న్యాయశాస్త్రంలో BCL డిగ్రీ పుచ్చుకుని ఇండియా వచ్చిన రసూల్ ఆ డిగ్రీ తీసుకున్న ప్రథమ బెంగాలీగా చరిత్ర సృష్టించారు. న్యాయవాద వృత్తిని చేపట్టి అతి కొద్దికాలంలో ప్రతిభావంతుడైన న్యాయవాదిగా గణుతికెక్కారు.

1905లో లార్డ్ కర్జన్ బెంగాలును విభజించాడు. ఆ చర్యను వ్యతిరేకిస్తూ చరిత్ర ప్రసిద్ధి చెందిన బెంగాలు విభజన వ్యతిరేక ఉద్యమం ఉనికిలోకి వచ్చింది. ప్రజల ఆగ్రహజ్వాలల్లో నుండి వందేమాతరం నినాదం ఉద్యమ స్ఫూర్తి అయ్యింది. ఆ ఉద్యమం ద్వారా అబ్దుల్ రసూల్‌లోని జాతీయ భావాలు పురివిప్పాయి. బెంగాల్‌ను చీల్చి ప్రజల ఐక్యతకు గండికొట్టి, హిందూ-ముస్లిల మధ్యన చిచ్చుపెట్టాలన్న ఆంగ్లేయుల కుట్రకు వ్యతిరేకంగా ఉద్యమించి మౌల్వీ రసూల్ స్వాతంత్ర్య పోరాట యోధునిగా నూతన జీవితం





ఆరంభించారు. బెంగాల్ విభజన కుట్రకు వ్యతిరేకంగా 1905 ఆగస్టు 7న కలకత్తా టౌన్‌హాలులో అన్ని సాంఘిక జనసముదాయాల ప్రముఖుల సమావేశంలో ఆయన ప్రముఖ పాత్ర వహించటం మాత్రమే కాకుండా తొలిసారిగా గళం విప్పారు.

ఆ తరువాత అబ్దుల్ రసూల్ న్యాయవాద వృత్తిని త్యజించి, బెంగాల్ విభజన వ్యతిరేకోద్యమానికి పూర్తిగా అంకితమయ్యారు. బెంగాల్ అంతటా కలయ తిరుగుతూ సభలు సమావేశాలు నిర్వహించారు. బెంగాల్ విభజనను వ్యతిరేకించాల్సిన అవసరాన్ని వివరిస్తూ, హిందూ-ముస్లింల స్నేహ సంబధాల ఆవశ్యకతను ఉద్బోధిస్తూ అయన సాగిస్తున్న విస్తృత ప్రచారం ప్రభుత్వానికి కంటక ప్రాయమైంది. మౌల్వీ రసూల్‌ను నిరోధించేందుకు ఆయనను మానసికంగా, భౌతికంగా బ్రిటీష్ ప్రభుత్వం ఇబ్బందులు పాల్జేసినా ఏమాత్రం వెనుకడుగు వేయకుండా ఆయన ముందుకు సాగారు. ఆయనకున్న ప్రత్యేక విదేశీ అలవాట్లనే కాకుండా, విదేశీ వస్తువులకు కూడా ఆయన దూరమయ్యారు. స్వదేశీ వస్తువులను స్వీకరించటమే కాకుండా ఆ వస్తువుల వాడకాన్ని ప్రోత్సాహించడానికి ఆచరణాత్మక వ్యూహం రూపొందించి ప్రజలలో ప్రచారం గావించారు. బెంగాల్‌ను చీల్చినట్టు హిందూ-ముస్లింలను కూడా విభజించడానికి వలస ప్రభుత్వం పన్నుతున్న కుట్రలను తూర్పారబట్టారు. ఆయన సమరశీల ప్రసంగాలకు, ప్రచార కార్యక్రమాల ప్రభావాన్ని గుర్తించిన ప్రభుత్వం ఆగ్రహించి ఆయన నిర్వహిస్తున్న పలు పదవులు, ఉన్నతోద్యాగాల నుండి తప్పించడం మాత్రమే కాకుండా పలు శిక్షలకు కూడా గురిచేసింది.

మౌల్వీ రసూల్ జాతీయోద్యమంలో ప్రముఖ పాత్రను నిర్వహిస్తూనే ముస్లింల ప్రగతిని కాంక్షిస్తూ **బెంగాలు మహమ్మదన్ అసోసియేషన్** లాంటి సంఘాలను స్థాపించి, వాటి ద్వారా జాతీయ, సెక్యులర్ భావాల పరివ్యాప్తికి అవిశ్రాంతంగా కృషి చేశారు. 1907 మార్చిలో బెంగాలులో జరిగిన మతకలహాల సందర్భంగా కల్లోల ప్రాంతాలకు స్వయంగా వెళ్ళి హిందూ-ముస్లింలు పరస్పరం సోదరులుగా భావించి **రాఖీలు** కట్టుకోవాలని కోరుతూ **రాఖీ బంధన్** కార్యక్రమానికి ఆయన ప్రత్యేకంగా పిలుపునిచ్చారు.

1916లో అనిబిసెంట్ ఆరంభించిన హోంరూల్ ఉద్యమంలో మౌల్వీ చాలా చురుగ్గా పాల్గొంటూ ఉద్యమంలో మార్గదర్శక పాత్రను పోషించారు. ఈ ఉద్యమాన్ని ఆయన ఎంతగా ప్రేమించారంటే ఉద్యమ గుర్తుగల చేతిగడియారాన్ని తన భౌతికకాయంతోపాటు సమాధి చేయాలని కోరారు. ఈ మేరకు కోర్కెను వెల్లడించిన అతి కొద్ది రోజులకు అనగా 1917 సెప్టెంబరులో మౌల్వీ అబ్దుల్ రసూల్ ఆకస్మింగా కన్నుమూశారు. ◆



# 34. నవాబ్ సయ్యద్ ముహమ్మద్

## (1867 - 1919)

బ్రిటీష్ వ్యతిరేక పోరాట వీరుల జాబితాలో ప్రముఖ స్థానం ఆక్రమించిన మైసూరు పులి టిపూ సుల్తాన్ వారసత్వాన్ని కొనసాగిస్తూ ఆయన ఆశయాలను అనుగుణంగా వ్యవహరించిన జాతీయ ఉద్యమకారులలో నవాబ్ సయ్యద్ ముహమ్మద్ ఎన్నదగినవారు.

1867లో జన్మించిన సయ్యద్ ముహమ్మద్, టిపూ సుల్తాన్ నాల్గవ కుమారుడైన సుల్తాన్ యాసిన్ కుమార్తె రుఖ్ బేగంకు తల్లి పక్షాన మనుమడు. 1867లో జన్మించిన ఆయన విద్యాభ్యాసం మద్రాసు నగరంలో జరిగింది. ఆ తరువాత తండ్రి మీర్ హుమాయున్ మార్గదర్శకత్వంలో వాణిజ్యరంగ ప్రవేశం చేసి అత్యధికంగా గడించారు.

ఒకవైపు వ్యాపార బాధ్యతలు నిర్వహిస్తునే రాజకీయ-ప్రజాసేవా రంగాల వైపు సయ్యద్ ముహమ్మద్ దృష్టి సారించారు. 1894లో మద్రాసులో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ సభలో సభ్యత్వం స్వీకరించిన ఆయన 1896 సంవత్సరంలో మద్రాసు నగరానికి తొలి ముస్లిం షరీఫ్‌గా ఎంపికై చరిత్ర సృష్టించారు. 1897లో బ్రిటీష్ ప్రభుత్వం ఆయనను నవాబు బిరుదుతో సత్కరించింది. 1900 సంవత్సరంలో ఆయన మద్రాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు ఎంపికయ్యారు. 1901లో భారత జాతీయ కాంగ్రెస్ కమిటీ సభ్యులయ్యారు.

ప్రజల ఆర్థిక-రాజకీయ- సాంఘిక చైతన్యం కోసం కృషి ఆరంభించిన ఆయన





మద్రాసు మహజన సభ అధ్యక్షునిగా బాధ్యతలను నిర్వహించి ప్రజల మన్నన పొందారు. ఆనాటి సంపన్న కుటుంబీకుల అతి విలాసవంతమైన జీవితాలకు భిన్నంగా, పేద ముస్లింల స్థితిగతులను మెరుగుపర్చడానికి ఆయన పలు నూతన సంస్థలను స్థాపించి ప్రజలతో కలిసి పనిచేశారు. ప్రజల ఆర్థికాభివృద్ధికి సాంకేతిక విద్యకు, పారిశ్రామిక అభివృదికి ప్రభుత్వం తోడ్పడాలని, రైతాంగ మీద పన్నుల భారం అధికంగా ఉందని, అందువల్ల పన్నుల భారాన్ని గణనీయంగా తగ్గించాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు.

1903 మద్రాస్ లో జరిగిన జాతీయ కాంగ్రెస్ సమావేశాలకు ఆహ్వాన సంఘ అధ్యక్షునిగా సమర్థవంతంగా సమావేశాలను నిర్వహించి నేతల ప్రశంసలందుకున్నారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ, జాతీయ కాంగ్రెస్‌లో ముస్లింలు బహుళ సంఖ్యలో చేరాలని పిలుపునిచ్చారు. ప్రజల ఉమ్మడి రాజకీయ ప్రయోజనాల కోసం మతాలను విస్మరించి అంతా కలసి ఐక్యంగా ముందుకు సాగాలని కోరారు. 1905లో ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులుగా బాధ్యతలు చేపట్టారు. ఆయన ఏ పదవిలో ఉన్నా ప్రజల సంక్షేమమే ప్రధానంగా వ్యవహరించారు. మతాతీత రాజకీయ భావాలు కలిగిన సయ్యద్ ముహమ్మద్ 1906లో లార్డ్ మింటోను కలసి ముస్లింలకు ప్రత్యేక నియోజక వర్గాలు కావాలని కోరడానికి వెళ్ళిన ముస్లింల ప్రతినిధి బృందంలో చేరడానికి ఇష్టపడలేదు.

జాతీయ కాంగ్రెస్ సమావేశాలకు తనదైన రీతిలో ఆర్థిక-హార్థిక సహాయ సహకారాలు అందించిన ఆయన 1913లో కరాచిలో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ సమావేశాలలో కాంగ్రెస్ జాతీయ అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. ఈ సందర్భంగా జాతీయ కాంగ్రెస్ కార్యక్రమాల నిర్వహణ కోసం భూరి విరాళం ఇవ్వడమే కాకుండా తన సంపదను ఎంతో వ్యయం చేశారు. ఆనాడు పలువురు ముస్లిం ప్రముఖులు జాతీయ కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా చేస్తున్న ప్రచారాలను సమర్థవంతంగా తిప్పికొట్టారు. ఈ సందర్భంగా హిందూ-ముస్లింలు సోదరుల్లా మెలగాలని, మతాలు వేరైనప్పటికి తమ పుట్టి పెరిగిన గడ్డ ఒక్కటే కనుక మత విభేదాలు వద్దన్నారు. ఐక్యత మాత్రమే ఉమ్మడి లక్ష్యాలను సాధించగలదని స్పష్టంచేశారు. ఉమ్మడి ప్రయోజనాల సాధనకు తోడ్పడిన ప్రజలకు మాత్రమే ఆ ప్రయోజనాలలో వాటా కోరగల హక్కు ఉంటుందని సయ్యద్ ముహమ్మద్ ప్రకటించారు.

ఈ విధంగా అన్ని రంగాలలో సమర్థవంతంగా కార్యకలాపాలను నిర్వహించి, జాతీయోద్యమంలో ప్రముఖ పాత్రను పోషించి వదాన్యులుగా ఖ్యాతిగాంచిన నవాబ్ సయ్యద్ మహమ్ముద్ 1919 ఫిబ్రవరి 12న మద్రాసులో చివరిశ్వాస విడిచారు. ◆

# 35. ఉమర్ బీబి

## (1864-1919)

**మా**తృభూమిని పరాయి శక్తుల నుండి విముక్తి చేసేందుకు అహింసాయుత పోరాటాలలో పాల్గొని బ్రిటీష్ పోలీసుల హింసకు ప్రాణాలను అర్పించిన అమరజీవుల జాబితాలో ఉమర్ బీబి అరుదైన స్థానం సంపాదించుకున్నారు.

ఉమర్ బీబి పౌరుషానికి పోతుగడ్డ, ధైర్యసాహసాలకు పుట్టినిల్లుగా ఖ్యాతిగాంచిన పంజాబ్ రాష్ట్రంలోని అమృతసర్ జిల్లా, దుల్లా (DULLA) లో 1864లో జన్మించారు. ఆమెకు ఇమానుద్దీన్‌తో వివాహం జరిగింది.

ఉమర్ బీబి మాతృభూమి పట్ల అపార గౌరవాభిమానాలు గల మహిళ. ఆమె జాతీయోద్యమ విశేషాలను తెలుసుకుంటూ, స్వదేశీయుల మీద విరుచుకుపడుతున్న బ్రిటీష్ పోలీసుల దాష్టీకాలను జ్వలిత నేత్రాలతో గమనిస్తూ ఆవేదన చెందారు. బానిస బంధనాల నుండి విముక్తమయ్యేందుకు భారతీయులు సాగిస్తున్న పోరాటాలను అణిచి వేసేందుకు బ్రిటీష్ పాలకులు అనుసరిస్తున్న క్రూరవిధానాల మూలంగా దేశంలో అల్లకల్లోల పరిస్థితి నెలకొనియున్న తరుణంలో ఆమె జీవిత సహచరుడు కన్నుమూశారు. భర్తను కోల్పోయిన ఆమె సంసారం ఒడిదుడుకులకు గురయ్యింది.

ఆర్థిక కష్టనష్టాల కడలిలో పయనం సాగిస్తున్నా కూడా ఉమర్ బీబి జాతీయోద్యమ





కార్యక్రమాల పట్ల తనకున్న ప్రత్యేక ఆసక్తిని కోల్పోలేదు. ఆనాడు పంజాబ్ రాష్ట్రంలో జరుగుతున్న పరిణామాలను తెలుసుకుంటూ ఉద్యమకారుల ఉత్సాహానికి ఆనందిస్తూ, ఉద్యమకారులను తన బిడ్డలుగా భావిస్తూ ప్రోత్సహిస్తూ ఆశీర్వదించారు.

ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజల నుండి వ్యక్తమౌతున్న ఆందోళనల అణిచివేతకు ఆంగ్ల ప్రభుత్వం 1919 మార్చిలో భయంకర **రౌలత్** చట్టాన్ని తెచ్చింది. ఈ చట్టం ద్వారా అధికారులకు విశేషాధికారాలు కల్పించింది. ఆ కారణంగా రౌలత్ చట్టం గురించి **నో అప్పీల్-నో వకీల్-నో దలాల్** (No appeal; no vakeel; no dalaal ) అని గాంధీజి వ్యాఖ్యానిస్తూ సత్యాగ్రహోద్యమానికి పిలుపునిచ్చారు. ఈ నేపథ్యంలో పంజాబ్‌లో జనరల్ డయ్యర్ నేతృత్వంలో సాగుతున్న పోలీసు రాజ్యాన్ని డాక్టర్ సైపుద్దీన్ కిచ్లూ, డాక్టర్ సత్యపాల్ తీవ్రంగా విమర్శించారు. ఆ విమర్శలకు ఆగ్రహించిన ప్రభుత్వం ఆ నేతలను 1919 ఏప్రిల్ 10న అరెస్టుచేసి ప్రవాసానికి పంపింది. అందుకు నిరసనగా ఏప్రిల్ 13న అమృతసర్‌లోని జలియన్‌వాలా బాగ్‌లో నిరసన సభను నిర్వహించాలని నిర్ణయించారు. ఆ సభా కార్యక్రమాలు నిషేధిస్తూ డయ్యర్ ఉత్తర్వులు జారీ చేశాడు. ఆ సభలో పాల్గొనేందుకు ఉమర్ బీబి కూడా అమృతసర్‌కు చేరుకున్నారు.

జనరల్ డయ్యర్ చర్యలకు ఏమాత్రం భయపడకుండా ప్రజలు భారీ సంఖ్యలో సభాస్థలికి విచ్చేశారు. ప్రజా స్పందనకు మండిపడ్డ డయ్యర్ జలియన్ వాలా బాగ్‌లో జరుగుతున్న సభను విఘ్నం చేయడానికి, ఎటువంటి ముందస్తు హెచ్చరికలు లేకుండా నేరుగా సభికుల మీద కాల్పులు జరిపించాడు. ఈ దమనకాండలో వందలాది ఉద్యమకారులు, ప్రజలు ప్రాణాలు విడిచారు. అంగవైకల్యం పొందారు.

ఆంగ్ల ప్రభుత్వ లెక్కల ప్రకారంగా ఆ కిరాతకత్వానికి 378 మంది ఉద్యమకారులు ప్రాణాలు కోల్పోయారు. ఆ విధంగా ప్రాణాలర్పించిన వారిలో 55 మంది ముస్లిం యోధులు ఉన్నారు. ఆ 55 మంది ముస్లిం యోధులలో ఒకే ఒక మహిళగా 55 సంవత్సరాల ఉమర్ బీబి ప్రత్యేక స్థానం పొందారు.

ఈ మేరకు తన రుధిర ధారలతో జలియన్‌వాలా బాగ్ మట్టిని పునీతం చేయడం మాత్రమే కాకుండా తమ వీరోచిత పోరాటాలతో, ప్రాణ త్యాగాలతో పంజాబీలు నిర్మించిన అద్భుత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ఉమర్ బీబి ప్రత్యేక స్థానం పొందారు. ◆

(Source : Contribution of Muslims to the Indian Freedom Movement, Khaliq Ahamed Nizami, Idarah-i-adabiyat-i- Delli,1999, Page. 36, Ect.,)

# 36. షేక్ ముహమ్మద్ గులాబ్

**(-)**

**భా**రత స్వాతంత్ర్యోద్యమంలో చంపారన్ రైతాంగ పోరాటం చిరస్మరణీయమైంది. బ్రిటీష్ ఇండిగో ప్లాంటర్ల పెత్తనం, కిరాతక చర్యలకు వ్యతిరేకంగా చంపారన్ రైతులు ఉద్యమించి విజయం సాధించారు. ఈ రైతాంగ పోరాటం ఫలితంగా ఇండిగో ప్లాంటర్ల దుశ్చర్యలకు భరతవాక్యం పలికిన ప్రత్యేక చట్టం అమలులోకి వచ్చింది. అంతటి మహోద్యమానికి నాందీవాచకం పలికిన రైతుల నేత షేక్ ముహమ్మద్ గులాబ్.

బీహార్ రాష్ట్రంలోని చంపారన్ ప్రాంతాన్ని బ్రిటీషర్లు ఇండిగో ఉత్పత్తికి అనుకూలమైన ప్రదేశంగా ఎంచుకుని స్థిర నివాసాలను, కర్మాగారాలు నిర్మించుకున్నారు. అవసరమైన ముడిసరుకు కోసం ఆ ప్రాంతపు భూములను ఉపయోగించదలిచారు. అందువల్ల తాము కోరిన పంటను మాత్రమే పండించమంటూ రైతుల వత్తిడి చేయసాగారు. అందుకు అంగీకరించని రైతులు ప్లాంటర్ల నుండి, ప్లాంటర్లకు అనుకూలంగా ఉన్న బ్రిటీష్ ప్రభుత్వం నుండి ఇక్కట్లను ఎదుర్కోవాల్సి వచ్చింది. రైతులను పశువుల కంటే హీనంగా భావించిన ప్లాంటర్లు, పోలీసు బలగాల సహకారంతో విరుచుకుపడ్డారు. రైతుల స్వేచ్చను హరించి వేశారు. ఆ కారణంగా చంపారన్ ప్రాంతపు గ్రామాలలోని రైతులు అనుక్షణం భయంతో ప్రాణాలను అరచేత పెట్టుకుని బ్రతుకుతున్నారు.





ఆ సమయంలో నిస్సహాయులైన రైతాంగాన్ని ఆదుకోటానికి 'నేనున్నా...నేనున్నా ...ఏడవకండి...ఏడవకండి' అంటూ విప్లవ తరంగమై షేక్ ముహమ్మద్ గులాబ్ తరలి వచ్చారు. ఆయన బీహార్ రాష్ట్రం లోహియా ఠాణాకు చెందిన చాంద్‌పూర్ గ్రామ నివాసి. సాధారణ రైతు కుటుంబం నుండి వచ్చిన షేక్ గులాబ్ బ్రిటీష్ ప్లాంటర్ల దాష్టీకాలకు బలవుతున్న రైతు కుటుంబాలకు అండగా నిలిచారు. రైతుల కడగండ్లను చూసి సహించలేక పోయారు. రైతు బిడ్డడైన ఆయన రైతాంగపు సహజసిద్దమైన హక్కులను హరించదలచిన ప్లాంటర్ల మీద విప్లవ శంఖారావం పూరించాడు. ఈ మేరకు గులాబ్ సాగించిన ప్రయత్నాల ఫలితంగా ఆత్మగౌరవం కాపాడుకునేందుకు రైతులు ప్లాంటర్లకు వ్యతిరేకంగా పోరుబాటను ఎన్నుకున్నారు. షేక్ గులాబ్ మార్గదర్శకత్వంలో రైతు సంఘాలు ఉద్యమించాయి. రైతుల ప్రదర్శనలు, ఊరేగింపులు ప్రారంభమయ్యాయి.

చివరకు ప్రత్యక్ష కార్యాచరణ ద్వారా రైతులు ప్రతిఘటనకు కూడా పూనుకున్నారు. ఆ క్రమంలో 1907లో బ్రిటీష్ ప్రభుత్వ బంటు అయిన కాళీచరణ్ ఇండిగో ప్లాంటును, గులాబ్ నేతృత్వంలో రైతులు చుట్టుముట్టారు. ఆ చర్యతో గులాబ్ అరెస్టుకు వారెంటు జారీ అయ్యింది. రైతుల అండగల గులాబ్‌ను అరెస్టు చేయడం సాధ్యం కాలేదు. చివరకు బితియా సబ్‌డివిజన్ అధికారి ఇ.ఎస్. టేనర్ అతి కష్టం మీద రైతాంగ ఉద్యమ నేత గులాబ్‌ను అరెస్టు చేశారు. న్యాయస్థానంలో కేసు విచారణకు వచ్చింది.

ఈ అవకాశాన్ని వినియోగించుకుని ప్లాంటర్ల దుర్మార్గాలను, రైతుల కడగండ్లను గులాబ్ న్యాయస్థానంలో వివరించారు. ఆ విషయాలను మౌల్వీ మహమ్మద్ యూనుస్ అను ఉపాధ్యాయుడు వ్యాసాలుగా రాసి భారతీయ వార్తాపత్రికలకు అందచేశారు. మౌల్వీ యూనుస్ వ్యాసాల వలన షేక్ గులాబ్ నాయకత్వంలో సాగుతున్న రైతాంగ పోరాటం వివరాలు దేశమంతా తెలిసాయి. ఆయన వ్యాసాల మూలంగా భారత జాతీయ కాంగ్రెస్ కూడా చంపారన్ రైతాంగ పోరాటం మీద దృష్టి సారించింది. చివరకు 1916 గాంధీజీ చంపారన్ రైతుల బాధలను విచారించడానికి కదలి రావాల్సి వచ్చింది.

ఆ తరువాత షేక్ గులాబ్ ఏమైపోయారో తెలియదు. మోతీహారిలో గాంధీజీనే అంతం చేయాలని పథకం రూపొందించిన ప్లాంటర్లు షేక్ ముహమ్మద్ గులాబ్‌ను అదృశ్యం చేసి ఉంటారని ఊహాగానాలు సాగాయి. ఆకస్మికంగా గులాబ్ అంతర్ధానమైనా, రైతాంగ పోరాటం సాధించిన విజయాలతో రైతుల హృదయాలలో ఆయన శాశ్వత స్థానం పొందటం మాత్రమే కాక స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో చంపారన్ రైతు ఉద్యమం, ఆ ఉద్యమనేత షేక్ ముహమ్మద్ గులాబ్ సాహసం, త్యాగం ప్రత్యేక స్థానాన్ని పొందగలిగాయి. ◆

# 37. మౌలానా ముహమ్మద్ హసన్

## (1851-1920)

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో **ఉలేమాలు** ఎంతటి అద్వితీయమైన పాత్ర పోషించారో ఆ తరువాత కూడా జాతీయోద్యమంలో అంతటి మహత్తర భాగస్వామ్యాన్ని అందించిన ఉలేమాలలో SHAIK-UL-HIND గా ఖ్యాతిగాంచిన మౌలానా ముహమ్మద్ హసన్ గణనీయులు.

ముహమ్మద్ హసన్ 1851లో ఉత్తరప్రదేశ్‌లోని సహరన్‌పూర్ జిల్లా బరేల్లి (Bareilly) లో జన్మించారు. తండ్రి మౌలానా జుల్ఫికర్ అలీ. స్వగ్రామంలో ప్రాథమిక విద్య పూర్తిచేసిన మహమ్మద్ హసన్ దేవ్‌బంద్‌లోని **దార్-ఉల్-ఉలూం** ప్రథమ విద్యార్థిగా చేరి తన అసాధారణ ప్రతిభ ద్వారా 1871లో ఆ విద్యాలయంలోనే ఆచార్యులయ్యారు. ఆ తరువాత 1888లో ప్రధానాచార్యునిగా పదోన్నతి లభించగా తన 75 రూపాయల జీతంలో 25 రూపాయలను విద్యా సంస్థ అభివృద్ధి నిధికి అందచేశారు.

బ్రిటీషర్ల బానిసత్వం నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న అంతర్గత లక్ష్యంతో ఏర్పడిన దార్-ఉల్-ఉలూం మహమ్మద్ హసన్ నేతృత్వంలో సమర్థులైన విముక్తి పోరాట సైనికులను తయారుచేసే కృషిని ఆరంభించి, పలు ఇతర సంఘాలను, సంస్థలను వివిధ ప్రాంతాలలో ఏర్పాటు చేసింది.





1911 నుంచి అంతర్జాతీయ రాజకీయాలలో వచ్చిన మార్పుల నేపథ్యంలో తమ పథకాలను అమలు పర్చేందుకు మౌలానా హసన్ ఉద్యుక్తులయ్యారు. భారతదేశ వాయవ్య సరిహద్దు ప్రాంతాలలోని గిరిజన ముస్లింల ద్వారా దాడిని ఆరంభించి, స్వదేశంలోని ప్రజలు, భారతీయ సైనికులను తిరుగుబాటుకు పురికొల్పాలని నిర్ణయించారు. ఈ కార్యకలాపాలకు దేవ్‌బంద్‌ను కేంద్రస్థానం చేసుకుని, డిల్లీ, దినాపూర్, అమ్రోట్, కరంచీ, ఛేదా, చక్వాల్, కాబూల్‌లలో శాఖలను ఏర్పాటు చేశారు. ఆ లక్ష్య సాధనకు బ్రిటీష్ వ్యతిరేక శక్తుల నుండి సహాయం పొందేందుకు ప్రయత్నాలు ఆరంభించారు.

ఆ ప్రయత్నాలలో భాగంగా 1915లో తన శిష్యులు మౌలానా ఒబైదుల్లా సింధీ నాయకుడిగా ఒక ప్రతినిధి బృందాన్ని ఆఫ్గనిస్థాన్ పంపి ఆ తరువాత 1916లో తానూ మక్కాకు పయనమయ్యారు. మక్కా చేరుకున్న ఆయన టర్కీ గవర్నర్ గాలిబ్‌పాషాను కలసి తన పథకాన్ని వివరించి సానుకూలత సాధించారు. బ్రిటీష్ సైన్యంలోని, భారతీయులను తిరుగుబాటుకు ప్రోత్సహిస్తూ గాలిబ్ రాసిన లేఖలు **గాలిబ్ నామా** గా చరిత్ర ప్రసిద్ధి పొందాయి. ఈ సందర్భంగా తిరుగుబాటును ప్రోత్సహిస్తూ సిల్క్ వస్త్రం మీద ఇండియాకు పంపిన వర్తమానం కాస్తా **సిల్క్ గుడ్డ కుట్ర**గా ఖ్యాతిగాంచింది.

మౌలానా ఆంతర్యాన్ని పసిగట్టిన ఆంగ్లేయులు ఆయనను నిర్బంధించి సుమారు నాలుగేండ్ల తరువాత 1920లో విడుదల చేశారు. మౌలానా హసన్ స్వదేశానికి రాగానే ఖిలాఫత్-సహాయ నిరాకరణోద్యమంలో ప్రవేశించి క్రియాశీలక పాత్ర పోషించారు. ఆ క్రమంలో1920 అక్టోబర్ 29న అలీఘర్‌లో జాతీయ విశ్వవిద్యాలయం **(జామియా మిలియా ఇస్లామియా)** శంఖుస్థాపన గావించారు. 1920 నవంబర్‌లో డిల్లీలో జరిగిన Jamiath-ul-Ulema సమావేశంలో ఉలేమాల నుద్దేశించి ప్రసంగిస్తూ, సామ్రాజ్యవాద శక్తులకు వ్యతిరేకంగా మహోదృతంగా ఉద్యమించమని పిలుపునిచ్చారు.

భారతదేశంలోని ముస్లింలందరూ జాతీయోద్యమంలో పాల్గొనాలని, సహాయ నిరాకరణ ఉద్యమంలో చురుకైన పాత్రను నిర్వహించాలని, మతాల ప్రసక్తి లేకుండా భారతదేశంలో నివశిస్తున్న వారంతా ఒక్కటేనన్న భావనతో కలసికట్టుగా బ్రిటీష్ పాలకులను తరిమివేసేందుకు సాగుతున్న జాతీయోద్యమంలో పాల్గొనాల్సిందిగా కోరుతూ ఉలేమాల ద్వారా మౌలానా ఫత్వా జారీ చేయించారు. ఆ క్రమంలో అనారోగ్యాన్ని కూడా లెక్కచేయక ఉద్యమ కార్యకలాపాలలో అవిశ్రాంతంగా పాల్గొనటం వలన ఆరోగ్యం మరింత క్షీణించి 1920 నవంబరు 30న మౌలానా ముహమ్మద్ హసన్ కన్నుమూశారు. ◆

# 38. ఫజులుల్లా ఖాన్

## (- ౧౯౨౨)

**భా**రత స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న పలువురు యోధుల చరిత్రలు ప్రజాదరణ పొందిన చరిత్ర గ్రంథాలలో చోటు చేసుకోకపోవటం వలన ఆ యోధుల త్యాగాలు, సాహసోపేత చరిత్రలు ప్రజాబాహుళ్యానికి అందకుండా పోయాయి. అలాంటి అలనాటి అజ్ఞాతయోధులలో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ఫజులుల్లా ఖాన్ ఒకరు.

భారతదేశంలో సహాయ నిరాకరణ, ఖిలాఫత్, శాసనోల్లంఘన ఉద్యమాల తరువాత ఆంధ్రప్రదేశ్‌లో అల్లూరి సీతారామరాజు నాయకత్వంలో **మన్య విప్లవం** జరిగింది. ఆ సమయంలో మన్యంలో అల్లూరి తండ్రి వెంకట్రామరాజుకు సహాధ్యాయి, మిత్రుడు ఫజులుల్లా ఖాన్ బ్రిటీష్ ప్రభుత్వంలో డిప్యూటీ కలక్టరుగా పని చేస్తున్నారు. ఆయనకు తన మిత్రుని కుమారుడైన అల్లూరిని ఇబ్బందుల పాల్జేయటం ఇష్టంలేకపోయింది. అందువలన రాజుకు అనుకూలంగా వ్యవహరించారు. ఈ విషయాన్ని పొన్నలూరి రాధాకృష్ణమూర్తి 1935లో రాసిన **మన్యంలో విప్లవం-అల్లూరి సీతారామరాజు** గ్రంథం ద్వారా వెల్లడైంది. బ్రిటీష్ ప్రభుత్వం చేత నిషేధానికి గురైన ఆ గ్రంథంలో **'తన స్నేహితుని కుమారుని** (రాజు) **ప్రమాదములలో బడద్రోయుటకు మనసొప్పలేదు. తనకు** (ఫజులుల్లా ఖాన్) **గల అధికారము మూలమున రక్షణ చేయదలచెను'** అని పొన్నలూరి పేర్కొన్నారు.





రాజును ఫజులుల్లా ఖాన్ తన నివాసానికి పిలిపించుకుని విప్లవోద్యమం గురించి చర్చిస్తూ ఆ వేదాంత చర్చల చాటున అడవిబిడ్డల మీద అధికారుల జులుం, ఆ సమస్యల పరిష్కార మార్గాలు, ఆ మార్గాల ద్వారా సత్ఫలితాలు రాబట్టేందుకు రూపొందించాల్సిన పథకాల గురించి ఆలోచనలు చేశారు. ఆ చర్చల పర్యవసానంగా ఏర్పడిన పునాదుల మీద మన్యం విప్లవోద్యమం సాగింది. ఆ ఆలోచనలను ఆచరణలో పెడుతూ అల్లూరికి అడ్డతీగల సమీపంలో 60 ఎకరాల భూమిని ఫజులుల్లా ఖాన్ మంజూరు చేయించటమే కాకుండా, ప్రత్యేక ఉత్తర్వుల ద్వారా పోలీసుల నుండి ఆటంకాలు లేకుండా మన్యంలో స్వేచ్ఛగా సంచరిస్తూ తన కార్యకలాపాలను సాగించే అవకాశాన్ని రాజుకు కల్పించారు.

ఈ విధంగా బ్రిటీష్ ఉన్నతాధికారులైన ఆంగ్లేయులకు ఎటువంటి అనుమానం కలుగకుండా రామరాజుకు ఫజులుల్లా అండగా నిలిచారు. ఈ విషయమై పొన్నలూరి రాస్తూ **'కృష్ణదేవి పేటలో అలజడి యారంభమైనపుడే రాజును స్థానభ్రష్టుని జేయక, అతనికి భూములిప్పించి, మన్యములోనే నిల్పిన ఖాన్‌గారి చర్యలు ఈ పితూరికి పూర్తి సహాయమైనటుల తెల్ల ఉద్యోగులు తమ విశ్వాసమును ప్రకటించిరి'** అన్నారు.

మన్యం విప్లవానికి రామరాజు నాయకుడైతే, ఆ నాయకుని రథసారధిగా ఫజులుల్లా ఖాన్‌ను పొన్నలూరి అభివర్ణించారు. అత్యంత ప్రాధాన్యతగల ఈ అంశాన్ని ఆయన మరితంగా వివరిస్తూ **'రామరాజు ప్రవేశించినంతనే, విపదాంధకారయుతమగు మన్యలోకమున విప్లవ భానుడుదయించి నటులయ్యెను. కాని యా భానుని** (రాజు) **తీవ్ర గమనమునకు రథ సారథ్యమును వహించవలసిన శ్రీయుత ఫజులుల్లా ఖాను గారు మృత్యుశయ్యపై నున్నారు. ఫజులుల్లా గారు గొప్ప వ్యాధిగ్రస్తులైపోయిరి. పిదప అనతి కాలంలో ఖాను గారు స్వర్గస్తులైరి'** అని ఆనాటి పరిస్థితిని వివరించారు.

ఈ వాఖ్యానాలు, అందిన సమాచారం బట్టి అల్లూరి విప్లవోద్యమం ఆవిర్భావంలో డిప్యూటీ కలక్టరు ఫజులుల్లాఖాన్ ఎంతటి గొప్ప పాత్ర నిర్వహించారో తెలుస్తుంది. ఆ కారణంగా **'ఖాన్ గారు మరికొంతకాలం జీవించియున్నచో, ఆయన కంఠానికి ఉరిబెట్టి ప్రభుత్వము తన ఆగ్రహమును లోకమునకు ప్రకటించేది'** అని పొన్నలూరి అభిప్రాయ పడ్డారు. అల్లూరి సాగించిన పోరాటానికి పరోక్షంగా చేయూతనిచ్చిన ఫజులుల్లా ఖాన్‌కు చరిత్ర సరైన న్యాయం చేయలేదు. ఆయన సాహసాన్ని పొన్నలూరి బయటపెట్టేంత వరకు ఫజులుల్లా పాత్ర ఎవ్వరికీ తెలియదనటం విచారకరం. ఈ విధంగా ఫజులుల్లా ఖాన్ చివరి వరకు అల్లూరి సీతారామరాజుకు అన్ని విధాల సహాయపడుతూ 1922 జూలై 27న అంతిమ శ్వాస విడిచారు. ◆

# 32. మౌల్వీ అలీ ముసలియార్

## (1853- 1922)

బ్రిటీషర్లకు వ్యతిరేకంగా 120 సంవత్సరాలు పోరుబాటన సాగి, 1922 ప్రాంతంలో ఖిలాఫత్- సహాయనిరాకరణ ఉద్యమంలో విలీనమైపోయిన మలబారు మోప్లా యోధుల వారసులు మౌల్వీ అలీ ముస్సలియార్.

కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలోని తూర్పు మంజేరిలో గల పండిక్కడ్ సమీప గ్రామం నెల్లిక్కుట్టులో 1853లో అలీ జన్మించారు. ప్రాథమిక విద్య తరువాత, ధార్మిక విద్యకోసం మక్కా వెళ్ళిన ఆయన ఏడు సంవత్సరాల తర్వాత తిరిగి వచ్చి లక్షదీవులలోని కనారట్టి ద్వీపంలోని ఒక పాఠశాలలో ప్రధానోపాధ్యాయుడిగా బాధ్యతలు చేపట్టారు.

బ్రిటీషర్లకు వ్యతిరేకంగా మలబార్ మోప్లాలు సాగిస్తున్న పోరాటాలలో భాగంగా 1894, 1897లో జరిగిన తిరుగుబాట్లల్లో మౌల్వీ కుటుంబ సభ్యులంతా బ్రిటీష్ సైనికుల ఊచకోతకు గురయ్యారు. గ్రామాలలో ఒకవైపున భూస్వాములు, మరోవైపు పాలకవర్గాల వలన మలబారు పేద రైతాంగం ఎదుర్కొంటున్న ఇక్కట్లను గమనించిన ఆయన కరడు గట్టిన బ్రిటీష్ వ్యతిరేకవాది గాను, జాతీయభావాలను నరనరాన నింపుకున్న పోరాట యోధుని గాను రూపుదాల్చి 1921-1922 మధ్యలో జాతీయోద్యమంలో భాగంగా మలబారులో సాగిన ప్రభుత్వ వ్యతిరేక పోరాటాలకు కేంద్రమయ్యారు.





1916 ప్రాంతంలో మలబార్ ప్రాంతానికి జాతీయోద్యమ పవనాలు ప్రబలంగా తాకాయి. ఆ ప్రభావంతో మౌల్వీ ముస్సలియార్ ఖిలాఫత్-సహాయ నిరాకరణ ఉద్యమాలకు నాయకుడయ్యారు. ఆయన శిష్యులు, అనుచరులు మహాత్ముని మార్గంలో ఉద్యమించారు. మౌల్వీ ప్రత్యేక శిక్షణలో ఖిలాఫత్ కార్యకర్తలు సుశిక్షితులుగా తయారయ్యారు.

ఖిలాఫత్- సహాయనిరాకరణ ఉద్యమం మలబార్ ప్రాంతంలో పటిష్టపడి, గ్రామ గ్రామాలకు చేరడంతో పాలకవర్గాలు కలవరపడసాగాయి. ఖిలాఫత్ ఉద్యమం శీఘ్రగతితో గ్రామాలకు వ్యాపించడాన్ని ప్రభుత్వం సహించలేకపోయింది. ప్రశాంతంగా ఉద్యమిస్తున్న కార్యకర్తలు, నేతలను రెచ్చగొట్టి చట్టవ్యతిరేక చర్యలకు పాల్పడేట్టు చేసి మౌల్వీని, ఆయన సహచరులను నిర్భంధించాలని ప్రణాళిక రూపొందించింది. ఖిలాఫత్ కమిటీ నాయకుల మీద తప్పుడు కేసులు బనాయించి, వారు ఆయుధాలు దాచిపెట్టారంటూ అరెస్టులను, నిర్బంధాన్ని సాగించింది. మౌల్వీని అరెస్టు చేయడానికి ప్రయత్నించింది. ఆ విషయం తెలుసుకున్న ప్రజలు మౌల్వీ అరెస్టును ప్రతిఘటించారు. ఆంగ్లేయాధికారుల ఆజ్ఞల మేరకు పోలీసులు, సైనికులు కాల్పులు జరిపారు. ప్రజలు సాయుధంగా తిరగబడగా పోలీసులు, సైనికులు పరారయ్యారు. ప్రభుత్వాధికారులు, బలగాలు పారిపోవడంతో మౌల్వీ ముస్సలియార్ నేతృత్వంలో స్వతంత్ర పాలన ఆరంభమయ్యింది.

ఆ పరిస్థితులతో మండిపడ్డ పోలీసులు, సైన్యం మౌల్వీని అరెస్టు చేయడానికి తిరిగి వచ్చి మౌల్వీ ఉన్న మసీదు మీద కాల్పులు జరిపాయి. మౌల్వీ అనుచరులు సాయుధంగా ప్రతిఘటించారు. ఈ పోరాటంలో మొత్తం మీద 22 మంది మరణించారు. చివరకు మౌల్వీని సైనిక బలగాలు అరెస్టు చేశాయి. ఆ తరువాత విచారణ తంతు జరిపి మౌల్వీతో ముస్సలియార్‌తోపాటుగా 12 మందికి ఉరిశిక్షలు విధించి, ముగ్గురిని అండమాన్ దీవులకు పంపారు. మరో 33 మందికి జీవిత ఖైదును ఖాయం చేశారు.

మౌల్వీ ముస్సలియార్‌కు మరణ శిక్ష విధించినప్పటికీ, మౌల్వీ ఆయన అనుచరులు ఆయుధాలు చేపట్టడానికి, మోప్లాల రైతాంగ సమస్యలు, ఆంగ్లేయాధికారుల ఆహంకార పూరిత చర్యలు, ఖిలాఫత్ నేతలలో పెల్లుబికిన జాతీయ భావాలు, ఖిలాఫత్ సహాయ నిరాకరణ ఉద్యమాలే ప్రధానంగా కారణమని న్యాయస్థానం తీర్పులో వెల్లడించక తప్పలేదు. చివరకు ఉరిశిక్ష విధించేందుకు మౌల్వీని కోయంబత్తూరు జైలుకు తరలించగా ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షకు చిక్కకుండా 1922 ఫిబ్రవరి 17న కొయంబత్తూరు జైలులో మౌల్వీ అలీ ముస్సలియార్ కన్నుమూశారు. ◆



# 40. ఆబాదిబానో బేగం

## (1852-1924)

**జా**తీయోద్యమంలో పురుషులతోపాటు అద్వితీయమైన భాగస్వామ్యాన్ని అందించిన మహిళలలో ఆబాదిబానో బేగం అగ్రగామి.

ఉత్తరప్రదేశ్ రాష్ట్రం మొరాదాబాద్ జిల్లా అమ్రోహా గ్రామంలో 1852లో ఆబాదిబానో బేగం జన్మించారు. ఆమెకు రాంపూర్ సంస్థానానికి చెందిన అబ్దుల్ అలీ ఖాన్‌తో వివాహం జరిగింది. చిన్న వయస్సులో భర్తను కోల్పోయినా పునర్వివాహం చేసుకోకుండా బిడ్డలైన మౌలానా ముహమ్మద్ అలీ, మౌలానా షౌకత్ అలీల భవిష్యత్తు మీద దృష్టి సారించి, వారిని జాతీయోద్యమ నేతలుగా ఆమె తీర్చిదిద్దారు.

ఆబాదిబానో రాజకీయ జీవితం **హోంరూల్ ఉద్యమం**తో ఆరంభమైంది. ఈ ఉద్యమం మరింతగా విస్తరించేందుకు ఆమె ఆర్థిక, హార్థిక సహాయసహకారాలను అందించడమే కాకుండా నిబద్ధత గల ఉద్యమకారిణిగా పనిచేశారు. బ్రిటీష్ ప్రభుత్వం **ఇండియన్ డిఫెన్స్ రెగ్యులేషన్స్** తెచ్చి జాతీయోద్యమకారులైన అలీ సోదరులను చిందన్‌వాడ గ్రామంలో నిర్బంధించగా ఆమె కూడా వారి వెంట వెళ్లారు. ఈ సందర్భంగా **మాతృదేశం, జాతి జనుల కోసం కష్టనష్టాలను భరించేందుకు భగవంతుడు ఎంపిక** (తన బిడ్డలను) **నిజంగా గర్వించదగిన విషయం** అని ఆమె ఆనందం వ్యక్తంచేశారు. అలీ సోదరులు నిర్బంధంలో





ఉన్నప్పుడు, వారి లొంగుబాటుకు ప్రతిపాదనను తెచ్చిన పోలీసు అధికారితో ఆబాదిబానో బేగం మాట్లాడుతూ **'నా బిడ్డలు కనుక ప్రభుత్వ ప్రతిపాదనలను (లొంగుబాటు ప్రతిపాదనలు) అంగీకరిస్తే, నిస్సందేహంగా స్వయంగా నేను వారి గొంతు పిసికి చంపేస్తాను. ఆ మహత్తర కర్తవ్య నిర్వహణకు భగవంతుడు ఈ వృద్ధురాలి చేతులకు అంతటి శక్తిని తప్పక ఇస్తాడు**' అంటూ వచ్చిన దారిన బయటకు వెళ్ళమని పోలీసు ఉన్నతాధికారికి ఇంటి నుండి బయటకు వెళ్ళే మార్గాన్ని చూపారు.

1917లో మొట్టమొదటిసారిగా ఆబాదిబానో గాంధీజీని కలిశారు. అప్పటి నుండి ఆమెను గాంధీజీ కూడా **అమ్మ** అని పిలవటంతో, జాతీయోద్యమకారులంతా ఆమెను **బీబి అమ్మ** అని సంబోధించసాగారు. 1917లో కలకత్తాలో జరిగిన జాతీయ కాంగ్రెస్ సమావేశాలకు, అఖిల భారత ముస్లిం లీగ్ మహాసభలకు హాజరైన ఆమె ఐక్యత ద్వారా మాత్రమే భారతీయులు వలసపాలకుల నుండి సంపూర్ణ స్వేచ్ఛ పొందగలరని ఉద్ఘాటించారు.'**ఈ దేశంలోని హిందూ- ముస్లిం-శిక్కు-ఈశాయి ప్రజలంతా ఐక్యంగా ఉద్యమించనట్టయితే లక్ష్యం సిద్ధించ జాలదు**' అని హెచ్చరించారు.

1919 నాటి ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమంలో చాలా నిర్మాణాత్మక పాత్రను పోషించిన ఆమె అవిశ్రాంతంగా పర్యటనలు జరిపారు. ఉద్యమ నిర్వహణకు నిధులను సమకూర్చి పెట్టారు. జాతీయోద్యమకారులంతా తన బిడ్డలు కనుక వారి ఎదుట తనకు పర్దా అక్కరలేదని ప్రకటించారు. వృద్ధాప్యం వలన శరీరం సహకరించకున్నా జాతీయోద్యమంలో ప్రజలను భాగస్వాములను చేయడానికి పర్యటనలు జరుపుతూ **'భారతదేశపు కుక్కలు, పిల్లులు కూడా బానిసత్వపు సంకెళ్ళలో బందీలుగా ఉండరాదన్నది నా అభిమతం'** అని తాను మాట్లాడిన సభలలో సాహసంతో ప్రకటించారు. ఆ కారణంగా పోలీసులు ఆమెను **ప్రమాదకర విద్రోహి**గా పరిగణించారు. ఆమె మాత్రం పోలీసు హింస, అరెస్టులు, లాఠీచార్జీలను ఏమాత్రం ఖాతరు చేయకుండా ముందుకు సాగారు.

ఆమె రాజకీయ రంగంలోనే కాకుండా సామాజిక రంగంలో కూడా తనదైన భాగస్వామ్యాన్ని అందిస్తూ అఖిల భారత మహిళల సంఘాలకు మార్గదర్శకం చేశారు. చివరి వరకు ఉద్యమకారుల కుటుంబాలకు చెందిన మహిళలకు అన్ని విధాల సహకరిస్తూ ఆదర్శవంతంగా నిలిచారు. అనారోగ్యం, వృద్ధాప్యం, పోలీసుల ఆగడాలు, ఆటంకాలను లెక్క చేయకుండా జాతీయోద్యమంలో చురుకైన పాత్ర నిర్వహించిన ఆబాదిబానొ బేగం 1924 నవంబరు 13న తన బిడ్డలు, మహాత్మా గాంధీజీ చెంత నుండగా ప్రశాంతంగా కన్నుమూశారు. ◆

# 41. మౌల్వీ అబ్దుల్ బారి

## (1878-1926)

**భా**రతదేశంలోని ముస్లిం ధార్మిక ప్రముఖుల మార్గదర్శకత్వంలో ఏర్పడిన పలు విద్యాకేంద్రాలు ధార్మిక విద్యను బోధించటమే కాకుండా బ్రిటీషర్ల పట్ల తీవ్ర వ్యతిరేకతనూ ప్రబోధించాయి. ఆ క్రమంలో 'మదరసా-ఏ-నిజామియా' ను స్థాపించిన విద్యావేత్త మౌల్వీ ఖయ్యాముద్దీన్ ముహమ్మద్ అబ్దుల్ బారి ఫిరంగి మహల్.

మౌల్వీ అబ్దుల్ బారి లక్నోకు చెందిన ప్రఖ్యాత ఫిరంగి మహల్ ఉలేమాల కుటుంబంలో 1878లో జన్మించారు. తొలుత తండ్రి వద్ద, ఆ తరువాత పలువురు మౌల్వీల శిష్యరికంలో ధార్మిక విద్యను అభ్యసించి, ఆ తరువాత కాన్స్టాంట్‌నోపుల్‌లో ఉన్నత విద్యను పూర్తిచేసిన ఆయన ఉపాధ్యాయ వృత్తిని స్వీకరించారు.

ముస్లింలలో చైతన్యం, వలసపాలకుల పట్ల వ్యతిరేకత ప్రోదిచేయడంకోసం 1908లో 'మదరసా-ఏ- నిజామియా' స్థాపించి, ఆ విద్యాకేంద్రం మహోపాధ్యాయునిగా బాధ్యతలను చేపట్టారు. ఈ సంస్థ ఆ తరువాత కాలంలో బ్రిటీష్ వ్యతిరేక కార్యకలాపాలకు, ఉద్యమకారులకు, విప్లవకారులకు కేంద్రంగా భాసిల్లి స్వాతంత్ర్యసమరంలో తనదైన పాత్రను నిర్వర్తించింది.

1913లో ప్రఖ్యాతి చెందిన 'కాన్పూరు మసీదు' సంఘటన రంగం మీదకు వచ్చింది.





ఈ సంఘటన ఆధారంగా బ్రిటీష్ పాలకులు హిందూ-ముస్లింల మధ్యన మనస్పర్థలను సృష్టించాలని కుయుక్తులు పన్నారు. ఆ చర్యలకు విరుగుడుగా సమస్యను సానుకూలంగా పరిష్కరించడంతో మౌల్వీ అబ్దుల్ బారికి మంచి గుర్తింపు లభించింది.

ఆ సమయంలో బల్కాన్ యుద్ధం ప్రారంభమైంది. ఆ సందర్భంగా అలీ సోదరులతో చర్చించి '**అంజుమన్-ఏ-ఖుద్దం-ఏ-కాబా**' అను సంస్థను ఏర్పాటు చేశారు. ముస్లింల పవిత్ర స్థలాలను కాపాడాలన్నది ఈ సంస్థ బహిర్గత లక్ష్యం కాగా బ్రిటీష్ సామ్రాజ్యవాద శక్తుల పట్ల తీవ్ర వ్యతిరేకతను బలోపేతం చేయడం అంతర్గత లక్ష్యమైంది. ఈ రహస్యం ప్రభుత్వా నిఘా నుండి ఎంతో కాలం దాగలేదు.

మౌల్వీ బారి 1918లో మొట్టమొదటి సారిగా ఢిల్లీలో గాంధీజీని కలుసుకున్నారు. ఖిలాఫత్ సమస్య గురించి, ముస్లిం ప్రజల మనోభావాల గురించి ఆయనతో ప్రస్తావించారు. ఆ చర్చల పర్యవసానంగా మౌల్వీ బారి గాంధీజీతో కలసి ఖిలాఫత్-సహాయ నిరాకరణోద్యమానికి శ్రీకారం చుట్టారు. ఆయన కృషి ఫలితంగా 'అఖిల భారత ఖిలాఫత్ కమిటీ' ఏర్పడింది. ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమాన్ని మరింత ఉధృతం చేసే లక్ష్యంతో 'జమాయతుల్-ఉలేమా-ఏ-హింద్' ఏర్పాటులో ఆయన ప్రధాన పాత్ర పోషించారు. మౌల్వీ అబ్దుల్ బారి మార్గదర్శకత్వంలోని విద్యాకేంద్రం విద్యార్థులు జాతీయోద్యమంలో ప్రముఖ పాత్ర నిర్వహించి కఠిన శిక్షలకు గురయ్యారు.

ఈ సందర్భంగా ఆచరణాత్మక చర్యల ద్వారా హిందూ-ముస్లింల ఐక్యతకు ఆయన అవిశ్రాంతంగా శ్రమించారు. ఆయన తన ప్రత్యేకమైన పద్ధతులతో మానవ సంబంధాలను మరింత పటిష్టపర్చారు. మౌల్వీ బారి కృషిని చూసి మహాత్ముడు కూడా ఆశ్చర్యపోవడమే కాకుండా ప్రజలంతా ఆయనను, ఆయన విధానాలను అనుసరించాలని బోధించారు.

మౌల్వీ బారి మంచి రచయిత, వక్త. ఆయన ఉర్దూలో వందకు పైగా పుస్తకాలు రచించారు.'అల్-నిజామియా' అను ఉర్దూ మాసపత్రికను నడిపారు. ఈ పత్రికను బ్రిటీష్ పాలకుల దాష్టికాలను ప్రజల ముందుకు తెస్తూ, ప్రభుత్వ వ్యతిరేక ప్రచారానికి, హిందూ-ముస్లిం ఐక్యతకు, ఇస్లామిక్ తత్త్వశాస్త్ర విశ్లేషణకు, ఇస్లామిక్ ఆచార సాంప్రదాయాలను, తమ సంస్థ లక్ష్యాలను ప్రజలకు ఎరుకపర్చడానికి సమర్థవంతంగా ఉపయోగించారు.

ఈ విధంగా ధార్మిక, రాజకీయ సామాజిక, సాహిత్య, విద్యారంగాలలో విశిష్టమైన ప్రతిభను కనబర్చి విద్యావేత్తగా, ప్రముఖ జాతీయవాదిగా, స్వాతంత్ర్యసమరయోధుడిగా, అత్యుత్తమ సేవలను అందించిన మౌల్వీ ఖయాముద్దీన్ మహమ్మద్ అబ్దుల్ బారి ఫిరంగి మహల్ 1926 జనవరి 19న చివరిశ్వాస విడిచారు. ◆



# 42. అష్ఫాఖుల్లా ఖాన్

## (1900-1927)

**మా**తృభూమి విముక్తి కోసం ప్రాణాలను తృణప్రాయంగా భావించి బ్రిటిష్ వలస పాలకులపై విప్లవించి అమరులైన యోధాగ్రేసులలో ఒకరు అష్ఫాఖుల్లాఖాన్ .

1900 అక్టోబర్ 22న ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని షాజహాన్‌పూర్‌లోని సంపన్న జమిందారి కుటుంబంలో అష్ఫాఖ్ జన్మించారు. తండ్రి షఫీఖుల్లాఖాన్. తల్లి మజహరున్నీసా బేగం. చిన్ననాటి నుండే స్వతంత్ర భావాలను సంతరించుకున్న ఆయన ప్రజల జీవన పరిస్థితుల మీద దృష్టి సారించటంతో చదువు మీద పెద్దగా శ్రద్ధచూపలేదు. తల్లి నుండి సాహిత్యాభిలాష పెంచుకున్న ఆయన మంచి ఉర్దూ కవిగా రూపొందారు.

అష్ఫాఖుల్లా Abbie Rich Mission High School 8వ తరగతి విద్యార్థిగా బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేక కార్యక్రమాలలో పాల్గొన్నారు. ప్రభుత్వ ప్రజావ్యతిరేక చర్యలను నిరసిస్తూ కవితలు రాస్తూ పరాయి పాలకుల పట్ల గల వ్యతిరేకతను చిన్నతనంలోనే వ్యక్తంచేశారు. ఆ క్రమంలో 'హిందూస్థాన్ రిపబ్లికన్ ఆర్మీ' నాయకులు రాం ప్రసాద్ బిస్మిల్‌తో ఏర్పడిన పరిచయం ద్వారా విప్లవోద్యమంలో భాగస్వామి అయ్యారు. మతం కారణంగా ఆర్యసమాజానికి చెందిన బిస్మిల్ హిందూస్థాన్ రిపబ్లికన్ ఆర్మీలో అష్ఫాక్‌కు సభ్యత్వం ఇవ్వడానికి సంశయించినా చివరకు అంగీకరించక తప్పలేదు. ఆర్మీ సభ్యునిగా





బిస్మిల్ నేతృత్వంలో జరిగిన పలు యాక్షన్‌లలో చురుగ్గా అష్ఫాఖ్ పాల్గొన్నారు. బలమైన శత్రువును మాతృభూమి నుండి తరిమి కొట్టేందుకు ఆయుధాల సమీకరణకు ధనం అవసరం కాగా విప్లవకారుల కన్ను ప్రభుత్వపు ఖజానా మీద పడింది. ప్రభుత్వ ఖజానాను తెస్తున్న రైలు నుండి ధనాన్ని కొల్లగొట్టేందుకు పథకం తయారయ్యింది. ఈ పథకం పట్ల తొలుత అష్ఫాఖ్ అయిష్టత వ్యక్తంచేస్తూ ప్రభుత్వ ఖజనాను అపహరిస్తే ప్రభుత్వం విప్లవోద్యమం మీద విరుచుకపడగలదని, ఆ కారణంగా బాల్యావస్థలో నున్న విప్లవోద్యమం కోలుకోలేనంత దెబ్బ తింటుందని హెచ్చరించారు. అయినా ప్రజాస్వామిక సిద్ధాంతం పట్ల గౌరవంగల ఆయన సహచరుల మెజారిటీ నిర్ణయానికి సమ్మతి తెలిపారు.

ఆ పథకం ప్రకారంగా 1925 ఆగస్టు 9న కాకోరి గ్రామం మీదుగా వెళ్ళే మెయిల్‌లో తరలిస్తున్న ప్రభుత్వ ఖజానాను పది మంది సభ్యుల గల విప్లవకారుల దళం సాహసోపేతంగా కైవసం చేసుకుంది. ఈ పథకాన్ని అమలుపర్చటంలో క్రమశిక్షణ గల విప్లవకారునిగా అష్ఫాఖ్ తనదైన పాత్రను నిర్వహించారు. ఆ సంఘటనతో ఒక్కసారిగా ఖంగుతిన్న బ్రిటీష్ ప్రభుత్వం అష్ఫాఖ్ ఊహించినట్టే విప్లవకారుల మీద విరుచుకపడటంతో అష్ఫాఖుల్లాతో పాటుగా ఆర్మీ సభ్యులంతా అజ్ఞాతంలోకి వెళ్ళిపోయారు.

అష్ఫాఖుల్లా మాత్రం ఏడాదిపాటు అజ్ఞాత జీవితం గడిపిన పిదప స్వగ్రామానికి చెందిన ఒక మిత్రద్రోహి కారణంగా ఢిల్లీలో అరెస్టయ్యారు. ఆయనకు పలు ఆశలు చూపి, మత మనోభావాలను కూడా రెచ్చగొట్టి లొంగదీసుకోటానికి ప్రభుత్వం విఫల ప్రయత్నాలు చేసింది. చివరకు కాకోరి రైలు సంఘటన విచారణ ప్రారంభమైంది. ఆ సమయంలో ఆర్మీ నాయకుడు రాంప్రసాద్ బిస్మిల్‌ను శిక్ష నుండి తప్పించేందుకు కాకోరి రైలు సంఘటనకు తాను మాత్రమే పూర్తి బాధ్యుడనంటూ తన న్యాయవాది సలహాకు భిన్నంగా ఉన్నత న్యాయస్థానానికి అష్ఫాఖ్ రాతపూర్వకంగా తెలుపుకున్నారు. చివరకు ఆయనతోపాటు సహచర మిత్రులకు కూడా కోర్టు ఉరిశిక్షలు విధిస్తూ తీర్పునిచ్చింది.

మాతృభూమి కోసం ప్రాణాలర్పించటం మహద్భాగ్యమని ప్రకటించిన అష్ఫాఖ్‌ను 1927 డిసెంబరు 19న ఫైజాబాదు జైలులో ఉరితీశారు. ఈ సందర్భంగా **'నా మాతృభూమి సర్వదా భోగభాగ్యాలతో విలసిల్లాలి. నా హిందూస్థాన్‌కు స్వేచ్ఛ లభిస్తుంది చూడండి. చాలా త్వరగా బానిసత్వపు సంకెళ్ళు తెగిపోతాయి'** అని ఎంతో ఆత్మవిశ్వాసంతో దేశ భవిష్యత్తును ప్రకటించిన అష్ఫాఖుల్లా ఖాన్ ఉరితాడును సంతోషంగా స్వీకరిస్తూ, తన వందేళ్ళ జీవితాన్ని 27 ఏళ్ళకే ముగించుకుని తరలి వెళ్ళిపోయారు. ◆



# 43. హకీం అజ్మల్ ఖాన్

## (1868-1927)

**భా**రతీయుల ఉమ్మడి లక్ష్యమైన **స్వరాజ్యం** సాధించేందుకు ఏకత్వంలో భిన్నత్వం, భిన్నత్వంలో ఏకత్వం ప్రాతిపదికగా త్యాగాలకు ఆచరణాత్మకంగా సిద్ధపడిన ఈ గడ్డ ముద్దుబిడ్డలలో హకీం ఆజ్మల్ ఖాన్ ప్రముఖులు.

స్వదేశీ వైద్యంలో ప్రఖ్యాతిగాంచిన వైద్య ప్రముఖులు హకీం అబ్దుల్ గులాం మహమ్మద్ ఖాన్ తనయుడిగా అజ్మల్ ఖాన్ 1868 ఫిబ్రవరి 12న ఢిల్లీలో జన్మించారు. చిన్ననాటనే ఉర్దూ, అరబిక్, పర్షియన్ భాషలను నేర్చుకున్నారు. వైద్యశాస్త్రంతోపాటు, పలు శాస్త్రాలలో ప్రావీణ్యత గడించటమే కాకుండా మంచి వైద్యులుగా పేర్గాంచారు.

1906 వరకు ప్రజాసేవకు, స్వదేశీ వైద్యరంగానికి పరిమితమైన అజ్మల్ ఖాన్ 1906 అక్టోబర్ 1న సిమ్లాలో వైస్రాయిని కలిసిన ముస్లిం ప్రముఖుల బృందంలో సభ్యునిగా పాల్గొన్నారు. ఆ తరువాత All India Muslim Educational Conference లో All India Muslim leauge ఏర్పాటు తీర్మానాన్ని సమర్థించారు. అనంతరం లీగ్ ఉపాధ్యక్షునిగా భాధ్యతలను చేపట్టి, హిందూ-ముస్లింల మధ్య మతసామరస్యం కాపాడేందుకు, గోవులను ఖుర్బాని ఇవ్వడాన్ని మానుకోవాలని ముస్లింలు పిలుపునిచ్చారు. సయోధ్యను, సమైక్యతను సర్వదా కాంక్షించిన ఆయన 1916లో భారత జాతీయ కాంగ్రెస్,





ముస్లిం లీగ్‌ల మధ్యన దోస్తీ కుదిర్చిన **లక్నో ఒప్పందం** అమలులోకి రావడానికి ప్రముఖ పాత్ర నిర్వహించారు. ఈ క్రమంలో అజ్మల్ ఖాన్ ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమాల ప్రారంభోత్సవ కార్యక్రమంలో బ్రిటీష్ ప్రభుత్వం అందజేసిన Kaisar-i-Hind, Hazq-ul-Mulk బిరుదులను, ప్రభుత్వం ప్రసాదించిన పలు పురస్కారాలను త్యజించిన తొలి భారతీయుడిగా అందరికీ ఆదర్శప్రాయుడయ్యారు. అన్ని ప్రముఖ నగరాలలో, పట్టణాలలో ఖిలాఫత్ కమిటీలు ఏర్పడేందుకు నిరంతరం శ్రమిస్తూ ఉద్యమం కోసం తన పలుకుబడిని ఉపయోగించి ఆయన భారీగా విరాళాలు సేకరించారు. 1917 నాటికే గాంధీజీ సన్నిహితులైన ఆయన క్రమంగా ముస్లిం లీగ్‌కు దూరమై ఆ తరువాత భారత జాతీయ కాంగ్రెస్ సభ్యత్వం స్వీకరించారు. 1918 డిసెంబర్‌లో జరిగిన కాంగ్రెస్ సమావేశాలకు ఆహ్వాన సంఘం అధ్యక్షునిగా పనిచేశారు. ఖిలాఫత్ సమస్యపై 1920 జనవరిలో వైస్రాయిని కలసిన ప్రతినిధివర్గంలో ఆయన పాల్గొన్నారు. 1921లో అహమ్మదాబాద్‌లో జరిగిన కాంగ్రెస్ జాతీయ సమావేశాల అధ్యక్ష స్థానాన్ని అలంకరించిన గౌరవాన్ని పొందారు.

జాతీయభావాలు గల విద్యార్థుల కోసం ఏర్పాటు చేసిన Jamia Milia Islamia (Nationa Muslim University) ప్రథమ ఛాన్సలర్‌గా బాధ్యతలు చేపట్టి ఆ విద్యాసంస్థ పటిష్టతకు కృషిచేశారు. 1922 మార్చి 10న మహాత్మాగాంధీని అరెస్టు చేసినప్పుడు ఆయన స్థానంలో శాసనోల్లంఘన ఉద్యమ నిర్దేశకులుగా అజ్మల్ ఖాన్ నియుక్తులయ్యారు. 1922-23 మధ్యకాలంలో భారత జాతీయ కాంగ్రెస్, ముస్లింలకు నాయకత్వం వహిస్తున్న వివిధ సంస్థల మధ్య సత్సంబంధాలు ఏర్పడటానికి ఆయన కృషి సల్పారు. హిందూ - ముస్లింల ఐక్యతకోసం అవిశ్రాంతంగా శ్రమించిన ఆయన 1924 సెప్టెంబరులో హిందూ -ముస్లిం నాయకులను ఆహ్వానించి తన ఇంట ఐక్యతా సమావేశాన్ని ఏర్పాటు చేసి ప్రధాన జనసముదాయాల మధ్య స్నేహసంబంధాల మెరుగుదలకు కృషి సల్పారు.

ఒక వైపు వైద్యం, మరొక వైపు రాజకీయాలు, ఇంకోవైపు విద్యావ్యాప్తికి నిరంతరం శ్రమిస్తున్న అజ్మల్‌ఖాన్ SHAIDA అను కలం పేరుతో ఉర్దూ, పర్షియన్ భాషలలో రాసిన కవితలలో మానవత్వపు పరిమళాలు గుబాళించాయి. ఈ కవితలను డాక్టర్ జాకీర్ హుస్సేన్ DIWAN-SHAIDA పేరుతో 1926లో సంకలనంగా తెచ్చారు.

అనారోగ్యం కారణంగా 1925లో రాజకీయాల నుండి నిష్క్రమించినా హిందూ - ముస్లింల మధ్య సయోధ్య కోసం జీవిత చరమాంకం వరకు శ్రమించిన జాతీయోద్యమనేత హకీం అజ్మల్ ఖాన్ 1927 డిసెంబర్ 29న కన్నుమూశారు. ◆

# 44. రజియా ఖాతూన్

**(-)**

**భా**రత స్వాతంత్ర్య సంగ్రామం ప్రజానీకాన్ని అన్ని రకాల త్యాగాలకు సిద్ధపర్చింది. అహింసామార్గంలో బ్రిటీష్ సేనల తుపాకి గుండ్లకు బలైన ఖుదాయే- ఏ-ఖిద్మత్‌గార్‌లనూ (భగవత్సేవకులు), ఆయుధాలను చేతపట్టి బ్రిటీష్ పోలీసు-సైనిక దళాలను తొడగొట్టి సవాల్‌చేసి రణరంగంలో వీరోచితంగా పోరాడి ప్రాణాలను బలిపెట్టిన సాయుధపోరాట యోధులైన విప్లవకారులను జాతీయోద్యమం సృజియించింది.

బ్రిటీషర్ల బానిసత్వం నుండి విముక్తి కోరుకుంటూ జమిలిగా సాగిన ఈ పోరాట మార్గాలు ఏవైనా అందులో పురుషులతోపాటు మహిళలు కూడా నడుం బిగించి ముమ్మందుకు సాగారు. విముక్తి పోరాటంలో ఏమాత్రం వెన్ను చూపక ఆయుధం చేపట్టి పరాయి పాలకులైన బ్రిటీషర్ల వెన్నులో చలి పుట్టించారు. ఈ మేరకు బ్రిటీష్ ప్రభుత్వాన్ని సవాల్ చేసి హడలగొట్టిన ఆడపడుచులలో రజియా ఖాతూన్ ఒకరు.

ఆమె ప్రముఖ విప్లవయోధుడు మౌల్వీ నశీరుద్దీన్ అహమ్మద్ కుమార్తె. చిన్ననాటి నుండి ఆమెలో అంకురించిన దేశభక్తి భావనలు తండ్రి నుండి సంతరించుకున్న బ్రిటీష్ వ్యతిరేకతను తీవ్రతరం చేశాయి. స్వదేశాన్ని విదేశీ పాలకుల బానిసత్వం నుండి విముక్తం చేయాలని ఆమె సంకల్పించారు. తండ్రితో పాటు ఆమె కూడా జుగాంతర్ విప్లవ దళంలో





సభ్యత్వం స్వీకరించారు. జుగాంతర్ విప్లవయోధులు సాగించిన సాయుధపోరాట దళం సభ్యురాలిగా రజియా ఖాతూన్ విప్లవోద్యమానికి క్రియాశీలక తోడ్పాటునందించారు.

భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర పుటలలో **అగ్నియుగం** గా పిలువబడిన సాయుధ పోరాట కాలంలో జుగాంతర్, అనుశీలన సమితి, ఆత్మోన్నతి దళం, గదర్ విప్లవ దళం, హిందూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్, హిందూస్థాన్ రిపబ్లిక్ ఆర్మీ తదితర విప్లవ దళాలలోని విప్లవవీరులు అపూర్వ ధైర్య సాహసాలతో, అసమాన త్యాగాలతో భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో అగ్నియుగాన్ని రగిలించారు. ఆ సమయంలో ప్రాణాలను తృణప్రాయంగా భావించి పోరుబాట పట్టిన విప్లవ వీరుల సరసన నిలిచి ఆ విప్లవ జ్వాలలను మరింతగా మండించడంలో జుగాంతర్ విప్లవ సంస్థ సభ్యురాలిగా రజియా ఖాతూన్ తనదైన పాత్రను నిర్వహించారు.

ఆనాడు పరాయి పాలకుల నుండి మాతృదేశ విముక్తికోసం తమ ప్రాణాలను తృణప్రాయంగా భావించి చిరునవ్వుతో బలిపెట్టడానికి సిద్ధమైన, ముక్సుద్దీన్ అహమ్మద్ (నెట్రకోన), మౌల్వీ గయాజుద్దీన్ అహమ్మద్, అబ్దుల్ ఖాదర్ (జమ్లాపూర్) తదితర విప్లవ యోధులతో కలసి రజియా ఖాతూన్ విప్లవోద్యమ కార్యక్రమాలలో పాల్గొన్నారు. బ్రిటీష్ పాలకవర్గాలు జుగాంతర్ దళ సభ్యులను పూర్తిగా మట్టుపెట్టాలని ఒకవైపున తీవ్రంగా ప్రయత్నాలు చేస్తూ, విప్లవకారుల మీద దాడులు, విప్లవకారులకు అండదండలందిస్తున్న ప్రజల మీద దాష్టీకాలకు పాల్పడుతున్న భయానక సమయంలో కూడా రజియా ఖాతూన్ మార్గం మళ్ళకుండా విప్లవబాటను వీడకుండా ముందుకు సాగారు.

బ్రిటీష్ గూఢచారుల, పోలీసుల కదలికలను, ఇతర సమాచారాన్ని రహస్యంగా విప్లవకారులకు చేరవేయటం, దళంలోని సభ్యులకు ఆశ్రయం కల్పించటం, ఆహారం, ఆర్థిక, ఆయుధ సహాయ సహకారాలు అందచేయటం లాంటి పనులను రజియా ఖాతూన్ చాకచక్యంగా నిర్వహించి జుగాంతర్ విప్లవ దళం పోరాట చరిత్రలో ప్రత్యేక స్థానం పొందారు.

ఈ విషయాలను ప్రముఖ చరిత్రకారుడు Santimoy Ray తన Freedom Movement and Indian Muslims, PPH, New Delhi,1993, P.44లో విప్లవోద్యమ పోరాట యోధురాలు రజియా ఖాతూన్ గురించి ప్రత్యేకంగా ప్రస్తావించారు. ◆



# 45. ప్రొ॥ మహమ్మద్ బర్కతుల్లా భోపాలీ

**(1864-1928)**

**భా**రత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో **అగ్నియుగం**గా ఖ్యాతిగాంచిన సాయుధ పోరాటానికి తమ జీవితాలను పూర్తిగా అర్పించిన త్యాగధనులలో అరుదైన **అగ్నిశిఖరం** మహమ్మద్ బర్కతుల్లా భోపాలీ.

మధ్యప్రదేశ్ రాష్ట్రం భోపాల్‌లో 1864లో జన్మించిన మహమ్మద్ బర్కతుల్లా భోపాల్ నివాసి కావటంతో బర్కతుల్లా భోపాలి అయ్యారు. బర్కతుల్లా తండ్రి ఖుద్రతుల్లా. బర్కతుల్లా చురుకైన విద్యార్థి, ఏకసంథాగ్రాహి. విద్యార్జన పట్ల అత్యంత మక్కువగల ఆయన జ్ఞాన సముపార్జన కోసం 1883లో ఇల్లు వదిలి విశ్వయాత్రకు శ్రీకారం చుట్టారు.

ఆ యాత్రలో బ్రతుకు తెరువుకు పలు ఉద్యోగాలు చేసిన బర్కతుల్లా ఉపాధ్యాయుడిగా, పాత్రికేయునిగా పనిచేస్తూ ఉన్నత విద్య కోసం 1895లో ఇంగ్లాడు వెళ్ళారు. అక్కడ దేశభక్తులైన ముస్లిం యువకులతోనూ, స్వదేశీ విప్లవకారులతో కలిగిన పరిచయం ఆయన జీవితాన్ని మలుపు తిప్పింది. ఆ ఆలోచనల పర్యవసానంగా ప్రపంచ దేశాల సహకారంతో బ్రిటీష్ పాలకులను మాతృదేశం సరిహద్దులు దాటించడమే తన ప్రధాన లక్ష్యంగా ఆయన నిర్ణయించుకున్నారు. ఆ లక్ష్యసాధన దిశగా సాగిన ప్రయత్నాలలో భాగంగా 1903లో అమెరికాకు వెళ్ళి **గదర్ పార్టీ** విప్లవకారులతో పరిచయాలు పెంచుకున్న ఆయన





అమెరికా నుండి తిరిగి వచ్చాక పూర్తిగా విప్లవోద్యమం బాటపట్టారు. 1909లో జపాన్ వెళ్ళి అక్కడ ఆచార్యునిగా పనిచేస్తూ **ఇస్లామిక్ సౌభ్రాతృత్వం** అను పత్రికను ప్రారంభించి బ్రిటీష్ ప్రభుత్వ చర్యలను వ్యతిరేకిస్తూ విప్లవకారుల వైఖరిని సమర్థించ సాగారు. ప్రభుత్వం ఆగ్రహించటంతో ఆ పత్రిక 1912లో నిలచిపోయింది, ఆయన ఉద్యోగం ఊడిపోయింది. ఆ తరువాత మళ్ళీ అమెరికా చేరుకుని గదర్ పార్టీలో చేరటంతో ఆయన ప్రజ్ఞా పాటవాలను ఎరిగి ఉన్న పార్టీ నాయకులు బర్కతుల్లాకు ఉపాధ్యక్ష పదవినిచ్చి గౌరవించారు.

1914 తరువాత బర్కతుల్లా జర్మనీ వెళ్ళి అక్కడున్న విప్లవయోధులు హర్‌దయాల్, చంపకరామన్ పిళ్ళైలతో లభించిన పరిచయంతో **భారత స్వాతంత్ర్య సమితి** అను విప్లవ పోరాట సంఘాన్ని స్థాపించడంలో వారికి సహాయపడ్డారు. ఆ సమయంలో ఆయనకు రాజా మహేంద్రప్రతాప్‌తో మంచి స్నేహం ఏర్పడింది. జర్మనీలో కొంతకాలం గడిపాక **సంపూర్ణ స్వరాజ్యం** సాధన కోసం మిత్రదేశాల సహాయం అర్థించేందుకు టర్కీ వెళ్లారు. టర్కీ అధినేత అన్వర్‌పాషాను కలిసి సాయుధపోరాటానికి మద్దతు సంపాదించారు. 1915 అక్టోబరు 2న రాజా మహేంద్రవర్మతో కలిసి కాబూల్ చేరుకుని, ఆఫ్ఘనిస్తాన్ అధినేత హబీబుల్లాతో చర్చలు జరిపి బ్రిటీష్ ప్రభుత్వం మీద యుద్ధం చేయాలంటే స్వతంత్ర ప్రభుత్వం ఏర్పాటు చేయాలనుకున్నారు. భారతదేశ స్వాతంత్ర్యాన్ని ప్రకటిస్తూ రాజా మహేంద్ర ప్రతాప్ రాష్ట్రపతిగా, తాను ప్రధాన మంత్రిగా భారత దేశం ఆవల **స్వతంత్ర భారత ప్రవాస ప్రభుత్వాన్ని** ఏర్పాటు చేశారు. ఆ ప్రభుత్వానికి టర్కీ, జర్మనీ దేశాల గుర్తింపు లభించటంతో హడలిపోయిన బ్రిటీష్ పాలకులు ఆఫ్ఘన్ పాలకుల మీద ఒత్తిడి తెచ్చి బర్కతుల్లాను సాగనంపాలన్నారు. ఆ సమయంలో గత్యంతరంలేక రష్యాలో ఏర్పడిన నూతన కమ్యూనిస్టు ప్రభుత్వం సహాయాన్ని కోరేందుకు బర్కతుల్లా భోపాలి రష్యా వెళ్లారు. రష్యాలో లెనిన్‌ను కలసి చేయూత కోరినా అక్కడ ఆశించినంత తోడ్పాటు లభించక పోవటంతో తిరిగి జర్మనీ చేరుకుని రహస్యంగా పలు పత్రికలు ఆరంభించి, ఆ పత్రికల ద్వారా విప్లవకారులను ప్రోత్సహిస్తూ, విప్లవోద్యమానికి ప్రజల మద్దతు కూడ గట్టసాగారు.

ఆ క్రమంలో 1927లో బెల్జియంలో జరిగిన సామ్రాజ్యవాద వ్యతిరేక సదస్సుకు హజరై సామ్రాజ్యవాద శక్తులపై గర్జిస్తూ అపూర్వ ప్రసంగం చేశారు. ఒక వైపు మాతృదేశం విముక్తి కోసం, మరోకవైపు ప్రపంచ ప్రజలకే ప్రమాదకరంగా మారిన సామ్రాజ్యవాద శక్తులకు వ్యతిరేకంగానూ అవిశ్రాంతంగా పోరాడిన మహమ్మద్ బర్కతుల్లా భోపాలి 1895లో స్వదేశం వదలి వెళ్ళి తిరిగి తన స్వంత గడ్డ మీద అడుగు పెట్టకుండానే 1928 జనవరి 5న జర్మనీలో చివరిశ్వాస విడిచారు. ◆



# 46. మౌలానా మజహర్రుల్ హఖ్

## (1866-1930)

**జా**తి జనుల ప్రయోజనాల ముందు స్వజనుల ప్రయోజనాలు తీసికట్టన్న భావనతో **స్వరాజ్యం** అను స్పష్టమైన లక్ష్యాన్ని సాధించటం కోసం జీవితపర్యంతం కృషి చేసిన స్వాతంత్ర్య సమర యోధులలో మజహర్రుల్ హఖ్ ప్రముఖులు.

బీహార్ రాష్ట్రం, పాట్నా జిల్లా భాపూర్ గ్రామంలోని జమీందారి కుటుంబంలో 1866 డిసెంబర్ 22న మజహర్రుల్ హఖ్ జన్మించారు. 1888లో న్యాయశాస్త్రం అభ్యసించేందుకు ఇంగ్లాండ్ వెళ్ళగా అక్కడ ఆయనకు మహాత్మాగాంధీ సహవిద్యార్థిగా పరిచయమయ్యారు. సేవా దృక్పథం, నిర్మాణ దక్షత గల ఆయన ఇంగ్లాండ్‌లో **అంజుమన్-ఎ-ఇస్లామియా** అను విద్యార్థుల సంస్థను ప్రారంభించి ముస్లిం విద్యార్థులకే కాక భారతీయ విద్యార్థులు అందరికీ ఈ సంస్థను కూడలి ప్రదేశంగా తీర్చిదిద్దారు.

1891లో ఇంగ్లాండ్ నుండి తిరిగి వచ్చి న్యాయవాదిగా జీవితం ప్రారంభించిన ఆయన కొంతకాలం తరువాత జుడిషియల్ సర్వీసులో ప్రవేశించి 1896లో ఆ ఉద్యోగానికి రాజీనామా చేసి ఛాప్రాలో న్యాయవాదిగా ప్రాక్టీస్ ఆరంభించారు. ఒకవైపున న్యాయవాదిగా అవిశ్రాంతంగా పనిచేస్తూ పలు సేవా కార్యక్రమాలతో ప్రజలతో సత్సంబధాలు పెంచుకున్నారు. ఆ కారణంగా ప్రజాప్రతినిధిగా ఆయనకు పలు పదవులు లభించాయి.





1906లో ఏర్పడిన ఆల్ ఇండియా ముస్లిం లీగ్ స్వరూప స్వభావాలను నిర్దేశించడంలో శ్రద్ధ తీసుకున్న ఆయన లీగ్ వ్యవస్థాపక కార్యదర్శిగా లీగ్‌ను మతతత్వానికి దూరంగా ఉంచేందుకు కృషి చేశారు. 1908లో ఆయన తన కార్యస్థానాన్ని పాట్నాకు మార్చారు. ఆ తరువాత రెండు దశాబ్దాల పాటు అటు జాతీయోద్యమంలో, ఇటు బీహార్‌లో ప్రముఖ రాజకీయ నేతగా అద్వితీయమైన పాత్రను నిర్వహించారు. 1914లో కాంగ్రెస్-ముస్లిం లీగ్‌ల మధ్య సయోధ్యకు కారణమైన **లక్నో ఒప్పదం** కుదర్చడానికి శ్రమించారు.

1916లో డాక్టర్ అనీబిసెంట్ నాయకత్వంలో ప్రారంభమైన HOME RULE ఉద్యమంలో బీహార్ రాష్ట్ర శాఖాధ్యక్షునిగా మజహర్రుల్ హఖ్ ప్రముఖ పాత్ర నిర్వహించారు. అనంతరం భారతీయులందర్ని ఒకేగాటన కట్టివేసి, బలమైన ఐక్యతను ప్రోది చేసిన **ఖిలాఫత్-సహాయనిరాకరణోద్యమం** ఆరంభం కాగానే మహాత్ముని పిలుపుమేరకు మజహర్రుల్ హఖ్ **ఉద్యమం**లోకి ప్రవేశించారు. ఈ సందర్భంగా హిందూ-ముస్లింల ఐక్యతకు ఆయన ఎంతగానో కృషిచేశారు. ఆ సమయంలో గాంధీజీతో ఏర్పడిన అనుబంధం వలన పాట్నా నగర సరిహద్దులో, **'సదఖత్ ఆశ్రమం'** (Abode of Truth) పేరిట ఆశ్రమాన్ని ఏర్పరచుకుని, అత్యంత విలాసవంతమైన జీవితం నుండి పూర్తిగా వైదొలిగి అతి సామాన్య ఫకీర్ జీవితాన్ని గడిపారు.

1917లో బీహార్‌లో జరిగిన మతకలహాలు కుదిపివేయగా, మత సామరస్యం కాపాడటం కోసం హిందూ సోదరుల మత మనోభావాలకు కష్టం కల్గించే విధానాలను విడనాడాలని ముస్లింలకు ఉద్బోధిస్తూ ఆయన పలు పర్యటనలు జరిపారు. ఆ బోధలకు మతదురహంకారుల ఉన్మాదం శాంతించలేదు. 1924లో మళ్ళీ మతకలహాలు భీభత్సాన్ని సృష్టించడంతో ఆయన మనస్సు వికలమైపోయింది. ఆయన ప్రత్యేక వైఖరి వలన 1926లో స్థానిక లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు జరిగిన ఎన్నికలలో హఖ్ పరాజితులయ్యారు. ఆ ఓటమితో క్రియాశీలక రాజకీయాల నుండి విరమించుకున్నారు. రాజకీయాల నుండి ఆయన విరమించుకున్నప్పటికి జాతీయ కాంగ్రెస్ నేతలు మాత్రం ఆయనను దూరం చేసుకోలేదు. జాతీయ కాంగ్రెస్ అధ్యక్ష పదవిని స్వీకరించమని కోరుతూ 1920 ఆగస్టు 20న, మౌలానా అబుల్ కలాం ఆజాద్ ఆయన వద్దకు వచ్చి అభ్యర్థించినా హఖ్ అంగీకరించలేదు.

ఈ విధంగా భారత రాజకీయాల మీద ప్రత్యేకంగా బీహార్ రాష్ట్ర ప్రజల హృదయాల మీద తనదైన విలక్షణ పంథాతో చెరిగిపోని ముద్రను వేసి, **'హిందూ-ముస్లింల ఐక్యతా ప్రవక్త'** గా ఖ్యాతిగాంచిన మజహర్రుల్ హఖ్ 1930 జనవరి 2న కన్నుమూశారు. ◆



# 47. మౌలానా మహమ్మద్ అలీ జౌహర్

## (1878-1931)

**జాతీ**యోద్యమానికి కలికితురాయి అనదగిన **ఖిలాఫత్ ఉద్యమం**లో బృహత్తర పాత్రను నిర్వహించి, ఖిలాఫత్-సహాయ నిరాకరణోద్యమాలకు ప్రాణం పోసిన అలీ సోదరులలోని కనిష్టులు మౌలానా మహమ్మద్ అలీ జౌహర్.

ఉత్తర ప్రదేశ్ రాంపూర్‌కు చెందిన సంపన్న కుటుంబంలో 1878 డిసెంబర్ 10న మహమ్మద్ అలీ జన్మించారు. తండ్రి అబ్దుల్ అలీ, తల్లి ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధురాలు ఆబాదిబానో బేగం. పసితనంలోనే తండ్రిని పోగొట్టుకున్నా, తల్లి ఆబాదిబానో జాతి రత్నాలనదగ్గ రీతిలో తన బిడ్డలను తీర్చిదిద్దారు. 1888లో అలీ జౌహర్ అలీఘర్‌లో బి.ఎ. చేసి, ఆక్స్‌ఫర్డ్ వెళ్ళి బి.ఎ.(ఆనర్స్) చదివి ఇండియా వచ్చాక పలు ఉన్నత పదవులను చేపట్టి అవి నచ్చక చివరకు పాత్రికేయుడిగా స్థిరపడ్డారు.

1906లో అఖిల భారత ముస్లిం లీగ్ స్థాపనలో ప్రముఖ పాత్ర వహించిన ఆయన హిందూ-ముస్లింలు ఐక్యతతో ముందుకు సాగినప్పుడు మాత్రమే లక్ష్యాలను సాధించగలరని స్పష్టం చేశారు. ప్రజలలో రాజకీయ చైతన్యం లక్ష్యంగా 1911లో **ది కామ్రేడ్** ఆంగ్ల వారపత్రికను, 1913లో **హందర్ద్** ఉర్దూ దినపత్రికను స్థాపించారు. ముస్లింల స్థితిగతులను మెరుగుపర్చేందుకు, మౌలానా కృషి ఆరంభించారు.





ప్రథమ ప్రపంచ యుద్ధ సమయంలో **కామ్రేడ్** లో Choice of the Turks శీర్షికన రాసిన వ్యాసం ఆంగ్ల ప్రభుత్వ ఆగ్రహానికి గురియ్యింది. స్వతంత్ర భావనలను వ్యక్తం చేస్తున్న **కామ్రేడ్, హందర్ద్** పత్రికల మీద కత్తివేటు పడింది. ఆ తరువాత మౌలానా, ఆయన సోదరులు షౌకత్ అలీని 1915లో గృహనిర్బంధానికి గురిచేసింది ప్రభుత్వం. ఆ గృహ నిర్బంధానికి కొద్ది రోజుల ముందుగా అలీ సోదరులు గాంధీజీని కలిసారు. ఆ కలయిక ఖిలాఫత్-సహాయ నిరాకరణ ఉద్యమంలో మౌలానాను గాంధీజీ మార్గాన నడిపించింది. ఇస్లామిక్ ధార్మిక సూత్రాల పట్ల అపార జ్ఞానంగల మహమ్మద్ అలీ ఖుర్‌ఆన్ సూక్తులను, ముహమ్మద్ ప్రవక్త ప్రవచనాలను ప్రస్తావిస్తూ, బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా అనర్గళ ప్రసంగాలు చేస్తూ, సామాన్య ముస్లింలను మాత్రమే కాకుండా ధార్మిక పండితులను కూడా ఉద్యమ దిశగా నడిపించారు. ఈ సందర్భంగా హిందూ-ముస్లింల ఐక్యతను కాంక్షించిన మౌలానా మత మనోభావాలకు భంగం కల్గించే ఆచార సాంప్రదాయాలను తక్షణమే విడనాడాలని ముస్లిం సమాజానికి సూచించారు.

1923లో జైలు నుండి విడుదలైన మౌలానాను భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్ష పదవి వరించింది. ఆ సమయంలో పెచ్చరిల్లిన మతవైషమ్యాలను నిరోధించి హిందూ-ముస్లింల ఐక్యతను పటిష్టం చేసేందుకు 1927లో ముహమ్మద్ అలీ జిన్నా రూపొందించిన ఢిల్లీ ప్రతిపాదనలను జాతీయ కాంగ్రెస్ మద్రాసు సమావేశాలలో ఆయన అంగీకరింప జేశారు. ఆ తరువాత పండిట్ మోతిలాల్ నెహ్రూ అధ్యక్షతన రూపొందిన 'నెహ్రూ కమిటీ రిపోర్టు'ను అంగీకరించని మౌలానా 1928లో జాతీయ కాంగ్రెస్‌కు దూరమయ్యారు. ఆ తరువాత మహాత్మాగాంధీతో ఆయన సంబంధాలు సన్నగిల్లాయి.

1930లో ప్రథమ రౌండ్ టేబుల్ సమావేశానికి లండన్ వెళ్ళిన ఆయన ఆరోగ్యం క్షీణించినా తన కలాన్ని పక్కన పెట్టలేదు. చివరి క్షణం వరకు స్వేచ్ఛ-స్వాతంత్ర్యం గురించి ఆలోచనలు చేస్తూ, రాస్తూ గడిపిన మౌలానా అలీ 1931 జనవరి 3న హిందూ-ముస్లింల సమస్యను చర్చిస్తూ, బ్రిటీష్ ప్రధానమంత్రికి సుదీర్ఘ లేఖ రాయించారు. చివరకు **'నా దేశానికి స్వాతంత్ర్యం ప్రకటించిన ఫర్మానా నా చేతుల్లోకి వచ్చినప్పుడు మాత్రమే నేను నా మాతృభూమి మీద అడుగు పెడతాను. నా దేశానికి స్వాతంత్ర్యం ఇవ్వాలి లేదా నా సమాధి కోసం రెండు గజాల స్థలమన్నా ఇవ్వాలి**' అని ప్రకటించారు.

ఆ విధంగా తన ఆకాంక్షను ప్రకటించిన మౌలానా ముహమ్మద్ అలీ జౌహర్ పరాయిపాలకుల నుండి విముక్తి, హిందూ-ముస్లిం ఐక్యతకై తన చివరిశ్వాస వరకు శ్రమిస్తూ 1931 జనవరి 4న కన్నుమూశారు. ◆



# 48. సయ్యద్ హసన్ ఇమాం

## ( 1871-1933 )

ప్రజలు ప్రగతిశీల దృకృధాన్ని అలవర్చుకోనిదే సాధించిన స్వరాజ్యఫలాలను సక్రమంగా అనుభవించలేరన్న దూరదృష్టితో అటు రాజకీయ పోరాటయోధులుగా, ఇటు సాంఘిక సంస్కర్తలుగా జాతీయోద్యమంలో బహుముఖ పాత్రలను పోషించిన ప్రముఖులలో సయ్యద్ హసన్ ఇమామ్ ఒకరు.

బీహార్ రాష్ట్రం పాట్నా జిల్లా నియోరా గ్రామంలోని సుప్రసిద్ధ, సంపన్న కవి-పండితుల కుటుంబంలో 1871 ఆగస్టు 31న ఆయన జన్మించారు. 1889లో ఉన్నత విద్యాభ్యాసం కోసం ఇంగ్లాండ్ వెళ్ళిన ఆయన బ్రిటీష్ వ్యతిరేక భావాలు కలిగిన భారతీయ విద్యార్థులతో కలసి కార్యక్రమాలలో పాలు పంచుకున్నారు. 1892లో నాయ్యవాదిగా భారతదేశానికి తిరిగి వచ్చి ప్రాక్టీస్ ఆరంభించారు. 1910లో కలకత్తాకు నివాసం మార్చిన ఆయన మంచి న్యాయవాదిగా ఖ్యాతిగడించారు.

1908లో భారత జాతీయ కాంగ్రెస్ మద్రాసు సమావేశంలో పాల్గొన్నారు. విద్యార్థి-యవజనుల ఐక్య భాగస్వామ్యం ద్వారా ఏదైనా సాధించగలమన్న విశ్వాసం గల ఆయన 1909లో జరిగిన బీహార్ విద్యార్థుల సమావేశంలో చారిత్రక అధ్యక్షోపన్యాసం చేస్తూ ప్రగతి నిరోధక సాంప్రదాయాలను అలవాట్లను త్యజించి యువకులు అభ్యుదయ భావాలను





సంతరించుకోవాలని పిలుపునిచ్చారు.

1911లో అలహాబాద్‌లో జరిగిన జాతీయ కాంగ్రెస్ సమావేశంలో ముస్లింల కోసం ప్రత్యేక నియోజక వర్గాల ఏర్పాటు చేయాలన్న ప్రతిపాదనలను ఆయన వ్యతిరేకించారు. 1916 నుంచి స్వరాజ్య సాధనా దిశగా కార్యకలాపాలను ముమ్మరం చేసిన ఆయన తన న్యాయమూర్తి పదవికి రాజీనామా చేసి పూర్తికాలం ఉద్యమకారునిగా పనిచేశారు. బొంబాయిలో జరిగిన కాంగ్రెస్ జాతీయ సమావేశానికి అధ్యక్షునిగా వ్యవహరించారు.

ఆ క్రమంలో హోంరూల్ ఉద్యమంలో బీహార్ నుండి ప్రముఖ పాత్ర వహించారు. జాతీయ కాంగ్రెస్-ముస్లిం లీగ్‌ల మధ్యన అంతరం పెరగటం స్వరాజ్య సాధనకు మంచిది కాదన్నారు. అ సంస్థల మధ్యన సంబంధాలను మెరుగుపర్చేందుకు కాంగ్రెస్-లీగ్ పథకం రూపకల్పనకు ఆసక్తి చూపారు. 1919 నాటి రౌలత్ చట్టాన్ని తీవ్రస్థాయిలో వ్యతిరేకిస్తూ భారీ ప్రజాప్రదర్శన నిర్వహించి బ్రిటీష్ ప్రభుత్వాన్ని కలవరపరిచారు.

ఇస్లాం మతంపట్ల ఎంతో గౌరవ భావం గల ఆయన మత దురహంకారం, మత నియంతృత్వంను పూర్తిగా విమర్శించారు. పర్దా పద్ధతిని వ్యతిరేకిస్తూ నైతిక విలువల పాటించడం ఐచ్ఛికం కావాలి తప్ప, నిర్బంధాలతో కూడదన్నారు. ఏ మతమైనా ప్రగతికి ఆటంకం కారాదన్నారు. ప్రజల ఉమ్మడి సమస్యల పరిష్కారం విషయంలో మత భావాలకు చోటు ఇవ్వరాదన్నారు. మతం వ్యక్తిగతమని ప్రకటిస్తూ హిందూ-ముస్లింల మధ్యన స్నేహ సంబంధాలను కోరుకున్నారు. హిందూ-ముస్లిం జన సముదాయాల మధ్య ఐక్యత కొరవడితే స్వరాజ్యం అసాధ్యమన్నారు. మాతృదేశానికి సంబంధించిన ఉమ్మడి సమస్య వచ్చినప్పుడు ప్రాంతీయ, మత ప్రాముఖ్యతలను పూర్తిగా విస్మరించాలన్నారు.

ఈ మేరకు అటు జాతీయోద్యమంలో, ఇటు సంస్కరణోద్యమంలో అవిశ్రాంతంగా గడుపుతున్న హసన్ ఇమామ్ 1931 నాటి స్వదేశీ ఉద్యమంలో పలు బాధ్యతలను నిర్వహించారు. ఖాధీ వస్త్రధారణకు అధిక ప్రచారం ఇవ్వడం మాత్రమే కాకుండా, ఖాదీ ప్రజలకు అందుబాటులోకి రావడానికి తగిన ఏర్పాట్ల పట్ల కూడా అత్యంత శ్రద్ధ చూపారు. స్వదేశీ ఉద్యమాన్ని ప్రజానీకంలోకి తీసుకెళ్ళేందుకు ఏర్పడిన 'స్వదేశీ లీగ్' ప్రధాన కార్యదర్శిగా పనిచేస్తూ ఉత్తేజపూరిత ప్రసంగాల ద్వారా సభికులను కార్యాచరణకు పురికొల్పి ప్రభుత్వ ఆగ్రహానికి గురయ్యారు.

ఈ విధంగా బహుముఖ ప్రతిభతో అన్ని రంగాలలో తనదైన ప్రత్యేక ముద్ర వేసిన సయ్యద్ హసన్ ఇమామ్ 1933 ఏప్రిల్ 19న చివరిశ్వాస విడిచారు. ◆



# 49. టి. ఆహమ్మద్ ఖాన్ షేర్వాణి

## (1885-1935)

స్వరాజ్య సాధన కోసం ఒకవైపు ఉద్యమిస్తూనే మరోవైపున సమాజాన్ని పట్టిపీడిస్తున్న సామాజిక రుగ్మతల మీద సంస్కరణల దండయాత్ర సాగించిన యోధులలో టి. ఆహమ్మద్ ఖాన్ షేర్వాణి ప్రముఖులు.

1885లో ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని అలీఘర్ సమీపాన గల బిలోనా గ్రామంలో ఆయన జన్మించారు. జమీందారి కుటుంబానికి చెందిన ఆయన ఉన్నత విద్యాభ్యాసం నిమిత్తం అలీఘర్‌లోని M.A.O. COLLEGE లో ప్రవేశించి కళాశాల విద్యార్థి సంఘం నాయకుడయ్యారు. అ క్రమంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం సాగుతున్న పోరాటం పట్ల ఆకర్షితులైన అహమ్మద్ ఖాన్, కళాశాల కమిటీ అనుసరిస్తున్న ఆంగ్ల ప్రభుత్వ అనుకూల విధానాలను బహిరంగంగా విమర్శించి కళాశాల నుండి బహిష్కరించబడ్డారు.

1911లో బారిస్టర్ పట్టా పుచ్చుకున్న ఆయన 1912లో భారతదేశానికి వచ్చారు. ఆలీఘర్‌లో న్యాయవాదిగా ప్రాక్టీస్ ప్రారంభించి సామాజిక సేవా కార్యకలాపాలను సాగిస్తూ 1916లో జాతీయ కాంగ్రెస్ సభ్యత్వం స్వీకరించారు. ఆ తరువాత శ్రీ మోతిలాల్ నెహ్రూ, శ్రీ సి.ఆర్. దాస్, మహాత్మా గాంధీ, డాక్టర్ యం. ఎ. అన్సారి తదితర నేతల ప్రభావంతో జాతీయ రాజకీయాలలో అడుగుపెట్టారు. 1916లో అనీబిసెంట్ నాయకత్వంలో





ప్రారంభమైన హోమ్‌రూల్ ఉద్యమంలో ప్రముఖ పాత్ర నిర్వహించారు. 1919లో ఆయనకు జాతీయ కాంగ్రెస్ కమిటీలో స్థానం లభించటంతో జాతీయ కాంగ్రెస్ కార్యక్రమాలలో నిరంతరం పాల్గొంటూ వచ్చిన ఆయన జాతీయోద్యమకారునిగా ప్రత్యేక గుర్తింపు పొందారు.

అఖిల భారత ముస్లిం లీగ్ కార్యక్రమాలలో కూడా ఆయన పాల్గొన్నారు. ముస్లిం లీగ్ లో ఉంటూ హిందూ-ముస్లింల ఐక్యత కోసం కృషి సాగించారు. స్వరాజ్యసాధన కోసం ఈ రెండు జనసముదాయాల మధ్యన సుదృఢమైన ఐక్యత అవసరమని భావించిన ఆనాటి ముస్లిం నాయకులలో ఒకరైన అహ్మద్ ఖాన్, 1919లో అమృతసర్‌లో జరిగిన లీగ్ సమావేశంలో ఈ అభిప్రాయాన్ని విస్పష్టం చేశారు. హిందూ-ముస్లింల ఐక్యతను సాధించేందుకు గోవులను ఖుర్బాని ఇవ్వడాన్ని ముస్లింలు మానుకోవాలని కోరుతూ ప్రవేశ పెట్టిన తీర్మానాన్ని ఆయన సమర్థించారు. 1920 డిసెంబరులో జరిగిన లీగ్ సమావేశంలో అహింసాయుత పోరాటం, సహయ నిరాకరణోద్యమ కార్యక్రమాలకు పూర్తిగా మద్దతు తెలుపుతూ చేసిన తీర్మానాన్ని లీగ్ సమర్థించేలా చూశారు. ముస్లిం లీగ్-జాతీయ కాంగ్రెస్‌ల మధ్యన సయోధ్య కుదిర్చేందుకు అహర్నిశలు కృషి సల్పారు.

1920లో జాతీయ కాంగ్రెస్, ఖిలాఫత్ కమిటీల పిలుపు మేరకు ప్రారంభమైన ఖిలాఫత్ ఉద్యమం, సహయనిరాకరణ ఉద్యమాలలో భాగస్వాములయ్యారు. ఆ కారణంగా 1921లో తొలిసారిగా జైలు శిక్షకు గురయ్యారు. 1924లో పండిట్ జవహర్ లాల్ నెహ్రూ సలహ మేరకు అలీఘర్ వదలి, అహ్మదాబాద్‌కు వచ్చిన ఆయన రాజకీయాలలో భాగం పంచుకుంటూనే మతసామరస్యం ప్రధాన లక్ష్యంగా ముందుకు సాగారు. పరాయి పాలన నుండి విముక్తి మాత్రమే కాకుండా మాతృభూమి ఉజ్వల భవిష్యత్తుకు హిందూ-ముస్లిం జనశ్రేణుల మధ్య పరస్పర అవగాహన, స్నేహం-సఖ్యత అత్యవసరమని ఆయన ప్రకటించారు. ఆ దిశగా నిరంతరం శ్రమించిన అహమ్మద్ ఖాన్ విభేదాల పరిష్కారానికి అవిశ్రాంతంగా కృషి చేశారు. మతోన్మాదాన్ని ఎవరు రెచ్చకొట్టినా అంతిమంగా అది అందరికి అత్యంత ప్రమాదకారి కాగలదని ప్రజలను తీవ్రంగా హెచ్చరించారు.

జాతీయోద్యకారునిగా, సంస్కరణాభిలాషిగా నిరంతరం ప్రజాసేవలో నిమగ్నమై కాలం గడుపుతున్న ఆయన 1932లో జాతీయ కాంగ్రెస్ పార్టీ నిషేదానికి గురైనప్పుడు నిర్భంధానికి గురయ్యారు. జయాపజయాలను సమాన దృష్టితో స్వీకరించే స్థితప్రజ్ఞుడైన టి.అహమ్మద్ ఖాన్ షెర్వాణి పరాజయాన్ని పక్కన పెట్టి స్వాతంత్ర్యసమర యోధుడిగా, సంఘ సంస్కర్తగా కార్యక్రమాలను కొనసాగిస్తూ, 1935 మార్చి22న కన్నుమూశారు. ◆



# 50. జస్టిస్ అబ్బాస్ తయ్యాబ్జీ

## ( 1854-1936 )

**'మహా వ్యక్తులకు మరణం ఉండదు. దేశం కోసం వారు చేసిన అపూర్వ త్యాగాలు ఆ మహనీయులను చిరంజీవులను చేస్తాయి..ఆయన ఉత్తమోత్తముడు. ఆయనను కలుసు కోవటం మహద్భాగ్యం'** అని గాంధీజీచే ప్రశంసలందుకున్న ప్రముఖులు అబ్బాస్ తయ్యాబ్జీ.

గుజరాత్ రాష్ట్రంలో 1854 ఫిబ్రవరి 1న సంపన్న తయ్యాబ్జీల కుటుంబంలో జన్మించారు. చిన్ననాటనే చదువు కోసం ఇంగ్లాండ్ వెళ్ళిన ఆయన1875లో బార్-ఎట్-లా చేసి ఇండియా వచ్చారు. 1893లో బరోడా ఉన్నత న్యాయస్థానంలో న్యాయమూర్తి పదవిని చేపట్టి ప్రతిభావంతుడైన న్యాయమూర్తిగా పేరుగడించారు.

జాతీయ కాంగ్రెస్ స్థాపన నాటి నుండి తయ్యాబ్జీ కుటుంబీకులకు కాంగ్రెస్‌తో విడదీయ లేని సంబంధాలు ఉన్నప్పటికీ, 1915లో మహాత్మాగాంధీజీతో కలిగిన పరిచయం, అబ్బాస్ జీవితాన్ని మలుపు తిప్పింది. భారత జాతీయ కాంగ్రెస్ ప్రారంభించక ముందే అబ్బాస్ నాయకత్వంలోని **'గుజరాత్ రాజకీయ పరిషత్'** సహాయనిరాకరణ ఉద్యమాన్ని చేపట్టింది. రాజవంశీకులతో స్నేహసంబంధాలు కలిగి అత్యంత ఆడంబరమైన జీవితాన్ని సాగిస్తున్న ఆయన 1919లో అన్ని విలాసాలకు స్వస్తిపలికి స్వదేశీ ఉద్యమంలో భాగస్వామి అయ్యారు. ఎనభై సంవత్సరాల వయస్సులో ఖద్దరును ప్రోత్సహించేందుకుగాను ఎద్దుల బండిలో **'విముక్తి వస్త్రాన్ని'** విక్రయిస్తూ గుజరాత్ రాష్ట్రంలోని గ్రామాల్లో తిరిగారు.





భారతదేశంలోని హిందూ-ముస్లింల మధ్యన సన్నిహిత సంబంధాలు మరింత పటిష్టం కావాలని, ఈ రెండు ప్రధాన జీవన స్రవంతుల మధ్య ఐక్యత మరింతంగా పరిఢవిల్లాలని ఆయన కోరుకున్నారు. ఖిలాఫత్ ఉద్యమంలో హిందూ సోదరులు అన్ని విధాల సహకరించినందున ఈ ఐక్యతను కాపాడుకోవాల్సి ఉందని ప్రగాఢంగా వాంఛించారు.

1928 బార్డోలి సత్యాగ్రహ కార్యక్రమంలో పలు బాధ్యతలు చేపట్టారు. **దండియాత్ర** సందర్భంగా బ్రిటీష్ ప్రభుత్వం గాంధీజీని అరెస్టు చేసినప్పుడు ఆయన స్థానంలో అబ్బాస్ నాయకత్వం చేపట్టారు. ఆ సందర్భంగా ఆయన జైలుపాలయ్యారు. పండు వయస్సులో కూడా మొక్కవోని ధైర్యంతో, అనారోగ్యాన్ని కూడా లెక్కచేయక విముక్తి పోరాటమే ఊపిరిగా సాగిన ఆయన జాతీయోద్యమకారులకు ఆదర్శప్రాయుడయ్యారు.

జాతీయోద్యమానికి తన్ను తాను అంకితం చేసుకున్న, అబ్బాస్ తయ్యాబ్జీ గాంధీజీకి అత్యంత విశ్వాసపాత్రులైన ఉద్యమకారులలో ఒకరుగా ఖ్యాతిగాంచారు. గాంధీజీతో ఆయనకు ఉద్యమ సంబంధాలే కాక, వ్యక్తిగత సంబంధాలు ఉండేవి. గాంధీజీ తాను ఆచరణలో పెట్టదలచుకున్న పోరాట రూపాల ఫలితాలను పరిశీలించేందుకు, గుజరాత్‌ను పలుమార్లు ప్రయోగశాలగా స్వీకరించారు. ఆ సందర్భాలలో అబ్బాస్ తయ్యబ్జీ ద్వారా ఆ ప్రయోగాలను గుజరాత్‌లో నిర్వహించారు. ఈ మేరకు సహాయ నిరాకరణ ఉద్యమం, శాసనోల్లంఘన ఉద్యమం, పన్నుల వ్యతిరేక ఉద్యమం, విదేశీవస్తు బహిష్కరణ, మద్యపాన నిషేధం ఉద్యమం తొలుత అబ్బాస్ మార్గదర్శకత్వంలో గుజరాత్ నుండే ప్రారంభం గావటం గమనార్హం.

ప్రధాన న్యాయమూర్తిగా పనిచేసిన, సంపన్న కుటుంబీకుడైన అబ్బాస్ 80 ఏండ్ల వయస్సులో కూడా అతి సామాన్య జాతీయోద్యమ కార్యకర్తగా గాంధీజీ బాటలో నడుస్తూ, ఉద్యమ కార్యక్రమాలను నిర్వహించిన తీరును గమనించిన మహాత్ముడు ఆయన కార్యక్రమాలను వివరిస్తూ, '..that Abbas saheb should go about carrying a wooden plate hung from his neck and inscribed with slogans, is no ordinary event. What contrast between what he was then, a judge admonishing others, and what he is now, and ex-judge, who with a wooden plate hanging from his neck, had sallied forth with his comrades, determined to let himself be manhandled by the police...' అని వ్యాఖ్యానించారు.

**'గుజరాతీ వజ్రం'** గా గాంధీజీ చేత పిలువబడిన అబ్బాస్ తయ్యాబ్జీ జీవితాంతం స్వాతంత్ర్యసమరంలో పాల్గొంటూ, బ్రిటీష్ బానిసత్వం నుండి మాతృభూమి విముక్తి కోసం అవిశ్రాంతంగా శ్రమిస్తూ 1936, మే 9న తనువు చాలించారు. ◆



# 51. డా॥ ముక్తార్ అహమ్మద్ అన్సారి

## (1880-1936)

**భి**న్న జనసముదాయాల నిలయమైన భారతావనిలో ఆ సమూహాల ఐక్య పోరాటాల ద్వారా మాత్రమే స్వరాజ్యం సిద్ధించగలదని విశ్వసించి, హిందూ-ముస్లింల ఐక్యత కోసం అవిశ్రాంతంగా కృషిసల్పిన ప్రముఖులలో అగ్రగామి ముక్తార్ అహమ్మద్ అన్సారి.

ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ఘాజీపూర్ జిల్లా, యూసుఫ్‌పూరాలో 1880 డిసెంబర్ 25న జమీందారి కుటుంబంలో ఆయన జన్మించారు. హాజీ అబ్దుర్రహ్మాన్, ఇల్లహన్ బీబిల కుమారుడైన అన్సారి 1900లో నిజాం కళాశాల నుండి డిగ్రీ తీసుకుని హైదరాబాద్ రాష్ట్రం ఏర్పాటు చేసిన ఉపకారవేతనంతో ఇంగ్లాండ్ వెళ్ళారు. 1908లో శస్త్రచికిత్సా విభాగం నుండి మాస్టర్ డిగ్రీ తీసుకుని అక్కడే ప్రతిష్టాత్మకమైన పలు సంస్థలలో పనిచేశారు. 1910లో స్వదేశం వచ్చి మంచి వైద్యునిగా ఖ్యాతి గడించిన ఆయన బాగా సంపాదించారు. సంపన్నుల డాక్టర్‌గా పేర్గాంచిన ఆయన ప్రతిరోజు ప్రత్యేక సమయాలలో పేదవర్గాల ప్రజలకు ఉచితంగా వైద్యసేవలు అందించటం ద్వారా సామాన్య ప్రజల మన్నన పొందారు.

1916 ప్రాంతంలో Home Rule ఉద్యమంతో ఆరంభమైన అన్సారి రాజకీయ జీవితం జాతీయ కాంగ్రెస్ సభ్యత్వం స్వీకరించటంతో వేగాన్నందుకుంది. భారత జాతీయ కాంగ్రెస్, ముస్లిం లీగ్‌ల మధ్య **లక్నో ఒప్పందం** కుదరటంలో విశేషమైన పాత్ర వహించిన





ఆయన రౌలత్ బిల్లు వ్యతిరేక ఉద్యమంలో పాల్గొనటం ద్వారా గాంధీజీకి బాగా సన్నిహితులు అయ్యారు. 1920లో వైశ్రాయిని కలసిన ఖిలాఫత్ ప్రతినిధి వర్గానికి అన్సారి నాయకత్వం వహించారు. గాంధీజీ పిలుపు మేరకు సహాయ నిరాకరణ ఉద్యమంలో చురుకైన పాత్ర నిర్వహించారు. ఆనాడు ఆయనలో కలిగిన ఆలోచనల ప్రతి రూపంగా 1920 అక్టోబర్ 29న ఆరంభమైన జాతీయ జామియా కళాశాలకు హకీమ్ అజ్మల్ ఖాన్ తరువాత ఛాన్సెలర్‌గా బాధ్యతలను చేపట్టిన అన్సారి, జామియా సుస్థిరత, అభివృద్ధి కోసం జీవిత చరమాంకం వరకు కృషి చేశారు.

అన్సారి హిందూ-ముస్లిల ఐక్యతకు అత్యధిక ప్రాధాన్యతనిచ్చారు. 1921నాటి ముస్లిం లీగ్ సమావేశంలో మాట్లాడుతూ హిందువుల మనోభావాలను గౌరవిస్తూ, బక్రీద్ పండుగ రోజున గోవులకు బదులుగా ఇతర జంతువులను ఖుర్బాని ఇవ్వవలసిందిగా కోరుతూ తీర్మానించాలన్నారు. మత విద్వేషాలకు దూరంగా సామరస్య వాతావరణం ఏర్పాటుకు నిరంతరం కృషి సల్పారు. జాతీయ స్థాయిలో మత కలహాలను నివారించేందుకు లాలా లజపతిరాయ్‌తో కలసి The Indian National Pact ను రూపొందించారు. హిందూ-ముస్లింల మధ్య ఐక్యతా ప్రయత్నాలలో భాగంగా 1924లో Unity Confernce, 1927 అక్టోబరు 27న మరో ఐక్యతా సదస్సును నిర్వహించారు. మతతత్త్వ భావాలు గల నేతల వలన ఆయన ప్రయత్నాలకు సత్ఫలితాలు లభించకపోవటంతో మతాన్ని రాజకీయాలతో జత చేయరాదని పలుమార్లు ఆయన చాలా విస్పష్టంగా ప్రకటించారు.

ప్రజలలో జాతీయ భావనలను ప్రోదిచేసేందుకు అవిరళ కృసి చేసిన అన్సారి 1929 జూలై 27-28న జరిగిన కాంగ్రెస్ సమావేశంలోని జాతీయభావాలు గల ముస్లింలను ఏకతాటిపై నడిపేందుకు **అఖిల భారత జాతీయ ముస్లిం పార్టీ** ఏర్పాటు చేసి దాని కోశాధికారిగా ఆర్థిక బాధ్యతలను నిర్వహించారు. గాంధీజీ ఆహ్వానం మేరకు 1927లో జాతీయ కాంగ్రెస్ పగ్గాలు చేపట్టిన ఆయన తన సంపదలోని అత్యధిక భాగాన్ని పార్టీ కార్యకలాపాల కోసం, పార్టీ కార్యకర్తల ఎన్నికల కోసం వినియోగించి చివరకు ఆర్థికంగా రుణగ్రస్తుడయ్యారు.

అ తరువాత వచ్చిన రాజకీయబేధాభిప్రాయాల వలన జాతీయ కాంగ్రెస్ పార్టీలోని పదవులన్నిటిని వదులుకున్న అన్సారి 1935లో ప్రజాజీవితం నుండి పూర్తిగా నిష్క్రమిస్తున్నట్టుగా ప్రకటించారు. ఆ తరువాత శేషజీవితాన్ని రచనల కోసం, జామియా మిలియా కళాశాల అభివృద్ధి కోసం వినియోగిస్తూ నిరంతరం శ్రమించిన డాక్టర్ ముక్తార్ అహమ్మద్ అన్సారి 1936 మే 10న చివరిశ్వాస వదిలారు. ◆



# 52. బద్రుల్ హసన్

## (1898- 1937)

**శ**త్రువు ఎంతటి బలవంతుడైనా ఏమాత్రం లెక్కచేయకుండా మాతృభూమి విముక్తి కోసం అహింసా మార్గాన సాగిన యోధులలో బద్రుల్ హసన్ ముఖ్యులు.

ఆనాటి నైజాం రాజధాని హైదరాబాద్‌లోని సంపన్న కులీన కుటుంబంలో 1898లో ఆయన జన్మించారు. ఆయన తల్లి ఫక్రుల్ హాజియా హసన్ స్వాతంత్ర్య సమరయోధురాలు. జాతీయోద్యమానికి ఆమె సర్వస్వం ధారబోసిన ఆమె బిడ్డలంతా జాతీయోద్యమంలో పాల్గొన్నారు. ఆ తల్లి వారసుడుగా బద్రుల్ హసన్ జాతీయోద్యమకారుడయ్యారు.

జర్నలిస్టుగా గాంధీజీ వద్ద శిష్యరికం చేయాలన్న సంకల్పంతో హైదరాబాద్ వదలిపెట్టి సబర్మతి ఆశ్రమం చేరుకున్న బద్రుల్ హసన్ గాంధీజీ సంపాదకత్వంలో ప్రచురితమవుతున్న 'యంగ్ ఇండియా' పత్రికలో మధ్యపానం నిషేధావశ్యకతను విశ్లేషిస్తూ పలు వ్యాసాలు రాశారు. ఆ తరువాత అలహాబాద్ నుండి వెలువడుతున్న'**ఇండిపెండెంట్**' అను అంగ్ల పత్రికకు విలేకరిగా చాలా కాలం బాధ్యతలను నిర్వహించారు.

ఆ సమయంలో బద్రుల్ హసన్‌లోని జాతీయవాది తనదైన రీతిలో స్పందించాడు. ఆ క్రమంలో జాతిని చైతన్యపరిచే పలు రచనలు చేశారు. బ్రిటీష్ వ్యతిరేక కార్యకలాపాలు నిర్వహించగలగడమే కష్టతరంగా ఉండగా బద్రుల్ హసన్ 1920లో తిలక్ స్వరాజ్య నిధిని సమకూర్చేందుకు నడుంకట్టారు. ఈ మేరకు 23 వేల రూపాయలను సేకరించి





బొంబాయి వెళ్ళి స్వరాజ్యనిధి కోసం అందచేశారు. నిజాం నవాబు ఎన్ని ఆంక్షలను విధించినా, ఎన్ని కట్టుదిట్టాలు చేసినా అహింసా సిద్ధాంతాలతో ప్రభావితులైన ఉద్యమ కారులను నిలువరించలేకపోయాడు. బద్రుల్ హసన్ ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమం లో భాగస్వాములయ్యారు. విదేశీ వస్తువులను, వస్త్రాలను త్యజించారు. బ్రిటీష్ రాకుమారుడు భారత సందర్శన సందర్భంగా విదేశీ వస్త్రాలను తగులపెట్టి, నిజాం రాజ్యంలో అటువంటి కార్యక్రమాన్ని ధైర్యసాహసాలతో నిర్వహించిన తొలి తెలుగు బిడ్డడయ్యారు.

బద్రుల్ హసన్ ఖద్దరు ఉద్యమానికి అత్యధిక ప్రాధాన్యతనిచ్చారు. ఖద్దరు ఉత్పత్తిని అత్యధికం చేసేందుకు బొంబాయి నుండి రాట్నాలు తెప్పించారు. హైదరాబాదు రాష్ట్రంలో ఆధునిక రాట్నాలను ప్రవేశపెట్టిన తొలి వ్యక్తిగా ఘనత వహించారు. ఆయన స్వయంగా ఖద్దరు ధరించారు. నైజాం పాలకుల అభీష్టానికి వ్యతిరేకంగా బద్రుల్ హసన్, అయన సోదరులు జాఫర్ హసన్‌లు సాంప్రదాయకమైన పైజామా బదులుగా ఖద్దరు ధోవతి, గాంధీ టోపిని ధరించటంతో పాలకులు మండిపడినా హసన్ ఖాతరు చేయలేదు.

జాతీయోద్యమ ప్రచార కార్యక్రమాలను మరింత ముమ్మరం చేసేందుకు బద్రుల్ హసన్ ధృఢంగా సంకల్పించారు. ఆ ప్రచారానికి అవసరమగు సాహిత్యాన్ని ఆయన సృష్టించారు. ఉద్యమ సహచరుల మధ్యన సమన్వయం-సమాచారం కోసం 'హైదరాబాదు బుక్ డిపో' పుస్తక విక్రయ కేంద్రం ఆరంభించారు. ఈ బుక్‌డిపో ఆనాడు జాతీయోద్యమకారులకు ఒక రహస్య కూడలి ప్రదేశం అయ్యింది.

మహాత్ముని అడుగుజాడల్లో సాగుతున్న బద్రుల్ హసన్ గ్రామీణాభివృద్ధి పట్ల అత్యధిక శ్రద్ధ కనపర్చారు. గ్రామాలలోని కుటీర పరిశ్రమలను, అంతరించి పోతున్న వృత్తి పనులను పునరుద్ధరించాలని అభిలషించారు. ఆ దిశగా ఔత్సాహిక ప్రారిశ్రామిక వేత్తలను ప్రోత్సహిస్తూ పలు కుటీర పరిశ్రమల స్థాపనకు దోహదకారయ్యారు. పరస్పర సహకారం ద్వారా పెట్టుబడుల సమస్యను అధిగమించగలమని, నైపుణ్యాన్ని అభివృద్ధి పర్చుకోగలమని విశ్వసించిన ఆయన సహకారోద్యమ ప్రారంభానికి కారకులయ్యారు. సహకార రంగంలో సంస్థల స్థాపనకు, సహకారోద్యమ వ్యాప్తికి శ్రమించారు. ఈ మేరకు హైదరాబాదులో సహకార వ్యవస్థకు ప్రాణప్రతిష్ట చేసిన ప్రముఖులలో ఒకరయ్యారు.

ఈ విధంగా అటు బ్రిటీష్, ఇటు నైజాం పాలకవర్గాలకు వ్యతిరేకంగా నైజాం గడ్డ మీద స్వేఛ్ఛా-స్వాతంత్ర్య భావనలను పరివ్యాప్తి చేయడంలో మాత్రమే కాకుండా, మహాత్ముని అడుగు జాడల్లో గ్రామీణాభివృద్ధికి చివరి నిమిషం వరకు కృషిసల్పిన బద్రుల్ హసన్ 1937లో కన్నుమూశారు. ◆



# 53. మౌలానా షౌకత్ అలీ

## (1873- 1938)

**జా**తీయోద్యమంలో అత్యంత ప్రధాన ఘట్టమైన ఖిలాఫత్-సహాయ నిరాకరణో ద్యమంలో ప్రధానపాత్ర నిర్వహించి 'అలీ సోదరులు' గా ప్రసిద్ధిచెందిన అన్నదమ్ములలో అగ్రజులు మౌలానా షౌకత్ అలీ.

1873 మార్చి 10 ఉత్తరప్రదేశ్‌లోని బిజినోర్ జిల్లా నాజిబాబాద్‌లో జన్మించారు. తల్లి ఆబాదిబానో బేగం. తండ్రి అబ్దుల్ అలీ ఖాన్. 1880 తండ్రిని కోల్పోయిన ఆయన జాతీయోద్యమంలో పాల్గొని ఆంగ్లేయ ప్రభుత్వంతో పోరాడి ఉద్యమకారులందరి చేత 'అమ్మా' అన్పించుకున్న తల్లి ప్రత్యేక సంరక్షణలో పెరిగారు. ఆనాటి సమాజం కట్టుబాట్లను త్రోసిరాజంటూ ఆమె బిడ్డలకు ఉత్తమ ఆధునిక విద్యను అందించారు. 1888లో షౌకత్ అలీ తన సోదరులు చదువుకుంటున్న అలీఘర్‌కు విద్యార్జన కోసం వెళ్ళి ఉత్తమ విద్యార్థిగా మాత్రమే కాకుండా ఉత్తమ క్రీడాకారునిగా రూపొందారు.

చిన్నప్పటి నుండే నాయకత్వ లక్షణాలను ప్రదర్శించిన ఆయన కళాశాల విద్యార్థి సంఘం నాయకులు కావటమే కాకుండా కళాశాల మ్యాగ్‌జైన్ సంపాదకులుగా బాధ్యతలు నిర్వహించారు. 1895లో బి.ఎ ఉత్తీర్ణత పొందిన ఆయన 1896 నుండి 17 ఏండ్లపాటు ప్రభుత్వ ఉద్యోగం చేశాక అలీఘర్ విద్యాలయం అభివృద్ధికి నిధులను రాబట్టేందుకు ఆగాఖాన్‌తో కలసి పర్యటనలు గావించేందుకు ఉద్యోగానికి రాజీనామా చేశారు.





1913లో 'కాబా సేవకుల సంఘం' ఏర్పాటు చేసి కాబా కట్టడాన్ని పరిరక్షించేందుకు, హజ్ యాత్రికులకు తగిన సౌకర్యాలు కల్పించటం కోసం ఎనలేని కృషిచేశారు. పరాయి పాలనలో మగ్గుతున్న ప్రజల స్థితిగతులను గమనించిన ఆయన బ్రిటీష్ ప్రభుత్వం మీద పోరాటానికి తన సోదరులు మౌలానా మహమ్మద్ అలీతో కలసి ఉద్యమించారు. మౌలానా ముహమ్మద్ అలీ సంపాదకత్వంలో నడుస్తున్న ఆంగ్ల వారపత్రిక 'కామ్రేడ్', ఉర్దూ దినపత్రిక 'హందర్ద్' నిర్వహణ బాధ్యతలను మౌలానా షౌకత్ అలీ చేపట్టారు.

ప్రథమ ప్రపంచ యుద్ధం సందర్భంగా అక్షరాయుధంతో ఆంగ్లపాలకుల మీద విరుచుకుపడినందున అలీసోదరులు 1915 మే15న అరెస్టయ్యారు. వారి ఆస్తిపాస్తులను జప్తుచేసి, వివిధ ప్రాంతాలలో వారిని నిర్బంధించి 1919 డిసెంబరులో విడుదల చేశారు. ఆ విధంగా విడుదలకాగానే ఆయన ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమంలో భాగస్వాములు అయ్యారు. ఈ సందర్భంగా ఆయనకు మహాత్మాగాంధీతో పరిచయం ఏర్పడింది. ఆ తరువాత మహాత్మునితో కలసి దేశపర్యటన గావించిన ఆయన అనర్గళ ప్రసంగాలతో, కార్యదీక్షతో ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమానికి జవం-జీవం అయ్యారు. ఆ కారణంగా 1921లో ఆయన మళ్ళీ అరెస్టయ్యారు.

నిక్కచ్చి మనిషిగా ప్రసిద్ధులైన షౌకత్ అలీ పండిట్ మోతిలాల్ నెహ్రూ రూపొందించిన 'నెహ్రూ కమిటీ నివేదిక' తో ఏకీభవించలేదు. తనకు నచ్చని విషయంలో ఏమాత్రం రాజీపడని ఆయన 1928లో జాతీయ కాంగ్రెస్‌కు దూరమయ్యారు. ఆ తరువాత మహాత్మాగాంధీతో కూడా సంబంధాలు సన్నగిల్లాయి. ఈ బేధాభిప్రాయాల వలన లాభించాలని ప్రయత్నించిన వ్యక్తుల కుయుక్తులను సాగనివ్వకుండా మౌలానా జాగ్రత్త పడ్డారు. 1929లో ఢిల్లీలో జరిగిన అన్ని పార్టీల సమావేశంలో క్రియాశీలక పాత్రను పోషించిన ఆయన 1932లో జెరుసలంలో ప్రపంచ ముస్లింల మహాసభను నిర్వహించారు.

భారత జాతీయ కాంగ్రెస్ నాయకులతో సరిపడక కాంగ్రెస్ నుండి పూర్తిగా బయటకు వచ్చిన ఆయన ముస్లిం లీగ్ వైపు మొగ్గుచూపారు. 'ఖిలాఫత్-యే-ఉస్మానియా' అను పత్రిక ద్వారా ముస్లిం జన సముదాయాల సంక్షేమం కోసం కృషిచేస్తూ పలు కార్యక్రమాలను రూపొందించారు. 1936లో సెంట్రల్ అసెంబ్లీ సభ్యులుగా భాధ్యతలు చేపట్టారు. ఆయన ఎక్కడున్నా, ఏ పదవిలోనున్నా ప్రజా సమస్యల పరిష్కారం విషయంలో ఏమాత్రం రాజీపడకుండా వ్యవహరించారు. నిర్మోహమాటిగా పేర్గాంచిన మౌలానా షౌకత్ అలీ తనదైన శైలిలో పయనిస్తూ 1938 నవంబరు 26న తనువు చాలించారు. ◆

# 54. బేగం షంషున్నీసా అన్సారి

## (- 1938)

**మా**తృభూమిని బ్రిటీష్ దాస్య శృంఖలాలనుండి విముక్తం చేయడానికి సాగిన స్వాతంత్ర్యోద్యమంలో ఉద్యమకారుల మహిళలు ప్రత్యక్షంగా కాకున్నా పరోక్షంగా సహాయ సహకారాలు అందిస్తూ ఉద్యమానికి జవసత్వాలను అందించడంలో తిరుగులేని పాత్రను నిర్వహించారు. ఆ కోవకు చెందిన దానగుణశీలి బేగం షంషున్నీసా అన్సారి.

ఆమె ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, ఢిల్లీకి చెందిన డాక్టర్ ముక్తార్ అహమ్మద్ అన్సారి భార్య. 1899లో డాక్టర్ అన్సారిని వివాహమాడిన ఆమె సాంప్రదాయక మత విద్యను అభ్యసించడంతోపాటు పర్షియన్, ఉర్దూ, అరబ్బీ బాషలలో ప్రావీణ్యం సంపాదించారు. సాహిత్య, రాజకీయ, సామాజిక గ్రంథాల పఠనం పట్ల ఆమెకు ఆసక్తి ఎక్కువ.

ఈ మేరకు సంతరించుకున్న పరిజ్ఞానం వలన సమకాలీన రాజకీయాల గురించి మహాత్మాగాంధీ లాంటి నేతలతో కూడా ఆమె చర్చించటం జరిగింది. ప్రముఖ నాయకులతో తన అభిప్రాయాలను పంచుకుంటూ, తన వైఖరి నాయకుల ధోరణికి విరుద్ధంగా ఉన్నా తన అభిప్రాయాన్ని స్పష్టం చేయడానికి ఆమె ఏమాత్రం వెనుకాడలేదు. జాతీయ, అంతర్జాతీయ రాజకీయ పరిణామాలను ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ భర్త అన్సారి





అభిప్రాయాలను కూడా ప్రభావితం చేసిన ప్రతిభావంతురాలు బేగం అన్సారి.

1921నాటి ఖిలాఫత్ ఉద్యమ కార్యక్రమాలలో పాల్గొనటం ద్వారా ఆమె జాతీయోద్యమంలో ప్రత్యక్షంగా ప్రవేశించి భర్తతోపాటుగా బహుముఖ పాత్ర నిర్వహించారు. ఢిల్లీ ఖిలాఫత్ కమిటీ మహిళా విభాగం అధ్యక్షురాలుగా ఉద్యమానికి, ఉద్యమకారుల కుటుంబాలకు ఆమె ఎనలేని సేవలందించారు. ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులు, అలీ సోదరుల మాతృమూర్తి ఆబాదిబానో బేగం ఢిల్లీ వచ్చిన సందర్భంగా మహిళలతో ప్రత్యేక సమావేశాలను నిర్వహించి ఖిలాఫత్ ఉద్యమం కోసం వేలాది రూపాయల విరాళాలను వసూలు చేసి ఆమెకు అందజేశారు.

భారత జాతీయ కాంగ్రెస్ సమావేశాల పట్ల కూడా ఆమె ప్రత్యేక ఆసక్తి చూపారు. భర్తతోపాటుగా ఆమె ప్రతి సమావేశానికి హాజరయ్యేవారు. డాక్టర్ అన్సారి ప్రారంభించిన Anjuman-i-Khuddam-Kaaba కార్యకలాపాలలో కీలకపాత్ర పోషించారు. ఆధునిక విద్యావిధానాలు, సాంప్రదాయక విద్యాపద్ధతుల మధ్య సమన్వయం ఏర్పరచడానికి, మక్కాలోని పవిత్రస్థలాలను పరిరక్షించి అభివృద్ధి పర్చేందుకు సాగిన కృషిలో తోడ్పాటు అందించిన ఈ సంస్థకు ఆర్థిక వనరులు సమకూర్చడానికి, ఉద్యమకారుల కుటుంబాలను ఆర్థికంగా ఆదుకోడానికి షంషున్నీసా బేగం ఎంతగానో శ్రమించారు.

జాతీయ కాంగ్రెస్ ఢిల్లీలో నిర్వహించిన జాతీయ స్థాయి కార్యక్రమాలు ఏవీకూడా ఆమె భాగస్వామ్యం, సహకారం, ఆతిధ్యం లేకుండా జరిగేవి కావు. ఈ సందర్భంగా అతిధులెవ్వరికీ ఎటువంటి అసౌకర్యం కలుగకుండా ప్రణాళికాబద్ధంగా ఆతిధ్యాన్ని, ఇతర సదుపాయాలను కల్పించటంలో ఆమె స్వయంగా శ్రద్ధవహించారు. ఆమె సేవాగుణం, సహకారం, కార్యదక్షతను ప్రస్తావిస్తూ 1931మార్చి 29నాటి **నవజీవన్** పత్రికలో గాంధీజీ స్వయంగా ఒక ప్రత్యేక వ్యాసం రాస్తూ, అందులో ఆమె దానశీలతను వివరిస్తూ '**అన్సారి బేగం సమక్షాన శ్రద్ధాభావనలతో నా తలను వంచుతున్నాను**' అని వ్యాసం ముగించారు.

1936లో డాక్టర్ ముక్తార్ అహమ్మద్ అన్సారి మరణించారు. భర్త మరణించినా ఆయన లేని లోటు కన్పించకుండా డాక్టర్ అన్సారి సమకూర్చిపెట్టిన సంపదను, తన అమూల్యమైన సమయాన్ని జాతీయోద్యమానికి అర్పితం చేశారు. ఆమెతో పరిచయమున్న ప్రతి ఒక్కరిచే '**పవిత్రమైన..దానగుణశీల మహిళ**' గా ప్రశంసలందుకున్నారు. డాక్టర్ అన్సారి '**ఎంతటి ఘనత సాధించినా అదంతా షంషున్నిసా అన్సారి సహకారంతో మాత్రమే**' నని ప్రముఖుల నుండి ప్రశంసలు, గౌరవాభిమానాలను అందుకున్న బేగం షంషున్నీసా అన్సారి 1938లో కాలధర్మం చెందారు. ◆

# 55. బేగం ఆలం

**(-)**

**స్వా**తంత్ర్యోద్యమంలో పాల్గొంటున్న మహిళలు తమ భర్తలతోపాటు తామూ జైళ్ళకు వెళ్ళడమే కాకుండా ఏదేని కారణంగా తమ భర్తలు జైళ్ళకు వెళ్ళకపోవడాన్ని అవమానం గా పరిగణించారు. ఆ విధంగా భావించి భర్తను జాతీయోద్యమానికి అంకితం చేయడంలో ఏమాత్రం వెనుకాడని మహిళామణులలో బేగం ముహమ్మద్ ఆలం ఒకరు.

ఆమె లాహోర్‌కు చెందిన ఖాన్ షేక్ మియా ఫిరోజుద్దీన్ కుమార్తె. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు డాక్టర్ ముహమ్మద్ ఆలం భార్య. అసలు పేరు కంటే బేగం ముహమ్మద్ ఆలం పేరుతో ఆమె ఎంతో ప్రఖ్యాతి చెందారు. ఖిలాఫత్-సహాయ నిరాకరణ ఉద్యమం సందర్భంగా కనకవర్షం కురిపిస్తున్న న్యాయవాద వృత్తిని త్యజించిన డాక్టర్ ఆలంతోపాటు బేగం ఆలం కూడా జాతీయోద్యమంలో ప్రవేశించారు.

1932లో అనారోగ్యంతో బాధపడుతున్న డాక్టర్ ఆలంను బ్రిటీష్ ప్రభుత్వం అరెస్టు చేసింది. జైలులో వైద్యసదుపాయం అందక డాక్టర్ ఆలం ఆరోగ్యం మరింత చెడింది. డాక్టర్ ఆలం గాని, ఆయన కుటుంబ సభ్యులు గాని స్వయంగా విజ్ఞప్తి చేస్తే తప్ప వైద్య సౌకర్యం కల్పించేది లేదని అధికారులు ఖరాఖండిగా చెప్పారు. డాక్టర్ ఆలం మాత్రం ఎటువంటి పరిస్థితులలోనూ తన వ్యక్తిత్వాన్ని చంపుకుని ప్రభుత్వానికి వినతిపత్రం





పంపుకునేది లేదని స్పష్టంగా ప్రకటించారు. భర్త ఆరోగ్యం పట్ల బేగం ఆలం ఆవేదన చెందుతునప్పటికి, భర్త అభిప్రాయాన్ని గౌరవిస్తూ ప్రభుత్వానికి ఎటువంటి అభ్యర్థనలు పంపలేదు. ఈ పట్టుదల మూలంగా డాక్టర్ ఆలంకు ఎటువంటి చికిత్స జరగకపోవడంతో సమయం గడిచే కొద్దీ ఆయన ఆరోగ్యం ప్రమాదకర స్థితికి చేరుకుని చివరకు రక్తం కక్కుకుంటూ ఆలం మృత్యువుకు సమీపం కాసాగారు.

ఆ పరిస్థితులలో బేగం ఆలంకు నచ్చచెప్ప ప్రయత్నించినా,పరాయి పాలకుల చెంత మోకరిల్లడానికి ఆమె ఇష్టపడలేదు. ఆ సమయంలో బేగం ఆలం నిరుపమాన దేశభక్తి, ఉద్యమకారుడైన భర్త దృఢనిర్ణయం పట్ల గల గౌరవం, ఆమెలోని అసమాన ధైర్యసాహసాలు బహిర్గతమయ్యాయి. ఈ సందర్భంగా బేగం ఆలం చేసిన ప్రకటన సంచలనం సృష్టించింది. ఆ ప్రకటన ఇలా సాగింది. మాతృభూమి **'స్వేచ్ఛాస్వాతంత్ర్యాల నిమిత్తం పోరాడుతున్న నా భర్త జీవితం తొలుత ఈ జాతి సొత్తు, ఆ తరువాత మాత్రమే నాది, మరెవరిదైనా. అందువలన నాభర్త జీవితాన్ని ఎలా ఉపయోగించుకోవాలన్నది జాతి జనులు నిర్ణయించాలి ...ప్రభుత్వాన్ని అర్థించి, నాభర్త నామీద ఉంచిన విశ్వాసాన్ని భంగపరుస్తూ, ఆయన త్యాగపూరిత దృఢ నిశ్చయానికి వ్యతిరేకంగా నేను వ్యవహరించ లేను...జరిగేదేదో జరగనివ్వండి. ఆ ఘోర విపత్తుకు బ్రిటీష్ ప్రభుత్వమే కారణం కానివ్వండి...నా భర్తను సింహంలా మృత్యువును స్వీకరించనివ్వండి...జాతి ప్రయోజనాలు, ఆత్మ గౌరవాభిమానాల పరిరక్షణ విషయంలో వ్యక్తిగత జీవితాలు అంత ప్రాముఖ్యం కావు...మాతృదేశ విముక్తి పోరాటంలో ధనమాన ప్రాణాలను బలిపెట్టాల్సి ఉంటుంది...అందుకు ఎవ్వరూ చింతించాల్సిన అవసరం లేదు సరికదా, మనమంతా మరింతగా గర్వపడాలి...బ్రిటీష్ వాళ్ళతో పోరాడినట్టే, మృత్యువుతో కూడా పోరాడి ఆయన విజయం సాధించగలరు. ఒకవేళ మృత్యువుదే పైచేయి అయినట్టయితే, గౌరవప్రదమైన జీవితం సాగించే ఉద్యమ కారునికి లభించే మరణం, పదికాలాల పాటు నికృష్టంగా గడిపే భయంకర బానిస జీవితం కంటే ఎంతో ఉన్నతమైంది'**

ఈ ప్రకటన అటు ప్రభుత్వ వర్గాలలోనూ ఇటు ప్రజలలోనూ సంచలనానికి కారణమైంది. బేగం ఆలం ధైర్యానికి, ఆమెలో దాగిఉన్న ఉద్యమ నిబద్ధతకు, భర్త నిర్ణయాల పట్ల గల గౌరవానికి జాతీయోద్యమకారులు, ప్రజలు జేజేలు పలికారు. ఆ విధంగా ఉద్యమకారులకు స్ఫూర్తిదాయక మార్గదర్శకం చేసిన బేగం ఆలం డాక్టర్ ఆలంతోపాటుగా విముక్తి పోరాటంలో భాగస్వామ్యం వహించి చిరస్మరణీయులయ్యారు. ◆

# 56. బేగం అమీనా తయ్యాబ్జీ

## ( 1866-1942)

బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో భాగంగా సాగిన సంస్కరణోద్యమాలలో ఆనాడు మహిళలు చురుగ్గా పాల్గొన్నారు. ఆ కార్యక్రమాలలో ఎంతో నిబద్ధతతోపాటుగా చక్కని కార్యదక్షతను ప్రదర్శించారు. ఆ కారణంగా సమర్థత గల అటువంటి మహిళలను మహాత్మా గాంధీ స్వయంగా ఉద్యమంలోనికి ఆహ్వానించి వారికి ఉద్యమాల నాయకత్వం బాధ్యతలను అప్పగించారు. అంతటి గౌరవాన్ని దక్కించుకున్న మహిళలలో అగ్రగణ్యులు బేగం అమీనా తయ్యాబ్జీ.

అమీనా తయ్యాబ్జీ గుజరాత్‌కు చెందిన ప్రసిద్ధ తయ్యాబ్జీల కుటుంబంలో 1866లో జన్మించారు. భారత జాతీయ కాంగ్రెస్ నాయకులు జస్టిస్ బద్రుద్దీన్ తయ్యాబ్జీ ఆమె తండ్రి కాగా మరో జాతీయోద్యమకారులు జస్టిస్ అబ్బాస్ తయ్యాబ్జీని ఆమెను వివాహం చేసుకున్నారు. తయ్యాబ్జీల కుటుంబంలో ఉన్న రాజకీయ వాతావరణం మూలంగా బేగం అమీనా జాతీయోద్యమం పట్ల చిన్ననాటనే ఆకర్షితురాలయ్యారు. తొలుత నుండి భారత కాంగ్రెస్ సభ్యురాలైన ఆమె స్థానికంగా భారత జాతీయ కాంగ్రెస్ కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొంటూ వచ్చారు.

ఆ సందర్భంగా అమీనాలో గల పట్టుదల గుజరాత్ మహిళలలో ఆమె పట్ల ఉన్న





గౌరవాన్ని గమనించిన గాంధీజీ 1930 ఏప్రిల్ 11న ఆమె కుమార్తె రెహనా తయ్యాబ్జీ పేరిట ఓ లేఖ రాస్తూ **'మద్యపాన నిషేధం, విదేశీ వస్తువుల బహిష్కరణ తదితర అంశాల మీద గుజరాత్ మహిళల సమావేశం ఏర్పాటు చేస్తున్నాను. ఆ సమావేశానికి నీవు, మీ అమ్మగారు తప్పక హాజరుకావాలి'** అని కోరారు. స్వయంగా మహాత్ముడు పంపిన ఆహ్వానాన్ని గౌరవిస్తూ అమీనా ఆ సమావేశానికి హజరయ్యారు. ఆ సమావేశం మద్యపాన నిషేధం, విదేశీ వస్తువుల బహిష్కరణ కోసం కృషి చేయాలని నిర్ణయిస్తూ తీర్మానించింది. ఆ సమావేశంలో గాంధీజీ సమక్షంలో గుజరాత్ మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలిగా అమీనా తయ్యాబ్జీ ఎంపికయ్యారు.

ఆ నిర్ణయాల మేరకు గుజరాత్ మహిళా కాంగ్రెస్ నేతగా అమీనా తయ్యాబ్జీ అన్ని కష్టనష్టాల కోర్చి మద్యపాన నిషేధం, విదేశీ వస్తువుల బహిష్కరణోద్యమానికి ప్రాణం పోశారు. గుజరాత్ అంతటా ధర్నా, పికెటింగ్, రాస్తారోకో లాంటి ఆందోళనా రూపాలతో ఉద్యమించి భారతదేశం మొత్తానికి గుజరాత్‌ను ఆదర్శప్రాయమైన మార్గంలో నిలిపారు. విదేశీ వస్తువుల బహిష్కరణకు ప్రత్యామ్నాయంగా ఖద్దరు వస్త్రధారణను ప్రోత్సహించారు. రాట్నం తిప్పటం, నూలు వడకటం, ఖద్దరు నేయటం, ఖద్దరు ధరించడం స్వయంగా ఆచరించి ఆయా కార్యక్రమాలకు అమీనా బహుళ ప్రాచుర్యం కల్పించారు.

ఆమె కృషి, కార్యదక్షతను గమనించిన గాంధీజీ తన **యంగ్ ఇండియా, నవజీవన్** పత్రికలలో **'గుజరాత్ మహిళలు మహత్తరమైన బాధ్యతను స్వీకరించారు. ఆ బరువును మహిళల పక్షాన అమీనా తయ్యాబ్జీ ఆమె కమిటీ భరించారు'** అని ప్రశంసించారు. ఈ ఉద్యమం నేపథ్యంలో మహిళా కాంగ్రెస్ పక్షాన వైస్రాయికి 24 మంది మహిళల సంతకాలతో పంపిన లేఖలో అమీనా తయ్యాబ్జీ సంతకాన్ని గాంధీజీ ప్రత్యేకంగా కోరడం ద్వారా జాతీయ స్థాయిలో ఆమె ప్రాధాన్యత వెల్లడయ్యింది. ఆ లేఖలో ఆమనా ఖురేషి, రెహనా తయ్యాబ్జీలు కూడా సంతకాలు చేశారు.

చివరి వరకు ఆమె తన భర్త అబ్బాస్ తయ్యాబ్జీతోపాటుగా జాతీయోద్యంలో పాల్గొన్నారు. ఉద్యమాలను దేశవ్యాప్తం చేయాలనుకునప్పుడల్లా ఆ ఉద్యమ కార్యకలాపాలను మహాత్ముడు తొలుత గుజరాత్‌లో నిర్వహించేవారు. ఆ సమయంలో అమీనా లాంటి మహిళా నేతలు ఆ ఉద్యమ కార్యక్రమాలను సమర్థవంతంగా నిర్వహించి మహాత్మునికి భరోసా ఇవ్వగలిగారు. ఈ మేరకు జీవిత చరమాంకం వరకు జాతీయోద్యమకారులకు ఆదర్శంగా నిలచిన అమీనా తయ్యాబ్జీ 1942లో కన్నుమూశారు. ◆

# 57. జులేఖా బేగం

## (1893- 1943)

**జా**తీయోద్యమంలో భర్తతో పాటు భుజం భుజం కలిపి సాగిన మహిళలు కొందరైతే, ఉద్యమకారుడైన భర్త దృష్టి కుటుంబ సమస్యల వైపుకు మళ్ళనివ్వకుండా ఉద్యమ కార్యకలాపాలలో నిమగ్నమయ్యేందుకు తగిన నైతిక బలాన్ని ప్రసాదించిన మహిళలు మరికొందరు ఉన్నారు. ఆ రెండవ కోవకు చెందిన మహిళలలో జులేఖా బేగం ఒకరు.

బేగం జులేఖా 1892-93 ప్రాంతంలో పశ్చిమ బెంగాల్‌లో జన్మించారు. చిన్న వయస్సులో అనగా 1900-01 ప్రాంతంలో ఆమెకు మౌలానా అబుల్ కలాం ఆజాద్‌తో వివాహం జరిగింది. జులేఖా బేగం వైవాహిక జీవితాన్ని ఆరంభించేందుకు మెట్టినింట అడుగు పెట్టేసరికి మౌలానా ఆజాద్ బ్రిటీషు వ్యతిరేక పోరాటంలో నిమగ్నమైఉన్నారు.

బ్రిటీషు వ్యతిరేక పోరాటాన్ని విప్లవోద్యమంతో ప్రారంభించిన ఆయన ఆ తరువాత మహాత్ముని మార్గంలో ముందుకు సాగారు. ఒకవైపు విప్లవకారునిగా, ఆ తరువాత అహింసా యోధునిగా, మరొకవైపు ప్రఖ్యాత ఉర్దూ పత్రిక **అల్ హిలాల్** సంపాదకునిగా, బహు గ్రంథ రచయితగా క్షణం తీరుబడి లేకుండా కార్యక్రమాలలో నిమగ్నం కాగా జులేఖా బేగం అన్ని విధాల, అన్ని కార్యక్రమాలలో మౌలానాకు జవం జీవమయ్యారు.

మౌలానా ఆజాద్ 1916లో మొట్టమొదటి సారిగా నిర్బంధానికి గురయ్యారు. అప్పటి





నుండి ఆరంభమైన ఆయన జైలు జీవితం పది సంవత్సరాలకు పైగా సాగింది. ఖిలాఫత్ ఉద్యమం సమయంలో మౌలానాను అరెస్టు చేశారు. ఆ సమయంలో కలకత్తా కేంద్రంగా ఆయన నిర్వహిస్తున్న కార్యక్రమాలను చేపట్టేందుకు ముందుకు వచ్చిన బేగం జులేఖా **'నా భర్త అరెస్టు వలన బెంగాల్ ఖిలాఫత్ కమిటీ కార్యక్రమాల నిర్వహణలో ఏర్పడిన ఖాళీని నా కృషితో భర్తీ చేస్తాను...ఈ నశ్వరమైన శరీరాన్ని ఖిలాఫత్ ఉద్యమానికి సంపూర్ణంగా అంకితం చేయాలని నిర్ణయించుకున్నాను'** అని గాంధీజీకి లేఖ రాశారు.

1923 ప్రాంతంలో ఒకసారి, 1939లో మరోసారి మౌలానా భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షులుగా ఎంపిక కావడం, ఆయన జాతీయోద్యమ అగ్రనేత కావడం, జాతీయ కాంగ్రెస్ కార్యక్రమాలన్నిటిలో ప్రధాన పాత్ర పోషించడం వలన మౌలానా కార్యకలాపాలు బాగా విస్తృతయ్యాయి. ఆయనకు ఇంటి గురించి గాని, ఇల్లాలు గురించి గాని, ఆమె ఆరోగ్యం గురించి గాని, ఆర్థిక పరిస్థితుల గురించి గాని పట్టించుకునే అవకాశం ఏమాత్రం లేకుండా పోయింది. ఆ బాధాకరమైన వాతావరణాన్ని ఏకాంతంగా భరిస్తూ, కష్టాలను సహిస్తూ, తమలాగే అవస్థలు పడుతున్న సాటి జాతీయోద్యకారుల కుటుంబాలకు నైతికబలాన్ని మాత్రమే కాకుండా ఆర్థికంగా తొడ్పాటు అందించారు.

1941లో జులేఖా బేగం అనారోగ్యం మరింత తీవ్రతరమయ్యింది. డాక్టర్ల సలహా మేరకు ఆమె కలకత్తా వదలి రాంచీ వెళ్ళి 1942 జూలై 31న తిరిగి కలకత్తాకు వచ్చీ రాకముందే 1942 ఆగస్టులో మౌలానా అఖిల భారత కాంగ్రెస్ సమావేశాలకు బొంబాయికి వెళ్ళాల్సి వచ్చింది. ఆమె అనారోగ్యం వలన ఎంతో బాధ పడుతున్నప్పటికీ, త్వరగా వస్తానంటూ బయలుదేరుతున్న మౌలానాకు ఎంతో ధైర్యం చెప్పి పంపారు.

ఆ తరువాత అరెస్టులు, జైళ్ళ కారణంగా వాగ్దానం చేసినట్టుగా మౌలానా ఇంటికి రాలేకపోయారు. ఆమె అనారోగ్యం మరింత తీవ్రతరమైంది. ఆ సమయంలో జైలులో ఉన్న మౌలానాకు జులేఖా బేగం పలు ఉత్తరాలు రాసినా ఎక్కడా తన అనారోగ్యం గురించి పేర్కొనలేదు. చివరకు వార్తాపత్రికల ద్వారా ఆ విషయం తెలుసుకున్న మౌలానాను పెరోల్ మీద విడుదల చేయడానికి ప్రభుత్వం కొన్ని ఆంక్షలు విధించింది. ఆ ఆంక్షలకు తలవంచి తనను చూడ రావద్దని జులేఖా భర్తకు సందేశం పంపడంతో ఆమె కనీసం పరామర్శించడానికి కూడా మౌలానా ఆమె వద్దకు రాలేకపోయారు.

1943 ఏప్రిల్‌లో ఆమె అనారోగ్యం తీవ్రతరమైంది. డాక్టర్ల ప్రయత్నాలు ఫలించలేదు. భర్త కడసారి చూపుకు కూడా నోచుకోకుండా ఏప్రిల్ 19న మౌలానాకు ఆత్మీయ నైతిక బలాన్ని, స్ఫూర్తిదాయక ప్రేరణను అందించిన జులేఖా బేగం చివరి శ్వాసవిడిచారు. ◆



# 58. అల్లా బక్ష్ సుంరో

## (1887-1943)

**మ**త రాజకీయాలు మనుషుల మస్తిష్కాలను కలుషితం చేసి, నిష్పాక్షికతను దూరం చేస్తాయని ప్రకటించిన నేరానికి మతోన్మాద రాజకీయ స్వార్థపరశక్తుల భయానక కుట్రలకు గురైన స్వాతంత్ర్యసమరయోధులలో గణుతికెక్కినవారు అల్లా బక్ష్ సుంరో.

ప్రస్తుత పాకిస్థాన్‌లో భాగమైన సింథ్ ప్రాంతం, శిఖాపూర్ పట్టణంలోని ఒక సంపన్న కుటుంబాన 1887లో ఆయన జన్మించారు. చిన్నతనంలోనే వ్యాపారంలోకి ప్రవేశించిన అల్లా బక్ష్, వ్యాపార దృక్పథానికి సేవా దృక్పథం జతచేయడం ఫలితంగా 23 సంవత్సరాల వయస్సులో ఆయన జాకోబాద్ పురపాలక సంఘం సభ్యునిగా ఎన్నికయ్యారు. ఆ విధంగా రాజకీయరంగ ప్రవేశం చేసిన ఆయన ఆ తరువాత అంచెలంచెలుగా ఎదిగారు.

1935లో భారత ప్రభుత్వ చట్టం ఉనికిలోకి వచ్చాక జరిగిన రాజకీయ పరిణామాల నేపథ్యంలో ఆయన సింథ్ ప్రాంతపు ప్రధాన మంత్రి అయ్యారు. చిన్న వయస్సులో ప్రజాప్రతినిధిగా ఎన్నికైన అల్లా బక్ష్ సుంరో, 38 సంవత్సరాల వయస్సులో సింథ్ ప్రధానమంత్రి పదవి చేపట్టి చరిత్ర సృష్టించారు.

ఆ తరువాతి క్రమంలో మతాలకు అతీతంగా విశాల దృక్పథంతో ప్రజల మన్ననలు చూరగొంటూ రాజకీయ రంగాన ముందుకు సాగిన అల్లాబక్ష్ జాతీయోద్యమం పట్ల





ఆకర్షితులయ్యారు. ఆయనను ఆకర్షించేందుకు అఖిల భారత ముస్లిం లీగ్ చేసిన పలు ప్రయత్నాలు విఫలమయ్యాయి. మతతత్త్వశక్తులతో చేతులు కలపడానికి నిరాకరించడంతో ఆయన ప్రభుత్వం కూలిపోయింది. ఆ తరువాత జరిగిన ఎన్నికలలో తిరిగి ఘన విజయం సాధించి సింథ్ ప్రధానిగా మరోకసారి అధికార పగ్గాలు చేపట్టారు.

అది రుచించని మహమ్మద్ అలీ జిన్నా ఆయనను ముస్లింలీగ్‌లో చేరమని పలుమార్లు స్వయంగా కోరారు. మతం ప్రాతిపదికన రాజకీయ పార్టీలు ఏర్పాటు చేయడం సుతరాము ఇష్టంలేని సుంరో మతాన్ని రాజకీయాలతో ముడిపెట్టడం ఇస్లాం సిద్ధాంతాలకు వ్యతిరేకమని ప్రకటించారు. ఈ సందర్భంగా మతోన్మాద రాజకీయాలను రెచ్చగొట్టి రాజ్యాధికారాన్ని నిలబెట్టుకోడానికి కుయుక్తులు పన్నుతున్న శక్తుల తీరు తెన్నులను అతి ఘాటైన పదజాలంతో విమర్శిస్తూ ఆయన రాసిన లేఖ భారతస్వాతంత్ర్యోద్యమ సాహిత్య చరిత్రలో అతి విలువైన డాక్యుమెంటుగా పరిగణించబడింది. మతతత్త్వ భావాలకు అతీతంగా 1940 ఏప్రిల్ మాసంలో ఢిల్లీలో జరిగిన 'ఆజాద్ ముస్లింల సమావేశం' లో పాల్గొన్న ఆయన ముస్లింలీగ్ ప్రతిపాదించిన విభజన తీర్మానాన్ని గట్టిగా వ్యతిరేకించారు.

1942లో 'క్విట్ ఇండియా' ఉద్యమం ఆరంభ కాగా ప్రజలను అణిచివేసేందుకు పరాయిపాలకులు సృష్టిస్తున్న రక్తపాతం, అనుసరిస్తున్న క్రూరమైన చర్యలను ఆయన బహిరంగంగా నిరసించారు. జాతీయోద్యమంలో భాగంగా మహాత్మాగాంధీ సూచనల మేరకు అల్లా బక్ష్ ఖాదిని, ఖాది ఉత్పత్తిని, విక్రయాలను ప్రోత్సాహించేందుకు స్వయంగా సదుంకట్టారు. జాతీయోద్యమ కార్యక్రమాలను సమర్థవంతంగా ప్రజలోకి తీసుకెళ్ళటం, ప్రభుత్వం గతంలో ఇచ్చిన బిరుదులను విసర్జించటం, అతిఘాటైన పదజాలంతో పాలక వర్గాల దుశ్చర్యలను విమర్శించడాన్ని ఆంగ్ల పాలకులకు మింగుడు పడలేదు. ఈ వైఖరి నచ్చని ముస్లింలీగ్ నేతలు ఆయన విమర్శను తట్టుకోలేక ఆగ్రహావేశాలు వ్యక్తం చేయసాగారు. ఆ పరిస్థితులలో రానున్న దుష్పరిణామాల పట్ల సన్నిహితులు హెచ్చరించినా ఆయన ఖాతరు చేయలేదు, ఆత్మరక్షణకు జాగ్రత్త చర్యలేవీ తీసుకోలేదు.

ఆ కారణంగా సన్నిహితులు భయపడినట్టే మేధోపరంగా ఆయనను ఎదుర్కొన లేకపోయిన అరాచక ఉన్మాదశక్తులు భౌతికచర్యలకు పాల్పడి 1943 మే 14 న సుంరోను కాల్పులకు గురిచేశాయి. ఈ ఘాతుక చర్యతో బ్రిటిష్ ఇండియాలో ప్రముఖ ప్రధానిగా ఖ్యాతిగడించి, మతోన్మాద, వేర్పాటువాద రాజకీయశక్తులతో చివరివరకు రాజీలేని పోరాటం సాగించి, విభజన ఆలోచనలను ఆదినుంచి వ్యతిరేకించిన అల్లా బక్ష్ సుంరో రాజకీయ చిత్రపటం నుండి ఆకస్మికంగా అంతర్థానమయ్యారు. ◆



# 68. మౌలానా ఒబైదుల్లా సింధీ

## (1872-1944)

**జా**తీయోద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన పలువురు నాయకులకు పుట్టినిల్లుగా ఖ్యాతిగాంచిన దేవ్‌బంద్ '**దారు-ఉల్-ఉలూమ్**' నుండి భారత స్వాతంత్ర సంగ్రామం లోకి దూసుకు వచ్చిన **విప్లవాగ్ని శిఖ** మౌలానా ఒబైదుల్లా సింధీ.

ప్రస్తుత పాకిస్తాన్‌లోని సియోల్‌కోట్ జిల్లా చియాన్వాలి గ్రామంలో 1872 మార్చి 10న ఒబైదుల్లా సింధీ జన్మించారు. సిక్కు కుటుంబానికి చెందిన ఆయన 8 వ తరగతి చదువుతున్నప్పుడు మౌలానా ఇస్మాయిల్ షాహిద్ రాసిన Taqwiat-ul-Imag గ్రంథంలో చదివి దాని వల్ల ప్రభావితుడై ఆ తరువాత 1887లో ఇస్లాం మతం స్వీకరించారు.

మహమ్మద్ సిద్దిఖీ అను గురువు వద్ద కొంతకాలం విద్యాభ్యాసం తరువాత, పదిహేడు సంవత్సరాల వయస్సులో దేవ్‌బంద్‌లోని 'దారు-ఉల్-ఉలూం'లో విద్యార్థిగా ప్రవేశం పొందారు. ఈ విద్యాసంస్థ ప్రధానాచార్యుడైన మౌలానా మహమ్మదుల్ హసన్ ప్రభావంతో ఆయనలోని విప్లవభావాలు మరింతగా వికసించాయి. గురువు ఆదేశం మేరకు 'దారు-ఉల్-ఉలూం'లో ఉపాధ్యాయుడిగా పనిచేశారు. ఆ తరువాత మౌలానా హసన్ మార్గదర్శకంలో బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలకు యువతను సిద్ధం చేసేందుకు ఉద్దేశించబడిన పలు సంస్థలను ఏర్పాటు చేసి వాటిని సమర్థవంతంగా నిర్వహించారు.





1915లో మౌలానా హసన్ పథకం మేరకు ఆయన ఆఫ్గనిస్థాన్‌కు వెళ్ళారు. ఆఫ్గనిస్థాన్ నుండి పరాయిపాలకులకు వ్యతిరేకంగా విజృంభించమని స్వదేశీయులను రెచ్చగొడుతూ, అందుకు కావాల్సిన మద్దతును, సాధన సంపత్తిని కూడగట్టసాగారు. బ్రిటీష్ ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలను స్థానిక భారతీయ విప్లవకారులతో కలసి ముమ్మరం చేశారు. ఆ క్రమంలో 1916లో రాజా మహేంద్ర వర్మ, ప్రొఫెసర్ బర్కతుల్లా భూపాలి తదితరులతో కలిసి ప్రప్రథమ ప్రవాస భారత ప్రభుత్వాన్ని కాబూల్ కేంద్రంగా ఏర్పాటు చేశారు. ఆ ప్రభుత్వంలో ఆయన విదేశీ రక్షణ వ్యవహారాల మంత్రిత్వ శాఖ చేపట్టారు.

ఈ సందర్భంగానే భారత స్వాతంత్ర్యసంగ్రామంలో '**సిల్క్ అక్షరాల కుట్ర**' గా ఖ్యాతి గాంచిన విప్లవ కార్యక్రమాన్ని రూపొందించటంలో ఒబైదుల్లా ప్రముఖ పాత్ర వహించారు. విప్లవకారుల ప్రయత్నాలు విజయవంతం కాకపోవటంతో పలువురు నేతల మీద 'కుట్ర' కేసులు నమోదయ్యాయి. మౌలానా సింధీ అజ్ఞాతంలోకి వెళ్ళాల్సివచ్చింది. ఆయనను ప్రమాదకర వ్యక్తిగా పరిగణించిన బ్రిటీష్ పాలకులు, ఆఫ్గనిస్థాన్ నుండి బయటకు పంపేందుకు గాని, వీలుచిక్కితే అంతమొందించటానికి ప్రయత్నాలు సాగించారు. ఆ ఒత్తిడి వలన ఒబైదుల్లా సింధీ చివరకు ఆఫ్గనిస్థాన్‌ను విడిచి మాస్కో చేరుకున్నారు.

ఈ విధంగా బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధ పోరాట కార్యకలాపాలను కొనసాగిస్తూ వచ్చిన మౌలానా 1926లో ఇటలీ మీదుగా హిజాజ్ చేరుకున్నారు. అరేబియాలో విప్లవ కార్యకలాపాలను నిర్వహిస్తూ 12 సంవత్సరాల పాటు గడిపారు. ఈ విధంగా స్వాతంత్ర్య సముపార్జన లక్ష్యంతో మొత్తం మీద 24ఏండ్ల పాటు ప్రవాస జీవితం గడిపిన మౌలానా సింధీ 1939లో స్వదేశానికి తిరిగి వచ్చారు. మతం ప్రాతిపదికన దేశాన్ని చీల్చటం సరికాదన్నారు. ఆయన 'లీగ్' వేర్పాటువాదాన్ని విమర్శించారు. అన్ని జాతుల ప్రజలు సత్సంబంధాలతో కలసిమెలసి జీవించాలన్నారు. ఈమేరకు విభిన్న సాంఘిక సమూహాలు నివశిస్తున్న భారత దేశానికి అనువైన రాజ్యాంగం ముసాయిదాను ఆయన రూపొందించారు. ఆ రాజ్యాంగం మన దేశానికి సరైనది మాత్రమే కాకుండా చాలా ఉన్నతమైనదని జవహర్‌లాల్ నెహ్రూ లాంటి ప్రముఖుల ప్రశంసలను అందుకుంది. ఈ సందర్భంగా ప్రజల-పండితుల ప్రసంసలు అందుకున్న పలు గ్రంథాలను రచించారు.

ఈ విధంగా స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో అతి సుదీర్ఘకాలం ప్రవాస జీవితం గడిపిన అసమాన విప్లవకారుడిగా ఖ్యాతిగడించిన మౌలానా ఒబైదుల్లా సింధీ తాను కలలుగన్న స్వతంత్ర భారతదేశ పతాక రెపరెపలు చూడకుండానే, తీవ్ర అస్వస్థతకు లోనై 1944 ఆగస్టు 22న కన్నుమూశారు. ◆



# 60. మౌల్వీ ఉమర్ అలీషా

## (1885-1945)

**అ**టు జాతీయోద్యమం, ఇటు ఆధ్యాత్మికోద్యమం మరోవైపు సాహిత్యోద్యమం, ఇంకో వైపు సంఘ సంస్కరణోద్యమం, చివరకు రాజకీయోద్యమాలను ఏకబిగిన సాగించి బహుముఖ ప్రజ్ఞాశాలిగా ఖ్యాతిగడించిన అరుదైన యోధులు మౌల్వీ ఉమర్ అలీషా.

1885 ఫిబ్రవరి 28న, ఆంధ్రప్రదేశ్‌లోని తూర్పుగోదావరి జిల్లా పిఠాపురంలో ఆయన జన్మించారు. చిన్నవయస్సులోనే కవితల్లల్లడం ఆరంభించి 'కవిగారు' అని పిలవబడ్డారు. పిఠాపురంలో ఉన్నత పాఠశాల వరకు మాత్రమే విద్యాభ్యాసం చేసిన ఆయన ఆ తరువాత పండితుల సహచర్యంలో సాహిత్యస్రష్టగా రూపొందారు. బహు భాషాకోవిదునిగా ఘనత వహించారు. జాతీయ భావం, సమానత్వం, సర్వమానవ సౌభ్రాతృత్వం, సర్వమత సమ భావనలతో పాటుగా సామాజిక రుగ్మతలకు వ్యతిరేకంగా, మహిళాభ్యుదయాన్ని, ప్రజా చైతన్యాన్ని కాంక్షిస్తూ అసంఖ్యాకంగా రచనలు చేశారు. మతసామరస్యం ఆకాంక్షిస్తూ, మతం పేరుతో సాగుతున్న దాష్టీకాలను ఉమర్ అలీషా తీవ్రంగా నిరసించారు.

నాలుగు పదులు దాటని వయస్సులోనే ఉమర్ అలీషా విద్వత్తుగల ప్రముఖునిగా వెలుగొందటంతో 1924లో All India Oriental Conference లో 'పండిట్' బిరుదుతో సత్కరించగా, అలీఘర్ విశ్వవిద్యాలయం 'మౌల్వీ' బిరుదు ఇచ్చింది. ఫ్రాన్స్‌కు చెందిన





ఆర్యన్ విశ్వవిద్యాలయం Professor in Hindu-Muslim Culture అవార్డును, Academia International America ఆయనకు Dorctor of Literature ను ప్రకటించి గౌరవించాయి.

మహాత్మాగాంధీ స్ఫూర్తితో 1916లో భారత జాతీయ కాంగ్రెస్ సభ్యత్వం స్వీకరించిన ఆయన జాతీయోద్యమంలో భాగంగా జాతీయ కాంగ్రెస్ పిలుపు మేరకు సాగిన ఉద్యమ కార్యక్రమాలన్నిటిలో ప్రముఖంగా పాల్గొన్నారు. ఆధ్యాత్మిక-సాహిత్య రంగాలలో నిమగ్నమైన ఉమర్ అలీషా, తన చుట్టూ గిరి గీసుకుని ఏనాడు కూర్చోలేదు. సమకాలీన రాజకీయ పరిణామాలకు ఆయన కవిగా, పౌరునిగా, నాయకునిగా స్పందించారు.

1923-1924లో కాకినాడలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ సభలో అఖిల భారత ఖిలాఫత్ కమిటి ప్రధాన కార్యదర్శిగా, ముస్లిం లీగ్ మద్రాసు శాఖకు ఉపాధ్యక్షునిగా, ప్రధాన కార్యదర్శిగా నాయకత్వం వహించారు. ఖిలాఫత్ వాలంటీర్ కోర్ కు కెప్టెన్‌గా నియమితులయ్యారు. ఈ సందర్భంగా మంచి వాగ్ధాటిగల ఆయన తన ప్రసంగాలతో ప్రజలను జాతీయోద్యమం దిశగా కార్యోన్ముఖులను చేస్తూ పలు ప్రాంతాలు పర్యటించారు.

జాతీయోద్యమ కాలం నాటి ప్రజా పోరాటాలకు స్పందిస్తూ, దేశభక్తి ప్రపూరితమైన పద్యాలను రాశారు. ఉమర్ అలీషా వ్యక్తం చేసిన రాజకీయ భావాలను గమనించిన గాంధీజీ '**ఉదాత్తమైన రాజకీయ భావాల వ్యక్తి**' గా ఆయనను ప్రశంసించారు. 1928 తరువాత జాతీయోద్యమ కార్యక్రమాలకు కొంచెం దూరమైన ఆయన 1930 తరువాత భారత జాతీయ కాంగ్రెస్‌కు రాజీనామా చేశారు. 1935లో అఖిల భారత శాసనసభకు ఎన్నికలు రాగా స్వతంత్ర అభ్యర్ధిగా పోటీచేసి విజయం సాధించాక ముస్లిం లీగ్ నేత మహ్మదాలి జిన్నా నాయకత్వాన్ని అంగీకరిస్తూ ముస్లిం లీగ్‌లో చేరారు.

భారత శాసనసభలో ఆయన కన్నుమూసే వరకు అనగా దశాబ్దం పాటు ప్రజా ప్రతినిధిగా బాధ్యతలను సమర్ధవంతంగా నిర్వర్తించారు. చట్టాల రూపకల్పన జరుగుతున్నప్పుడు సంస్కృతం, పర్షియన్, అరబిక్, ఉర్దూ తదితర భాషలలో మంచి పండితుడుగా ఖ్యాతిగాంచిన ఆయన సలహాలను సెంట్రల్ అసెంబ్లీ గౌరవంగా స్వీకరించింది. ప్రజాప్రయోజనాలకు మాత్రమే అత్యధిక ప్రాధాన్యతనిస్తూ నిజాయితీపరుడైన మంచి ప్రజాప్రతినిధిగా డాక్టర్ ఉమర్ అలీషా పేరుగడించారు.

గుంటూరు జిల్లా తెనాలిలో ముస్లింలీగ్ రాష్ట్రశాఖ ఆహ్వానం మేరకు పాల్గొన్న ఆయన చివరి రాజకీయ ప్రసంగం చేసి పశ్చిమ గోదావరి జిల్లా నరసాపురం వెళ్ళారు. నరసాపురంలో మౌల్వీ ఉమర్ అలీషా 1945 జనవరి 23న ఆకస్మికంగా తనువు చాలించారు. ◆

# 61. యం. అబ్దుల్ రహిమాన్

## (1898-1945)

**భా**రత స్వాతంత్ర్యసంగ్రామంలో కలకలం సృష్టించిన మలబారు మోప్లాల చారిత్రిక తిరుగుబాటు వారసత్వాన్ని అణువణువునా నింపుకొని బ్రిటీష్ వ్యతిరేక పోరాటాల బాటన సాగిన మలబారు యోధులలో ఒకరు ముహమ్మద్ అబ్దుల్ రహిమాన్.

1898 లో కేరళ రాష్ట్రంలోని కనంగనోర్ సమీపాన గల అజికోడ్ (AZHIKODE)లో జన్మించారు. ఆ సమయంలో మలబారు మోప్లా జనసముదాయం ఒకవైపు భూస్వాములైన జెన్మిలతో మరోకవైపు వలస పాలకులైన బ్రిటీషర్లతో పోరాడుతున్నారు. ఈ పోరాటాల ప్రభావం నుంచి తప్పించుకోలేని అబ్దుల్ రహిమాన్ స్వతంత్ర భావనలను, బ్రిటీష్ వ్యతిరేకతను పుణికిపుచ్చుకున్నారు. ఆయన గాంధీజీ సిద్దాంతాల పట్ల బాగా అకర్షితులయ్యారు. ఉన్నత చదువుల కోసం అలీఘర్ వెళ్లిన ఆయన గాంధీజీ పిలుపు మేరకు ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమంలో పాల్గొనడానికి కళాశాలను వదలి 1920లో స్వస్థలం చేరుకున్నారు.

ఆ సమయాన కేరళ రాష్ట్రంలోని మలబారు ప్రాంతంలో మోప్లా ప్రజానీకం బ్రిటీష్ బలగాల మీద తిరగబడి వీరోచిత పోరాటాలు సాగిస్తున్నారు. బ్రిటీష్ సైనిక బలగాల క్రూరత్వం వలన, జాతీయ కాంగ్రెస్ వ్యవహార సరళి వలన మోప్లా ప్రజానీకం





జాతీయవాదులైన కాంగ్రెస్ నాయకులంటేనే మండి పడుతున్న తరుణంలో కేరళ ఖిలాఫత్ కమిటి ప్రధాన కార్యదర్శిగా ఆయన బాధ్యతలను స్వీకరించారు. సాయుధపోరాటాల ద్వారా మోప్లా యోధులు సాధించేదేమీ లేదంటూ అహింస, లౌకిక, జాతీయవాద సిద్ధాంతాలకు కట్టుబడి వ్యవహరిస్తూ ప్రజలను అహింసోద్యమం పట్ల ప్రభావితుల్ని చేశారు.

బ్రిటీష్ ప్రభుత్వం, బ్రిటీష్ సైనికులు హింసాత్మక చర్యలను రెచ్చగొడుతూ, మత సామరస్యానికి, హిందూ-ముస్లింల ఐక్యతను విచ్ఛిన్నం చేసేందుకు తప్పుడు ప్రచారం సాగిస్తున్నారని ఆగ్రహించిన ఆయన ప్రభుత్వ చర్యలను దుయ్యబట్టారు. ఆ కారణంగా అబ్దుల్ రహీం తన జీవితకాలంలో పలుమార్లు జైలుశిక్షలను అనుభవించారు.

1922 జనవరి తరువాత నుండి మోప్లా జనసముదాయాలను జాతీయోద్యమం దిశగా నడిపించేందుకు భారత జాతీయ కాంగ్రెస్ నాయకునిగా బాధ్యతలను స్వీకరించి లక్ష్య సాధన కోసం నడుం కట్టారు. అహింసోద్యమ ప్రచారం కోసం ఆయన పలు పత్రికలను నడిపారు. ఆ పత్రికల ద్వారా ప్రజలలో నూతన చైతన్యానికి నాంది పలికారు.

1930లో కేరళ ప్రాంతీయ కాంగ్రెస్ కమిటీ ఉప్పుసత్యాగ్రహం ప్రకటించగా ప్రభుత్వ ప్రభావానికి లోనైయున్న ప్రజలు ప్రభుత్వాధికారుల మద్దతుతో సమావేశాలను, సభలను భగ్నం చేశారు. ఆ సమయంలో కేరళలో అడుగు పెట్టేందుకు నాయకులు భయపడుతున్న సమయంలో అబ్దుల్ రహిమాన్ కేరళలో పర్యటించారు. ఆలోచనాత్మక, ఉత్తేజపూరిత ప్రసంగాలతో తమ సందేశాన్ని ఆయన ప్రజలకు చేర్చగలిగారు. మలబార్ మోప్లాలలో జాతీయ భావాలను పెంపొందించడంతోపాటు వారి భాగస్వామ్యంతో ఉప్పు సత్యాగ్రహంలో భాగంగా 1930 మే 12వ తేదిన కాలికట్ సముద్రతీరంలో ఉప్పును తయారు చేశారు.

ఆ తరువాత గాంధీ ప్రబోధంతో ఆయన సాంఘిక సంస్కరణోద్యమం మీద దృష్టి సారించారు. దళితోద్ధరణకు, హిందూ-ముస్లింల ఐక్యతకు కృషిచేశారు. జాతీయ విద్యా విధానాన్ని దేశం మొత్తం మీద వ్యాపింపచేయాలని ఆయన అభిలషించారు. జ్ఞానార్జన ద్వారా మాత్రమే అజ్ఞానం నుండి బయట పడతాడతామని ప్రజల్లో ప్రచారం గావించారు. ఆ లక్ష్యంతో పనిచేసే సంస్థలను, వ్యక్తులను ఆయన ఎంతగానో ప్రోత్సహించారు.

దయార్ద్ర హృదయుడైన ఆయన తన ఆస్తిపాస్తులను పూర్తిగా జాతీయోద్యమ కార్యక్రమాల కోసం, సహచరుల కోసం త్యాగం చేసి అతి సామాన్య కార్యకర్తగా జీవితం గడిపారు. ప్రజల స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలను ఆకాంక్షిస్తూ మలబారు సాయుధ పోరాట యోధులను మహాత్ముని బాటలో అహింసోద్యమకారులుగా మారడానికి కారణమైన అహింసోద్యమ నేత అబ్దుల్ రహిమాన్ 1945 నవంబర్ 22న కన్నుమూశారు. ◆



# 62. ముహమ్మద్ ఇస్మాయిల్

## (1892-1948)

**మ**హాత్ముని మార్గదర్శకత్వంలో ఖద్దరు ధారణ, ఖద్దరు ప్రచారాన్ని, ఖద్దరు విక్రయాన్ని స్వచ్ఛందంగా స్వీకరించి **ఖద్దరు**తో తన పేరు పెనువేసుకుని చివరకు **ఖద్దరు ఇస్మాయిల్**గా ప్రసిద్ధిగాంచిన ప్రముఖులు ముహమ్మద్ ఇస్మాయిల్.

ఆంధ్రప్రదేశ్ గుంటూరు జిల్లా నకరికల్లు గ్రామంలో 1892లో ముహమ్మద్ ఇస్మాయిల్ జన్మించారు. తండ్రి మహమ్మద్ మస్తాన్ సాహెబ్ పోలీసు కానిస్టేబుల్. తల్లి కులుసుం బీబి. గాంధీజీ పట్ల ప్రత్యేక ఆసక్తిని ప్రదర్శిస్తూ వచ్చిన ఇస్మాయిల్ తిన్నగా జాతీయ ఉద్యమం పట్ల ఆకర్షితులయ్యారు. బట్టల వ్యాపారం చేస్తూ, తన చిన్ననాటి మిత్రులు వేల్పుల గంగయ్యతో కలసి జాతీయోద్యమంలో పాల్గొన్నారు. గాంధీజీ స్ఫూర్తితో ఖద్దరు ఉత్పత్తిని, వాడకాన్ని ప్రోత్సహించేందుకు నడుం కట్టారు. ఆ కృషిలో భాగంగానే తెనాలిలో ఖాదీ షాపును ఆరంభించి, వ్యాపార దృష్టితో కాకుండా ప్రత్యేక లక్ష్యంతో దాన్ని నడిపారు. రాట్నం, దారం తీయటానికి దూది, చిలపలు, తకలీలు తదితర సామగ్రిని తెచ్చి, ఆసక్తిగల వారికి అందుబాటులో ఉంచారు. ఖద్దరు తయారీని, గ్రామీణ కుటీర పరిశ్రమలను ప్రోత్సహించేందుకు గ్రామాలు తిరిగారు. ఖద్దరు తయారికి అవసరమైన సామగ్రిని తెచ్చి ఆసక్తి గలవారికి అందించి సహకరించారు. ఆయన స్వయంగా ఖద్దరు ధరించడం





కాకుండా ప్రతి ఒక్కరిని ఖద్దరు ధరించమని అభ్యర్థించారు. భార్య హజరాబీబి తోసహా జీవితాంతం ఖద్దరు ధరించారు. ఈ మేరకు ప్రచార కార్యక్రమాలను నిర్వహించారు. ఈ విషయమై ముస్లింలీగ్ చే ప్రభావితులైన స్థానిక ముస్లింలు ఆయనను వ్యతిరేకించడమే కాకుండా సాంఘిక బహిష్కరణకు గురిచేశారు. అయినా ఖద్దరు ఇస్మాయిల్, ఆయన భార్య హాజరా బీబి ఏమాత్రం భయపడకుండా జాతీయోద్యమంలో భాగస్వాములయ్యారు.

గుంటూరు జిల్లాలో ముహమ్మద్ ఇస్మాయిల్ తొలి ఖాదీ షాపును 1926లో ప్రారంభించారు. ఖద్దరు దుకాణం ప్రారంభించడానికి ప్రేరణ ఏమిటన్న ప్రశ్నకు హాజరా బీబి సమాధానమిస్తూ, **రాట్నం వడికితే స్వాతంత్ర్య వస్తుందన్నారు మహాత్మా గాంధీ. ఆయన మాట మాకు వేదవాక్కు...అందువల్లే ఖద్దరు వాడకాన్ని ప్రోత్సహించేందుకు ఖద్దరు షాపు ను ప్రారంభించాం** అన్నారు. ఆ రోజుల్లో తెనాలిలోని స్వాతంత్ర్య సమర యోధులకు ఇస్మాయిల్ ఖాదీ షాపు రహస్య కూడలి కేంద్రమయ్యింది. ఆ క్రమంలో ముహమ్మద్ ఇస్మాయిల్ కాస్తా **ఖద్దర్ ఇస్మాయిల్** అయ్యారు.

జాతీయోద్యమంలో ముహమ్మద్ ఇస్మాయిల్ చురుకుగా పాల్గొన్నారు. శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్న ఇస్మాయిల్‌ను పోలీసులు అరెస్టు చేసి, 18 మాసాల కారాగారవాస శిక్ష విధించారు. ఆ శిక్షతో ఆరంభమైన ఆయన జైలు జీవితం మొత్తం మీద ఆరు సంవత్సరాల పాటు సాగింది. తెనాలి, గుంటూరు, రాజమండ్రి, బళ్ళారి, తిరుచినాపల్లి, రాయవెల్లూరు తదితర జైళ్ళల్లో ఆయన పలుసార్లు శిక్షను అనుభవించారు.

జాతీయ భావాలు కలిగిన ఇస్మాయిల్ తీరుతెన్నులు నచ్చని ముస్లిం లీగ్ విధానాలతో ప్రభావితులైన కొందరు కాంగ్రెస్ రాజకీయాలను మానుకొమ్మని ఆయనను హెచ్చరించారు. ఆ హెచ్చరికలను ఏమాత్రం ఖాతరు చేయలేదు. ఆయన తన యావత్తు కుటుంబాన్ని మతతత్త్వ రాజకీయాలకు అతీతంగా ముందుకు సాగనిచ్చారు. ఆ ధోరణి నచ్చని కొందరు ఆయనకు ప్రాణాపాయస్థితి కూడా కల్గించారు. ఆ చర్యలకు ఏమాత్రం లొంగని ఇస్మాయిల్ జీవిత చరమాంకం వరకు జాతీయ భావాలతో లౌకిక వ్యవస్థ పట్ల అచంచల విశ్వాసంతో నడుచుకున్నారు.

ముహమ్మద్ ఇస్మాయిల్ రాయవెల్లూరు జైలులో ఉండగా **కామెర్ల** వ్యాధి సోకింది. ఆ వ్యాధి బాగా ముదరటంతో ప్రభుత్వం ఆయనను విడుదల చేసింది. ఆ వ్యాధి తీవ్రత నుండి ఖద్దరు ఇస్మాయిల్ మళ్ళీ కోలుకోలేదు. అనారోగ్యంతో బాధపడుతూ స్వతంత్ర స్వాతంత్ర్యం కోసం పోరాడిన జాతీయోద్యమకారులు ముహమ్మద్ ఇస్మాయిల్ చివరకు స్వతంత్ర భారతంలో 1948 నవంబరు 19న ఆఖరిశ్వాస వదిలారు. ◆



# 63. షోయాబుల్లా ఖాన్

## (1920-1948)

ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా అక్షరాయుధాలను ఎక్కుపెట్టి ప్రాణాలు కోల్పోయిన పాత్రికేయునిగా ముహమ్మద్ బాకర్ చరిత్ర సృష్టించగా, వేర్పాటువాద భావాలకు వ్యతిరేకంగా అక్షరాలనే ఆయుధాలుగా మలచుకుని పోరాటం సాగించి అమరత్వం పొందిన అరుదైన కలం యోధులు షోయాబుల్లా ఖాన్.

1920 అక్టోబరు 17న ఖమ్మం జిల్లాలో షోయాబుల్లా జన్మించారు. తండ్రి హబీబుల్లా ఖాన్ పోలీసు అధికారి. కుమారుడిలో మహత్ముని పోలికలున్నాయని బిడ్డకు **షోయబుల్లా గాంధీ** అని పిలుచుకున్నాడాయన. చిన్నతనం నుండే, మహాత్మాగాంధీ గురించి వింటూ ఆయన అహింసా సిద్ధాంతాలకు షోయాబ్ ప్రభావితులయ్యారు. ఉస్మానియా నుండి గ్రాడ్యుయేషన్ చేసిన ఆయనకు నిజాం సంస్థానంలో మంచి హోదాగల ఉద్యోగం లభించే అవకాశం ఉన్నా ఉద్యోగం వలదంటూ జాతీయోద్యమానికి తన వంతు సేవలను అందించటానికి జర్నలిజంను ప్రధాన వృత్తిగా స్వీకరించారు.

జాతీయ భావాలను, ఆ దిశగా రాయబడిన వ్యాసాలను ప్రోత్సహిస్తున్న **తేజ్** ఉర్దూ వారపత్రికలో షోయాబుల్లా పనిచేశారు. నిజాం నవాబు, ఆయన తాబేదార్లయిన రజాకారుల అమానుష కృత్యాలను ఘాటుగా విమర్శిస్తూ వ్యాసాలు రాశారు. ప్రభువుల చర్యలను విమర్శించే ఆయన వ్యాసాలు సహజంగానే పాలక వర్గాలకు రుచించలేదు. చివరకు ఆ





పత్రికను నిజాం నిషేధించగా మందుముల నరశింగరావు ఆధ్వర్యంలో నడుస్తున్న **రయ్యత్** అను ఉర్దూపత్రికలో చేరిన ఆయన తనదైన మార్గంలో పాలకవర్గాల దాష్టీకాలను, రజాకారుల దుర్మార్గాలను తీవ్రంగా ఎండగడ్తూ రచనలు చేశారు. చివరకు రయ్యత్ పత్రిక కూడా పాలకవర్గాల ఆగ్రహానికి గురయ్యి మూతపడింది.

ప్రజల పక్షంగా జాతీయ భావాలను పెంపొందించగల దినపత్రిక కోసం భార్య, తల్లి ఆభరణాలను అమ్మి **ఇమ్రోజ్** (నేడు) అను ఉర్దూ దినపత్రికను 1947 నవంబరు 15న షోయాబుల్లా ఖాన్ ఆరంభించారు. ఆర్థిక ఇబ్బందులు చుట్టుముట్టుతున్నా, ఎంతో పట్టుదలతో ఆయన ఇమ్రోజ్‌ను ప్రజల పత్రికగా తీర్చిదిద్దారు. ప్రజల పక్షం వహించిన ఆయన నిరంకుశత్వం, మత దురహంకారం మీద తిరుగులేని సమరం సాగించారు.

1947లో భారతదేశానికి స్వాతంత్ర్యం లభించింది. ఆ సమయంలో నిజాం **ఇండియన్ యూనియన్** లో కలసి పోడానికి తిరస్కరించారు. ఆ నిర్ణయానికి వ్యతిరేకంగా ఉద్యమాలు ఆరంభమయ్యాయి. ఆ ఉద్యమాన్ని అణిచి వేసేందుకు నిజాం నవాబు పక్షాన రజాకార్లు సిద్ధమయ్యారు. ఆ విపత్కర సమయంలో షోయబుల్లా నిజాం సంస్థానాన్ని ఇండియన్ యూనియన్‌లో విలీనం చేయాలని డిమాండ్ చేస్తూ సంపాదకీయాలు రాశారు. దేశ ప్రయోజనాల దృష్ట్యా విలీనం అవసరాన్ని వివరిస్తూ నిజాం నిరాకరణ వెనుకగల స్వార్థ రాజకీయాలను బహిర్గతం చేస్తూ వ్యాసాలు ప్రచురించారు. ఈ రాతలు పాలకులకు కంటక ప్రాయమయ్యాయి. నయానా, భయానా నచ్చచెప్పి ఆయన కలాన్ని నియంత్రించాలని పాలకవర్గాలు విఫలప్రయత్నాలు చేశాయి. చివరకు బెదిరింపుల పర్వం ఆరంభం కాగా జాగ్రత్తగా ఉండమని పెద్దలిచ్చిన సలహాకు స్పందిస్తూ, **సత్యాన్వేషణలో ఒక వ్యక్తి మరణిస్తే అది గర్వించదగిన విషయమని గాంధీజీ చెప్పారు కదా అటువంటప్పుడు నేనెందుకు భయపడాలి** అని బెదిరింపులను ఖాతరు చేయకుండా ముందుకు సాగారు.

1948 సంవత్సరం ఆగస్టు 21 అర్ధరాత్రి సమయంలో ఆయన, ఆయన అనుచరులు ముహ్మద్ ఇస్మాయిల్ ఖాన్ 'ఇమ్రోజ్' కార్యాలయం నుండి ఇంటికి వస్తుండగా పొంచి ఉండి కిరాతక శత్రువు జరిపిన దాడి, కాల్పులలో ఆయన నేల కూలారు. ప్రభువులను కూడా భయకంపితుల్ని చేసిన సంపాదకీయాలు రాసిన ఆయన చేతులను దుండగులు నరికివేశారు. ఆసుపత్రిలో చికిత్స పొందుతూ, **మరణం అనివార్యం. చావు నుండి ఎవ్వరూ తప్పించుకోలేరు. ఆ మరణం ఒకలక్ష్యం కోసం సంభవిస్తే గర్వించాలి. నేను దేశం కోసం మరణిస్తున్నందుకు మీరు సంతోషించాలి** అని బంధుమిత్రులను సముదాయించిన కలం యోధులు షోయాబుల్లా ఖాన్ 1948 ఆగస్టు22 తెల్లవారుజామున కన్నుమూశారు. ◆

# 64. షఫాతున్నీసా బీబి

## (1896-1948)

స్వలాభం ఏమాత్రం ఆశించక స్వాతంత్ర్యోద్యమంలో చేసిన అద్వితీయ త్యాగాలు మతం ముద్రవలన మరుగునపడి బలవంతంగా స్వంత గడ్డను విడిచి పెట్టాల్సి వచ్చిన భయంకర చేదు అనుభవాలను చవిచూసిన మహిళాయోధురాలు షఫాతున్నీసా బీబి.

1896లో పంజాబ్‌లోని లూధియానాలో షఫాతున్నీసా జన్మించారు. తండ్రి మౌలానా అబ్దుల్ అజీజ్ నక్షాబంది. చిన్ననాటనే ఆమె ధార్మిక విద్యతోపాటుగా లౌకిక విద్యను మౌలానా హఫీజు రెహమాన్‌ను వివాహం చేసుకున్నారు.

బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగుతున్న పోరాటంలో అత్యంత కీలక పాత్ర నిర్వహించిన మౌలానా మీద పోలీసులు కక్షగట్టడంతో ఆయన పది సంవత్సరాల ఆరు నెలల పాటు పలు జైళ్ళల్లో గడిపారు. ఆ అవిశ్రాంత ఉద్యమకారుని భార్యగా షఫాతున్నీసా బీబి కూడా జాతీయోద్యమంలో తనదైన సాహసోపేత పాత్రను నిర్వహించి చరిత్ర పుటలకెక్కారు. భర్త మాత్రమే కాక ఆమె కుమారులు కూడా స్వాతంత్ర్య సంగ్రామంలో భాగస్వాములు కావడంతో అజ్ఞాతం, అరెస్టులు, జైళ్ళలో గడపటం మూలంగా ఆ కుటుంబం దుర్భరమైన ఆర్థిక పరిస్థితులను ఎదుర్కొంది. అలవిగాని ఆర్థిక కడగండ్లను ఎదుర్కొంటున్నా, ఎవ్వరి వద్దా చేయిచాచి సహాయం అడగని ఆమె తనవద్దనున్న కొద్దిపాటి





ఆర్థికవనరులతో జాతీయోద్యమంలో పాల్గొంటున్న ఇతర ఉద్యమకారుల కుటుంబాల మహిళలను ఆదుకున్నారు. ఉద్యమకారుల కుటుంబాల వివరాలు తెలుసుకుని వారికి ఆర్థికంగా అండదండలు అందించటమేకాక ఆ కుటుంబాల మహిళలను స్వయంగా కలసి ధైర్యం చెప్పటం విశేషం.

ఖద్దరు ప్రచార కార్యక్రమంలో భాగంగా ప్రజలలో ప్రధానంగా మహిళలలో ఖద్దరు ధారణను ఆమె ఎంతగానో ప్రోత్సహించారు. ఆమె కుటుంబ సభ్యులంతా ఖద్దరు ధరించారు. భర్తతోపాటుగా ఆమె జమాఅత్ ఉలేమా-యే-హింద్, (Jamiatul Ulema-e-Hind), భారత జాతీయ కాంగ్రెస్‌లలో సభ్యత్వం స్వీకరించారు. ఆయా సంస్థల పిలుపు మేరకు జరిగిన కార్యక్రమాలలో చురుకైన భాగస్వామ్యం అందించారు. ఈ క్రమంలో ప్రత్యక్షంగా, పరోక్షంగా స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న షఫాతున్నీసా బేగం పలుమార్లు ఒంటరిగా పోలీసుల భయానక చిత్రహింసలను ధైర్యం-సహనంతో ఎదుర్కొన్నారు.

1947 నాటికి స్వరాజ్యం సిద్ధించే రాజకీయ వాతావరణం ఏర్పడింది. అఖిల భారత ముస్లిం లీగ్ భారత విభజన కోరడంతో షఫాతున్నీసా దంపతులు విభజనకు వ్యతిరేకంగా ఉద్యమించారు. చివరకు విభజన తప్పలేదు. తమ ఆకాంక్షలకు విరుద్ధంగా ఇండియా విభజనకు గురికావడంతో విభజన కల్లోలం తాకిడితోపాటు, మతవిద్వేష పెనుతుఫానులో ఆమె కుటుంబం సర్వం కోల్పోయింది. తల దాచుకునేందుకు మొండిగోడల ఇల్లు కూడా నిలువలేదు. నిలువనీడ లేకున్నా, తిండి కరువైనా పర్వాలేదనుకున్నా, విభజనకు వ్యతిరేకులైన ఆ కుటుంబీకుల ప్రాణాలకు విభజనవాదుల నుండి ముప్పు ఏర్పడింది.

ఆ విపత్కర సమయంలో లూధియానా వదలి వెళ్ళమని మిత్రులు సలహా ఇచ్చారు. పుట్టిపెరిగిన గడ్డను, తన ఇంటిని వదలి వెళ్ళడం సుతరామూ ఇష్టంలేని ఆమె ప్రాణాలు పోయినా లూధియానా వదిలేది లేదన్నారు. చివరకు తప్పనిసరి పరిస్థితులలో ఆ దంపతులు శరణార్థుల శిబిరంలో తలదాచుకుని ఆ తరువాత ఢిల్లీ చేరారు. అక్కడ కూడా దుర్భర పరిస్థితి ఎదురుకావడంతో మళ్ళీ శరణార్థి శిబిరం చేరక తప్పలేదు. అప్పుడు పాకిస్థాన్ వెళ్లమని కొందరిచ్చిన సలహాను తిరస్కరించిన ఆమె లూధియానాలోని తన స్వంత ఇంటికి ఎలాగైనా వెళ్ళాలని చివరి వరకు పరితపించారు, పట్టుబట్టారు. అయితే విభజన వాదం సృష్టించిన అరాచక వాతావరణంలో స్వగృహానికి వెళ్ళే అవకాశం లేకుండా పోయింది. చివరకు లూధియానాలోని స్వంత ఇంటి గడప తొక్కకుండానే షఫాతున్నీసా బీబి 1948 జూన్ 1న ఢిల్లీలో కన్నుమూశారు. ◆



# 65. యూసుఫ్ జాఫర్ మెహర్ అలీ

## ( 1903-1950)

**భా**రత జాతీయోద్యమ చరిత్రలో ప్రధాన పోరాట ఘట్టాల సరసన నిలచిన 'సైమన్ గోబ్యాక్' ఉద్యమంలో విప్లవించిన ఉద్యమకెరటం యూసుఫ్ జాఫర్ మెహర్ అలీ.

1903 సెప్టెంబర్ 3న బొంబాయిలోని సంపన్న పారిశ్రామికవేత్తల కుటుంబంలో ఆయన జన్మించారు. బ్రిటీష్ పాలకుల చర్యలకు వ్యతిరేకంగా నిప్పులు కురిపించే ఆయన విద్యార్థిగా నున్నప్పుడే, The British Rulers are like Dogs. If you kick them, They will lick you. But if you lick them, they will kick you, అన్నారు. చిన్ననాటి నుండే స్వాతంత్ర్యోద్యమం, సామ్యవాదం పట్ల ఆకర్షితులయ్యారు.

1925లో 'యంగ్ ఇండియా సొసైటీ' ఆరంభించి యువజనుల ఉద్యమానికి శ్రీకారం చుట్టారు. 1928 జనవరి 21న జరిగిన సమావేశంలో సొసైటీచే 'సంపూర్ణ స్వరాజ్యం', 'సైమన్ కమీషన్ బహిష్కరణ' తీర్మానాలు చేయించారు. సంపూర్ణ స్వరాజ్యం పిలుపును ఆనాడు కొందరు ప్రముఖ నాయకులు చిన్నపిల్లల చేష్టలని ఎద్దేవా చేయగా, ఆ విమర్శకు సమాధానంగా THE CHILD IS THE FATHER OF THE MAN అని ఘాటైన సమాధానమిచ్చారు. 1928 ఫిబ్రవరి 3న సైమన్ కమీషన్, బొంబాయిలోని మోల్ స్టేషన్ లో ఓడ దిగగానే ముందుగా వేసుకున్న పథకం ప్రకారంగా యూసుఫ్





ఒక్కసారిగా,'సైమన్ గోబ్యాక్' అంటూ నినదిస్తూ ముందుకు ఉరికారు. ఆ హఠాత్పరిణామం నుండి తేరుకున్న పోలీసులు ఆయనను అడ్డుకునేందుకు పరుగులు తీశారు. ఆ చర్యకు ఆగ్రహించిన ప్రభుత్వం ఆయన మీద పలు ఆంక్షలు విధిస్తూ, ఆయనను న్యాయవాదిగా ప్రాక్టీస్ చేసేందుకు అనుమతిని నిరాకరించింది.

విద్యార్థి, యువజనుల శక్తియుక్తుల పట్ల అత్యంత విశ్వాసం గల యూసుఫ్ తొలుత నుండి విద్యార్థి యువజనోద్యమం వైపు దృష్టిని కేంద్రీకరించారు. యువకులను ప్రగతిశీల పోరాట కార్యకర్తలుగా తీర్చిదిద్దాలంటే సైద్ధాంతిక అవగాహన, ప్రపంచ పరిణామాల చరిత్ర అధ్యయనం, సత్ఫలితాలను సాధించగల ఆచరణాత్మక వ్యూహాల పరిజ్ఞానం అవసరమని భావించారు. అందుకు కోసం VANGUARD అను వారపత్రికను నడిపారు. పలు గ్రంథాలను ప్రచురించారు. పలు సంస్థలను ప్రారంభించారు.

ఆ సంస్థల ఆధ్వర్యంలో జాతీయోద్యమంలో భాగంగా జరిగిన ప్రతి ప్రతిఘటన ఉద్యమంలో ముందుండి యువతను నడిపించారు. ఈ చర్యల వలన ఆయన పలుమార్లు పోలీసుల దాష్టీకాన్ని, జైలు జీవితాన్ని రుచిచూడాల్సి వచ్చింది. ఆయన ఎక్కడ ఉన్నా ప్రజల హక్కుల కోసం పోరాడటం మానలేదు. జైళ్లల్లో విచారణ ఎదుర్కొంటున్న నిందితులు, ఖైదీల హక్కుల కోసం పోరాడారు. అతి దుర్భరంగా జీవితాలు గడుపుతున్న గుమాస్తాల బ్రతుకుల్లో వెలుగులు నింపిన 'SHOPS AND ESTABLISHMENT ACT ఉనికిలోకి రావడానికి కూడా ఆయన కారణమయ్యారు.

1940లో ప్రారంభమైన వ్యక్తి సత్యాగ్రహంలో యూసుఫ్ మొహర్ అలీ చురుకైన పాత్ర వహించారు. బ్రిటీష్ ప్రభుత్వాన్ని ఊపేసిన 'క్విట్ ఇండియా' నినాదాన్ని అంతకు ముందుగానే తాను రాసిన 'క్విట్ ఇండియా' గ్రంథం ద్వారా ప్రచారంలోకి తెచ్చి 'క్విట్ ఇండియా' నినాదం సృష్టికర్తగా ఖ్యాతిగడించారు.

స్వాతంత్ర్యం సిద్ధించాక భారతదేశం రెండుగా చీలిపోవటం సహజంగానే ఆయనకు బాధ కలిగించింది. 1948 మార్చిలో జరిగిన బొంబాయి లెజిస్లేటివ్ అసెంబ్లీ ఎన్నికలలో సోషలిస్టు పార్టీ అభ్యర్థిగా ఎన్నికైన ఆయన శాసనసభ్యునిగా కూడా ఆదర్శవంతమైన పాత్రను నిర్వహించారు. ఉద్యమ జీవితంలో ఆయన పలుమార్లు లాఠీ దెబ్బలను రుచి చూస్తూ, జైలు జీవితం గడిపారు. ఆ శిక్షల ప్రభావం వలన ఆయన ఎరవాడ జైలులో ఉన్నప్పుడు తీవ్ర అనారోగ్యం పాలయ్యారు. ఆ అనారోగ్యం నుండి ఆయన మళ్ళీ కోలుకోలేదు. చివరకు మిత్రులు జయప్రకాష్ నారాయణ పక్కనుండగా 1950 జులై 2న యూసుఫ్ జాఫర్ మెహర్ అలీ తుదిశ్వాస వదిలారు. ◆



# 66. మౌలానా హస్రత్ మోహాని

**( 1878-1951)**

స్వరాజ్యం కాదు కావాల్సింది **సంపూర్ణ స్వరాజ్యం** అంటూ ఎలుగెత్తిచాటి గాంధీజీ అభిప్రాయానికి వ్యతిరేకంగా సభికుల్ని ఆకట్టుకుని జాతీయ కాంగ్రెస్ సమావేశాల్లో మహాత్ముడ్ని సయితం కలవర పెట్టించిన '**చిచ్చుర పిడుగు**' మౌలానా హస్రత్ మోహాని.

1878లో ఉత్తర ప్రదేశ్ లోని మోహన్ అను పట్టణంలో జన్మించిన ఆయన అసలు పేరు సయ్యద్ ఫజులుల్ హసన్. మంచి కవిగా ఖ్యాతిగాంచిన ఆయన కలం పేరు 'హస్రత్'. జన్మస్థానం 'మోహన్' పేరును కలుపుకుని ఆయన 'హస్రత్ మోహాని' అయ్యారు. పదిహేడవ ఏటనే మోహాని గజల్స్ రాయటం ప్రారంభించి, 'ఉర్దూ-యే-ముల్లా' పత్రికకు ఎడిటర్‌గా వ్యవహరించారు. అరవింద ఘోష్, బాల గంగాధర తిలక్‌ల విప్లవాత్మక భావాల పట్ల ఆకర్షితులైన ఆయన చదువు పూర్తి కాగానే నౌకరుగా చాకిరి చేయటం ఇష్టంలేక జర్నలిస్టుగా జీవితం ప్రారంభించారు. బానిసత్వాన్ని ఏ రూపంలో ఉన్నా సహించని ఆయన బ్రిటీష్ ప్రభుత్వం మీద తిరుగులేని పోరు సలిపేందుకు నడుంకట్టి 1903లో భారత జాతీయ కాంగ్రెస్‌లో చేరారు.

విప్లవాత్మక భావాలతో బ్రిటీష్ ప్రభుత్వం పై విరుచుకుపడుతూ రాసిన వ్యాసాల కారణంగా 1909లో ఆయన మీద ప్రభుత్వం రాజద్రోహం నేరం మోపింది.





విచారణాంతరం రెండు సంవత్సరాల జైలు, రు.500 జరిమానా విధించింది. జరిమానా కట్టలేకపోవటం వలన ఆయన సమకూర్చుకున్న అమూల్య గ్రంథాలను జప్తుచేసి పోలీసులు పట్టుకెళ్ళారు. అప్పటి నుండి జాతీయోద్యమ కాలంలో ఆయన అత్యధిక సమయం జైలులో గడిచింది. స్వదేశీ ఉద్యమానికి ఊపిరి పోసేందుకు భార్య నిషాతున్నిసా బేగం తో కలసి భారతదేశం లోని ప్రథమ 'స్వదేశీ స్టోర్స్' ను ప్రారంభించారు.

ఖిలాఫత్ ఉద్యమంలో చురుకైన పాత్ర నిర్వహించారు. ఆ సందర్భంలో మోహాని పలుమార్లు హైదరాబాద్ సందర్శించి ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమ ప్రచారం గావించారు. 1921లో అహ్మదాబాద్ కాంగ్రెస్ సమావేశం నుండి '**సంపూర్ణ స్వరాజ్యం**' తీర్మానాన్ని ప్రతిపాదిస్తు వచ్చారు. గాంధీజీ అహింసా సిద్ధాంతాలు అన్ని సమయాలలో అనుసరించదగినవి కావన్న నిక్కచ్చి అభిప్రాయాలను వెల్లడించి స్వయంగా గాంధీజీ ప్రశంసలందుకున్నారు. సంపూర్ణ స్వరాజ్యం సాధించేందుకు హిందూ-ముస్లిం ఐక్యత ఎంతో అవసరమని నమ్మిన ఆయన, 1927-28లో కలకత్తాలో జరిగిన ఐక్యతా సమావేశాల నిర్ణయాలను హిందూ సోదరులు నిరాకరించటంతో వ్యధకు గురయ్యారు.

మహాత్మాగాంధీ విధానాలు కొన్ని నచ్చక 1928లో కాంగ్రెస్ నుండి బయటకు వచ్చారు. 1929 అక్టోబరు 31 నాటి లాహోర్ సమావేశంలో జాతీయ కాంగ్రెస్ సంపూర్ణ స్వరాజ్యం తీర్మానం చేయడంతో ఆయన కల నిజమైంది. ఆ తరువాత ముస్లిం లీగ్‌కు దగ్గరైన ఆయన 1946లో జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో ముస్లింలీగ్ అభ్యర్థిగా ఉత్తరప్రదేశ్ రాష్ట్రం నుండి ఎన్నికయ్యారు. ముస్లిం లీగ్ సభ్యుడిగా ఉన్నా కూడా జిన్నా వేర్పాటు వాదాన్ని ధైర్యంగా ఎదుర్కొన్నారు. భారత విభజనను అడుగడుగున వ్యతిరేకించారు. 1947లో భారతదేశం చీలిపోవటంతో బాధపడ్డారు. ఆ తరువాత కూడా రాజకీయాలలో గడిపిన ఆయన పార్లమెంటు ఎన్నికలలో ఉత్తరప్రదేశ్ నుండి పలుమార్లు ఎన్నికయ్యారు.

ఆఖరి ఘడియ వరకు ప్రజాపక్షం వహించిన హస్రత్ మోహాని రాజకీయాలకు దూరం కాలేదు. సాహిత్య రంగాన్ని వదలలేదు. వందలాది గజల్స్ రాసిన హస్రత్ మోహాని ఆనాటి ప్రముఖ కవులలో ఒకరుగా వెలుగొందారు. ఆయన గజల్స్ చలన చిత్రాలలో కూడా చోటుచేసుకున్నాయి.

స్వాతంత్ర్య సంగ్రామంలో మాత్రమేకాకుండా స్వతంత్ర భారతావనిలో కూడా తాను నమ్మిన సిద్ధాంతాలను, తాను ఏర్పర్చుకున్న బాటను వీడకుండా, యోధాను యోధులను కూడా తన విద్వత్తుతో నిర్భయంగా ఎదుర్కొంటూ ముందుకు సాగిన విప్లవకారుడు మౌలానా హస్రత్ మోహాని లక్నోలో 1951లో మే 13న కన్నుమూశారు. ◆

# 67. ముఫ్తీ ఖిఫాయతుల్లా

## (1872-1952)

బ్రిటీష్ పాలకులతో పోరాడటం ముస్లింల తిరుగులేని విధిగా ప్రకటించటం మాత్రమే కాకుండా స్వరాజ్యం కోసం తానుగా ఉద్యమించి ఉద్యమవారసులను కూడా తయారు చేసుకున్న ప్రముఖ ధార్మికవేత్తలలో ప్రథములు ముఫ్తీ ఖిఫాయతుల్లా.

1872 సంవత్సరంలో ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని షాజహన్‌పూర్ గ్రామంలో ఖిఫాయతుల్లా జన్మించారు. స్వగ్రామమైన షాజహాన్‌పూర్ లోని మదరసాలో ప్రాధమిక విద్యాభ్యాసం తరువాత జాతీయోద్యమకారులకు కేంద్రంగా నున్న ప్రముఖ విద్యాసంస్థ దేవ్‌బంద్‌లో చేరారు. బ్రిటీషర్ల మీద తిరుగులేని పోరాటం సాగించిన యోధులు, ఆ విద్యాసంస్థ ప్రధానాచార్యులు మౌలానా మహమ్మద్ హసన్ ప్రభావంతో బ్రిటీష్ వలస పాలకులు ఇనుప పిడికిలి నుండి మాతృదేశాన్ని విముక్తి చేయటం కోసం నడుంకట్టారు.

విద్యాభ్యాసం పూర్తిచేసి ఢిల్లీ వచ్చి, ధార్మిక విద్యను బోధించే 'అంజుమన్-ఏ-హిదాయతుల్-అల్-ఇస్లాం' కు చెందిన పాఠశాల నిర్వహణా బాధ్యతలు స్వీకరించారు. ప్రజలలో దిగజారి పోతున్న ధార్మిక, నైతిక విలువలను పెంపొందించేందుకు మౌల్వీ హఫీజ్ అబ్దుల్ ఘనీతో కలసి 'కితాబ్ ఖాన్- ఏ-రహిమియ్యా' అను ప్రచురణ సంస్థను స్థాపించారు. జాతీయోద్యమంలో ప్రధాన పాత్రపోషించిన 'జయాయత్-ఎ-ఉలేమా-ఏ హింద్' అధ్యక్షునిగా 1919 నుండి 1942 వరకు కిఫాయతుల్లా బాధ్యతలు నిర్వహించారు.





మాతృదేశం పరాయి పాలనలో మగ్గుతున్నంత కాలం తమ ధార్మిక విద్యా ప్రచారానికి, మత స్వేఛ్చకు, ప్రజల సంపూర్ణ స్వాతంత్ర్యానికి ఏమాత్రం అవకాశం ఉండదని ప్రకటించిన ఆయన ఖిలాఫత్-సహాయనిరాకరణోద్యమంలో పాల్గొనటం ద్వారా జాతీయోద్యమంలో ప్రవేశించారు. ప్రభుత్వం మీద తిరుగుబాటు గాంధీజీ మార్గనిర్దేశనంలో సాగాలని, ప్రస్తుత పరిస్థితుల నేపధ్యంలో సాయుధ పోరాటాలు సత్ఫలితాలను సాధించలేవన్నారు. 1930లో భారత జాతీయ కాంగ్రెస్ జాతీయ సభ్యుడయ్యాక శాసనోల్లంఘనోద్యమంలో ఢిల్లీ ప్రజానీకానికి నేతృత్వం వహించారు. ఆ కారణంగా కిఫాయుతుల్లాకు జైలుశిక్ష పడింది. అప్పటి నుండి ఆయనకు కఠిన కారాగారవాస శిక్షలు సాధారణమైన అనుభవాలయ్యాయి.

జాతీయోద్యమం నుండి కిఫాయతుల్లాను దూరంచేయాలని బ్రిటీష్ పాలకులు ఆశలు చూపగా, **స్వాతంత్ర్యం కోసం పోరాటం ముస్లింల మతపరమైన విధి** అని ఆయన ప్రకటించారు. జహుళ జాతుల, మతాల ప్రజలు సహజీవనం సాగించే భారత గడ్డ మీద ఇస్లాం ప్రభోధించే సిద్దాంతాల ఆధారంగా రాజ్యాన్ని స్థాపించ ప్రయత్నించటం సరికాదని అన్నారు. జాతీయవాదిగా భారత విభజన, ద్విజాతి సిద్ధాంతాన్ని ఇస్లాం ధార్మిక సిద్దాంతాల ప్రాతిపదికన ఖండిస్తూ, హిందూ-ముస్లింల మధ్యన ఐక్యతావశ్యకత కోసం ఖిఫాయతుల్లా నిరంతరం కృషిచేశారు. ముస్లింలు- ముస్లిమేతరులను వివక్ష ఎంతమాత్రం తగదంటూ ఐక్యంగా ముందుకు సాగినప్పుడు మాత్రమే ఉమ్మడి లక్ష్యం సిద్ధిస్తుందని ఆయన బలంగా ప్రచారం చేశారు.

పాశ్చ్యాత్య విద్య, సంస్కృతి వలన సమాజం రుగ్మతలకు గురవుతుందని భావించిన ఆయన సంస్కరణోద్యమాన్ని కూడా ఆరంభించారు. పురుషులతోపాటు మహిళలు కూడా విద్యావంతులు కావాలంటూ వారికోసం ప్రత్యేక పాఠశాలలను స్థాపించాలన్నారు. మానవులంతా భగవంతుని సృష్టిలో భాగం కనుక అంటరానితనం ఏమాత్రం సరికాదని అన్నారు. మనుషుల్లో ఉఛ్ఛ-నీచాలను విధానం స్వార్ధపరుల సృష్టి మాత్రమేనంటూ సహపంక్తి భోజనాలలో, సహజీవనం సాగించటంలో ఏమాత్రం తప్పులేదన్నారు.

స్వాతంత్ర్యం లభించాక ధార్మిక విద్యాబోధన గావిస్తూ కాలం గడిపిన ఆయన పలు గ్రంథాలను రాశారు. భారతప్రభుత్వం ఆయనకు పలు సౌకర్యాలను, ఆర్థిక సదుపాయాలను ప్రకటించగా, ఆ సదుపాయాలను స్వీకరించడమంటే తమ దేశభక్తికి విలువ కట్టడమేనని ప్రకటించారు. ఆ సౌకర్యాలను, సదుపాయాలను తిరస్కరించిన ముఫ్తీ ఖిఫాయతుల్లా చివరి వరకు పేదరికంతో సహజీవనం చేస్తూ 1952 డిసెంబరు 31న ఢిల్లీలో కన్నుమూశారు. ◆



# 68. యం. ఆసఫ్ అలీ

## ( 1888-1953 )

**స్వా**తంత్ర్య సమరంలో పాల్గొని తమ సర్వస్వం అంకితం చేసిన మహనీయులు అనేకులు కాగా, తాము కలలుగన్న స్వరాజ్యాన్ని కన్నులారాగాంచటమే కాక, భవ్యభారత నిర్మాణంలో భాగస్వామ్యం వహించిన అదృష్టవంతులు బహు అరుదు. అటువంటి అరుదైన అవకాశం పొందిన ధన్యజీవులలో యం.ఆసఫ్ అలీ ఒకరు.

ఉత్తరప్రదేశ్ రాష్ట్రం బిజినోర్ జిల్లా నాగిన గ్రామంలో 1888 మే 11న సంపన్న కుటుంబంలో ఆయన జన్మించారు. ఉన్నత విద్యాభ్యాస్యం కోసం లండన్ వెళ్ళి 1914లో ఇండియాకు వచ్చిన ఆయన ఢిల్లీలో న్యాయవాదిగా జీవితాన్ని ఆరంభించారు. అరుణా గంగూలిని మతాంతర వివాహం చేసుకున్నారు. ఆమె అగ్రశ్రేణి స్వాతంత్ర్య సమరయోధులలో ఒకరుగా **అరుణా ఆసఫ్ అలీ** గా ఖ్యాతిగాంచారు.

డాక్టర్ అనీబిసెంట్ ఆరంభించిన 'హోంరూల్' ఉద్యమం ద్వారా ఆసఫ్ అలీ క్రియాశీలక రాజకీయ జీవితాన్ని ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన ప్రసంగాలను, ఆయన రాతలను ప్రభుత్వం నిషేధించగా తన కేసును తాను వాదించుకుని విజయం సాధించటంతో ఆయనకు విశేష ప్రాచుర్యం లభించింది.

డాక్టర్ ముక్తార్ అహ్మద్ అన్సారితో కలసి ఖిలాఫత్ ఉద్యమ నిర్మాణంలో ప్రధాన పాత్ర నిర్వహించారు. జాతీయ కాంగ్రెస్ పిలుపు మేరకు న్యాయవాద వృత్తిని వదిలేసి





పూర్తికాలపు కార్యకర్తగా జాతీయోద్యమంలో ప్రవేశించారు. ఆనాటి నుండి జాతీయ కాంగ్రెస్ కార్యక్రమాలన్నిటిలోనూ, తనదైన పాత్ర నిర్వహించారు. ఢిల్లీలో జరిగిన ఉద్యమ ప్రచార కార్యక్రమాలలో పాల్గొని 18 మాసాల పాటు జైలుశిక్ష అనుభవించారు. 1924 నాటి ఆల్ ఇండియా ముస్లిం లీగ్ సమావేశంలో పాల్గొని 'స్వరాజ్యం' ప్రతిపాదన తీర్మానంగా రూపుదిద్దుకునేలా తోడ్పడ్డారు. 'భారత ప్రభుత్వం చట్టం 1919' స్థానంలో నూతన రాజ్యాంగం రచన కోసం ఏర్పడిన కమిటీలో సభ్యునిగా ఆసఫ్ అలీ తనదైన భాగస్వామ్యాన్ని అందించారు.

మత తత్త్వానికి వ్యతిరేకంగా చివరివరకు రాజీలేని పోరాటం సాగించిన ఆయన మతతత్త్వాన్ని రెచ్చగొట్టి, మత మనోభావాల ఆధారంగా భారత విభజనకు పురికొల్పుతున్న రాజకీయవాదులను ఆసఫ్ అలీ క్షమించలేదు. ఆనాడు ముస్లిం నాయకులలో అగ్రగణ్యుడిగా ప్రకాశిస్తున్న జిన్నాను రాజకీయంగా ఎదుర్కొవడానికి వెనుకాడలేదు.

జాతీయ కాంగ్రెస్ సభ్యునిగా ఆసఫ్ అలీ అనేక పదవులను నిర్వహించారు. పలు నిజనిర్ధారణ కమిటీలలో సభ్యులుగా బాధ్యతలు చేపట్టారు. ఏ బాధ్యత చేపట్టినా తన కార్యదక్షతతో నిర్విఘ్నంగా కార్యక్రమాలను నిర్వహించడం ఆయన ప్రత్యేకత కావడంతో ప్రభుత్వ ఆగ్రహానికి గురై సంవత్సరాల తరబడి జైలుజీవితాన్ని చవిచూడాల్సి వచ్చింది.

1945లో జరిగిన ఎన్నికలలో ఢిల్లీ నుండి భారీ ఆధిక్యతతో విజయం సాధించిన ఆసఫ్ అలీ నెహ్రూ నేతృత్వంలో ఏర్పడిన మంత్రివర్గంలో చేరారు. ఆ తరువాత రాజ్యాంగ రచన సంఘం సాగించిన చర్చలలో పాల్గొని, లౌకిక భావాల పరిరక్షణాంశాల పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపారు. మంచి న్యాయవాదిగా పేర్గాంచిన ఆయన భగత్‌సింగ్ పక్షాన న్యాయ పోరాటం చేయడమే కాకుండా, Indian National Army పక్షాన వాదించేందుకు జాతీయ కాంగ్రెస్ ఏర్పాటు చేసిన 'INA Defence Commitee' కార్యదర్శిగా పనిచేశారు. ఆనాడు ఆసఫ్ అలీ నాయకత్వంలో విజయం సాధించిన ఆ కమిటీ పలువురు Indian National Army యోధులను కాపాడుకుంది.

1947 తరువాత స్వతంత్ర భారతదేశంలో ఆయన పలు ఉన్నత పదవులను నిర్వహించి ప్రపంచ దేశాలలో భారతదేశం పేరుప్రతిష్టలను ఇనుమడింప చేశారు. ప్రజ్ఞావంతుడైన న్యాయవాదిగా, ఉత్తమ ఉర్దూ సాహిత్యవేత్తగా, సునిశిత విమర్శకుడిగా, నిబద్ధత గల నేతగా, అసాధారణ వక్తగా, అద్భుతమైన రాయబారిగా, అన్ని రంగాలలో రాణించి, భారత సాంఘిక, రాజకీయ రంగాలలో తనదైన శాశ్వత ముద్రను ప్రతిష్టించుకున్న యం.ఆసఫ్ అలీ 1953 ఏప్రిల్ 2న కన్నుమూశారు. ◆



# 69. రఫీ అహమ్మద్ కిద్వాయ్

## (1894-1954)

**బా**నిస బంధనాలనుండి మాతృభూమిని విముక్తి చేయటం కోసం జరిగిన పోరాటంలో పాల్గొనటం అదృష్టమైతే, ఆ తరువాత స్వేచ్ఛా భారతంలో, భావితరాల భవిష్యత్తును బంగారు మయం చేయటానికి అవిశ్రాంతంగా కృషి చేసి తనదైన ముద్రను సుస్థిరం చేసుకోవటం మరింత భాగ్యం. ఆ సౌభాగ్యాన్ని అందుకున్న ప్రముఖులలో ఒకరు రఫీ అహమ్మద్ కిద్వాయ్.

ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని బారాబంకీ జిల్లా మసౌలి గ్రామంలో 1894 ఫిబ్రవరి 18న రఫీ అహమ్మద్ జన్మించారు. చిన్నతనంలోనే తల్లిని కోల్పోయిన ఆయన పదేండ్ల వయస్సులో, పినతండ్రి ఇనాయత్ అలీ వద్దకు చేరి ఆయన నుండి బ్రిటీష్ వ్యతిరేక భావాలను పుణికి పుచ్చుకున్నారు. విద్యాభ్యాసం కోసం అలీఘర్ విశ్వవిద్యాలయం వెళ్ళిన ఆయన వ్యక్తం చేసిన బ్రిటీష్ వ్యతిరేక భావాల మూలంగా '**ప్రమాదకర వ్యక్తి**'గా ముద్రపడ్డారు. ఆ తరువాత గాంధీజీ పిలుపు మేరకు అలీఘర్‌ను వదలి జాతీయ కాంగ్రెస్ సభ్యత్వం స్వీకరించి ఖిలాఫత్-సహాయనిరాకరణోద్యమంలో క్రియాశీలకపాత్ర వహించిన ఆయన అనతి కాలంలోనే బారాబంకీ జిల్లా నాయకుడయ్యారు. అప్పటి నుండి ఇటు రాష్ట్ర స్థాయి అటు జాతీయ స్థాయి రాజకీయాలలో ప్రముఖ పాత్ర వహించారు.





సమసమాజ స్థాపన ధ్యేయంగా సోషలిస్టు ఉద్యమ నిర్మాణం వైపు మొగ్గు చూపుతున్న సమయంలో జమీందారి కుటుంబీకుడైన రఫీ అహమ్మద్ జమీందారీలను రద్దు చేయాలని ప్రకటించి సంచలనం సృష్టించారు. జాతీయ కాంగ్రెస్ రాజకీయ విధానాలలో మార్పును ఆశిస్తూ అసెంబ్లీ ప్రవేశాన్ని అంగీకరించి మోతీలాల్ నెహ్రూ పక్షాన చేరిన ఆయన 1935 నాటి ఎన్నికలలో విజయం సాధించి మంత్రి పదవిని కూడా చేపట్టారు. ఆ సందర్భంగా ప్రజల హితం ఆకాంక్షిస్తూ పలు సంస్కరణలను ప్రతిపాదించారు.

1940 అక్టోబర్‌లో ప్రారంభమైన యుద్ధ వ్యతిరేక సత్యాగ్రహ ఉద్యమాన్ని నిర్వహించేందుకు జాతీయ కాంగ్రెస్ రాష్ట్ర శాఖ రఫీకి బాధ్యత అప్పగించింది. ఆ సందర్భంగా ఆయన అరెస్టయ్యి సంవత్సరాల తరబడి జైలులో మగ్గాల్సిన పరిస్థితిని ఎదుర్కొన్నారు. ఈమేరకు ఆయన మొత్తం మీద పదేండ్లకు పైగా జైలు జీవితం గడిపారు. క్విట్ ఇండియా ఉద్యమం తరువాత అటు కేంద్రంలో ఇటు రాష్ట్రంలో జరుగునున్న ఎన్నికల కోసం ప్రముఖ కాంగ్రెస్ నాయకులంతా అరెస్టయ్యి ఉండటంతో ప్రభుత్వం సహకారంలో బలపడిన ముస్లింలీగ్‌ను ఎదుర్కొనేందుకు రఫీ అహమ్మద్ చాలా కష్టపడాల్సి వచ్చింది. ముస్లిం లీగ్ వేర్పాటువాద రాజకీయాలను వమ్ముచేసేందుకు ఆయన 'ఖ్యామీ ఆవాజ్' పత్రికను ప్రారంభించారు. లౌకిక, ప్రజాస్వామ్య భావనలను స్పష్టం చేస్తూ ఆయన 'నేషనల్ హెరాల్డ్' లాంటి పత్రికలకు వ్యాసాలు రాశారు. భారత జాతి ఉమ్మడి సంస్కృతి, సభ్యతల పట్ల అపార గౌరవం గల జాతీయవాదిగా ఆ సభ్యతా-సంస్కారాల పరిరక్షణకు కృషి సాగించారు. భారత విభజన అంటే సుసంపన్నమైన ఉమ్మడి సభ్యతా సంస్కారాల విభజనగా ఆయన భావించారు.

1947లో స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత పండిట్ నెహ్రూ మంత్రివర్గంలో ఆయన పలు పదవులు చేపట్టారు. అన్నిరంగాలలో ప్రదర్శించిన శక్తిసామర్థ్యాల ఫలితంగా పండిట్ నెహ్రూ తరువాత ఎవరూ? అనే ప్రశ్నకు సమాధానమయ్యేంత స్థాయికి రఫీ ఎదిగారు. అటు ప్రభుత్వంలోనూ, ఇటు ప్రజా సంఘాలలోనూ పలు పాత్రలను సమర్థవంతంగా నిర్వహించిన కిద్వాయ్ చివరివరకు దేశసేవ-ప్రజాసేవలో గడిపారు.

1954 అక్టోబర్ 24న ఢిల్లీలో జరిగిన ఒక సభలో ప్రసంగిస్తూ, వేదిక మీదనే గుండెనొప్పితో ఆయన కుప్పకూలారు. మాతృభూమి సేవలో చివరి క్షణం వరకు తనను తాను అర్పించుకున్న రఫీ అహమ్మద్ కిద్వాయ్ అంత్యక్రియలు మౌలానా అబుల్ ఆజాద్ పర్యవేక్షణలో ప్రజావాహిని దుఖాఃశ్రువుల మధ్య ముగిసాయి. ◆

# 70. మౌలానా హబీబుర్రెహమాన్

## ( 1892-1956 )

**భా**రత దేశ విభజన జరగడానికి దోహదం చేసిన పలు కారణాలలో 'ISLAM IN DANGER' అను నినాదం ఒకటి. ఈ నినాదం వెనుక గల స్వార్థబుద్ధిని బహిర్గతం చేస్తూ ప్రజలను చైతన్యవంతులను చేసేందుకు నిర్విరామంగా కృషి జరిపిన వారిలో మౌలానా హబీబుర్రెహమాన్ లుధియాని ప్రముఖులు.

1892 జూలై 3న మౌలానా హబీబుర్రెహమాన్ పంజాబ్ రాష్ట్రం లూధియానాలో జన్మించారు. ఆయన వంశీకులకు 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న చరిత్ర ఉంది. 1903లో లూధియానాకు చెందిన ప్రముఖ ఇస్లామిక్ తత్వవేత్త మౌలానా అబ్దుల్ అజీజ్ కుమార్తె బీబి షఫాతున్నీసాను ఆయన వివాహమాడారు. ఆమె కూడా భర్త, బిడ్డలతోపాటుగా జాతీయోద్యమంలో పాల్గొన్నారు.

భారత జాతీయ కాంగ్రెస్ సభ్యత్వం స్వీకరించిన మౌలానా రెహమాన్ 1919నాటి ఖిలాఫత్ ఉద్యమంలో పాల్గొనటం ద్వారా జాతీయోద్యమంలో ప్రవేశించారు. ఈ సందర్భంగా 1921 డిసెంబరు 1న ఆయన చేసిన ప్రసంగం ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరగబడమని ప్రజలను ప్రేరేపించేదిగా ఉందంటూ బ్రిటీష్ పోలీసులు వారెంటు జారీ చేశారు. 1922 డిసెంబరు 22న తొలిసారిగా అరెస్టయ్యారు. ఆరు మాసాల జైలు శిక్ష పడింది. అప్పటి నుండి ఆయన మొత్తం మీద పది సంవత్సరాలకు పైగా వివిధ జైళ్ళలో శిక్షలు





అనుభవించారు. మౌలానా మాత్రమే కాకుండా ఆయన బిడ్డలు కూడా జాతీయోద్యమంల పాల్గొని తండ్రి అడుగుజాడల్లో నడిచి దుర్భర జైలు జీవితాన్ని చవిచూడగా ఆయన భార్య షఫాతున్నిసా బీబి, తన ఆడబిడ్డలతో కలసి పోలీసుల దాడులను దాష్టికాలను అనుభవించారు. కుటుంబానికి ఎన్ని కష్టాలు వచ్చిన పడినా ఇటు ప్రజల నుండి అటు పార్టీ ఆర్థిక సహాకారమిచ్చేందు ముందుకు వచ్చినా మౌలానా ఎటువంటి ఆర్థిక సహాయం స్వీకరించకుండా ముందుకు సాగారు.

బ్రిటీష్ ప్రభుత్వం సాగించిన దుర్మార్గాలు, ఆస్తుల జప్తుల వలన సర్వం కోల్పోయినా, ఉన్నదానితో ఆశ్రితులను సంతృప్తి పర్చుతూ, ఆంగ్లేయ ప్రభుత్వం సాగిస్తున్న దౌర్జన్యం నుండి శాశ్వతంగా బయట పడాలని ఆయన కోరుకున్నారు. ఈ విషయంలో ఆయన భార్య షఫాతున్నీసా బేగం భర్త ఆలోచనలకు ఆలంబనగా నిలిచారు. స్వాతంత్ర్యోద్యమం లోని ప్రతి ఘట్టంలోనూ మౌలానా చురుగ్గా పాల్గొనటం, ప్రతిసారి ప్రభుత్వ ఆగ్రహానికి గురికావడం, భర్త-బిడ్డలు జైళ్ళపాలవటం ఆ కుటుంబానికి నిత్యకృత్యమైంది.

ఆధ్యాత్మిక-ధార్మిక విషయాలలో ముస్లింలకు మార్గదర్శకత్వం వహించే లక్ష్యంతో ఏర్పడిన JAMIAT-UL-ULEMA సంస్థలో ఆయన ప్రముఖ పాత్ర వహించారు. మౌలానా అబుల్ కలాం ఆజాద్ సలహా మీద 1920లో MAJLIS-E-AHARAR ( The Society of Freemen) అను సంస్థను ప్రారంభించి ప్రజాసేవా కార్యక్రమాలను నిర్వహించారు.

మౌలానా జీవితపర్యంతం జాతీయవాదిగా కొనసాగుతూ తాను నమ్మిన సిద్ధాంతాల పట్ల నిబద్ధతతో పనిచేశారు. 1947 విభజన వలన ఏర్పడిన విద్వేష వాతావరణంలో ఆయన కుటుంబం శరణార్థుల శిబిరంలో శరణు పొందాల్సిన అగత్యం ఏర్పడి జన్మభూమి లూధియానాను అతికష్టం మీద వదలాల్సి వచ్చింది. ఈ పరిస్థితులకు భార్య-భర్తలు విచలితులయ్యారు. చివరకు ఢిల్లీ వెళ్ళి అపరిచితుల గృహంలో తలదాచుకున్నారు. సన్నిహితులు పాకిస్థాన్ వెళ్ళమని సలహా ఇచ్చినా ఏదిఏమైనా స్వస్థలాన్ని వదలిపెట్టేది లేదని భీష్మించుకుని కూర్చున్న ఆ దంపతులు చేదు అనుభవాలను చవిచూడాల్సి వచ్చింది. ఆనాటి జ్ఞాపకాలు మౌలానాను చివరికంటా వెంటాడుతూనే ఉండి పోయాయి.

స్వాతంత్ర్యోద్యమంలో మౌలానా నిర్వహించిన పాత్రను చరిత్రకారులు తారాచంద్ వివరిస్తూ, 'His devotion to principle such as martyrs might envy. He never deviated from his beliefs and stood by them firm as rock. He is a man of amazing courage and endurance.' అని ఆయన వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించారు. మంచి ఉపన్యాసకుడిగా ప్రశంసలందుకున్న మౌలానా 1956 సెప్టెంబర్ 3న కన్నుమూశారు. ◆



# 71. బతఖ్ మియా అన్సారి

## (1867-1957)

**ఆం**గ్లేయులు కల్పిస్తామన్న మంచి ఉద్యోగం, అందిస్తామన్న ఆర్థిక సహాయతను తృణప్రాయంగా త్యజించి మహాత్మాగాంధీని విషప్రయోగం నుండి కాపాడి, ఆంగ్లేయుల ఆగ్రహానికి గురై దుర్భరమైన జీవితాన్ని గడిపిన యోధులు బతఖ్ మియా అన్సారి.

1867లో బీహార్ రాష్ట్రంలోని మోతిహారీ గ్రామంలో అన్సారి జన్మించారు. తండ్రి మహమ్మద్ అలీ అన్సారీ. చిన్న ప్రభుత్వ ఉద్యోగి అయినటువంటి బతఖ్ మియా లభిస్తున్న జీతంతో తన కుటుంబీకులతో తృప్తిగా కాలం గడుపుతున్నారు.

ఆంగ్లేయ ప్లాంటర్లు రైతాంగంపై క్రూరచర్యలకు పాల్పడుతున్నారని వచ్చిన ఫిర్యాదుల మేరకు భారత జాతీయ కాంగ్రెస్ మహాత్మా గాంధీజీని 1917లో బీహార్ రాష్ట్రంలోని చంపారన్‌కు పంపింది. గాంధీజీ ఆ ప్రాంతాన్ని కేంద్రంగా చేసుకుని రైతులను కలసి విచారణ ప్రారంభించగా, ఆ విచారణలో తమ కిరాతకాలు బయట పడతాయన్న భయం నీలిమందు తయారీదారులకు పట్టుకుంది. ఆ కారణంగా గాంధీజీని రంగం నుండి పూర్తిగా తప్పించాలని ప్లాంటర్లు పథకం వేశారు. అందులో భాగంగా మోతీహార్ వచ్చిన గాంధీజీని విందుకు ఆహ్వానించి విషాహారం ద్వారా అంతం చేయాలనుకున్నారు. ఈ కార్యక్రమాన్ని భారతీయుడి ద్వారా జరిపితే తమ చేతులకు మట్టి అంటదని భావించారు.





అందుకు ప్రభుత్వ ఉద్యోగి భతఖ్ మియా అన్సారిని ఎన్నుకున్నారు. ఆయనకు తమ విషాహార పథకాన్ని వివరించి విందులో గాంధీజీకి సూప్‌కు బదులుగా విషాన్ని అందించాలన్నారు. ఈ పథకాన్ని విజయవంతంగా అమలు చేసినట్టయితే స్వర్గ సుఖాలలో ముంచెత్తుతామని లేనట్టయితే భయంకర నరకాన్ని చూపిస్తామని ప్లాంటర్లు బతఖ్ మియాను హెచ్చరించారు. బలవంతులైన ఆంగ్లేయ ప్లాంటర్స్, ఆంగ్లేయాధికారుల సమక్షంలో ఏమీ అనలేక సరేనన్న అన్సారి నేరుగా గాంధీజీని కలసి కుట్ర విషయాన్ని వెల్లడించగా విషాహారం కుట్రకు బలికాకుండా మహాత్ముడు క్షేమంగా బయటపడ్డారు. ఆ విషయాన్ని బతఖ్ మియా గాంధీజీకి వివరిస్తున్నప్పుడు ఆయన వద్ద డాక్టర్ బాబూ రాజేంద్రప్రసాద్ ఉన్నారు.

1917 నాటి ఈ సంఘటనకు ప్రత్యక్షసాక్షి డాక్టర్ బాబూ రాజేంద్రప్రసాద్ 1950లో స్వతంత్ర భారతదేశ రాష్ట్రపతి హోదాలో మోతిహారీ వచ్చారు. ఆ సందర్భంగా జనంలో దీన వదనంతో కన్పించిన బతఖ్ మియాను గుర్తుపట్టి ఆయన స్థితిగతులను తెలుసుకుని చలించిపోయారు. ఆయనకు 50 ఎకరాల భూమిని మంజూరు చేయాల్సిందిగా జిల్లా కలెక్టర్‌కు ఆదేశాలు జారీచేశారు. అధికారుల అలక్ష్యం, అతి జాప్యం వలన రాష్ట్రపతి ఆదేశాలు చాలాకాలం అమలు కాలేదు. బతఖ్ మియా కుటుంబం సంవత్సరాల తరబడి కాళ్లకు బలపాలుకట్టుకుని తిరిగినా రాష్ట్రపతి ప్రసాదించిన భూమి దక్కలేదు.

బతఖ్ మియా అన్సారి కుటుంబీకులతో రాష్ట్రపతి బాబూ రాజేంద్ర ప్రసాద్ ఉత్తర ప్రత్యుత్తరాలు సాగించారు. 1957 అన్సారి మృతి చెందారన్న విషాదవార్త తెలుసుకున్న డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ అన్సారి కుటుంబీకులను 1958 డిసెంబరు 3న రాష్ట్రపతి భవన్‌కు పిలిపించి యోగ క్షేమాలు కనుక్కున్నారు. 1950లో భారీ బహిరంగ సభలో తాను స్వయంగా జారీ చేసిన ఆజ్ఞలు ఇంకా అమలు కాని విషయం ఆయనకు తెలిసింది. ఆ మీదట తగిన చర్యలు తీసుకున్నాక కాని అన్సారి కుటుంబీకులకు భూమి లభ్యంకాలేదు.

జాతీయోద్యమ చరిత్రలో అత్యంత ప్రాముఖ్యతకు నోచుకోవాల్సిన బతఖ్ మియా అన్సారి త్యాగం చాలా కాలం తరువాత స్వాతంత్ర్య సమర యోధులు సయ్యద్ ఇబ్రహీం ఫిక్రి ఉర్దూలో రాసిన **'హిందూస్థానీ జంగ్-యే-ఆజాది మేఁ ముసల్మానోంకాఁ హిస్సా'** గ్రంథం ద్వారా వెల్లడయ్యింది. భారత ప్రభుత్వ ఆర్థిక సహాయంతో 1999లో ప్రచురితమైన ఈ ఉర్దూ గ్రంథం ఆ తరువాత ఇతర భారతీయ భాషలలో భారత ప్రభుత్వ ఆర్థిక సహాయంతో ప్రచురితమైంది. మహాత్మా గాంధీకి ఎటువంటి అపకారం జరగకుండా చూసి జాతీయోద్యమానికి ఎంతో ఉపకారం చేసిన బతఖ్ మియా అన్సారి 1957లో తన 90వ ఏట చివరిశ్వాస విడిచారు. ◆



# 72. మౌలానా అహ్మద్ హసన్ మదాని

## (1879- 1957)

భారతీయుల స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల కోసం ఆంగ్లేయులతో మాత్రమే కాకుండా భారత విభజన ససేమిరా మంచిదికాదంటూ చివరిదాక వేర్పాటువాద శక్తులతో పోరాడిన ధార్మిక నేతలలో మౌలానా అహ్మద్ హసన్ మదాని ప్రముఖులు.

1879లో ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలో జన్మించారు. ఆయన కుటుంబం ప్రథమ స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న కారణంగా ఆంగ్లేయపాలకుల వేధింపులు భరించలేక 1889లో మౌలానా తల్లితండ్రులు మక్కా-మదీనాకు వెళ్ళారు. మౌలానా మదాని మదీనాలో ధార్మిక విద్యాభ్యాసం చేస్తూ పదహారేండ్లు మక్కా-మదీనాలో గడిపిన ఆయన ఉత్తమ ధార్మిక పండితుడిగా ధార్మిక జ్ఞానాన్ని సంపాదించుకున్నారు.

జాతీయోద్యమకారులు మౌలానా ముహమ్మద్ హసన్‌తో ఆయనకు పరిచయం కలిగింది. మాతృభూమి విముక్తి కోసం మౌలానా హసన్ సాగిస్తున్న పోరాటానికి మౌలానా మదని మద్దతు పలికారు. ఆ క్రమంలో స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో 'సిల్కు అక్షరాల కుట్ర కేసు' గా ప్రఖ్యాతి గాంచిన సంఘటనలో ఆయన పాల్గొన్నారు. ఆ కారణంగా బ్రిటీష్ ప్రభుత్వం 1916లో ఆయనను అరెస్టు చేసి మూడేండ్లు నిర్బంధించింది. 1920లో విడుదలయ్యాక భారతదేశం వచ్చిన మౌలానా మదాని 'ఖిలాఫత్-సహాయ నిరాకరణ





ఉద్యమం' లో పాల్గొన్నారు. ఈ సందర్భంగా భారతీయులు బ్రిటీష్ సైన్యం నుండి బయటకు రావాల్సిందిగా పిలుపిచ్చినందుకు రాజద్రోహం నేరం క్రింద మౌలానాను నిర్బంధించారు.

బ్రిటీష్ పాలనలో హిందువులు, ముస్లింలు ఒకే విధంగా బానిసత్వం భరిస్తున్నారు కనుక హిందూ-ముస్లింలు ఏకోన్ముఖంగా బ్రిటీష్ సామ్రాజ్యవాద శక్తులపై, పోరాటం సాగించాలన్నారు. ఈ లక్ష్యాన్ని సాధించాలంటే హిందూ-ముస్లింల మధ్య పటిష్టమైన స్నేహం, సామరస్య భావాలు పెంపొందడం దేశ ప్రయోజనాల దృష్ట్యా అత్యవసరమన్నారు.

జాతీయోద్యమంలో భాగంగా జరిగిన దండి సత్యాగ్రహంలో, శాసనోల్లంఘన ఉద్యమంలో మౌలానా మదాని చురుకైన పాత్రను నిర్వహించారు. 1942లో సాగిన క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నందుకు ఆయన జైలు పాలయ్యారు. ఈ మేరకు ఆయన పలుమార్లు జైలుజీవితాన్ని రుచిచూడాల్సి వచ్చింది.

ఆల్ ఇండియా ముస్లిం లీగ్ వేర్పాటువాద రాజకీయాలను తొలుత నుండి మౌలానా వ్యతిరేకించారు. మత దురహంకారం, మత విద్వేషం రెచ్చగొట్టడం, ఉమ్మడి ప్రయోజనాలకు మంచిది కాదన్నారు. 'ద్విజాతి సిద్ధాంతం' అతి ప్రమాదకరమని వాదిస్తూ ముస్లింలీగ్ నేతల చర్యలను తూర్పార పడుతూ, భారత విభజన ఆలోచనలను నిశితంగా విమర్శిస్తూ ప్రసంగాలు చేశారు. ఈ మేరకు ఆయన పలు పుస్తకాలను రాశారు.

భారత విభజన వలన సంభవించిన పరిణామాలతో మౌలానా అహ్మద్ హసన్ మదని కలత చెందారు. ఆ తరువాత ఆయన స్వతంత్ర భారత దేశంలో విద్యా, ఆధ్యాత్మిక రంగాల మీద దృష్టి సారించారు. చిన్ననాట తాను చదువుకున్న విద్యాలయం DAR-UL-ULOOM' ప్రధానాచార్యునిగా సుదీర్ఘకాలం పనిచేశారు. జాతీయోద్యమంలో తనదైన ప్రధాన పాత్రను పోషించినJAMIT-UL-ULAMA నేతగా, మార్గదర్శకునిగా జీవితాంతం పని చేశారు. మౌలానా మదని అందించిన సేవలకు గుర్తింపుగా ఆయనకు SHAIK-UL-ISLAM అను బిరుదును అందించి JAMIT-UL-ULAMA తన్నుతాను గౌరవించుకుంది.

స్వాతంత్ర్యోద్యమంలోనూ, స్వతంత్ర భారతంలోనూ, మౌలానా అహ్మద్ హసన్ మదాని నిర్వహించిన నిర్మాణాత్మక పాత్రను గౌరవిస్తూ, భారత ప్రభుత్వం 'భారత భూషణ్' అవార్డునిచ్చి గౌరవించదలించింది. **మాతృభూమి విముక్తి కోసం తాను ఏది చేసినా అది తన విధి మాత్రమేనని. విద్యుక్త ధర్మాన్ని నిర్వహించినందుకు అవార్డులు-రివార్డులు స్వీకరించడం సరికాదు** అన్నారు. చివరివరకు మాతృభూమి మీద అత్యంత ప్రేమాభిమానాలు చూపిన మౌలానా మదని '**భారతదేశంలో మరణించాలనుకుంటున్నాను**' అంటూ ఆయన ఆకాంక్షించినట్టుగానే 1957లో ఢిల్లీలో అంతిమశ్వాస విడిచారు. ◆



# 73. ఖాన్ అబ్దుల్ జబ్బార్ ఖాన్

## (1883-1958 )

**స**ర్వస్వతంత్ర స్వేచ్ఛా ప్రియత్వానికి పెట్టింది పేరైన పఠాన్ ప్రజలను శాంతి కాముకులుగా తీర్చిదిద్ది జాతీయోద్యమ దిశగా నడిపించిన '**ఖాన్ సోదరుల**'లో '**సరిహద్దు గాంధీ**' గా ప్రఖ్యాతిగాంచిన ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ కాగా మరోకరు '**డాక్టర్ ఖాన్ సాబ్**' గా ఖ్యాతిగాంచిన మరోకరు ఖాన్ అబ్దుల్ జబ్బార్ ఖాన్.

ప్రస్తుత పాకిస్థాన్‌లో భాగమైన పెషావర్ జిల్లా, చార్‌సద్దా తహసిల్‌లోని ఉత్తమంజాయ్ లోని సంపన్న కుటుంబంలో 1883 సంవత్సరం ఆయన పుట్టారు. పెషావర్‌లో ప్రాథమిక విద్య తరువాత బొంబాయి వెళ్ళి వైద్యవిద్య పూర్తిశారు. 1909లో ఉన్నతవిద్య నిమిత్తం ఇంగ్లాండ్ వెళ్ళి 1920లో స్వదేశం వచ్చి ఇండియన్ మెడికల్ సర్వీస్‌లో ప్రవేశించారు.

ఆ సమయంలో వాయవ్య సరిహద్దు ప్రాంతంలోని వజిరిస్తాన్‌లో పెల్లుబుకుతున్న పఠాన్ తెగల తిరుగుబాటును అణిచివేయడానికి వెళ్ళిన బ్రిటీష్ సైనికులకు వైద్య సేవలను అందించడానికి డాక్టర్ ఖాన్‌ను పంపగా, స్వజనులను ఇక్కట్ల పాల్జేస్తున్న బ్రిటీష్ సేనలకు వైద్యసేవలు అందజేయటం ఇష్టంలేక ఉద్యోగానికి ఆయన రాజీనామా చేశారు.

ఆ తరువాత ప్రజా సేవలో ప్రవేశించిన ఖాన్ అబ్దుల్ జబ్బార్ ఖాన్ కాస్తా '**డాక్టర్ ఖాన్ సాబ్**' అయ్యారు. ఆ పేరుతోనే ఆయన జాతీయోద్యమ చరిత్రలో ప్రసిద్ధులయ్యారు. సోదరుడు ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ మార్గంలో ప్రజల కోసం వైద్యశాలలను ప్రారంభించి





వైద్యసేవల ద్వారా జాతీయోద్యమంలో ప్రవేశించారు. 1930లో గాంధీజీ పిలుపు మేరకు ఆరంభమైన శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నారు. అ సందర్భంగా తన తొలి రాజకీయ ప్రసంగం చేశారు. పెషావర్‌లోని ఖిస్సాఖాని బజార్‌లో ప్రజల మీద పోలీసులు జరిపిన కాల్పులలో తీవ్రంగా గాయపడిన వందలాది కార్యకర్తలకు సేవలందించి ప్రభుత్వ ఆగ్రహానికి గురయ్యారు. జైలుశిక్షను అనుభవించారు. శిక్షాకాలం ముగిశాక డాక్టర్ ఖాన్ సాబ్ వాయవ్య సరిహద్దు రాష్ట్రం నుండి బహిష్కరణకు గురయ్యారు.

ఆ తరువాత నుండి జాతీయోద్యమానికి పూర్తికాలం వెచ్చించడం ద్వారా డాక్టర్ ఖాన్ సాబ్ భారత జాతీయ కాంగ్రెస్ నాయకునిగా ఎదిగారు. వాయవ్య సరిహద్దు ప్రాంతపు కాంగ్రెస్ పార్టీ విభాగానికి తిరుగులేని నేతగా ప్రజల మన్నన పొందారు. 1935లో, 1940లో జరిగిన ఎన్నికలలో ముస్లింలీగ్ అభ్యర్థులను పూర్తిగా పరాజితుల్ని చేసి, ఆయన నాయకత్వంలో భారత జాతీయ కాంగ్రెస్ ఘన విజయం సాధించింది. ఆ ఘన విజయం డాక్టర్ ఖాన్‌సాబ్ కు ముఖ్యమంత్రి పదవి తెచ్చిపెట్టింది.

1942లో సాగిన 'క్విట్ ఇండియా' ఉద్యమంలో ఆయన చురుగ్గా పాల్గొన్నారు. ఆరంభం నుండి వేర్పాటువాద భావనలను వ్యతిరేకిస్తూ, హిందూ-ముస్లింల ఐక్యతను అభిలషించిన ఆయన అఖిల భారత ముస్లింలీగ్ చేస్తున్న భారత విభజన వాదనను వ్యతిరేకించారు. మహమ్మద్ అలీ జిన్నా ద్విజాతి సిద్ధాంతాన్ని సమర్థవంతంగా తిప్పికొట్టారు. 1946 ఆగస్టు 16న ముస్లింలీగ్ ప్రత్యక్షచర్యకు పిలుపునివ్వగా హిందూ-ముస్లింల మధ్య సామరస్య వాతావరణం చెడకుండా కాపాడేందుకు స్వయంగా కష్టపడ్డారు.

భారత జాతీయ కాంగ్రెస్ 1947 మే 1న విభజనకు సూత్రప్రాయంగా అంగీకరించగా డాక్టర్ ఖాన్ సోదరులు వ్యతిరేకించారు. పాకిస్థాన్ ఏర్పడ్డాక భారత విభజన వ్యతిరేకించిన పాపానికి ముస్లింలీగ్ నాయకత్వంలో ఏర్పడిన పాకిస్థాన్ ప్రభుత్వం డాక్టర్ ఖాన్‌ను 'విద్రోహి'గా పరిగణించింది. ఆయన ప్రభుత్వాన్ని రద్దుచేసి ఆయనను ఆరేండ్లు గృహ నిర్బంధానికి గురి చేసింది. ఆ తరువాత నుండి చాలాకాలం ఖాన్ సోదరులకు పాకిస్థాన్ జైలులా మారింది. ఆ సోదరులిరువురు పలుమార్లు బహిష్కరణకు కూడా గురయ్యారు.

ప్రభుత్వాలు ఎలా పరిగణించినా ప్రజలు మాత్రం ఆయనను తమ ప్రియతమ నేతగా గౌరవించారు కనుక ఎన్నికల ద్వారా అధికారం చేపట్టినా ఆయన వ్యతిరేక శక్తులు ఆయనను ఏ పదవిలోనూ పూర్తిగా కొనసాగనివ్వలేదు. ఆయన అడ్డు తొలిగించేందుకు కుట్రలు జరుగుతున్నాయని తెలిసినా ప్రజలతో మమేకమై తిరగడాన్ని మానక పోవడంతో 1958 మే 9న ఖాన్ అబ్దుల్ జబ్బార్ ఖాన్ హత్యకు గురయ్యారు. ◆



# 74. మౌలానా అబుల్ కలాం ఆజాద్

## (1888-1958)

**భా**రత జాతీయోద్యమం దశ, దిశను నిర్దేశించి, స్వరాజ్య సాధనలో అగ్రభాగాన నిలచి, జనహృదయాధి నేతలుగా శాశ్వత ఖ్యాతి నార్జించిన స్వాతంత్ర్య సమర యోధులలో అగ్రగణ్యులు మౌలానా అబుల్ కలాం ఆజాద్.

1888 నవంబర్ 11న మక్కాలో జన్మించారు. తల్లి ఆలియా, తండ్రి మౌలానా ఖైరుద్దీన్. ఆజాద్ అసలు పేరు అబుల్ కలాం మొహిద్దీన్ ఖైరుద్దీన్. ఆజాద్ సాంప్రదాయక విద్యను గరిపిన పిదప కైరోలోని అల్-అజహర్ విశ్వవిద్యాలయంలో ఉన్నత విద్య పూర్తి చేశారు. స్వతంత్ర భావాలు స్వేచ్ఛా,స్వాతంత్ర్యాలను అభిలషించే అబుల్ కలాం తన పేరుకు **'ఆజాద్'**ను జోడించుకుని మౌలానా అబుల్ కలాం ఆజాద్ అయ్యారు. మౌలానా ఆజాద్ భార్య జులేఖా బేగం గృహ సంబంధిత వ్యవహారాలకు ఆయనను దూరంగా ఉంచి, ఉద్యమస్ఫూర్తిని కలిగిస్తూ జాతీయోద్యమంలో ఎంతో తోడ్పాటునందించారు.

మౌలానా అరబిక్, పర్షియన్, టర్కిష్, ఉర్దూ భాషలలో మంచి పాండిత్యం సంపాదించారు. పదకొండు ఏండ్ల వయస్సులో కలం చేతపట్టి, 12వ ఏట **నైరంగ్-ఎ-ఆలం** పత్రికను తెచ్చారు. 13వ ఏటన సాహిత్య విమర్శను సృజియించిన ఆయన ఆ తరువాత **'విద్యాగని, సలక్షణ శోభితుడు, మహాకవి, సాటిలేని విద్వాంసుడు'** అని ప్రశంసలను





అందుకున్నారు. ఒక వైపు సాహిత్యవేత్తగా కృషి సాగిస్తూ ముస్లిం జన సముదాయాల పరిస్థితులను, పరాయి పాలకుల దుశ్చర్యలను గమనించిన ఆయన 1904 లో జరిగిన అఖిల భారత ముస్లిం విద్యా సదస్సులో, అఖిల భారత ముస్లిం పత్రికా సంపాదకుల సమావేశాల్లో పరిష్కారాలను సూచించారు. ముస్లింలీగ్ ఆలోచనలతో బయలుదేరిన ఆయన చివరకు పరాయి పాలనకు స్వస్తిపలకాలంటే సాయుధపోరాటమే శరణ్యమనుకుని **దారుల్ ఇర్షాద్** మరియు **హిజుబుల్లా** అను విప్లవ సంఘాలను ఏర్పాటు చేశారు.

ఆ సందర్భంగా ఎదురైన అనుభవాల దృష్ట్యా హిందూ-ముస్లింల మధ్య ఐక్యత కోసం జీవితాంతం కృషి చేశారు. స్వరాజ్యం కంటే హిందూ- ముస్లింల ఐక్యత ప్రధానమని ప్రకటించారు. 1920 జనవరిలో మొదటిసారిగా మహాత్మాగాంధీని కలుసుకున్నారు. అప్పటి నుండి ఆజాద్ విప్లవబాటను వీడి అహింసా మార్గాన ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమంలో పాలొన్నారు. ఆ తరువాత స్వరాజ్య సంపాదన వరకు సాగిన వివిధ పోరాట రూపాలలో ప్రధాన పాత్ర వహించారు. ఈ ఉద్యమాల సందర్భంగా ఆరంభమైన ఆయన జైలు శిక్షల జీవితం పది ఏండ్ల ఏడు మాసాల పాటు వివిధ జైళ్ళలో సాగింది.

1923లో ఢిల్లీలో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ సమావేశాలకు 35 సంవత్సరాల వయస్సులో అధ్యక్షత వహించిన మౌలానా 1927లో కాంగ్రెస్-ముస్లింలీగ్‌ల మధ్య ఏర్పడిన సమోధ్యకు తోడ్పడ్డారు. 1939లో మరోసారి కాంగ్రెస్ అధ్యక్ష పదవి చేపట్టి 1948లో స్వాతంత్ర్యం లభించేంత వరకు ఆ పదవిలో ఉండి చరిత్ర సృష్టించిన ఆయన వేర్పాటువాదాన్ని వ్యతిరేకించారు. స్వతంత్ర భారతదేశంలో గాంధీజీ ఒత్తిడి మీద 1947 జనవరి 15న విద్యాశాఖ మంత్రిగా బాధ్యతలు స్వీకరించి, తొలి విద్యాశాఖామాత్యులుగా భవిష్యత్తు తరాలను తీర్చిదిద్దే విలక్షణమైన విద్యా ప్రణాళికలను అమలుచేశారు.

మౌలానా పలు గ్రంథాలను రాసి ప్రచురించి మహకవిగా, పండితునిగా, అద్భుత మేథాశక్తిగల ధార్మికవేత్తగా ఎనలేని ఖ్యాతి నార్జించారు. జాతీయోద్యమం దిశగా ప్రజలను చైతన్యవంతుల్ని చేసేందుకు **అల్ హిలాల్, అల్ బలాగ్** ఉర్దూ పత్రికలను వెలువరించారు. బ్రిటీష్ ప్రభుత్వాన్ని కలవరపెట్టిన ఈ పత్రికలు పలుమార్లు నిషేదానికి గురయ్యాయి. భారత స్వాతంత్ర్యోద్యమంలో, స్వతంత్ర భారత దేశంలో పలు విశిష్ట పాత్రలను నిర్వహించి, చరమాంకం వరకు తాను నమ్మిన లౌకిక ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు కట్టుబడి, హిందూ-ముస్లింల మధ్య ఐక్యతను ప్రగాఢంగా వాంఛిస్తూ జీవితాన్ని సాగించిన మౌలానా అబుల్ కలాం ఆజాద్ 1958 ఫిబ్రవరి 22న కన్నుమూశారు. ◆

# 75. మౌలానా అహమ్మద్ సయీద్

## ( 1888-1959 )

**'స్వాతంత్ర్యం కోసం పోరాడటం నా విధి. పోరాట యోధునిగా పెన్షన్ స్వీకరించడం నా ధర్మం ప్రకారం నిషిద్ధం'**, అంటూ భారతప్రభుత్వం మంజూరు చేసిన పెన్షన్ సౌకర్యాన్ని తిరస్కరించిన కొద్దిమంది స్వాతంత్ర్యసమరయోధులలో అహమ్మద్ సయీద్ ఒకరు.

1888లో ఢిల్లీ సమీపంలోని షాజానాబాద్‌లో సయీద్ జన్మించారు. చిన్ననాటి నుండే బానిసత్వం పట్ల తీవ్ర వ్యతిరేకత వ్యక్తచేయడం ఆయన విలక్షణ లక్షణంగా తల్లి తండ్రులు గమనించారు. విద్యార్థి దశ నుండే మంచివక్త గానే కాకుండా చక్కని సాహిత్యాన్ని సృష్టించి మంచికవిగా ఆయన సాహిత్యరంగంలో రాణించారు.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం తరువాత అంతులేకుండా పోయిన బ్రిటీషర్ల దుర్మార్గాలకు వ్యతిరేకంగా ఆరంభమైన 'వలీ ఇలాహీ' ఉద్యమంతో సయీద్ బాగా ప్రభావితులయ్యారు. ఆ ఉద్యమ ప్రేరణతో రాజకీయ జీవితాన్ని ప్రారంభించిన సయీద్ అతిత్వరలోనే జాతీయోద్యమంలో ప్రవేశించారు. అద్భుతవక్త అయిన మహమ్మద్ తన ఆలోచనాత్మక ప్రసంగాలతో శ్రోతలను ఉర్రూతలూగించారు, ఆలోచింపచేశారు. కవితలతో పరాయి పాలకులపై అక్షరాగ్నులు కురిపించారు.

ఖిలాఫత్ ఉద్యమం నుంచి ప్రారంభమై, స్వాతంత్ర్యం సిద్ధించే వరకు సాగిన అన్ని





జాతీయోద్యమ కార్యక్రమాలలో పాల్గొన్నారు. ఆ కారణంగా 1921లో ప్రారంభమైన ఆయన ఒక సంవత్సరం జైలు జీవితం 1930లో 2 సంవత్సరాలు, 1932, 1940లలో ఏడాది చొప్పున సాగింది. ఆయనను ప్రభుత్వం **అతిప్రమాదకారి**గా భావించడంతో 1942 లో మూడేండ్ల కఠిన కారాగారవాసమే కాకుండా, ఏకాంతంగా జైలులో గడపాల్సి వచ్చింది. ఈ సుదీర్ఘ జైలు జీవితం ఆయనలోని వక్తకు, కవికి ఎంతో తోడ్పాటునిచ్చింది. కఠిన కారాగారవాసం అనుభవిస్తూ, తన పూర్వీకుల త్యాగాలను స్మరించుకుంటూ, ఉద్వేగానికి లోనైన ఆయన 'ఆసిర్' కలం పేరుతో పరవళ్ళుతొక్కే కవిత్వాన్ని పండించారు.

1919లో ఏర్పడిన JAMAIATH-UL-ULMA-I-HIND తో సన్నిహిత సంబంధాలు కలిగి ఉండటమే కాక ఆ సంస్థకు కార్యదర్శిగా, అధ్యక్షునిగా కూడా బాధ్యతలను నిర్వహించారు. ఈ సంస్థ నేతృత్వంలో ప్రజలను ప్రధానంగా ముస్లింలను జాతీయోద్యమంలో పాల్గొనాల్సిందిగా సుమారు 900 మంది ఉలేమాలు చారిత్రాత్మక పిలుపునిచ్చారు. శాంతియుత ప్రజాస్వామ్య పోరాటానికి ప్రాధాన్యత నిచ్చే సయీద్ అహమ్మద్ అవసరమైతే సాయుధ పోరాటంలో ప్రాణత్యాగాలకు కూడా సిద్ధం కావాలని పిలుపునిచ్చారు.

మతాన్ని రాజకీయాలతో ముడిపెట్టడాన్ని అంగీకరించని సయీద్, ముస్లింలీగ్ విభజన రాజకీయాలను విమర్శించారు. మతమనోభావాలను రెచ్చగొట్టి తమ పబ్బం గడుపు కోవాలనుకుంటున్న రాజకీయశక్తులను సహించని ఆయన భారతదేశ విభజనను తీవ్రంగా వ్యతిరేకించారు. భారత విభజన ప్రతిపాదనను తొలినుండి వ్యతిరేకించిన ఆయన మహమ్మదాలి జిన్నాను ఎంత తీవ్రంగా విమర్శించారో అంతకంటే ఎక్కువగా నెహ్రూ, పటేల్‌లను కూడా విభజనకు బాధ్యుల్ని చేస్తూ దుయ్యబట్టారు. విభజన పరిణామాలలో భయభ్రాంతులైన ప్రజలలో ధైర్యాన్ని కలుగజేసేందుకు సదస్సులు, సమావేశాలు నిర్వహించారు. ఈ సందర్భంగా గాంధీజీ చేపట్టిన సత్యాగ్రహంలో ఆయన వెంట ఉండి సయీద్ ప్రధానపాత్ర వహించారు.

భారతదేశం **'సంపూర్ణ స్వరాజ్యం'** సాధించాక జరిగిన తొలి రిపబ్లిక్ దినోత్సవం నాడు, చరిత్ర ప్రసిద్ధి చెందిన ఎర్రకోటలో జరిగిన **'ఉర్దూ ముషాయిరా'** ను సయీద్ అహమ్మద్ ఘనంగా నిర్వహించారు. ఆరోజు ఆయన నిర్వహించిన ముషాయిరా సాంప్రదాయకంగా నేటికి కొనసాగుతుంది. ఈ విధంగా విముక్తి పోరాటాన్ని తన విధిగా ప్రకటించి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం అవిశ్రాంతంగా పోరాడిన సమరశీలుడు, కవి, విఖ్యాత వక్త, కార్యశూరుడైన మౌలానా సయీద్ అహమ్మద్ 1959 డిసెంబరు 4న, తన జ్ఞాపకాలను భారతీయులకు వదలి, శాశ్వత విశ్రాంతికై తరలి వెళ్ళిపోయారు. ◆

# 76. బేగం సకీనా లుక్మాని

## ( 1865-1960 )

**ఆ**ది నుండి స్వాతంత్ర్యోద్యమంలో ప్రధాన పాత్ర వహించిన తయ్యాబ్జీ కుటుంబం పలువురు మహిళలను జాతీయోద్యమానికి అంకితం చేసింది. మూడు తరాలకు చెందిన ఆ మహిళల్లో రెండు పదులు దాటని మహిళల నుండి ఎనిమిది పదులు దాటిన వారి వరకూ ఉన్నారు. అటువంటి పెద్ద వయస్సు మహిళలలో బేగం సకీనా లుక్మాని ఒకరు.

1865 ప్రాంతంలో గుజరాత్ రాష్ట్రంలో జన్మించిన ఆమె స్వాతంత్ర్యోద్యమ నేత బద్రుద్దీన్ తయ్యాబ్జీ కుమార్తె. భారత జాతీయ కాంగ్రెస్ తొలినాటి సమావేశాలకు అధ్యక్షత వహించిన ప్రముఖుడాయన. బద్రుద్దీన్ తయ్యాబ్జీ గృహంలో ఎల్లప్పుడు విలసిల్లుతున్న రాజకీయ వాతావరణం ఫలితంగా చిన్ననాటే జాతీయ భావనలను అందిపుచ్చుకున్న ఆమె జాతీయోద్యమంలో భాగంగా సాగిన అన్ని కార్యక్రమాలలో ప్రత్యక్షంగా పాల్గొన్నారు.

గాంధీ పిలుపు మేరకు 1930లో గుజరాత్‌లో సాగిన విదేశీ వస్తు బహిష్కరణ, మద్యపాన నిషేధ ఉద్యమాలలో ఆమె క్రియాశీలక పాత్ర వహించారు. ఆమె వయస్సు అప్పటికి 65 సంవత్సరాలైనప్పటికి ఎంతో చురుగ్గా పనిచేసి అందర్ని ఆశ్చర్యచకితుల్ని చేశారు. ఈ ఉద్యమంలో భాగంగా విదేశీ వస్తువుల విక్రయశాలలు, మద్యపానశాలల ఎదుట మండు టెండలను కూడా లెక్క చేయక పికెటింగ్‌లు నిర్వహించారు. గుజరాత్‌లో





విదేశీవస్తు బహిష్కరణకు, మద్యపాన విక్రయశాలల వద్ద పికిటింగ్ కార్యక్రమాలకు ప్రేరణగా నిలిచారు.ఆమెను అడ్డుకోవాలన్న ప్రభుత్వం శాంతి భద్రతలకు భంగం కల్గించారన్న నేరారోపణ చేసి ఆమెను అరెస్టు చేసింది.

ఆ తరువాత ఏకపక్ష విచారణ జరిపి ఆమెకు నాలుగు మాసాల కఠిన కారాగార శిక్ష, వందరూపాయల జరిమానా విధించింది. ఈ వార్త గుజరాత్ రాష్ట్రంలో సంచలనం సృష్టించింది. ప్రజలు ఆగ్రహావేశాలను వ్యక్తంచేశారు. బ్రిటీష్ న్యాయవ్యవస్థను, ప్రభుత్వాన్ని దుయ్యపడ్తూ, సకీనా బేగంకు విధించిన శిక్షను రద్దు చేయాల్సిందిగా ఉద్యమించారు. జాతీయోద్యమ నాయకులంతా ఆమె శిక్షను రద్దు చేయాల్సిందిగా ముక్త కంఠంతో డిమాండ్ చేశారు. అందుకు స్పందించిన ప్రభుత్వం సకీనా లుక్మాని స్వయంగా శిక్ష రద్దును అభ్యర్థిస్తే శిక్ష తగ్గించగల అవకాశాలను పరిశీలిస్తామని ప్రకటించింది. ఆమె మాత్రం ప్రభుత్వం కోరినట్టుగా శిక్ష రద్దు చేయమంటూ విజ్ఞప్తి చేసేందుకు నిరాకరించారు.

ఆ సందర్భంగా **అమ్మను నిరోధిస్తే ఆమె ఆరంభించిన కార్యక్రమాలను కొనసాగించ డానికి మేమున్నాం. మమ్మల్ని కూడా అరెస్టు చేయండి. మాకూ శిక్షలు విధించండి,** అంటూ గుజరాత్ యువత భారీ సంఖ్యలో వీధుల్లోకి వచ్చింది. ముఖ్యంగా పెద్ద సంఖ్యలో మహిళలు ప్రభుత్వ చర్యల మీద నిరసన వ్యక్తంచేస్తూ విరుచుకుపడ్డారు. ప్రజల నిరసన దృష్ట్యా ప్రభుత్వం దిగిరాక తప్పలేదు. ప్రభుత్వానికి సకీనా లుక్మానికి విధించిన కఠిన జైలు శిక్షను సామాన్య జైలుశిక్షగా మార్చక తప్పలేదు.

ఈ మేరకు '**తయ్యాబ్జీ పరివారం సభ్యులు అసాధారణ ధైర్య సాహసాలను ప్రదర్శించారు**' అంటూ గాంధీజీ నుండి ప్రశంసలందుకున్న సకీనా బేగం, జాతీయోద్యమ కార్యకలాపాలు అన్నింటిలో ప్రముఖ పాత్ర వహించారు. మద్యపాన నిషేధ ఉద్యమంలో భాగంగా గుజరాత్ రాష్ట్ర మహిళలు వైశ్రాయ్‌కు రాసిన చారిత్రాత్మక లేఖ మీద అమీనా తయ్యాబ్జీతో పాటుగా సకీనా లుక్మాని పాల్గొని గాంధీజీ విజ్ఞప్తి మేరకు ప్రకటన మీద సంతకం చేశారు. గాంధీజీని బ్రిటీష్ ప్రభుత్వం అరెస్టుచేయగా గుజరాత్‌లో మహిళలతో భారీ సమావేశాన్ని ఏర్పాటుచేసి ప్రభుత్వ వైఖరిని ఆమె తీవ్రంగా విమర్శించారు.

అపూర్వత్యాగాల ఫలితంగా స్వాతంత్ర్యం సిద్ధించాక, దేశం రెండుగా చీలిపోవటం పట్ల ఆమె ఎంతో వ్యాకులత చెందిన ఆమె ఆ తరువాత రాజకీయాలకు దూరమయ్యారు. తన సమయాన్ని పూర్తిగా సామాజిక సేవకు అంకితం చేసిన బేగం సకీనా లుక్మాని 1960 ఫిబ్రవరి 6న కన్నుమూసేంత వరకూ జాతిజన సేవలో గడపారు. ◆

# 77. మౌల్వీ ముహ్మద్ హఫీజుర్రెహమాన్

## (1901- 1962)

**స్వా**ర్థపూరిత స్వప్రయోజనాల కోసం '**ప్రమాదంలో మతం**' నినాదంతో భారత దేశాన్ని రెండుగా చీల్చడానికి సాగిన ప్రయత్నాలను సాధికారికంగా ఎదుర్కొన్న మంచి వాగ్ధాటిగల నేతలలో మౌలానా హఫీజు ర్రెహమాన్ అగ్రగామి.

ఉత్తరప్రదేశ్ రాష్ట్రం బిజ్నోర్ జిల్లాలో 1901 జనవరి 10న ఆయన జన్మించారు. బ్రిటీష్ వ్యతిరేక శక్తుల తయారీ కేంద్రంగా ఖ్యాతిగాంచిన దేవ్‌బంద్‌లోని దారుల్-ఉలూం లో ఆయన విద్యాభ్యాసం చేశారు. ప్రముఖ జాతీయోద్యమ నాయకులు మౌలానా ముహమ్మద్ హసన్ శిష్యరికంలో కరడుగట్టిన జాతీయోద్యమకారులు అయ్యారు.

1919 నుండి మౌలానా హఫీజుర్రెహమాన్ ఆంగ్ల ప్రభుత్వం మీద సమర శంఖారావం పూరించారు. ఆ క్రమంలో JAMIAT-I-ULEMA-I-HINDలో సభ్యులు కావడంతోపాటుగా భారత జాతీయ కాంగ్రెస్ సభ్యత్వం స్వీకరించారు. 1921 లో ప్రారంభమైన ఖిలాఫత్ ఉద్యమంలో మౌలానా చురుకైన పాత్ర నిర్వహించారు. చిన్నతనం నుండి మంచి వక్తగా పేర్గాంచిన ఆయన ఉద్యమ లక్ష్యాలను, పరిణామాలను పూసగుచ్చినట్టు వివరించడమే కాకుండా ఉత్తేజపూరితంగా ప్రసంగిస్తూ ప్రజలను ఉద్యమ దిశగా నడిపించి పలు ఖిలాఫత్ కమిటీలు ఏర్పాటు చేయించారు. ఖిలాఫత్-సహాయ నిరాకరణ ఉద్యమం సందర్భంగానే మహాత్మా గాంధీకి ఆయన సన్నిహితులయ్యారు.





జాతీయోద్యమంలో భాగంగా కార్యకలాపాలను చురుకుగా నిర్వహిస్తున్న జమాత్‌లో ప్రధాన బాధ్యతలను స్వీకరించారు. 1929లో ఆ సంస్థ ఆధ్వర్యంలో జరిగిన సమ్మేళనంలో మూడు గంటల పాటు సుదీర్ఘ ఉపన్యాసం చేస్తూ, ముస్లింలంతా జాతీయ కాంగ్రెస్‌లో చేరాలని, ప్రతి ఒక్కరూ జాతీయోద్యమంలో పాల్గొనాలని ఆయన పిలుపునిచ్చారు.

జమాత్‌లో లాగే జాతీయ కాంగ్రెస్‌లో కూడా పలు బాధ్యతాయుతమైన పదవులను మౌలానా నిర్వహించారు. 1936లో అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సభ్యునిగా ఆయ ఎంపికయ్యారు. ఉత్తరప్రదేశ్ కాంగ్రెస్ కమిటి ఉపాధ్యక్షులుగా పనిచేశారు. ఏ సంస్థలో ఉన్నా ఆ సంస్థ లక్ష్యాల సాధనకు అవిశ్రాంతంగా పని చేయటం, తన ప్రసంగాల ద్వారా ప్రజలను ఉద్యమాల దిశగా కార్యోన్ముఖులను చేయడం కర్తవ్యంగా ఆయన భావించారు. ఆ కారణంగా ప్రభుత్వ ఆగ్రహానికి గురైన మౌలానా హఫీజు ర్రెహమాన్ తన కుటుంబానికి దూరంగా సంవత్సరాల తరబడి జైలు జీవితం గడపాల్సి వచ్చింది.

మతం ప్రాతిపదికన దేశ విభజన జరగాలంటూ సాగుతున్న ఆలోచనల వెనుక గల ప్రమాదాన్ని పసిగట్టిన ఆయన విభజన ఆలోచనను వ్యతిరేకించారు. ఈ సందర్భంగా ఆల్ ఇండియా ముస్లింలీగ్ నాయకుల వాదనలను ఆయన ఎదుర్కొన్నారు. లీగ్ చర్యలను తీవ్రంగా నిరశించారు. ముస్లింలీగ్ ప్రచారం వెనుక దుర్మార్గపు ఆలోచనలు దాగి ఉన్నాయని ప్రజలను హెచ్చరించారు. ఉద్వేగాలకు లోనై దారి తప్పవద్దని ముస్లింలను కోరారు. 1947 జూన్ 14న భారత జాతీయ కాంగ్రెస్ చేసిన విభజన తీర్మానాన్ని ఆయన తీవ్రంగా తప్పుబట్టారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ, 'the Partition as the death warrant of nationalism...a communal mesure the like of which had never come before the AICC in the whole history' అన్నారు. భారత విభజన సృష్టించిన అల్లకల్లోలం సమయాన మతసామరస్యం కాపాడేందుకు, బాధితులను ఆదుకునేందుకు ప్రాణాలను సైతం పణంగా పెట్టి మౌలానా పనిచేశారు.

ఆయన మంచి వక్త మాత్రమే కాదు మంచి రచయిత కూడ. ఉర్దూలో అనేక ప్రసిద్ధ గ్రంథాలను ఆయన రచించారు. స్వతంత్ర్య భారతావనిలో ఆయన కాంగ్రెస్ పార్టీ సభ్యునిగా ప్రథమ లోక్‌సభ ఎన్నికలలో విజయం సాధించి ప్రజాప్రతినిధి అయ్యారు. ఆ తరువాత మొరాదాబాదు, అమ్రోహా పార్లమెంటరీ నియోజకవర్గాల నుండి విజయం సాధించిన ఆయన పార్లమెంటులో కూడా గొప్ప వక్తగా పేరుగడించారు. ఈ విధంగా పలు పాత్రలను సమర్థవంతంగా పోషించిన మౌలానా హఫీజుర్రెహమాన్ 1962 ఆగస్టు 2న చివరిశ్వాస విడిచి చిరస్మరణీయులయ్యారు. ◆

# 78. మగ్బూల్ అహమ్మద్

## (1902- 1963)

1857లో హైదరాబాదు నగరం నడిబొడ్డున ఆంగ్ల –నిజాం సైన్యాల మీద దాడులు జరిపి భాగ్యనగరం నడిబొడ్డున ఉరికొయ్యకు ఉయ్యాలలూగిన పఠాన్ తుర్రేబాజ్ ఖాన్, అండమాన్ దీవులో ప్రాణాలర్పించిన మౌల్వీ అల్లావుద్దీన్‌ల వారసుడిగా అటు నిజాం ఇటు ఆంగ్లేయుల పెత్తనాన్ని సవాల్ చేసిన యోధుడు మగ్బూల్ అహమ్మద్.

1902 మే 28న జన్మించిన ఆయన హైదరాబాద్ నివాసి. చిన్ననాటి నుండే జాతీయ భావాల పట్ల మొగ్గు చూపిన అహ్మద్ ఆలీఘర్ Mohammedan Anglo Oriental College లో బి.ఎ. చదువుతూ, గాంధీజీ పిలుపు మేరకు కళాశాల విద్యకు స్వస్తిచెప్పి సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. అప్పటి నుండి జాతీయ కాంగ్రెస్ క్రియాశీలక కార్యకర్తగా జీవిత చరమాంకం పనిచేశారు. భారత జాతీయ కాంగ్రెస్ పిలుపుమేరకు దేశవ్యాప్తంగా పలు ప్రాంతాలు పర్యటిస్తూ ప్రచార కార్యక్రమాలను నిర్వహించారు.

1930లో ఉప్పు సత్యాగ్రహం సందర్భంగా మధ్యప్రదేశ్‌లోని సియోని అను ప్రాంతంలో ఉప్పును తయారు చేసినందుకు శిక్షను అనుభవించారు. అప్పటి నుండి ఆరంభమైన శిక్షలకు ఏమాత్రం వెరవని ఆయన శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకుని బ్రిటీష్ పాలకులను తీవ్రంగా విమర్శిస్తూ సియోల్‌కొట్‌లో





చేసిన ప్రసంగంతో మండిపడిన ప్రభుత్వం ఆయనకు మళ్ళీ జైలుశిక్షను ప్రసాదించింది. అప్పటి నుండి జైలుశిక్షలు ఆయన జీవితంలో భాగమయ్యాయి. జాతీయోద్యమ కార్యక్రమాలలో తనదైన భాగస్వామ్యాన్ని అందిస్తూ వివిధ ప్రాంతాలను తిరుగుతూ 1938లో ఆయన హైదరాబాద్ వచ్చారు. ఆయన రాక బ్రిటీష్ పాలకులకు, నిజాంకు రుచించకపోవడంతో భాగ్యనగరం నుండి బహిష్కరణకు గురయ్యారు.

ఆయన మతాభిమాని అయినప్పటికీ, మతతత్వ రాజకీయాలు నచ్చక మొదట నుంచి అఖిల భారత ముస్లింలీగ్‌కు దూరంగా ఉన్నారు. మతాభిమానం ఉన్నా, మత దురభిమానం మాత్రం కూడదన్నది ఆయన అభిమతం. హైదరాబాద్ నుండి కేరళ రాష్ట్రంలోని మలబార్ చేరుకున్న ఆయన ముస్లిం లీగ్ మతతత్వ రాజకీయాలను నిరశిస్తూ ప్రసంగాలు చేసి లీగ్ నేతల ఆగ్రహానికి గురయ్యారు. భౌతిక ప్రమాదం ఏర్పడటంతో 1945లో మగ్బూల్ అహ్మద్ మలబార్ వదిలి పెట్టాల్సి వచ్చింది. మలబార్ నుండి మధ్యప్రదేశ్ చేరిన ఆయన అక్కడి జాతీయ రాజకీయాలలో తనదైన పాత్రను పునః ప్రారంభించి 1946లో సియోని కాంగ్రెస్ కమిటీకి అధ్యక్షులయ్యారు. మౌలానా అబుల్ కలాం అజాద్ అధ్యక్షతన గల Nationalist Muslim Conference నాయకునిగా మత సామరస్యం ప్రబోధిస్తూ, వేర్పాటువాదాన్ని వ్యతిరేకిస్తూ దక్షిణ భారతదేశం అంతటా ఆయన పలుమార్లు పర్యటనలు చేశారు.

భారత విభజన జరగడంతో తీవ్రంగా వ్యధచెందిన మగ్బూల్ అహమ్మద్ ఆ తరువాత నవభారత నిర్మాణానికి నడుంకట్టారు. నిజాం సంస్థానం భారతదేశంలో విలీనం కావాలంటూ సాగిన ఉద్యమంలో బహుముఖ పాత్రపోషించారు. ఈ సందర్భంగా జరిగిన పోలీస్ యాక్షన్‌లోని బాధితులను, నిరాశ్రయులను ఆదుకోడానికి శ్రమించారు.

1952–56 సంవత్సరంలో హైదరాబాద్ విధాన సభ సభ్యునిగా నియక్తులయ్యారు. అనంతరం 1956–60లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విధాన సభలో కాంగ్రెస్ పార్టీ నేతగా, ప్రజాప్రతినిధిగా ప్రజల పక్షం వహించి నిర్మాణాత్మకంగా బాధ్యతలను నిర్వహించారు.

జర్నలిస్టుగా రాణించాలన్న ప్రగాఢమైన కోరిక గల ఆయన పలు వ్యాసాలను, పలు పరిశోధనాత్మక గ్రంథాలను వెలువరించారు. నగరంలోని రచయితలను ప్రోత్సహించేందుకు గాను, తనదైన భావాలను వ్యక్తీకరించేందుకు, DAILY SALTANATH, PAISA AKHBAR, MUSHEER-E-DECCAN, AMAR BHARATH అను వార్తాపత్రికల సంపాదకవర్గాలలో సభ్యునిగా చేరి విశేషకృషి సల్పిన మగ్బూల్ అహ్మద్ 1963 జూలై 14న హైదరాబాద్ నగరంలో తన 61వ ఏట అంతిమశ్వాస విడిచారు. ◆



# 72. సైఫుద్దీన్ కిచ్లూ

## (1888-1963)

**స**మరోజ్వల భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో రక్తాక్షరాలతో లిఖించబడిన జలియన్ వాలా బాగ్ సంఘటనకు నేపధ్యనాయకులలో ప్రథములు, బ్రిటీష్ ప్రభుత్వ కారాగారాల్లో 14 ఏండ్ల పాటు శిక్షను అనుభవించిన యోధులు డాక్టర్ సైపుద్దీన్ కిచ్లూ.

1888 జనవరి 15న పంజాబ్ రాష్ట్రం ఫరీద్‌కోట్‌లో సైపుద్దీన్ కిచ్లూ జన్మించారు. తండ్రి అజీజుద్దీన్. తల్లి జాన్ బీబి. సంపన్న కుటుంబంలో పుట్టిన ఆయన అమృతసర్, ఆగ్రా, అలీఘర్‌లలో విద్యాభ్యాసం తరువాత లండన్ వెళ్ళి న్యాయశాస్త్రం, ఆ తరువాత జర్మనీ వెళ్ళి తత్వశాస్త్రంలో డాక్టరేట్ చేసి 1913లో అమృతసర్ వచ్చారు. అమృతసర్‌లో న్యాయవాదిగా స్థిరపడి మంచి ఆర్జనాపరుడిగా ఖ్యాతిగాంచిన ఆయన 1915లో జాతీయోద్యమకారిణి సాదత్ బాను వివాహమాడారు.

మంచి వక్తగా పేర్గాంచిన డాక్టర్ కిచ్లూ 1915లో హోంరూల్ ఉద్యమంలో పాల్గొనటం ద్వారా రాజకీయరంగ ప్రవేశం చేశారు. 1919లో బ్రిటీష్ ప్రభుత్వం **రౌలత్ చట్టం** తీసుకు రాగా, జలియన్‌వాలా బాగ్‌లో 1919 మార్చి 30న జరిగిన భారీ బహిరంగ సభలో ఆ చట్టానికి వ్యతిరేకంగా డాక్టర్ సైపుద్దీన్ వలస పాలకుల మీద నిప్పులు కక్కుతూ ప్రసంగించారు. ఆ తరువాత ఏప్రిల్ 9న డాక్టర్ సత్యపాల్ డాంగ్ నాయకత్వంలో జరిగిన





శ్రీరామ నవమి ఊరేగింపులో మతాల ప్రసక్తి లేకుండా అంతా పాల్గొని భారతీయుల ఐక్యతను చాటాలని పిలుపునిస్తూ వేలాది ముస్లింలతో డాక్టర్ సైపుద్దీన్ పాల్గొన్నారు. ఈ సందర్భంగా ప్రజలలో పెల్లుబికిన చైతన్యం, వ్యక్తమైన ఐక్యత పాలకుల వెన్నులో చలి పుట్టించింది. ఆ భయం వల్లే డాక్టర్ కిచ్లూ, డాక్టర్ డాంగ్‌లను ప్రభుత్వం చర్చలకని పిలిచి నిర్బంధించి ప్రవాసానికి పంపింది. ఈ సంఘటనతో డాక్టర్ కిచ్లూ Hero of Jallianwala Bagh గా భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ప్రఖ్యాతులయ్యారు.

1919 చివరిలో నిర్బంధం నుండి బయటకు వచ్చిన ఆయన లక్షలను ఆర్జించి పెడుతున్న న్యాయవాద వృత్తిని మానేసి జాతీయ కాంగ్రెస్‌కు అంకితమయ్యారు. ఖిలాఫత్–సహాయ నిరాకరణ ఉద్యమంలో చురుగ్గా పాల్గొన్న కిచ్లూ అఖిల భారత ఖిలాఫత్ కమిటీకి అధ్యక్షులయ్యారు. ఖిలాఫత్ నేతగా హిందూ,ముస్లింల ఐక్యతను వాంఛిస్తూ, ముస్లింలను జాతీయ కాంగ్రెస్‌లో చేరమని పిలుపునిచ్చారు. ముస్లింల హక్కుల పరిరక్షణకు గాను, Taharik-I-Tanzim సంస్థను ప్రారంభించారు. ఆ సంస్థ కార్యక్రమాలను ప్రచారం చేసేందుకు Tanzim అను ఉర్దూ పత్రిక నడిపారు. భారత దేశపు ప్రధాన జనశ్రేణులైన హిందూ–ముస్లింలలో ఐక్యతకోసం అహర్నిశలు శ్రమించిన డాక్టర్ కిచ్లూ వలస పాలకులకు వ్యతిరేకంగా మతప్రసక్తి లేకుండా ఉమ్మడిగా ఉద్యమించాలని కోరారు.

1924లో జాతీయ కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా, 1929లో లాహోర్ జాతీయ కాంగ్రెస్ సమావేశాల ఆహ్వానసంఘం అధ్యక్షునిగా వ్యవహరించారు. డాక్టర్ కిచ్లూకు గాంధీజీ అంటే వ్యక్తిగతంగా గౌరవం ఉన్నా రాజకీయంగా ఆయన సుభాష్ చంద్రబోస్‌ను అనుసరించారు. ఆ క్రమంలో కిచ్లూ కాంగ్రెస్‌కు దూరమయ్యారు. ఆయన అది నుండి ముస్లింలీగ్ వేర్పాటువాద రాజకీయాలను వ్యతిరేకించారు.

1947లో భారత దేశానికి స్వాతంత్ర్యం లభించాక, డాక్టర్ సైపుద్దీన్ కమ్యూనిజం పట్ల ఆకర్షితులయ్యారు. కమ్యూనిస్టు పార్టీలో పనిచేయడం కాకుండా **శాంతి–స్నేహం** లాంటి సంస్థలలో ప్రపంచశాంతి కోసం కృషిచేశారు. ఈ సందర్భంగా ప్రపంచంలోని ప్రముఖ నేతలను కలిసి ప్రపంచ శాంతికి పిలుపునిచ్చారు. డాక్టర్ కిచ్లూ శాంతి కోసం నిరంతరం సాగించిన కృషికి గుర్తింపుగా 1954లో ఆయనకు **స్టాలిన్ శాంతి పురస్కారం** లభించింది. సమరశీల యోధులైన ఆయన అవిశ్రాంతగా విశ్వశాంతి, ప్రపంచ ప్రజలలో శాంతి–స్నేహం ఆకాంక్షిస్తూ ముందుకు సాగారు. చివరి వరకు సామ్యవాద వ్యవస్థను కలలు గంటూ ప్రపంచశాంతి కోసం కృషిచేస్తూ వచ్చిన ప్రపంచశాంతి ప్రవక్త, డాక్టర్ సైపుద్దీన్ కిచ్లూ 1963 అక్టోబర్ 9న తుది శ్వాసవిడిచారు. ◆

# 80. అతావుల్లా షా బొఖారి

## (1891-1967)

స్వరాజ్య సాధనకు సాగుతున్న సంగ్రామంలో భాగస్వాములై తమ ఉత్తేజిత ప్రసంగాల ద్వారా ప్రజలను జాతీయోద్యమ దిశగా కార్యోన్ముఖులను చేసిన అదికొద్ది మంది మహావక్తలలో అతావుల్లా షా బొఖారి ఒకరు.

1891లో బీహార్ రాష్ట్రం పాట్నాలో జన్మించారు. ఆయన కుటుంబం ప్రస్తుత పాకిస్థాన్‌లో భాగమైన గుజరాత్ వెళ్లి స్థిరపడింది. అతావుల్లా తల్లి ఫాతిమా, తండ్రి జయావుద్దీన్ అహమ్మద్. ఆయన చిన్న వ్యాపారి. పసి ప్రాయంలోనే తల్లిని కొల్పోయిన ఆయన మేనమామ ఇంట్లో పెరిగారు. పారశీ, అరబ్బీ, ఉర్దూ భాషలు నేర్చుకుని, ఆధ్యాత్మిక విద్యను పూర్తిచేసి అమృతసర్ వచ్చి, అక్కడ మత బోధకునిగా జీవితాన్ని ప్రారంభించి 40 సంవత్సరాల పాటు ఖురాన్ గ్రంథాన్ని బోధిస్తూ గడిపారు.

బ్రిటీష్ పాలకుల పట్ల వ్యతిరేకత గల కుటుంబం నుండి వచ్చిన ఆయన 1921లో ఖిలాఫత్ ఉద్యమం ద్వారా జాతీయోద్యమంలో ప్రవేశించారు. ఖిలాఫత్ ఉద్యమం సందర్భంగా ఆయనలో దాగి ఉన్న మహావక్త బహిర్గతమయ్యాడు. బ్రిటీష్ పాలకుల సామ్రాజ్యవిస్తరణ కాంక్షను, ఆంగ్లేయాధికారుల కుయుక్తులను ఎండగడ్తూ నిప్పులు చెరిగే ప్రసంగాలతో ఆయన విసురుతున్న వాగ్బాణాల ధాటికి పాలకవర్గాలు తట్టుకోలేక





పోయాయి. ఆయన ప్రసంగాలు ప్రజలను ఉగ్రూతలూగించి, ఉత్తేజపర్చడం చూసి ఎక్కడ జాతీయోద్యమానికి సంబంధించిన సభ-సమావేశం జరిగినా ఆయనను ప్రత్యేకంగా ఆహ్వానించటం ఆచారమైంది. ఆ దశలోనే పాలక వర్గాల డేగకళ్ళు ఆయన మీద పడడంతో లాఠీచార్జీల రుచితో పాటుగా దుర్భర జైలు జీవితాన్ని చవిచూడటం ఆరంభమైంది.

పంజాబు కేంద్రంగా 'మజ్లిస్-ఏ-అహరర్ ఇస్లాం హింద్' సంస్థను ప్రారంభించి, ఆ సంస్థ అధినేతగా శాసనోల్లంఘన ఉద్యమంలో చురుగ్గా పాల్గొన్నారు. బ్రిటీష్ శాసనాలను ఎందుకు ఉల్లంఘించాలో వివరిస్తూ ఆయన చేసిన ప్రసంగాలు పాలక వర్గాల ఆగ్రహానికి కారణమయ్యాయి. జామయతుల్-ఉల్మా-ఏ-హింద్ నాయకునిగా కూడా **స్వాతంత్ర్యం కోసం పోరాడటం ప్రతి ఒక్కరి విధి** అని చాలా స్పష్టంగా ఆయన ప్రకటించారు.

1932లో ఇస్లాం మతం ధార్మిక సూత్రాలకు భిన్నంగా వ్యవహరిస్తున్న అహమ్మదీయులను (Ahemdiya) మజ్లిస్-ఏ-అహరర్ నాయకునిగా ఎదుర్కొని అహమ్మదీయుల ప్రధాన కార్యస్థానమైన ఖదియాయాన్‌లో ఏకధాటిగా 5 గంటలపాటు ప్రసంగం చేసి మౌలానా అతావుల్లా సంచలన చరిత్ర సృష్టించారు.

ప్రజలతో నిత్యం గడిపే అతావుల్లా ద్వితీయ ప్రపంచ యుద్ధం సందర్భంగా బ్రిటీష్ ప్రభుత్వం భారతీములను సైన్యంలో చేర్చుకోడానికి ప్రాంరంభించిన ప్రయత్నాలను వమ్ము చేయడానికి యుద్ధానికి వ్యతిరేకంగా గొంతు విప్పారు. ఈ విధంగా ఆయన గళం విప్పిన ప్రతిసారి జైలు జీవితం చవిచూడాల్సి వచ్చింది. ఆయన మాత్రం జైలు జీవితానికి భయపడి పరాయి పాలకుల చర్యల మీద ప్రసంగాల నిప్పుల వర్షం కురిపించడం మానలేదు.

బ్రిటీష్ పాలకుల కబంధ హస్తాల నుండి విముక్తం కావాలంటే ప్రజలంతా ఏకోన్ముఖంగా ఉద్యమించాలని ఉద్బోధిస్తూ భారత దేశమంతటా ఆయన పర్యటనలు జరిపారు. హిందూ-ముస్లింలు ఏకం కావడం మాత్రమే కాదు, ఈ గడ్డ మీద నివసిస్తున్న సర్వజనులు ఏకమవ్వాలని ఆయన విస్తృత ప్రచార కార్యక్రమాన్ని నిర్వహించారు. ముస్లిం లీగ్ కోరుతున్న పాకిస్థాన్ సృష్టిని అతావుల్లా పూర్తిగా వ్యతిరేకించారు. భారత విభజన కోరుతూ, ముస్లింలను ఆకట్టుకోవడానికి అఖిల భారత ముస్లిం లీగ్ సాగించిన ప్రచారాన్ని తన ధార్మిక పరిజ్ఞానంతో, ప్రసంగాల ద్వారా సమర్థవంతంగా ఎదుర్కొన్నారు.

భారత విభజన తరువాత స్వగ్రామం వెళ్ళి రాజకీయాలకు దూరంగా సంస్కరణోద్యమాన్ని చేపట్టి ప్రజల అభ్యున్నతికి ప్రధానంగా మహిళల ప్రగతికి దోహదపడే ఎన్నో కార్యక్రమాలను నిర్వహిస్తూ, జీవితాంతం ప్రజాసేవలో గడిపిన అతావుల్లా షా బొఖారి 1967 ఆగస్టు 21న కన్నుమూశారు. ◆

# 81. సుగరా ఖాతూన్

## (-1968)

**జా**తీయ, అంతర్జాతీయ వ్యవహారాల పట్ల అత్యంత ఆసక్తి చూపటమే కాక లోతైన అధ్యయనంతో జ్ఞానపరంగా పరిణతి చెందిన మహిళలు జాతీయోద్యమంలో ఎందరో కన్పిస్తారు. అటువంటి మహిళా మేధావులలో ఒకరు సుగరా ఖాతూన్.

ఆనాడు నిజాం సంస్థానంలో భాగంగా ఉన్న ఉస్మానాబాద్‌లో సుగరా ఖాతూన్ జన్మించారు. తల్లి పేరు సైదున్నీసా, తండ్రి సయ్యద్ హదీ. 13 ఏండ్ల వయస్సులో జమీందారీ కుటుంబానికి చెందిన మహమ్మద్ జమీర్‌ను ఆమె వివాహమాడారు. ఆ వివాహం జరిగిన ఆరు సంవత్సరాలకే ఆమె భర్తను కోల్పోయారు. ఆ తరువాత అత్తింట తలెత్తిన ఆస్థి వివాదాల కారణంగా ఆమె ఉత్తరప్రదేశ్ రాష్ట్రం లక్నోలోని తన మేనమామ ఇంట చేరారు.

ఆ సమయంలో ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమం ఉధృతంగా సాగుతోంది. ఆమె మంచి చదువరి. సమకాలీన సాంఘిక-ఆర్థిక-రాజకీయాల పట్ల ఆసక్తి గల ఆమె ఆ వివరాలను ఎప్పటికప్పుడు తెలుసుకుంటున్నారు. జాతీయోద్యమ వార్తలు ఆమెను నిలువనివ్వటం లేదు. ఆమెలోని దేశభక్తి భావనలు ఊపిరి సలుపనివ్వటం లేదు, నిర్లిప్తంగా కూర్చోనివ్వటంలేదు. మత ఆచార-సంప్రదాయాలు కట్టుబాట్లు కొంత మేరకు ఆటంకం





అవుతున్నాయి. ఆ కట్టుబాట్లను కాదంటూ జాతీయోద్యమంలో ఆమె ప్రవేశించారు. ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమంలో ఆమె చురుగ్గా పాల్గొన్నారు. విదేశీ వస్తు బహిష్కరణ సందర్భంగా అత్యంత విలువైన తన పెళ్ళినాటి వస్త్రాలను విసర్జించటమే కాక విదేశీ వస్తు విక్రయశాలల ఎదుట జరిగిన పికెటింగ్ తదితర కార్యక్రమాలలో ఆమె ప్రత్యక్షంగా పాల్గొన్నారు. ఆ కార్యక్రమాలలో సరోజినీ నాయుడు తదితరులతో కలసి క్రియాశీలకంగా వ్యవహరించి పోలీసుల లాఠీ దెబ్బలను రుచి చూశారు.

జాతీయోద్యమ కార్యక్రమాలలో చురుకైన భాగస్వామ్యాన్ని అందించటం, నిరంతరం ఆ కార్యకలాపాలలో మునిగితేలడం స్వజనులకు రుచించలేదు. చివరకు వస్త్రధారణ విషయంలో కూడా సంబంధీకుల నుండి తీవ్ర వ్యతిరేకతను ఎదుర్కొవాల్సి వచ్చింది. సౌకర్యంగా ఉంటాయన్న ఉద్దేశ్యంతో ఆమె ఖద్దరు చుడీదార్-కుర్తాలను ధరించారు. వితంతువులు అలాంటి వస్త్రధారణ చేయరాదని సాంప్రదాయవాదులు విమర్శించారు. అంగాంగ ప్రదర్శన లేని సభ్యతగల వస్త్రధారణ ఏమాత్రం అభ్యంతరకరం కానవసరం లేదంటూ ఆమె ఆ విమర్శలను తోసిపుచ్చి ధైర్యంగా ముందుకుసాగారు.

ఖిలాఫత్ నిధులకోసం ఆబాదిబానో బేగం లక్నోకు వచ్చిన సందర్భంగా సుగరా ఖాతూన్ ఆమెకు ఎంతగానో సహకరించారు. ఖిలాఫత్ ఫండ్ కోసం తన వద్దనున్న పెళ్ళినాటి 50తులాల బంగారాన్ని, అత్యంత విలువైన వజ్రాలను విరాళంగా సమర్పించారు. ఈ సందర్భంగా మహిళలను ఉద్దేశించి ఆమె ఉత్తేజపూరిత ప్రసంగం చేసి సభికులను ప్రభావితులను చేశారు. ఆమె ప్రసంగం తరువాత మహిళలు పెద్ద సంఖ్యలో ముందుకు వచ్చి భారీ ఎత్తున నిధులు సమకూర్చిన సంఘటన నగరంలో చర్చనీయాంశం అయ్యింది.

సుగరా ఖాతూన్ నిరంతర అధ్యయనశీలి. ఆమె రాసిన ఆలోచనాత్మక వ్యాసాలు, కవితలు **హందర్ద్, జమీందార్, హందం** లాంటి ప్రముఖ ఉర్దూ పత్రికలలో ప్రచురితమై సంచలనం సృష్టించాయి. ఆమె పలు నవలలు రాసి, వాటి ద్వారా తన అభిప్రాయాలను నిర్భయంగా ప్రకటించి, ఆ గ్రంథాలను ప్రచురించి మంచి రచయిత్రిగా ఖ్యాతి గడించారు.

సుగరా ఖాతూన్ క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభ దశలో చాలా చురుగ్గా పాల్గొన్నా ఆ తరువాత కుటుంబ సమస్యల కారణంగా పలుమార్లు హైదరాబాద్ పర్యటనలు జరపాల్సి రావటంతో జాతీయోద్యమంలో కోరుకున్న రీతిగా పూర్తి స్థాయిలో పాల్గొనలేక పోయారు. భారతదేశ స్వతంత్ర భానుడు ఉదయించాక ఆమె హైదరాబాద్ నుండి లక్నో వెళ్ళిపోయారు. ఆ తరువాత జాతి పునర్నిర్మాణంలో భాగం పంచుకుంటూ, ప్రజాసేవలో నిరంతరం గడిపిన సుగరా ఖాతూన్ 1968 మే 10న తనువు చాలించారు. ◆



# ౮౨. మఖ్దూం మొహిద్దీన్

## (౧౯౦౮-౧౯౬౯)

**జా**తీయోద్యమంలో కవులు-కళాకారులు అటు జాతీయోద్యమకారులుగా, ఇటు కవులు-రచయితలుగా ద్విపాత్రాభినయం చేశారు. బ్రిటీష్ సామ్రాజ్యవాద శక్తులు, ఆ శక్తుల మిత్రుల మీద అక్షరాగ్నులు కురిపించిన కవులలో మఖ్దూం మోహిద్దీన్ ఒకరు.

1908 ఫిబ్రవరి 4న ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని మెదక్ జిల్లా ఆందోల్ గ్రామంలో ఆయన జన్మించారు. చిన్నతనంలో తండ్రిని కోల్పోయిన ఆయన పినతండ్రి బషీరుద్దీన్ ఇంట పెరిగారు. ఆ ఇంట ఇటు జాతీయోద్యమం, అటు సామ్యవాద వ్యవస్థకు సంబంధించిన ప్రాధమిక సమాచారం మఖ్దూంకు పరిచయమయ్యాయి.

1929లో చదువుల కోసం గ్రామం విడిచి హైదరాబాద్ చేరుకున్న ఆయన చాల పేదరికాన్ని అనుభవించారు. 1937లో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో యం.ఏ చేసి, ఆ తరువాత **ఉర్దూ నాటకం** మీద పరిశోధనా పత్రం సమర్పించి డాక్టరేట్ పొందిన ఆయన 1929లో నగరంలోని సిటీకాలేజీలో అధ్యాపకునిగా స్థిరపడ్డారు.

ఆ రోజుల్లో 'నిగార్' పత్రికలో నియాజ్ ఫతేపూర్ రాసే వ్యాసాలు, కవితలు హేతు దృష్టితో యువకుల్లో ఆలోచనలు రేకెత్తించేవి. నియాజ్ రచనలు, బ్రిటీష్ సామ్రాజ్యవాద శక్తులకు వ్యతిరేకంగా, సామ్యవాద వ్యవస్థ, ప్రజాతంత్ర లౌకిక విధానాలకు గురించి జవహర్‌లాల్ నెహ్రూ చేస్తున్న ప్రసంగాలు మఖ్దూంను బాగా ఆకట్టుకున్నాయి.





1934లో 'టూర్' అను భావగీతం ద్వారా తనలోని కవితా తృష్ణకు అక్షర రూపం కల్పించిన ఆయన బ్రిటీష్ సామ్రాజ్యవాదానికి, ఫాసిజానికి వ్యతిరేకంగా ఉర్దూ కవిత్వం సృష్టించటం ఆరంభించారు. ఆ క్రమంలో 1936లో ఆయనకు కమ్యూనిస్టు గ్రూపులతో సంబంధాలు ఏర్పడ్డాయి. 1941లో కమ్యూనిస్టు పార్టీ హైదరాబాదు నగర శాఖను ప్రారంభించడంలో ఆయన ప్రధాన పాత్ర వహించారు. ఆ తరువాత అటు జాతీయోద్యమం ఇటు కమ్యూనిస్టు ఉద్యమంలో పూర్తికాలం పనిచేసేందుకు మఖ్దూం మొహిద్దీన్ అధ్యాపక ఉద్యోగానికి రాజీనామా చేశారు.

1942లో 'క్విట్ ఇండియా ఉద్యమం' ప్రారంభమైంది. ఆ ఉద్యమంలో చురుగ్గా పాల్గొన్నందుకు ఆయన శిక్షను అనుభవిచారు. ఈ సందర్భంగా ఆయనకు జైలులో జాతీయోద్యమకారులు, నిజాం స్టేట్ కాంగ్రెస్ నేతలు స్వామీ రామానంద తీర్థ, అచ్యుతరావు దేశ్‌పాండే లాంటి ప్రముఖుల పరిచయం లభించింది.

1946లో నిజాం సంస్థానంలోని పారిశ్రామిక వాడలలోని కార్మికులకు తగిన సంక్షేమ చట్టాలు లేక పలు ఇక్కట్లు పడడాన్ని గమనించిన మఖ్దూం కార్మికోద్యమ నిర్మాణం కోసం నడుంకట్టారు. అప్పటి నుండి ఆరంభమైన ఆయన కార్మికోద్యమనేత పాత్ర చరమాంకం వరకు సాగి ఉన్నత శిఖరాలను అందుకుంది. ఈ క్రమంలో ఆయన ఇటు నిజాం ప్రభుత్వం నుండి అటు ఆంగ్లప్రభుత్వం నుండి శిక్షలు-ఆంక్షలను చవి చూశారు. అయినా వాటిని ఏమాత్రం ఖాతరు చేయకుండా ముందుకు సాగిన మఖ్దూం నైజాం విలీనోద్యమంలో చురుగ్గా పాల్గొన్నారు. స్వరాజ్యం లభించాక జరిగిన ఎన్నికలలో విజయుడై ప్రజాప్రతినిధిగా, శాసనమండలి సభ్యునిగా ప్రజలకు సేవలు అందించారు.

కవిగా మఖ్దూం మొహియుద్దీన్ అంతర్జాతీయ ఖ్యాతినార్జించిన పలు కవితల రాశారు. ఆయన రాసిన కవితలలో **తూర్పు, తెలంగాణా, సిజ్దా, జవాని, యాద్ హై, మైం, షాయర్,ఇంతెజార్, ముస్తఖ్బిల్, దోకతయో, ఇన్తిసాబ్, జంగ్, మశరిక్, ధుర్వా, ఇక్‌బాల్, అంథేరా, జంగ్ హై జంగ్ ఆజాదీకి, సితారే, చార్‌గల్, అజ్‌కిరాత్ నజా, చుప్‌సారహో, సన్నాటా, అప్నాషహర్** ప్రముఖమైనవి. ఈ మేరకు మఖ్దూం రాసిన గీతాలు-గజళ్ళలో కొన్ని హిందీ చలన చిత్రాలలో కూడా చోటుచేసుకున్నాయి.

ఈ విధంగా ప్రజా జీవనరంగంలో జాతీయోద్యకారునిగా, కవిగా, కార్మికోద్యమ నిర్మాతగా, ప్రజాప్రతినిధిగా, ప్రజా సేవకునిగా బహుముఖ పాత్రలను నిర్వహించి, ప్రజల హృదయాల మీద తనదైన చెరగని ముద్రను వేసిన మఖ్దూం మొహియుద్దీన్ 1969 ఆగస్టు 25న కన్నుమూశారు. ◆

# 83. డాక్టర్ సయ్యద్ మహమ్మద్

## ( 1889-1971)

**భా**రత స్వాతంత్రోద్యమం చివరి దశలో ఉనికిలోకి వచ్చిన ద్విజాతి సిద్ధాంతం, పాకిస్థాన్ భూభాగం ముస్లింల స్వంత గడ్డగా సాగిన ప్రచారం భారతీయులు భవిష్యత్తుకు ప్రమాదకరమని ప్రజానీకాన్ని హెచ్చరించి, మాతృభూమి ముక్కలు కాకుండేందుకు చివరి క్షణం వరకు కృషి చేసిన నాయకులలో డాక్టర్ సయ్యద్ మహమ్మద్ ఒకరు.

ఉత్తరప్రదేశ్ రాష్ట్రం, ఘాజిపూర్ జిల్లా సయ్యద్‌పూర్ గ్రామంలో జమీందారి కుటుంబంలో సయ్యద్ మహమ్మద్ 1889లో జన్మించారు. అలీఘర్‌లో చదువుతున్నప్పుడు, బ్రిటిష్ ప్రిన్సిపాల్ చర్యలకు వ్యతిరేకంగా సాగిన సమ్మెలో చురుకైన పాత్ర నిర్వహించి కళాశాల నుండి బహిష్కరణకు గురయ్యి ఆంగ్ల ప్రభుత్వ వ్యతిరేకిగా పరిగణించబడ్డారు.

1905లో బెనారస్‌లో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ సమావేశంలో తొలిసారిగా పాల్గొన్నారు. ఆల్ ఇండియా ముస్లింలీగ్ ఏర్పాటైన తొలిరోజులలో ఆయన లీగ్‌లో క్రియాశీలక పాత్ర నిర్వహించారు. 1911లో న్యాయశాస్త్రంలో డాక్టరేట్ డిగ్రీని పొందిన ఆయన పాట్నాలో ప్రాక్టీస్ ప్రారంభించారు. 1915లో బొంబాయిలో జరిగిన లీగ్ సమావేశంలో పాల్గొన్నారు. 1919లో గాంధీజీ పిలుపు మేరకు మంచి ఆదాయాన్ని తెచ్చిపెడుతున్న న్యాయవాద వృత్తిని వదులుకొని ఖిలాఫత్-సహాయ నిరాకరణోద్యమంలో





ప్రవేశించి ఉధృతంగా ఉద్యమ ప్రచారం గావించిన ఫలితంగా అరెస్టయ్యారు. జాతీయ కాంగ్రెస్‌లో పలు పదవులు చేపట్టడమే కాకుండా పోరాట కార్యక్రమాలలో క్రియాశీలకంగా వ్యవహరించటంతో ఆయన పలుమార్లు జైలుశిక్షలను అనుభవించారు.

1935 భారత ప్రభుత్వం చట్టం ప్రకారంగా 1937లో జరిగిన ఎన్నికలు ఆయన దక్షిణ చంపారన్ నియోజకవర్గం నుండి విజయం సాధించారు. జాతీయ కాంగ్రెస్‌లో అత్యున్నతస్థానంలో ఉన్న ప్రజానాయకుడు సయ్యద్ మహమ్మద్ ముఖ్యమంత్రిగా పదవికి అన్నివిధాల సమర్థుడన్న అభిప్రాయం ఆనాడు బలంగా వ్యక్తమైంది. డాక్టర్ రాజేంద్రప్రసాద్ అడ్డు తగలడంతో ముఖ్యమంత్రయ్యే అవకాశాన్ని ఆయన కోల్పోయారు.

1946లో బీహార్ లెజిస్లేటివ్ అసెంబ్లీకి మరోసారి ఎన్నికయ్యారు. సిన్హా ప్రభుత్వంలో రవాణా, పరిశ్రమలు, వ్యవసాయ శాఖల మంత్రిగా బాధ్యతలు చేపట్టి సమర్థవంతంగా నిర్వహించారు. సోషలిస్ట్ భావాలు గల ఆయన తన హయాంలో చిన్న కుటీర పరిశ్రమల స్థాపనకు శ్రమించారు. సహకార వ్యవసాయ క్షేత్రాల ఏర్పాటుకు సహకరించారు. ఆదాయ పంపిణీలో తేడాలు ఉన్నంత వరకు, ప్రజలు అంతరాలను అనుభవిస్తున్నంత వరకు సంపూర్ణ ప్రగతి ఏమాత్రం సాధ్యం కాదని అభిప్రాయపడ్డారు.

అఖిల భారత ముస్లిం లీగ్ వేర్పాటువాద రాజకీయాలను నిరసించారు. విభజనను కోరుతున్న నేతల నైజాన్ని ఆయన బహిరంగంగా దుయ్యబట్టారు. విభజనకు ప్రయత్నాలు శరవేగంగా జరుగుతున్నప్పుడు ప్రముఖ హిందూ-ముస్లిం నాయకుల అభీష్టాలకు వ్యతిరేకంగా, విభజన వలన కలిగే నష్టాలను వివరిస్తూ, విభజన యత్నాలను ఎదుర్కోవాల్సిందిగా ప్రజలను కోరుతూ ఆయన పర్యటనలు జరిపారు. విభజన వలన అటుగాని-ఇటుగాని ప్రధానంగా ముస్లింలు నష్టపోతారని ఆయన హెచ్చరించారు. భారతదేశం చీలిన సందర్భంగా పెచ్చరిల్లిన దురదృష్టకర హింసాకాండకు బలైన హిందూ, ముస్లిం, సిక్కు సోదరులకు పునరావాసం కల్పించేందుకు, ఆ జనసమూహాలలో ఆత్మస్థైర్యం పెంపొందిచేందుకు ఆయన ప్రత్యేకంగా కృషిసల్పారు.

స్వతంత్ర్య భారతావనిలో1952లో జరిగిన ప్రథమ సార్వత్రిక ఎన్నికలలో తూర్పు చంపారన్ నుండి లోక్‌సభకు ఎన్నికై ప్రభుత్వంలో పలు పదవులను నిర్వహించారు. ప్రధానంగా మతోన్మాద రక్కసిని మట్టి కరిపించేందుకు ఎన్నికల సంస్కరణలను ఆయన సూచించారు. ఈ విధంగా జాతీయోద్యమ కాలం నుండి బహుముఖ పాత్రలు నిర్వహించి, భవ్య భారతదేశం నిర్మాణంలో కూడా భాగం పంచుకున్న డాక్టర్ సయ్యద్ మహమ్మద్ 1971లో ఢిల్లీలో మృతిచెందారు. ◆



# 84. ఖాన్ అబ్దుస్ సమద్ ఖాన్

## (1885-1972)

**మ**హాత్మాగాంధీ మార్గాన నడిచి ఆయన ప్రతిరూపాలుగా అంతర్జాతీయంగా ఖ్యాతి గాంచిన '**సరిహద్దు గాంధీ**' ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ తోపాటుగా జాతీయస్థాయిలో '**బెలూచీ గాంధీ**' గా ఖాన్ అబ్దుస్ సమద్ ఖాన్ ప్రఖ్యాతి చెందారు.

ప్రస్తుత పాకిస్తాన్‌లో భాగమైన బెలూచిస్థాన్‌లోని గులిస్తాన్ గ్రామంలో 1885లో ఆయన జన్మించారు. చిన్నతనం నుండి స్వతంత్ర-సంస్కరణ భావాలుగల ఆయన పరాయి పాలకుల పెత్తనాన్ని, ప్రజలలో ప్రబలిన అనాచారాల్ని సహించలేక పోయారు. జాతి జనులలో చైతన్యంకోసం, సమాజంలో సంస్కరణలను తెచ్చేందుకు '**అంజుమాన్- యే-వతన్**' (మాతృభూమి కోసం సంఘం) అను సంస్థను స్థాపించారు.

ఆ సమయంలో ఉధృతంగా సాగుతున్న జాతీయోద్యమంలో బలూచి ప్రజలను భాగస్వాములను చేయాలని అబ్దుస్ సమద్ ఖాన్ భావించారు. ఆ క్రమంలో బ్రిటీషర్ల దాస్యం నుండి స్వదేశాన్ని సంపూర్ణంగా విముక్తం చేయటంతో పాటుగా స్వజాతి ఉద్దరణ సాధించాలని అబ్దుస్ సమద్ తలంచారు. ఆ ఆలోచనలకు అనుగుణంగా తమ అంజుమన్ - యే-వతన్ ను భారత జాతీయ కాంగ్రెస్‌కు అనుబంధ సంస్థగా చేశారు.

1920 నుండి భారత జాతీయ కాంగ్రెస్‌తో కలసి పనిచేస్తూ మహాత్ముని అహింసా





సిద్ధాంతాలతో మమేకమైన ఆయన విప్లవ సంఘాలతో కూడా సంబంధాలు ఏర్పరచు కున్నారు. ఒకవైపున తన ప్రజలను జాతీయోద్యమంలో భాగస్వాములు చేస్తూ మరోవైపున బలూచీ ప్రజల ప్రత్యేక వెతలను, బ్రిటీష్ పాలకవర్గాల దోపిడిని వివరించేందుకు ఆయన జాతీయకాంగ్రెస్ సమావేశాలను వేదిక చేసుకున్నారు. ఆయన ప్రసంగాల ధాటికి తట్టుకోలేకపోయిన ప్రభుత్వం ఆయనను, ఆయన సోదరులను కూడా జైళ్ళ పాల్జేసింది. ఆ విధంగా జైలు శిక్షల అనుభవం ఆరంభించిన ఆయన జైలు జీవితం అటు బ్రిటీష్ ఇండియాలో, ఇటు పాకిస్థాన్‌లో మొత్తం మీద 15 ఏండ్లు సాగింది.

జాతీయ కాంగ్రెస్ పిలుపు మేరకు అబ్దుస్ సమద్ యుద్ధ వ్యతిరేక పోరాటంలో పాల్గొని, యుద్ధ వ్యతిరేక ఉద్యమాన్ని బలూచిస్తాన్‌లో ఉధృతం చేశారు. 1942 నాటి క్విట్ ఇండియా పోరాటంలో ఆయన క్రియాశీలక పాత్ర వహించారు. ఈ సందర్భంగా ప్రభుత్వం అరెస్టు చేసి మూడు సంవత్సరాల కఠిన జైలు శిక్షను విధించింది. ఆయనను ఎన్నిసార్లు జైళ్ళ పాల్జేసినా గాంధీ బాటలో ఆయన ఆరంభించిన అహింసోద్యమం వెనుకంజ వేయలేదు. ఆయన జాతీయోద్యమంలో వేసిన ప్రతి అడుగు గాంధీమార్గంలో సాగింది.

మతంతో రాజకీయాలను ముడివేయరాదని ప్రకటించినా అబ్దుస్ సమద్ ఖాన్ అఖిల భారత ముస్లిం లీగ్‌కు భారత జాతీయ కాంగ్రెస్‌కు మధ్య ప్రారంభమైన నిశ్శబ్ద యుద్ధంలో కాంగ్రెస్ పక్షం వహించారు. మహమ్మద్ అలీ జిన్నా ప్రతిపాదించిన ద్విజాతి సిద్ధాంతాన్ని నిరశించారు. భారతదేశ విభజనను ఆయన స్పష్టంగా వ్యతిరేకించారు. ఈ వైఖరి ముస్లింలీగ్ నాయకుల ఆగ్రహానికి కారణమైంది. 1947లో పాకిస్తాన్ ఆవిర్భవించగానే పాకిస్తాన్ పాలక పక్షం అబ్దుస్ సమద్ ఖాన్ మీద కన్నెర్ర చేసింది.

స్వాతంత్ర్యం లభించాక బలూచిస్థాన్ ప్రజల హక్కుల కోసం స్వయం ప్రతిపత్తిగల బలూచిస్థాన్ ఏర్పాటు చేయాలని ఆయన డిమాండ్ చేశారు. ఆ డిమాండ్‌తో మండిపడిన మహమ్మద్ అలీ జిన్నా ఆయనను అరెస్టు చేయించారు. ఆ ఆరెస్టులకు ఏమాత్రం వెరువకుండా బలూచి ప్రజల న్యాయమైన హక్కుల కోసం, పురోభివృద్ధి కోసం వృద్ధాప్యాన్ని కూడా లెక్కచేయక పాలకపక్షంతో పోరాడుతూ అబ్దుస్ సమద్ ఖాన్ ముందుకు సాగారు.

జాతి జనుల విముక్తి కోసం అవిశ్రాంతంగా పరాయిపాలకులతో పోరాడిన బలూచీ యోధులు సమద్ ఖాన్ బలూచీ ప్రజల స్వయం ప్రతిపత్తి కోసం చివరిదాకా పోరాడుతూ 1972లో హత్యకు గురయ్యారు. ఈ వార్త తెలిసి బలూచిస్థాన్ ప్రాంతమంతా శోకసంద్రం కాగా అటు పాకిస్థాన్, ఇటు ఇండియాలోని ప్రజలు '**బలూచీ గాంధీ**' ఖాన్ అబ్దుస్ సమద్ ఖాన్‌కు ఘనంగా నివాళులు అర్పించారు. ◆

# 85. అబిద్ అలీ

## (1899-1973)

**జా**తీయోద్యమం ద్వారా ఉద్యమకారునిగా అక్షరాభ్యాసం చేసి ఆ తరువాత పలు ప్రజా జీవనరంగాలలో తీవ్రంగా కృషిసల్పి ఆయా రంగాలలో ప్రముఖులుగా ఖ్యాతిగాంచిన పలువురు ప్రసిద్ధుల సరసన స్థానం పొందిన యోధులు అబిద్ అలీ.

1899 సంవత్సరంలో కచ్‌కు చెందిన అతి సామాన్య వ్యాపారి జఫర్ భాయి ఇంట జన్మించారు. కుటుంబ భారాన్ని మోయలేక ఇక్కట్లు పడుతున్న తండ్రిని ఆదుకోడానికి అబిద్ అలీ 14 ఏండ్ల వయస్సులో మిల్లు కార్మికులయ్యారు. కుటుంబం గడవటానికి కార్మికుడిగా లభిస్తున్న ఆదాయం చాలకపోవటంతో పలు ఇతర పనులు కూడా చేశారు.

నిరంతర శ్రమ వలన ఆర్థికంగా కాస్త ప్రశాంతత లభిస్తున్న సమయంలో గాంధీజీ పిలుపుకు స్పందించి ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమంలో ఆయన భాగస్వాములయ్యారు. ఆ విధంగా 1921లో జాతీయోద్యమంలో ప్రవేశించిన అబిద్ ఆలీ జీవిత చరమాంకం వరకు ప్రజాసేవలో గడిపారు. ఖిలాఫత్ ఉద్యమంలో చురుగ్గా పాల్గొంటూ నిబద్ధత గల కార్యదక్షుడిగా అందరి మన్ననలు పొందారు. ఆ క్రమంలో పలుమార్లు జైలు శిక్షలకు గురయ్యారు. కొంతకాలం మలయా వెళ్ళిన ఆయన అక్కడ కూడా బ్రిటీష్ వ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడటంతో బహిష్కారానికి గురయ్యారు. ఆ





తరువాత స్వదేశం చేరుకున్న ఆయన తిరిగి జాతీయోద్యమ కార్యక్రమాలకు పూర్తిగా అంకితమయ్యారు. 1928లో గుజరాత్ రాష్ట్రంలో ఆరంభమైన బార్డోలి తాలూకా రైతులు సత్యాగ్రహ ఉద్యమంలో అబిద్ అలీ క్రియాశీలకంగా పాల్గొన్నారు. ఈ క్రమంలో సాగిన ప్రతి ప్రభుత్వ వ్యతిరేక కార్యక్రమాలలో పాల్గొన్న ఆయన ప్రతిసారి పోలీసుల దాడులకు, జైలు శిక్షలకు గురయ్యారు.

అబిద్ అలీ మతతత్వరాజకీయలను నిరసించి విభజన వాదాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. మతం ఆధారంగా దేశాన్ని విభజించటం వలన ప్రజలకు ఏమాత్రం ప్రయోజనం ఉండదని స్పష్టంగా ప్రకటించారు. ఆ కారణంగా పోలీసుల దాడులనే కాదు ముస్లిం లీగ్ కార్యకర్తల హింసాకాండను కూడా చవిచూడాల్సి వచ్చింది.

భారత దేశానికి స్వాతంత్ర్యం లభించింది. దశాబ్దాలుగా సాగించిన పోరాటం విజయవంతం అయ్యాక కార్మికులను సంఘటితం చేస్తూ, కార్మికోద్యమం వైపుగా ఆయన సాగారు. ఆ క్రమంలో ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ క్రాంగెస్ (INTUC) వ్యవస్థాపక ఉపాధ్యక్షులయ్యారు. ఈ సందర్భంగా INTUC ప్రగతి, పటిష్టతకు అహర్నిశలు పనిచేశారు. 1946లో భారతదేశంలోని కార్మికుల, కార్మిక సంఘాల ప్రతినిధిగా ఆయన అంతర్జాతీయ కార్మిక సంస్థ సమావేశాలకు హాజరయ్యారు.

1948 సంవత్సరంలో అబిద్ అలీ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు ఎంపికయ్యారు. ఈ పదవిలో 1952 వరకు ఉన్నారు. 1952 నుండి 54 వరకు ఆయన రాజ్యసభ సభ్యునిగా బాధ్యతలు నిర్వహించారు. ఆ తరువాత కేంద్ర ప్రభుత్వంలో కార్మిక శాఖామాత్యులుగా కూడా ఆయన పనిచేశారు.

అబిద్ అలీ కార్మిక, రాజకీయనాయుకుడిగా మాత్రమే కాకుండా రచయితగా కూడా రాణించారు. కార్మికుల జీవితాలను, కార్మికోద్యమాన్ని వివరిస్తూ ఆయన పలు గ్రంథాలు రాశారు. కమ్యూనిస్టుల పట్ల తనకు గల భావాలను వ్యక్తంచేస్తూ, ఆంగ్లంలో ఆయన రాసిన INDIAN COMMUNISTS EXPOSED, INDIAN COMMUNISTS గ్రంథాలు ఆనాటి కార్మిక లోకంలో సంచలనానికి కారణమయ్యాయి.

ఒకనాడు ఇల్లు గడవటం కోసం అతి సామాన్య మిల్లు కార్మికునిగా జీవితాన్ని ప్రారంభించి ఇటు జాతీయోద్యమకారునిగా అటు కార్మిక సంఘాల వ్యవస్థాపకుడిగా, జాతీయ-అంతర్జాతీయ స్థాయిలలో కార్మికజన హితైషిగా ఖ్యాతి గడించి, ఆ క్రమంలో ఆ కార్మిక శాఖా మంత్రిగా బాధ్యతలను కూడా చేపట్టి ప్రముఖ నాయకునిగా గుణుతికెక్కిన అబిద్ అలీ 1973 జూన్ 27న తన ప్రియ జనుల మధ్యన కన్నుమూశారు. ◆



# 86. 'కాకా బాబు' ముజఫర్ అహమ్మద్

## (1889-1973)

స్వాతంత్య్రాన్ని సాధించుకోవడం మాత్రమే కాదు అన్నిరకాల అసమానతలు లేని సమాజాన్ని కూడా మనమే నిర్మించుకోవాలన్న సంకల్పంతో ఒకవైపు పరాయిపాలకుల మీద పోరు సాగిస్తూ, మరోవైపు సామ్యవాద వ్యవస్థ నిర్మాణం కోసం పాటుపడిన తొలి తరం నాయకులలో 'కాకాబాబు' గా ఖ్యాతిగాంచిన ముజఫర్ అహమ్మద్ అగ్రగణ్యులు.

ప్రస్తుత బంగ్లాదేశ్‌లోని నౌఖాళి జిల్లాలోని సాంధ్వీఫ్ (SANDWIP) లో 1889 ఆగష్టు 5న ఆయన జన్మించారు. కుటుంబ ఆర్థిక దుస్థితి కారణంగా విద్యాభాసం చేస్తూనే పలు పనులు చేస్తూ ఆయన కుటుంబాన్ని పోషించాల్సి వచ్చింది. కష్టాల కడలిని అతి కష్టంగా ఈదుతున్నా అధ్యయనం పట్ల అమితాసక్తి గల ఆయన ప్రతి పుస్తకాన్ని, పత్రికను వదలకుండా చదవటం ద్వారా మంచి రచయితగానేకాక మంచి వక్తగా రూపొందారు.

చిన్నా చితక ఉద్యోగాలు చేస్తూ, చాలీచాలని ఆదాయంతో భారంగా బ్రతుకీడుస్తున్న సమయంలో తన చుట్టూ ఉన్న సమాజాన్ని, పలుమార్గాలలో ప్రజల శ్రమను దోచుకుంటున్న శక్తులను, వలస పాలకులు సాగిస్తున్న అదుపులేని దోపిడిని పరికించారు. ఈ పరిస్థితులను మార్చాలని సంకల్పించుకున్న ఆయన ప్రభుత్వ సేవలో గడపటం ఇష్టం లేక ప్రజలను చైతన్యవంతుల్ని చేసేందుకు రచయితగా ఉపక్రమించారు.





చిన్న వయస్సులోనే ఆయన బెంగాల్ విభజనను వ్యతిరేకించారు. ఆ క్రమంలో 1916 నుండి ప్రత్యక్ష రాజకీయాల పట్ల ఆసక్తి కనపర్చటం ప్రారంభించారు. 1917లో రష్యాలో బొల్షివిక్ విప్లవం సాధించిన విజయం అయనను ఉత్తేజపర్చింది. ఆ తరువాత రౌలత్ చట్టాన్ని నిరసిస్తూ ఉద్యమించారు. బెంగాల్‌లోని విప్లవకారులతో సంబంధాలు పెంచుకున్నారు. ఆ సమయంలో రష్యా నుండి తిరిగి వచ్చిన ముహజరిన్ల ద్వారా కమ్యూనిస్టు సిద్ధాంతాలు పరిచయం కాగా అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంతో ఏర్పడిన సంబంధాలతో స్వదేశంలో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణానికి నడుం కట్టారు. ఆ విధంగా బెంగాల్‌లో కమ్యూనిష్టు ఉద్యమ నిర్మాతగా ముజఫర్ అహమ్మద్ గణుతికెక్కారు.

1920లో పూర్తిగా రాజకీయాలకు అంకితం కావాలని నిర్ణయించుకున్న ఆయన బెంగాల్‌లో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణానికి నడుం బిగించారు. ఆ నిర్ణయం తరువాత పూట గడవటానికి కూడా ఆయన అనేక ఆర్థిక ఇబ్బందులు పడ్డారు. కమ్యూనిస్టు ఉద్యమాన్ని మొగ్గలోనే తుంచి వేసేందుకు బ్రిటీష్ ప్రభుత్వం నిర్ణయించుకుని అందుకు గాను చరిత్రాత్మక **'పెషావర్ కుట్ర కేసు'** బనాయించి ముజఫర్‌ను నిందితుడ్ని చేసింది.

1924-25 సంవత్సరాలలో ముజఫర్ అహమ్మద్ తన కార్యక్రమాలను మరింత విస్త్రుతం చేశారు. రచయితగా తనదైన కృషిని సాగిస్తూ, భారత జాతీయ కాంగ్రెస్‌లో పలు బాధ్యతలను నిర్వహించారు. 1926-27లో బెంగాల్ ప్రావెన్షియల్ కాంగ్రెస్ కమిటీ సభ్యుడిగా చురుకైన పాత్ర నిర్వహించారు. 1927 నుండి 29 వరకు అఖిల భారత కాంగ్రెస్ జాతీయ కమిటీ సభ్యునిగా పనిచేశారు. 1939లో ద్వితీయ ప్రపంచ యుద్ధం ప్రారంభం కాగానే యుద్ధవ్యతిరేక ప్రదర్శనలలో చురుగ్గా పాల్గొనడంతో ఆయన మీద ప్రభుత్వం నిషేదాజ్ఞలను విధించింది. ఆ తరువాత పలుమార్లు నిర్బంధించింది. 1942 నాటి క్విట్ ఇండియా ఉద్యమంలో కమ్యూనిస్టులు పాల్గొనక పోయినప్పటికి రచయితగా జాతీయోద్యమకారుల పక్షాన ఆయన నిలిచారు.

చిన్నతనం నుండి జాతీయోద్యకారునిగా ఎదిగి, మరోవైపు కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతగా వ్యవహరిస్తూ బ్రిటీష్ సామ్రాజ్య విస్తరణకాంక్షను, దోపిడిని వ్యతిరేకిస్తూ ఉద్యమించిన కారణంగా ముజఫర్ అహమ్మద్ పలు కుట్ర కేసులను ఎదుర్కొవడమే కాకుండా సంవత్సరాల తరబడి జైలుగోడల మధ్య గడిపారు.

ఈ విధంగా చివరి క్షణం వరకు రచయితగా, పాత్రికేయునిగా, కమ్యూనిస్టుగా, స్వాతంత్ర్య సమర యోధుడిగా, ప్రజల మనిషిగా బహుళ ఖ్యాతిని గడించిన కాకా బాబు ముజఫర్ అహమ్మద్ 1973 డిసెంబర్ 18న కలకత్తాలో కన్నుమూశారు. ◆

# 87. బేగం మజిదా బానో

## (1919- 1974)

బ్రిటీష్ వలసపాలకులను తరిమివేతకు పోరాటం సాగిస్తున్న ప్రజలను, **ద్విజాతి సిద్ధాంతం** ఆసరాతో చీల్చి, మతోన్మాదాన్ని రెచ్చగొట్టి పబ్బం గడుపుకోవాలన్న స్వార్థపర శక్తులకు, వ్యక్తులకు వ్యతిరేకంగా ప్రజలు ఉద్యమించారు. భారతదేశంలోని ముస్లింలందరికి తనకు తానుగా ప్రతినిధిగా ప్రకటించుకున్న **అఖిల భారత ముస్లిం లీగ్** నాయకుల వేర్పాటువాద చర్యలకు వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని కూడగట్టి, మతం పేరుతో అధికారాన్ని చేపట్టాలనుకుంటున్న శక్తుల ఎత్తులను చిత్తుచేయడానికి ఎంతో సాహసంతో బరిలోకి దిగిన సాహసి బేగం మజీదా బానో.

ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ రాజధాని, నాటి నిజాం సంస్థానం రాజధాని హైదరాబాదు నగరంలో బేగం మజీదా బానో 1919లో జన్మించారు. ఆమె తండ్రి ముస్తఫా అహమ్మద్. ఆయన నిజాం సంస్థానంలో అధికారి. పదవ తరగతి చదువుతున్నప్పుడు బేగం వివాహం ఉత్తర ప్రదేశ్‌కు చెందిన న్యాయవాది మహమ్మద్ సిద్ధీఖీతో జరిగింది. వివాహం తరువాత భర్తతోపాటుగా ఆమె ఉత్తర ప్రదేశ్ వెళ్ళిపోయారు.

ఆమె అత్తింటివారింటిలో కూడా జాతీయోద్యమకారులున్నారు. భర్తతో ఆయన కుటుంబ సభ్యులతో అత్యంత సన్నిత సంబంధాలు గల ప్రముఖ జాతీయోద్యమ నాయకులు రఫీ అహమ్మద్ కిద్వాయ్ ప్రభావంతో ఆమె కూడా భర్తతోపాటుగా జాతీయోద్యమంలో





తనదైన పాత్ర నిర్వహించేందుకు భారత జాతీయ కాంగ్రెస్ సభ్యత్వం స్వీకరించారు.

స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల దిశగా సాగుతున్న జాతీయోద్యమం సంపూర్ణ విజయం సాధించి స్వరాజ్యం స్థాపించాలంటే, ప్రజలు మతాలకు అతీతంగా ఐక్యం కావాల్సి ఉందని బేగం మజిదా భావించారు. ఆ కారణంగా మతం పేరుతో వేర్పాటువాద రాజకీయాలు నడుపుతున్న ముస్లిం లీగ్ నాయకుల తీరుతెన్నులను విమర్శించారు. 1936లో జరిగిన ఓ ప్రదర్శనలో జాతీయవాదులైన కొందరు యువకులు ఏర్పాటు చేసిన **ఆజాద్ ముస్లిం లీగ్** లో ఆమె భాగస్వాములయ్యారు. ఆజాద్ లీగ్ ఆధ్వర్యంలో జరిగిన ప్రదర్శనలో ఆమె పాల్గొన్నారు. ఈ సందర్భంగా ముస్లింలీగ్ అధినేత ముహమ్మద్ అలీ జిన్నాకు వ్యతిరేకంగా బేగం మజీదా బానో నినదించి సంచలనం సృష్టించారు.

1935 భారత చట్టం ప్రకారంగా దేశంలో ఎన్నికలు జరుగుతున్నాయి. భారత జాతీయ కాంగ్రెస్ ప్రజలందరి ప్రతినిధిగా ఎన్నికల రంగంలో దిగగా, ముస్లింలీగ్ తాను ముస్లింల ప్రతినిధిగా ప్రకటించుకుంది. ఆ ఎన్నికలలో లక్నో మహిళా నియోజకవర్గం నుండి మజీదా బానో జాతీయ కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేశారు. ఆమె **ముస్లిం లీగ్** అభ్యర్థి బేగం ఇనాం హబీబుల్లాతో పోటీ పడ్డారు. ఈ ఎన్నికలలో మౌలానా అలీ సోదరులలో ఒకరైన మౌలానా షౌకత్ అలీ తదితర ప్రముఖ నాయకులు **లీగ్** గెలుపును కాంక్షిస్తూ ప్రచారం సాగించారు. ఈ సందర్భంగా మౌలానా షౌకత్ అలీ ఖురాన్ గ్రంథాన్ని చేత బూని ఎన్నికల ప్రచారం చేస్తూ ప్రజల నుండి వాగ్దానం చేయించుకోవడాన్ని బట్టి, ఆ ఎన్నికలను ముస్లిం లీగ్ నేతలు ఎంత ప్రతిష్ఠాత్మకంగా తీసుకున్నారో అర్థం చేసుకోవచ్చు. జాతీయ కాంగ్రెస్ అభ్యర్థి మజీదా బానో పక్షాన కాంగ్రెస్ నేతలు, లక్నో విద్యార్థులు ప్రచారం చేశారు. ముస్లిం లీగ్ నేతల వాదనలను పూర్వపక్షం చేస్తూ , మత సామరస్యం కోరుతూ మజీదా పర్దాతోపాటే విస్తృతంగా పర్యటనలు జరిపారు. ఆ ఎన్నికలలో కేవలం 175 ఓట్ల తేడాతో ఆమె ఓటమి చెందారు. జయాపజయాలతో ఏ మాత్రం నిమిత్తం లేకుండా హిందూ-ముస్లింల ఐక్యతా నినాదంతో మాత్రమే కాకుండా భారతీయులందరి ఐక్యతను ఆకాంక్షిస్తూ, మతోన్మాద రాజకీయ నేతల ఎత్తులను ఎదుర్కొంటూ, విభజన రాజకీయాలను తీవ్రంగా నిరసిస్తూ ముందుకు సాగారు.

స్వదేశానికి స్వరాజ్యం సిద్ధించాక దేశసేవకు అధిక ప్రాధాన్యతనిచ్చి, చివరి క్షణం వరకు మత సామరస్యం ప్రధాన లక్ష్యంగా కృషి చేస్తూ, అటు దేశసేవలో ఇటు ప్రజా సేవలో పూర్తి కాలాన్ని గడిపిన బేగం మజీదా బానో 1974 ఫిబ్రవరి 12న బీహార్ రాష్ట్రం బారాబంకీలో కన్నుమూశారు. ◆



# 88. షేక్ గాలిబ్ సాహెబ్

## (1904-1970)

**జా**తీయోద్యమంలో ప్రత్యేక స్థానం సంతరించుకున్న ఆంధ్రప్రదేశ్‌లోని గుంటూరు గడ్డ అందించిన విద్యార్థి-యువజనోద్యమ నేతలలో ఒకరు షేక్ గాలిబ్ సాహెబ్ ఒకరు.

1904 జూలై 15న గుంటూరులో ఆయన జన్మించారు. షేక్ చింగిషా, షేక్ అమీనాబి ఆయన తల్లిదండ్రులు. విద్యార్థిగా నున్నప్పుడే జాతీయోద్యమం పట్ల ఆకర్షితులైన ఆయన బ్రిటీష్ దాస్యశృంఖలాల నుండి విముక్తి కోసం గుంటూరు యోధులు సాగిస్తున్న పోరాటాల ద్వారా ప్రేరణ పొందారు. ఆ వాతావరణం ఆయనను చదువు మీద దృష్టి నిల్పనివ్వలేదు. ఆ ప్రభావంతో జాతీయోద్యమంలో ప్రవేశించాలనుకున్న గాలిబ్ 1928లో భారత జాతీయ కాంగ్రెస్ సభ్యత్వం స్వీకరించారు.

జాతీయోద్యమాన్ని తీవ్రతరం చేసేందుకు, ప్రజల్లోకి ఉద్యమ లక్ష్యాలను మరింత వేగంగా, బలంగా తీసుకువెళ్ళేందుకు యువజనుల, విద్యార్థుల శక్తిని గమనించిన ఆయన యువజన-విద్యార్థి సంఘాల నిర్మాణం మీద దృష్టిసారించారు. గుంటూరు పట్టణంలో యువజన, విద్యార్థి ఉద్యమాలను పటిష్టం చేసి బ్రిటీష్ వ్యతిరేక పోరాటంలో కీలక పాత్ర నిర్వహించేట్టుగా సహచరులతో కలసి యువజన విద్యార్థి సంఘాలను తీర్చిదిద్దారు.

ఆది నుండి గాంధీజీ ఆలోచనలు, సిద్ధాంతాల పట్ల అమిత గౌరవం గల ఆయన, మహాత్ముని ఆలోచనలన్నిటిని అలిఖిత ఆదేశాలుగా ఆచరించారు. ఆయన జీవితాంతం





ఖద్దరు ధరించారు. పేదరికంతో సతమతమౌతున్నా కూడా ఆయన మహాత్ముని బాట విడనాడలేదు. మంచి ప్రభుత్వం ఉద్యోగం వచ్చినా వదలుకొని తనను తాను పూర్తిగా జాతీయోద్యమానికి అంకితం చేసుకున్నారు. గుంటూరు బ్రాడీపేటలో తన సోదరుని పేరిట ప్రారంభించి ఆయన నిర్వహించిన లాండ్రీ, ఆనాడు గుంటూరు కేంద్రంగా సాగిన జాతీయోద్యమకారులకు రహస్య కూడలి కేంద్రంగా పేర్గాంచింది.

ఆ క్రమంలో 1930 నుండి ఆయన కార్యక్రమాలు మరింతగా పరిణితి చెందాయి. మహాత్మాగాంధీ పిలుపుమేరకు ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని శిక్షలను అనుభవించారు. బ్రిటీషర్ల పై పోరాటం సాగించమని పిలుపునిచ్చిన పలువురు ముస్లిం ఉలేమాల స్ఫూర్తితో ముందుకు సాగిన గాలిబ్, హిందూ-ముస్లింల ఐక్యతను ప్రగాఢంగా వాంఛించారు.

1937 నుండి 1941 వరకు ఆయన ముస్లిం మాస్ కాంటాక్ట్ మూమెంట్ కార్యదర్శిగా బృహత్తర బాధ్యతలను నిర్వహించారు. ఆ సమయంలో 1937 నుండి 1941వరకు గుంటూరు పురపాలక సంఘం సభ్యులుగా బాధ్యతలను చేపట్టారు. 1940లో జరిగిన వ్యక్తిగత సత్యాగ్రహంలో,1942లో సాగిన క్విట్ ఇండియా ఉద్యమంలో చాలా చురుగ్గా పాల్గొని అనుభవించిన కఠినకారాగార శిక్షల వలన ఆయన ఆరోగ్యం పూర్తిగా క్షీణించింది. అయినా ప్రాణమున్నంతవరకు పోరాటం సాగించాలని పట్టుదలతో జాతీయోద్యమ కార్యక్రమాలలో పాల్గొన్న ఆయనకు 1947లో మద్రాసులో శస్త్రచికిత్స తప్పలేదు.

1947 తరువాత అనారోగ్యం నుండి బయటపడిన షేక్ గాలిబ్ సాహెబ్ రాష్ట్ర రాజకీయాలలో కీలక పాత్ర వహించారు. గుంటూరు పురపాలక సంఘం సభ్యునిగా, 1950 నుండి 1952 వరకు ప్రొవిజనల్ పార్లమెంటులో సభ్యులుగా బాధ్యతలు నిర్వహించారు. 1954లో ఆయనకు రాజ్యసభ సభ్యునిగా పదవి లభించింది. ఆ పదవిలో ఆయన 1958 వరకు ఉన్నారు.

త్యాగపూరిత జీవితానికి ఆదర్శమైన గాలిబ్ తన సహచరులు, మిత్రులైన బెజవాడ గోపాల రెడ్డికి రాజ్యసభలో సీటును కల్పించేందుకు తన పదవీకాలం పూర్తికాక ముందే రాజ్యసభ సభ్యత్వానికి రాజీనామా చేశారు. ఆ తరువాత 1958 నుండి 1969 వరకు రాష్ట్ర విధాన పరిషత్ సభ్యులుగా భాధ్యతలు నిర్వహించారు. ప్రతిష్టాత్మక గుంటూరు **అంజుమన్ ఇస్లామియా** కు సుదీర్ఘకాలం అధ్యక్షులుగా పనిచేసి చరిత్ర సృష్టించారు.

ఈ విధంగా చిన్న వయస్సులోనే జాతీయోద్యమంలో ప్రవేశించి, విద్యార్థి, యువజన ఉద్యమాల నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహించి,ప్రజాప్రతినిధిగా ప్రజా సేవకు అంకితమైన షేక్ గాలిబ్ సాహెబ్ 1970 ఆగస్టు 21న కన్నుమూశారు. ◆



# 89. షౌకత్ ఉస్మాని

## (1901-1978)

**మ**న దేశం నుండి సామ్రాజ్యవాద దోపిడి శక్తులను తరిమివేశాక ఈ గడ్డ మీదున్న అసంఖ్యాక కార్మిక-కర్షక, సామాన్య జనసముదాయాల సంక్షేమం-అభ్యున్నతికి ఉపయుక్తం కాగలదని భావించిన సామ్యవాద వ్యవస్థ ఏర్పాటు కోసం ఉద్యమించిన యోధులలో ప్రముఖులు షౌకత్ ఉస్మాని.

1901 డిసెంబర్ 21న రాజస్థాన్ రాష్ట్రం బికనీర్ రాళ్ళు కొట్టే శ్రామిక కుటుంబాన ఆయన జన్మించారు. చిన్ననాటనే జాతీయోద్యమ నాయకులు సంపూర్ణానంద గురుత్వం లభించటంతో షౌకత్ ఉస్మాని జాతీయ భావనలను సంతరించుకున్నారు.

భారతదేశమంతటా రెపరెపలాడుతున్న ఖిలాఫత్-సహాయనిరాకరణోద్యమ పతాకాల ప్రేరణతో షౌకత్ ఉస్మాని ఖిలాఫత్ ఉద్యమంలో ప్రవేశించారు. 1920 జూన్ మాసంలో లక్నోకు చెందిన మౌల్వీ అబ్దుల్ బారి (ఫిరంగి మహల్) పిలుపు మేరకు బయట నుండి బ్రిటీషర్ల మీద యుద్ధం ప్రకటించాలని నిర్ణయించుకుని స్వదేశం వదలిన యువకుల్లో షౌకత్ ఉస్మాని చేరారు. అలా వెళ్ళిన కుటుంబాలకు అంతర్జాతీయ పరిణామాల మూలంగా ఆఫ్ఘనిస్థాన్ అధినేత అమానుల్లా తన దేశంలోకి అనుమతించకపోవడంతో తప్పనిసరి పరిస్థితులలో షౌకత్ ఉస్మాని నాయకత్వంలోని ఒక దళం రష్యా వెళ్ళేందుకు నిర్ణయించింది. ఆ చారిత్రక నిర్ణయం మేరకు సాహసోపేత హిజ్రత్ చేసిన షౌకత్ ఉస్మాని రష్యా





చేరుకోవడంతో ఆయన జీవితంలో పెనుమార్పులు చోటుచేసుకున్నాయి. ఆయన కమ్యూనిజం పట్ల ఆకర్షితులు కావడం మాత్రమే కాకుండా భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాతల్లో ఒకరయ్యారు.

బ్రిటీష్ ప్రభుత్వం మీద కత్తికట్టేందుకు, కమ్యూనిస్టు ఉద్యమాన్ని మాతృదేశంలో నిర్మించేందుకు రష్యాలోని భారతీయ యువకులను ఎం.యన్. రాయ్ స్వదేశానికి పంపగా ఆ దళంతోపాటుగా బ్రిటీష్ గూఢచారి దళాల కన్నుగప్పి షౌకత్ ఉస్మాని స్వదేశం చేరుకున్నారు. కమ్యూనిస్టుల మీద కన్నేసిన బ్రిటీష్ రహస్య పోలీసుల దళం 1923 మే 11న ఆయనను అరెస్టు చేయడంతో '**పెషావర్ కుట్ర కేసు**'లో నిందితులయ్యారు. ఈ క్రమంలో ప్రభుత్వ వ్యతిరేక చర్యలకు పాల్పడుతున్నట్టుగా ఆయన మీద పలు కేసులు నమోదు కావడంతో ఏండ్ల తరబడి దుర్భర జైలు జీవితాన్ని చవిచూడాల్సి వచ్చింది.

ఆనాడు 1. బ్రిటీష్ పాలనను కూలద్రోసి సంపూర్ణ రాజకీయ ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సాధించటం 2. సామ్రాజ్యవాదంతో ముడిపడిన స్వదేశీ సంస్థానాలు, జమీందారి విధానం, భూస్వామ్య విధానం రద్దుచేయడం 3. ప్రజారంజకమైన ప్రజాతంత్ర వ్యవస్థను నిర్మించడం లక్ష్యంగా ఆయన నిర్దేశించుకుని, ఆ లక్ష్యసాధనకోసం పలు సంస్థలను నిర్మించారు. భారత దేశంలో సామ్యవాద భావజాలాన్ని ప్రాచుర్యంలోకి తెచ్చి అసమానతలకు వ్యతిరేకంగా ప్రజలను ఉద్యమబాటన నడిపించేందుకు 1925 డిసెంబర్‌లో స్వదేశంలో భారత కమ్యూనిస్టు పార్టీని స్థాపించారు.

ఆ క్రమంలో జాతీయ కాంగ్రెస్‌కు దూరమయ్యారు. జాతీయ కాంగ్రెస్‌కు దూరమైనా వలసపాలకులకు వ్యతిరేకంగా సాగుతున్న జాతీయోద్యమానికి సహకరించారు. ఉద్యమకారుడిగా, రచయితగా, కమ్యూనిస్టుగా షౌకత్ ఉస్మాని తనదైన తీరులో బ్రిటీష్ పాలకులకు వ్యతిరేకంగా నిరంతరం ఉద్యమించారు.

భారత దేశానికి స్వాతంత్ర్యం లభించాక ఆయన కరాచి వెళ్ళిపోయారు. కరాచిలో కూడా ఆయన కార్మిక జనసముదాయాల పక్షం వహించి కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణానికి జరుగుతున్న ప్రయత్నాలలో భాగం పంచుకున్నారు. అక్కడ కొంతకాలం గడిపాక ఆయన పలు దేశాలు పర్యటిస్తూ జర్నలిస్టుగా అంతర్జాతీయ వ్యవహారాల మీద సైద్ధాంతిక వ్యాసాలను రాస్తూ కమ్యూనిస్టు మేధావిగా బహుళ ప్రాచుర్యం పొందారు.

ఈ విధంగా ఏదోఒక రూపంలో చివరికంటా బ్రిటీష్ వలసపాలకుల పెత్తనాన్ని వ్యతిరేకిస్తూ, విముక్తిపోరాట యోధుడుగా, శ్రామికజన పక్షపాతిగా పలు పోరాటాలు సాగించిన షౌకత్ ఉస్మాని 1978లో కన్నుమూశారు. ◆

# ౨౦. బేగం ఖుర్షీద్ ఖ్వాజా

## (1896-1981)

**జా**తీయోద్యంలో జైలుకు వెళ్ళటం ఎంతో గౌరవంగా ప్రజలు భావించి ఆనందాన్ని వ్యక్తం చేశారు. అలాగే జైలుకు వెళ్ళక పోవటం కూడా అపచారంగా పరిగణించారు. ఆ క్రమంలో జైలుకు వెళ్ళడం ఆలశ్యం కావడం కూడా అవమానంగా భావించిన ఉద్యమ స్ఫూర్తి గల కుటుంబ సభ్యురాలు బేగం ఖుర్షీద్ ఖ్వాజా.

ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాద్ నగరంలో బేగం ఖుర్షీద్ ఖ్వాజా 1896లో జన్మించారు. స్వగృహంలో బేగం ఖుర్షీద్ సాంప్రదాయక విద్యను పూర్తి చేశారు. సరోజిని నాయుడుతో ఆమెకు ఏర్పడిన పరిచయం వలన జాతీయోద్యమం పట్ల ఆకర్షితురాలయ్యి 1920లో ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ సభ్యత్వం స్వీకరించారు.

జాతీయోద్యమకారులు, ఉత్తరప్రదేశ్‌కు చెందిన ఖ్వాజా అబ్దుల్ మజీద్‌ను ఆమె వివాహమాడారు. వివాహం తరువాత 1921 డిసెంబరులో హైదరాబాద్ నగరంలో జరిగిన ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ సమావేశాలకు ఆమె ఉత్తరప్రదేశ్ రాష్ట్ర ప్రతినిధిగా హాజరయ్యారు. ఆ సమావేశాలలో బేగం హసరత్ మోహాని, బేగం ముహమ్మద్ అలీ, కమలా నెహ్రూ, స్వరూపరాణి నెహ్రూ లాంటి ప్రముఖులతో కలిసి ఆమె పని చేశారు.

ఖిలాఫత్-సహాయ నిరాకరణోద్యమ కార్యకలాపాలలో అవిశ్రాంతంగా పాల్గొంటూ





అందరికి ఆదర్శమయ్యారు. ఈ సందర్భంగా గాంధీజీకి లేఖ రాస్తూ అందులో **'నా భర్త సహచరులంతా జైళ్ళకు వెళ్ళారు. నా భర్త మాత్రం ఇంత వరకు స్వేచ్ఛగా ఉండటం పట్ల మాకు బాధగా ఉంది'** అని పేర్కొన్నారు. **'మహనీయురాలైన ప్రతిష్ఠాత్మక ధర్మపత్ని'** శీర్షికతో మహాత్మా గాంధీ స్వయంగా రాసిన వ్యాసంలో ఆమె గురించి ప్రస్తావిస్తూ అన్ని సుఖభోగాలను వదలి సాదాసీదా ఉద్యమ కార్యకర్త జీవితాన్ని చేపట్టిన వైనం, జాతీయోద్యమ లక్ష్యాల పట్ల ఆమెలో ఉన్న నిబద్ధతలను వివరిస్తూ ప్రశంసించారు.

జాతీయ విశ్వవిద్యాలయం 'జామియా మిలియా ఇస్లామియా' కులపతిగా బాధ్యతలు నిర్వహిస్తున్న భర్తను పోలీసులు అరెస్టు చేయగా **'నా భర్త గైర్హాజరీలో జామియా మిలియా ఇస్లామియా (అలీఘర్) కార్యకలాపాల బాధ్యతలనన్నిటినీ నిర్వహించేందుకు నేను కృషి చేస్తాను'** అని ఆమె గాంధీజీకి లేఖ రాశారు. ఈ మేరకు ప్రభుత్వ వ్యతిరేకతను ఎదుర్కొంటూ ఆమె జామియా మిలియా ఇస్లామియా కార్యకలాపాలను పర్యవేక్షించారు.

మహిళల్లో విద్య ఆవశ్యకతను గ్రహించిన ఆమె, ఆ దిశగా చాలా శ్రద్ధ చూపారు. మహిళలు విద్యావంతులైతే తప్ప సమాజ పురోగతి సాధ్యం కాదని ప్రకటించారు. జాతీయోద్యమం విజయవంతం కావాలంటే మహిళల్లో చైతన్యం రావాలనీ అది అక్షర జ్ఞానం ద్వారా మాత్రమే సాధ్యమౌతుందని ఆమె గట్టిగా విశ్వసించారు. ఈ మేరకు తన విశ్వాసాన్ని ఆచరణలో చూపేందుకు ఎంతగానో శ్రమించారు. ప్రజలలో అక్షర జ్ఞానం కల్గించేందుకు ప్రచార కార్యక్రమాల కంటే విద్యా వ్యవస్థల నిర్మాణం ద్వారా ఆ లక్ష్యాలు సాధ్యమౌతాయని భావించిన ఆమె 1930లో అలహాబాద్‌లో ఆడపిల్లలు, మహిళల కోసం **హమీదియా బాలికల సెకండరీ స్కూల్** స్థాపించారు.

ఖద్దరు ప్రచార కార్యక్రమాలలో ఆమె అత్యంత ఆసక్తి చూపారు. స్వయంగా ఖద్దరు ధారణ చేశారు. ఆశయాలను ఆచరణలో చూపటం ద్వారా ప్రజలను విశేషంగా ఆకర్షించారు. నూలు వడకటం మాత్రమే కాకుండా, నూలువడకడాన్ని ప్రజలకు ప్రధానంగా మహిళలకు, యువతులకు స్వయంగా నేర్పారు.

మాతృభూమి విముక్తి కోసం ఉద్యమించిన ఫలితంగా బ్రిటిష్ సామ్రాజ్య వాదుల నుండి దేశానికి విముక్తి లభించినప్పటికి, దేశం విభజనకు గురవటం పట్ల కుంగిపోయిన బేగం ఖుర్షీద్ రాజకీయాలకు దూరమై విద్య,సామాజిక సేవారంగాలకు అంకితమయ్యారు. అటు మాతృభూమి సేవ, ఇటు ప్రజాసేవకు అమూల్యమైన జీవితాన్ని పూర్తిగా అర్పించిన బేగం ఖుర్షీద్ ఖ్వాజా 1981 జులైలో తుదిశ్వాస విడిచారు. ◆



# ౮౧. మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్

## (౧౯౧౪-౧౯౮౩)

బ్రిటీష్ సైనిక స్థావరాల మీద విజయవంతంగా జరిపిన చారిత్రక దాడులకు నాయకత్వం వహించి, చరిత్రలో ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్న **ఆజాద్ హింద్ ఫౌజ్** సేనానులలో మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ ప్రముఖులు.

1914 జనవరి 24న పాకిస్థాన్‌లోని రావల్పిండిలో షానవాజ్ ఖాన్ జన్మించారు. తండ్రి తిక్కాఖాన్ బ్రిటీష్ సైన్యంలో ఉన్నతాధికారి. ప్రాథమిక విద్యను పూర్తిచేసిన షానవాజ్ సైనిక విద్యను పూర్తిచేసుకుని 1935లో బ్రిటీష్ సైన్యంలో అధికారిగా చేరారు. 1943లో **ఆజాద్ హింద్ ఫౌజ్** ఏర్పడిన విషయాన్ని నేతాజీ సుభాష్ చంద్రబోస్ 1943 జూలై 5న ప్రకటించి బ్రిటీష్ సైన్యంలోని స్వదేశీయులను ఆజాద్ హింద్ ఫౌజ్‌లోకి ఆహ్వానించగా ఆ మేరకు షానవాజ్ ఖాన్ నేతాజీ వెంట బ్రిటీష్ వ్యతిరేక పోరాటంలో అడుగిడారు.

నేతాజీ స్వయంగా ఆజాద్ హింద్ ఫౌజ్ మేజర్ జనరల్‌గా కెప్టెన్ షానవాజ్ ఖాన్‌ను నియమించారు. 1944లో భారత్ సరిహద్దులకు చేరుకున్న ఆజాద్ హింద్ ఫౌజ్ రెండు చోట్ల బ్రిటీష్ సైన్యాలను ఎదుర్కొని మట్టి కరిపించింది. ఆ పోరులో విజేతలుగా నిలచిన ఒక దళానికి మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ నాయకత్వం వహించారు. ఈ అపూర్వ విజయం తెచ్చిపెట్టిన ఆనందం నుండి తేరుకోక ముందే, అంతర్జాతీయంగా ఏర్పడిన





పరిస్థితుల దృష్ట్యా జపాన్ తన స్వీయరక్షణ కోసం ఆజాద్ హింద్ ఫౌజ్‌ను యుద్ధరంగంలో ఒంటరిని చేసి తప్పుకుంది. ఆ క్లిష్ట సమయంలో సైనికులలో ఆత్మవిశ్వాసం నూరిపోస్తూ, అందరిలో తానొకడిగా అన్నిరకాల కష్టనష్టాలను అనుభవిస్తూ, తన కర్తవ్యాన్ని నిర్వర్తించేందుకు షానవాజ్ కృతనిశ్చయంతో నిలిచారు.

1945లో ఆజాద్ హింద్ ఫౌజ్ మీద బ్రిటీష్ సేనలు విరుచుకుపడ్డాయి. ఆ భీకర పోరులో చాలామంది అమరత్వం పొందగా, ఆజాద్ హింద్ ఫౌజ్ సైనికులను, మేజర్ జనరల్ షానవాజ్ లాంటి అధికారులను మే 13న బ్రిటీష్ సైన్యం నిర్బంధించి, వారిని రాజద్రోహులుగా పరిగణిస్తూ 1945 నవంబర్ 5న ఢిల్లీలోని ఎర్రకోటలో విచారణ జరిపింది. ఆ సందర్భంగా మేజర్ జనరల్ షానవాజ్ పక్షాన మాత్రమే వాదించేందుకు ముస్లింలీగ్ నాయకులు మహమ్మద్ అలీ జిన్నా సంసిద్ధత ప్రకటించగా, We have stood shoulder to shoulder in the struggle for freedom. My comrades have died on the field of battle inspired by our leadership. We stand or fall together అంటూ జిన్నా ప్రతిపాదనను తిరస్కరించి సంచలనం సృష్టించారు. 1946 జనవరి 3న షానవాజ్ ఖాన్ తదితరులకు ఆజన్మద్వీపాంతరవాస శిక్షను ప్రకటించింది బ్రిటీష్ ప్రభుత్వం.

ఈ విచారణ సందర్భంగా భారత జాతీయ కాంగ్రెస్ నేతలతో ఏర్పడిన సఖ్యత, ప్రధానంగా పండిట్ జవహర్‌లాల్ నెహ్రూతో స్నేహం వలన జనరల్ షానవాజ్ కాంగ్రెస్‌లో చేరి గాంధీజీ, మౌలానా ఆజాద్ తదితరులతో కలసి పనిచేశారు. ఆ సమయంలో బీహార్ తదితర ప్రాంతాలలో మతసామరస్యాన్ని పరిరక్షించేందుకు, భిన్న మతస్థుల మధ్య స్నేహ సంబంధాలను పునరుద్ధరించేందుకు షానవాజ్ ఖాన్ ఎంతగానో కృషిచేశారు.

1947లో భారత దేశానికి స్వాతంత్ర్యం లభించాక 1956లో లోక్‌సభకు ఎన్నికైన షానవాజ్ ఖాన్ మరో రెండుసార్లు విజయం సాధించి కేంద్ర మంత్రిగా బాధ్యతలను నిర్వహించారు. ఆ తరువాత మారిన రాజకీయ వాతావరణంలో ఇమడ లేకపోయిన ఆ సైనికాధికారి 1977 నాటి సార్వత్రిక ఎన్నికలలో పరాజితులయ్యారు. ఈ పరాజయం తరువాత రాజకీయాల నుండి పూర్తిగా వైదొలగి సాంస్కృతిక, సాంఘిక సేవా కార్యక్రమాల వైపు మొగ్గు చూపారు. ఆజాద్ హింద్ ఫౌజ్‌లోని సేనా నాయకుడిగా తన అనుభవాలను My Memories of the INA and its Nethaji అను ప్రసిద్ధ గ్రంథంలో వెలువరించారు.

మాతృభూమి గర్వించదగిన సేనానాయకునిగా, రాజకీయనేతగా, రచయితగా, సాంఘిక, సాంస్కృతిక సేవాతత్పరుడిగా బహుముఖ పాత్రలు నిర్వహించిన మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ 1983 డిసెంబర్ 9న అంతిమశ్వాస విడిచారు. ◆



# 92. అబిద్ హసన్ సఫ్రాని

## (1911-1984)

**ఆ**జాద్ హింద్ ఫౌజ్ యోధులుగా మాతృభూమి విముక్తి కోసం నేతాజీ సుభాష్ చంద్రబోస్ నాయకత్వంలో ప్రాణత్యాగాలకు సిద్ధమై ఆయుధాలు చేతబట్టి యుద్ధరంగానికి సాగిన యోధులలో ముఖ్యులు అబిద్ హసన్ సఫ్రాని.

భాగ్యనగరంగా చరిత్ర ఖ్యాతినార్జించిన హైదరాబాదులో అబిద్ హసన్ సఫ్రాని 1911 ఏప్రిల్ 11న జన్మించారు. తండ్రి అమీర్ హసన్. తల్లి ఫక్రుల్ హాజియా బేగం. ఆమె ఇరాన్‌కు చెందిన మహిళ. విలక్షణ వ్యక్తిత్వం గల ఆమె ఖిలాఫత్- సహాయ నిరాకరణ ఉద్యమంలో చాలా చురుగ్గా పాల్గొన్నారు.

ఆ తల్లి వారసత్వంగా అబిద్ జాతీయోద్యమ జెండాను చేతపట్టారు. సహాయ నిరాకరణ ఉద్యమంలో భాగంగా కళాశాల చదువుకు స్వస్తిచెప్పి 1931లో సబర్మతి ఆశ్రమం చేరుకున్నారు. అక్కడ కొంతకాలం గడిపిన తరువాత వలస పాలకుల తరిమి వేతకు సాయధ పోరాటమే సరైన మార్గమనుకున్నారు. ఈమేరకు నాసిక్ జైలుకు చెందిన రిఫైనరీని నాశనం చేయ సంకల్పించిన విప్లవకారుల దళంతో కలసి పనిచేశారు. ఆ కారణంగా ఏడాదిపాటు కారాగార శిక్షకు గురయ్యారు. ఆ శిక్షాకాలం పూర్తికాక ముందే 'గాంధీ-ఇర్విన్ ఒడంబడిక' ఫలితంగా ఆయన విడుదలయ్యారు.





భారత జాతీయ కాంగ్రెస్ కార్యక్రమాలలో దాదాపు దశాబ్దంపాటు చురుగ్గా పాల్గొన్న ఆయనకు 1941లో ఆజాద్ హింద్ ఫౌజ్ అధినేత సుభాష్ చంద్ర బోస్ పరిచయమయ్యారు. ఆ పరిచయంతో నేతాజీ వ్యక్తిగత సిబ్బందిలో ఆయన ఒకరై పోయారు. 1942 నుండి రెండు సంవత్సరాలపాటు నేతాజీ కార్యదర్శిగా పలుదేశాలు చుట్టివచ్చారు. 1943 ఫిబ్రవరి 8న నేతాజీ సాగించిన సాహస జలాంతర్గమి ప్రయాణంలో అబిద్ ఆయన వెంట ఉన్నారు. మూడు మాసాల ఈ ప్రయాణం సందర్భంగా నేతాజీ తన భవిష్యతు కార్యక్రమాన్ని రూపొందించారు. ఆ కార్యక్రమం వివరాలను సుభాష్ చంద్రబోస్ వివరిస్తుండగా అబిద్ హసన్ ఆ వివరాల నోట్స్ నమోదు చేశారు.

ఆ సమయంలో భారతీయులందరికి స్ఫూర్తిదాయకంగా నిలచిన **'జైహింద్'** నినాదం, సుభాస్ చంద్రబోస్ పేరును కూడా మర్చిపోయేలా చేసిన **'నేతాజీ'** అను పదాన్ని అబిద్ హసన్ సఫ్రాని సృష్టించారు. భారత జాతీయ సైన్యంలో మొక్కవోని దీక్షతో బాధ్యతలు నిర్వహిస్తున్న ఆయన **గాంధీ బ్రిగేడ్** కమాండర్‌గా నియమితులయ్యారు. ఆ తరువాత జరిగిన పరిణామాల ఫలితంగా ఆజాద్ హింద్ ఫౌజ్ సైన్యాధికారుల్లాగే ఆయన కూడా రెండు సంవత్సరాలు జైలులో ఉండాల్సి వచ్చింది.

1947లో స్వాతంత్ర్య లభించాక భారతదేశం రెండుగా చీలిపోవటం, పోరాట యోధుడైన సఫ్రానికి బాధ కలిగించింది. అంతర్జాతీయంగా నేతాజీతో కలసి ఆయన జరిపిన పర్యటనలు, ఆ సందర్భంగా గడించిన అనుభవాన్ని దృష్టిలో పెట్టుకుని స్వతంత్ర భారత ప్రధాని జవహర్ లాల్ స్వయంగా అబిద్‌ను ఇంటర్వ్యూ చేసి ఇండియన్ ఫారిన్ సర్వీసులో బాధ్యతాయుతమైన పదవులు అప్పగించారు. అబిద్ హసన్ విదేశాంగ మంత్రిత్వ శాఖలో బాధ్యతలను నిర్వహిస్తూ, పెకింగ్, కైరోలలో భారత ప్రభుత్వ ప్రప్రథమ కార్యదర్శిగా, డెమాస్కస్, బాగ్దాద్, డెన్మార్క్‌లలో కౌన్సల్-జనరల్ గా పనిచేశారు.

స్వతంత్ర భారతంలో అత్యున్నత పదవులను నిర్వహించి, మాతృభూమి కీర్తి ప్రతిష్టలను ఇనుమడింప చేసిన అదృష్టాన్ని అబిద్ హసన్ దక్కించుకున్నారు. అత్యున్నత స్థాయి పదవుల నిర్వహణ నుండి విశ్రాంతి పొందిన తరువాత అబిద్ హసన్ తిరిగి హైదరాబాద్ చేరుకున్నారు. అప్పటి నుండి సేవా, సాంస్కృతిక కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొంటూ పలువురికి మార్గదర్శకులయ్యారు. స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో అపూర్వం అనదగిన **'జైహింద్'**, **'నేతాజీ'** లాంటి నినాదాలను, పదాలను సృష్టించిన ఆజాద్ హింద్ ఫౌజ్ యోధులు ఆబిద్ హసన్ సఫ్రాని 1984లో కన్నుమూశారు. ◆



# 93. బీబి అముతుస్సలాం

## (1907-1985)

**ప**రాయి పాలకుల బానిసత్వం నుండి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలు గాంధేయ మార్గం ద్వారా మాత్రమే సాధ్యమని నమ్మి జీవితచరమాంకం వరకు మహాత్ముని మార్గంలో సాగిన స్వాతంత్ర్య సమరయోధులలో ప్రముఖులు బీబి అమతుస్సలాం.

1907లో బీబి అమతుస్సలాం పాటియాలా రాజపుతాణా పరివారంలో జన్మించారు. తల్లి పేరు అమతుర్రెహమాన్. తండ్రి కల్నల్ అబ్దుల్ హమీద్. ఆరుగురు అన్నదమ్ములకు చెల్లెలిగా పెరిగిన అమతుస్సలాం చిన్ననాటి నుండి ఆరోగ్యపరంగా బలహీనురాలు.

చిన్నతనంలోనే పెద్దన్న ముహమ్మద్ అబ్దుర్రషీద్ ఖాన్ ప్రభావం వలన ప్రజాసేవ చేయాలన్న నిర్ణయానికొచ్చారు. అన్న మార్గదర్శకత్వంలో ఖద్దరు ధరించడం, విక్రయించడం మాత్రమే కాకుండా సభలు సమావేశాలకు హాజరైన ఆమె మహాత్ముని అహింసా సిద్ధాంతం, కార్యాచరణ పట్ల ఆకర్షితురాలై 1931లో అతి ప్రయాసతో గాంధీజీ నిర్వహిస్తున్న సేవాగ్రాం చేరారు. ఆశ్రమం నిర్ధేశించిన కఠిన నియమనిబంధనలను పాటిస్తూ, అంకితభావంతో బాధ్యతలు నిర్వహిస్తూ గాంధీజీ దంపతులకు **ప్రియ పుత్రిక** అయ్యారు.

జాతీయోద్యమంలో భాగంగా 1922లో మహాత్ముని అనుమతితో అనారోగ్యాన్ని లెక్కచేయక ఆశ్రమంలోని ఇతర మహిళలతోపాటు ఆమె జైలు కెళ్ళారు. జైలు నుండి





విడుదల కాగానే సేవాగ్రాం వచ్చి బాపూజీకి వ్యక్తిగత సహాయకురాలిగా బాధ్యతలు చేపట్టారు. ఆ పాత్రలో ఆమె గాంధీజీకి అత్యంత సన్నిహితంగా మెలుగుతూ అన్ని సందర్భాలలో ఆయన వెంట ఉంటూ దేశమంతా తిరిగారు. ఈ పర్యటనల ఫలితంగా ఆమె పలు భాషలతోపాటు తెలుగు భాషను నేర్చుకున్నారు.

స్వరాజ్య సాధనతోపాటుగా హిందూ-ముస్లింల ఐక్యత, హరిజనుల సంక్షేమం మహిళాభ్యుదయం తన జీవిత లక్ష్యాలుగా ఆమె ప్రకటించుకున్నారు. మహాత్ముని బాటన జాతీయోద్యమంలో నడిచిన అమతుస్సలాం హిందూ-ముస్లిం ఐక్యతకు చిహ్నమయ్యారు. మతకలహాలు విజృంభించినప్పుడు వాయవ్య సరిహద్దులు, సింధ్, నౌఖాళి ప్రాంతాలలో శాంతి-సామరస్య స్థాపనకు గాంధీజీ దూతగా ఆయా ప్రాంతాలు పర్యటించి, ఘర్షణల నివారణకు 20 రోజులపాటు సత్యాగ్రహదీక్ష చేసి గాంధీజీ వారసురాలు అన్పించుకున్నారు.

1947లో జాతీయోద్యమకారులు కన్నకలలను భగ్నం చేస్తూ ఇండియా రెండు ముక్కలయ్యింది. ఆ విఘాతం నుంచి బయటపడే లోపుగా గాంధీజీ హత్యకు గురయ్యారు. ఆ దుస్సంఘటనలకు చలించిపోయిన ఆమె త్వరితగతిన ఆ ఆవేదన నుండి బయటపడి గాంధీజీ బాటలో ప్రజాసేవకు పూర్తిగా పునరంకితమయ్యారు. పంజాబ్‌లోని రాజపూర్ గ్రామంలో కస్తూర్బా గాంధీ పేరిట **కస్తూర్బా మందిరం** అను ఆశ్రమాన్ని నెలకొల్పి మహిళలకు పలు వృత్తులలో శిక్షణ కల్పించి వారి ఆర్థిక అభ్యున్నతికి తొడ్పడ్డారు. దళిత జనులలో అక్షరజ్యోతులను వెలిగించేందుకు అవిశ్రాంతంగా కృషిచేశారు. జాతి సమైక్యత, సమగ్రతలను పటిష్ట పర్చేందుకు, హిందూ ముస్లింల మధ్య ఐక్యతా భావాలను ప్రచారం చేసేందుకు **హిందూస్థాన్** అను ఉర్దూ పత్రికను ఆమె చాలా కాలం నడిపారు.

చివరివరకు ప్రజా సేవలో గడిపిన అముతస్సలాం 1961లో భారత దేశం వచ్చిన ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ వెంట ఉండి ఆయనకు సేవలందిస్తూ ఆయన చేసిన దేశవ్యాప్త పర్యటనలో పాల్గొన్నారు. 1962లో చైనాతో, 1965లో పాకిస్థాన్‌తో యుద్ధం వచ్చినప్పుడు తన దత్త కుమారుడు సునీల్ కుమార్ సహాయంతో పర్వత ప్రాంతాలకు అతికష్టం మీద చేరుకుని అక్కడ పహారా కాస్తున్న జవానులను ఉత్సాహపర్చుతూ సేవలందించారు.

చిన్నతనం నుండి అనారోగ్యంతో పోరాటం సాగిస్తూ అవివాహితగా మిగిలిపోయినా, జాతీయోద్యమంలో అహింసాయుత మార్గాన సాగారు. ఆ తరువాత స్వతంత్ర భారతావనిలో సామాజిక సమస్యల పరిష్కారం కోసం నిరంతరం శ్రమిస్తూ, చరమాంకం వరకు గాంధీజీ తాత్విక భావాల వారసురాలుగా ఖ్యాతిగడించిన బీబి అమతుస్సలాం 1985 అక్టోబర్ 29న మృతిచెందారు. ◆



# ౮౪. ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్

## (౧౮౯౦-౧౯౮౮)

**మ**న వాయవ్వ సరిహద్దు ప్రాంతాల నివాసులైన పఠాన్‌లను **భగవత్సేవకుల** రూపంలో అపూర్వమనదగిన **శాంతి సైనికులు**గా తీర్చిదిద్ది ప్రపంచ ప్రఖ్యాతిపొందిన అహింసామూర్తి ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ **సరిహద్దు గాంధీ** గా విశ్వమంతా విఖ్యాతుడు.

1890లో వాయవ్య సరిహద్దు ప్రాంతంలోని పెషావర్ జిల్లా, చార్‌సద్దా తహసిల్, ఉత్తమంజాయ్ గ్రామంలో ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ జన్మించారు. తండ్రి ఖాన్‌బెహ్రాం ఖాన్ ఉత్తమంజాయ్ గ్రామ సర్దార్. గఫార్ ఖాన్ విద్యాభ్యాసం తరువాత బ్రిటీష్ సైన్యంలోని Guides Mission విభాగంలో చేరారు. ఒక పఠాన్ సైనికుని పట్ల ఆంగ్లేయాధికారి అగౌరవంగా ప్రవర్తించటం చూసి 1906లో సైన్యం నుండి బయటకు వచ్చారు. 1908లో అలిఘర్ వెళ్ళి అక్కడి నుండి విదేశాలకు వెళ్ళాలనుకున్నా తల్లి అయిష్టత వ్యక్తం చేయడం వలన విరమించుకున్నారు.

స్వగ్రామానికి తిరిగి వచ్చి వాయవ్యసరిహద్దు ప్రాంతాలలో పలు పర్యటనల ద్వారా, ప్రజల స్థితిగతులను అధ్యయనం చేసిన ఆయన ప్రగతికి విద్యా-వికాసాలే సోపానాలుగా భావించారు. మిత్రుడు అబ్దుల్ అజీజ్ సహకారంతో 1910లో ఉత్తమంజాయ్‌లో **ఆజాద్ జాతీయ పాఠశాల**ను ప్రారంభించి పఠాన్ల జీవితాలలో గుణాత్మక మార్పులకు కారణం అయ్యారు. పఠాన్ ప్రజానీకంలో సంస్కరణలకు కృషిచేసి అతి కష్టం మీద గణనీయమైన





విజయాలను సాధించి **బాద్షాఖాన్** (సర్దార్ లకు సర్దార్) అన్పించుకున్నారు.

1919లో రౌలత్ వ్యతిరేక ఉద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొనటం ద్వారా ఆయన జాతీయోద్యమ ప్రవేశం చేశారు. 1928 నాటి కలకత్తా సమావేశంలో గాంధీజీ ప్రసంగం విన్న ఆయన మహాత్ముని మాటను తన బాటగా స్వీకరించి 1929లో **ఖుదా-యే-ఖిద్మత్‌గార్** (భగవత్సేవకులు) సంస్థ స్థాపించారు. బాద్షాఖాన్ కృషి వలన **'అనాగరికుడు, మృగప్రాయుడు, పులిలాంటి క్రూరుడు, విశ్వాసఘాతకుడైన హంతకుడు'** అని ఆంగ్లేయుల శాపనార్థాలకు గురైన పఠాన్లు శాంతి ప్రియులైన భగవత్సేవకులయ్యారు. 1930లో పెషావర్‌లోని ఖిస్సాఖాని బజారును పోలీసులు శవాలదిబ్బగా మార్చినా చిన్నరాయి ముక్కను కూడా ఆంగ్లేయాధికారులు, సైనికులు, పోలీసుల మీద విసరకుండా తుపాకిగుళ్ళకు ఎదురొడ్డి ప్రాణత్యాగాలతో **భగవత్సేవకులు** ప్రపంచ ప్రజల ప్రశంసలందుకున్నారు.

1931 మార్చి 31న కరాచిలో అఖిల భారత కాంగ్రెస్ సమావేశానికి ఖుదా-యే-ఖిద్మత్‌గార్ సభ్యులతో సహా హజరైన ఆయన ప్రత్యేక గుర్తింపు పొందారు. ఆ తరువాత బొంబాయిలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ మహాసభల అధ్యక్ష స్థానం స్వీకరించాల్సిందిగా కాంగ్రెస్ ప్రముఖులు ఆయనను కోరగా, **'నేను జీవితాంతం సైనికుడ్ని మాత్రమే'** అంటూ తిరస్కరించారు. జాతీయోద్యమంలో ఆయన 15ఏండ్లు దుర్భర జైలుశిక్షను అనుభవించారు. ఒకవైపున పఠాన్ జాతుల్లో సంస్కరణలకు పాటుపడుతూ మరోవైపున మతోన్మాదశక్తులను ఎదుర్కొంటూ రాజకీయంగా ముందుకు సాగిన బాద్షాఖాన్ 1937నాటి ఎన్నికలలో జాతీయ కాంగ్రెస్‌కు వాయవ్య సరిహద్దు ప్రాంతాలలో ఆధిపత్యాన్ని సమకూర్చి పెట్టారు.

భారత విభజనను తొలుత నుండి వ్యతిరేకించిన ఆయన 1947 మేలో విభజనను అంగీకరిస్తూ జాతీయ కాంగ్రెస్ చేసిన ప్రతిపాదనను వ్యతిరేకించిన ఏకైక ప్రముఖునిగా ముస్లింలీగ్ ఆగ్రహానికి గురయ్యారు. ఆ సందర్భాన్ని పురస్కరించుకుని **మమ్మల్ని తోడేళ్ల పాల్జేశారు** అని ఆయన ఆవేదన వ్యక్తంచేశారు. అందుకు ఆగ్రహించిన పాకిస్థాన్ ప్రభుత్వం గఫార్ ఖాన్‌ను ద్రోహిగా పరిగణించింది. ఆ కారణంగా ఆయన పాకిస్థాన్‌లో మరో 15 ఏండ్ల పాటు జైలు జీవితాన్ని, ఆరేండ్ల ప్రవాస జీవితాన్ని గడపాల్సి వచ్చింది. 1987లో ఖాన్‌సాబ్ ఇండియా వచ్చిన సందర్భంగా ఆయనను **భారతరత్న** అవార్డుతో భారతీయులు గౌరవించుకున్నారు. భయానక నిర్బంధాన్నైనా చాలా తేలిగ్గా తీసుకుని క్రూర నియంతలను కూడా ఖాతరు చేయక జీవిత పర్యంతం అహింసా యోధునిగా తాను నమ్మిన మార్గంలో ముందుకు సాగిన **సరిహద్దు గాంధీ** ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ 98 ఏండ్ల వయస్సులో 1988 జనవరి 20న కాలం చేశారు. ◆



# 25. హజరా బీబి ఇస్మాయిల్

## (- 1994)

**జీ**విత భాగస్వామితో పాటుగా స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని స్వసమాజం భహిష్కరించినా, ఎన్ని కష్టనష్టాలు ఎదురైనా మొక్కవోని ధైర్యంతో తమదైన మార్గంలో జాతీయోద్యమ బాటలో సాగిన మహిళ హాజరా బీబి.

ఆంధ్రప్రదేశ్‌, గుంటూరు జిల్లా తెనాలి పట్టణం కేంద్రంగా ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు మహమ్మద్‌ ఇస్మాయిల్‌ సాహెబ్‌ జాతీయోద్యమంలో పాల్గొన్నారు. హజరా బీబి ఆయన భార్య. జాతీయోద్యమంలో ఆమె మహమ్మద్‌ ఇస్మాయిల్‌ వెంట నడిచిన సహచరి. గాంధీజీ ప్రబోధంతో ప్రభావితులైన ఆ దంపతులు ప్రత్యేకంగా ఖద్దరు ప్రచారోద్యమంలో అమితోత్సాహంతో పాలుపంచుకున్నారు. గుంటూరు జిల్లాలో తొలి **ఖద్దరు దుకాణం** ప్రారంభించి, **ఖద్దరు ఇస్మాయిల్‌** గా పేర్గాంచిన ఇస్మాయిల్‌కు హాజరా బీబి అన్ని విషయాలలో అపూర్వమైన తోడ్పాటునిచ్చారు.

ఆ కాలంలో అఖిల భారత ముస్లింలీగ్‌కు ఆంధ్రప్రదేశ్‌లోని తెనాలి ప్రధాన కేంద్రంగా ఉండేది. ఈ కేంద్రం నుండి ముస్లింలీగ్‌ కార్యకలాపాలు విస్తృతంగా సాగాయి. తెనాలి నేత ఖద్దర్‌ ఇస్మాయిల్‌ దంపతులు భారత జాతీయ కాంగ్రెస్‌లో కొనసాగటం, గాంధీజీ విధానాల పట్ల అత్యంత గౌరవభావంతో ఉండటం మాత్రమే కాకుండా ఆచరణలో





అందరికి ఆదర్శంగా నిలవడం తెనాలి లోని ముస్లిం లీగ్‌ నేతలకు కార్యకర్తలకు, లీగ్‌ అభిమానులకు ఇష్టం లేకపోయింది. ఆ కారణంగా ఆ దంపతులు ముఖ్యంగా హజరా బీబి చాలా అవస్థలు ఎదుర్కోవాల్సి వచ్చింది. అత్యంత క్లిష్టపరిస్థితులు ఎదురైనా హాజరా బీబి ఎంతో ఓర్పుతో కుటుంబ వ్యవహారాలను చూసుకుంటూ, తన ఇంటికి విచ్చేస్తున్న జాతీయోద్యమ నాయకులకు, కార్యకర్తలకు అవసరమైన సహాయ సహకారాలు అందిస్తూ ఇస్మాయిల్‌కు అండగా జాతీయోద్యమంలో ముందుకు సాగారు.

భర్త ముహమ్మద్‌ ఇస్మాయిల్‌ పలుసార్లు జైలు పాలైనప్పటికీ హాజరా అధైర్యపడలేదు. మహాత్ముని మాటలతో ప్రభావితమైన కార్యకర్తగా తన భర్త జైలుకు వెళ్ళటం గౌరవంగా భావించారు. పిల్లలకు జాతీయవిద్యను అందించాలన్న లక్ష్యంతో స్వసమాజం నుండి వ్యతిరేకత వ్యక్తమవుతున్నా, ఆడబిడ్డలను జాతీయ విద్యాబోధన కోసం హిందీ పాఠశాలకు పంపారు. ఈ పద్ధతులు నచ్చని వ్యక్తులు ఇస్మాయిల్‌ కుటుంబం మీద అప్రకటిత సాంఘిక బహిష్కరణ విధించారు. ఆమె ఇంటికి ఎవ్వరూ వెళ్ళరాదని, పలకరింపు కూడా కూడదని ఆంక్షలు విధించారు. ఆ చర్యలకు ఏ మాత్రం చలించకుండా ఎంతో సహనం, గౌరవంగా ఆమె వ్యతిరేక పరిస్థితులను నెట్టుకొచ్చారు. తమ మార్గం గాంధీ మార్గం కనుక ఎవరు ఏమనుకున్నా, ఏమి చేసినా ఓర్పు, సహనంతో పరిష్కరించుకోవడం తప్ప గాంధీమార్గం నుండి మళ్ళేది లేదని నిర్ణయించుకున్న హజరా బీబి, ఆ నిర్ణయం ప్రకారంగా చివరికంటా పయనం సాగించారు.

భర్త ముహమ్మద్‌ ఇస్మాయిల్‌ మొత్తం మీద ఏడు సంవత్సరాల పాటు జైలు జీవితం అనుభవించారు. ఆయన చివరిసారిగా జైలులో ఉన్నప్పుడు తీవ్ర అనారోగ్యం పాలై 1948లో కన్నుమూశారు. ఆయన కన్నుమూశాక స్వాతంత్ర్య సమరయోధులకు ఇచ్చే భూమిని ప్రభుత్వం ఆమెకు సంక్రమించ చేయదలచింది. అయితే తమ దేశభక్తికి విలువ కట్టడం ఇష్టంలేని ఆమె ప్రభుత్వం ఇస్తానన్న భూమిని తిరస్కరించారు.

ప్రభుత్వం ఇస్తానన్న భూమిని తిరస్కరించడం మాత్రమే కాకుండా తన భర్త వాగ్దానం మేరకు తెనాలి సమీపాన గల కావూరు వినయాశ్రమానికి తమ విలువైన రెండున్నర ఎకరాల మాగాణి భూమిని ఆమె దానం చేసి భర్త వాగ్దానాన్ని గౌరవించి తన దాతృత్వాన్ని చాటుకున్నారు. ఆనాడు స్వాతంత్ర్యయోధుల సమావేశస్థలిగా భాసిల్లిన **ఖద్దరు విక్రయశాల** ను ఇస్మాయిల్‌ మరణానంతరం కూడా కొంతకాలం నిర్వహించారు. చివరివరకు ఖద్దరు ధరిస్తూ గాంధీజీ బాటలో సాగుతూ భర్త ఆశయాలకు అనుగుణంగా జీవితం గడిపిన హాజరా బీబి 1994లో తుదిశ్వాస విడిచారు. ◆



# ౨౬. నక్కీ అహమ్మద్ చౌదరి

## (౧౯౧౪- ౧౯౯౬)

**నే**తాజి సుభాష్ చంద్రబోస్ నాయకత్వంలో ఆయుధం చేతపట్టి రణనినాదం చేస్తూ బ్రిటీషర్లను ఎదుర్కొన్న ఆజాద్ హింద్ ఫౌజ్ సభ్యునిగా పలు పోరాటాలలో పాల్గొని కార్యదక్షత, నిరుపమాన దేశభక్తిని నిరూపించుకున్న యోధులు నక్కీ అహమ్మద్ చౌదరి.

మణిపూర్ రాష్ట్రం తూర్పు ఇంఫాలాలోని కెకూహ్ ( KEIKHU ) గ్రామంలోని మౌల్వీ అమీరుల్లా, బీబి ఖతిజా అలియాస్ హోటోమ్‌బి బీబీ (HAOTOMBI BIBI) లకు నాల్గవ సంతానంగా నక్కీ అహమ్మద్ చౌదరి 1914 డిసెంబర్ 25న జన్మించారు. కలకత్తా విశ్వవిద్యాలయం నుండి మెట్రిక్ పరిక్ష పాసయ్యాక మణిపూర్‌లో కళాశాల లేకపోవడంతో విద్యాభ్యాసాన్ని ముగించారు. చిన్ననాటి నుండే సమాజసేవాభావనలను పుణికి పుచ్చుకున్న ఆయన నిఖిల్ మణిపూర్ మహాసభ (NIKHIL MANIPUR MAHASABHA) సభ్యత్వం స్వీకరించి సంఘ సేవా కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొన్నారు.

1939లో పరాయి పాలకుల తొత్తులు సాగించిన దోపిడి-దౌర్జన్యాలకు వ్యతిరేకంగా మణిపూరు మహిళలు సాగించిన **మేయిటై మహిళా తిరుగుబాటు**లో ( MEITEI WOMEN'S REVOLT) లో ఆయన చురుకైన పాత్ర నిర్వహించారు. మౌల్వీ రహిముద్దీన్ సాహెబ్, మౌల్వీ హుసైన్ అలీ సాహెబ్‌ల మార్గదర్శకత్వంలో సాగిన ఈ తిరుగుబాటులో మణిపూరి





ముస్లిం మహిళలు కూడా పెద్ద సంఖ్యలో పాల్గొని చరిత్ర సృష్టించారు.

మణిపూరులో ఉపాధికి అవకాశాలు లేకపోవటంలో బ్రతుకుదెరువు వెతుక్కొంటూ అస్సాంలోని జోర్‌హట్‌కు వెళ్ళిన అహమ్మద్ 1941 ఆరంభంలో బ్రిటీష్ ఇండియా ఆర్మీలో చేరారు. ఆ తరువాత జపాన్ బ్రిటీష్ ప్రాంతాల మీద దాడి చేసి, విజయం సాధించటంతో బ్రిటీష్ సైన్యంలోని భారతీయులు యుద్ధ ఖైదీలయ్యారు. ఆ యుద్ధఖైదీలు క్రమంగా నేతాజీ నాయకత్వంలోని భారత జాతీయ సైన్యంలో భాగమయ్యారు. ఈ సందర్భంగా నక్కీ అహమ్మద్‌లో గల ధైర్యసాహసాలు, కార్యదక్షతను గమనించిన నేతాజీ సుభాష్ చంద్ర బోస్ స్వయంగా ఆయనకు ప్రత్యేక బాధ్యతలను అప్పగించారు.

రణ దుంధుభి మోగిస్తూ ఆజాద్ హింద్ ఫౌజ్ బయలు దేరిన మార్గంలో అందరి కంటే ముందుగా ఆ స్థానాలకు చేరుకుని ఆ ప్రాంతాలలోని ప్రజలతో సత్సంబంధాలను ఏర్పరచుకుని శత్రువును ఎదుర్కొనేందుకు ప్రజలను సిద్ధం చేసి ఆజాద్ హింద్ ఫౌజ్ వీర పుత్రులకు అనుకూల వాతావరణం ఏర్పచడంలో నక్కీ అహమ్మద్ సమర్ధవంతంగా విధులను నిర్వహించి శభాష్ అన్పించుకున్నారు. ఈ సందర్భంగా ఆయనకు 'మేజర్' గా పదోన్నతిని కూడా లభించింది. ఆ తరువాత సాగిన ప్రతికూల పరిణామాల ఫలితంగా బ్రిటీష్ గూఢచారులు ఆయనను అరెస్టు చేశారు. ఆ సందర్భంగా జరిగిన ఇంటరాగేషన్‌లో ఒక ఆంగ్లేయాధికారి కొట్టిన చెంపదెబ్బకు ఆయన గూబ పగిలి పోవడంతో ఒక చెవి పూర్తిగా పనికిరాకుండా పోయింది.

చివరకు భారత జాతీయ కాంగ్రెస్ కృషి, సైనిక న్యాయస్థానంలో సాగిన విచారణ ఫలితాలు అనుకూలించడంతో 1946 మే మాసంలో నక్కీ అహమ్మద్ చౌదరీ స్వగృహం చేరుకున్నారు. ఈ సందర్భంగా ఆ ప్రాంతానికి చెందిన ప్రముఖుడు ఉన్నతాసనం నుండి దిగి వచ్చి ఆయనకు గౌరవంగా సెల్యూట్ చేసి స్వాగతం పలకడం సంచలనం సృష్టించింది. అ ప్రాంతంలో అప్పటివరకు మరే ముస్లిం ప్రముఖునికి అంతటి గౌరవం లభించక పోవటం ఈ సంఘటన చరిత్ర సృష్టించింది.

మేజర్ నక్కీ అహమ్మద్ చౌదరీ బ్రతుకుదెరువు కోసం స్వగ్రామంలో పలు ఉద్యోగాలు చేశారు. ఆయన ఎక్కడ ఉన్నా ఆనాటి ఆజాద్ హింద్ ఫౌజ్ వీరుల త్యాగాలను సాహసాలను బాలబాలికలకు వివరిస్తూ యోధుల అపూర్వ ఆత్మబలిదానాలతో లభించిన స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలను పరిరక్షించుకోవాల్సిన బాధ్యతలను యువకులకు గుర్తు చేస్తూ గడిపారు. ఈ విధంగా చివరివరకు గడిపిన ఆజాద్ హింద్ ఫౌజ్ యోధులు నక్కీ అహమ్మద్ చౌదరీ 82 ఏండ్ల వయస్సులో 1996 డిసెంబరు 6న ఆఖరిశ్వాస విడిచారు. ◆



# ౯౭. అమీర్ హైదర్ ఖాన్

## (౧౯౦౦-౧౯౯౯)

బ్రిటీష్ సామ్రాజ్యవాద శక్తులను పారద్రోలడం మాత్రమే కాకుండా సామ్యవాద వ్యవస్థను నిర్మించాలన్న లక్ష్యంతో కమ్యూనిస్టు ఉద్యమాన్ని దక్షిణ భారత దేశానికి పరిచయం చేసిన అసమాన పోరాట యోధులు అమీర్ హైదర్ ఖాన్.

ఈనాటి పాకిస్థాన్‌లో భాగమైన పశ్చిమ పంజాబ్ రాష్ట్రంలోని కలియన్ వలియన్ గ్రామంలోని ఒక సామాన్య రైతు కుటుంబాన 1900లో అమీర్ హైదర్ ఖాన్ జన్మించారు. జాతీయోద్యమంలో పాల్గొనడానికి ఇల్లు వదలి పెట్టి వెళ్ళిన పెద్దన్నను వెతుక్కుంటూ బయలు దేరిన హైదర్ ఖాన్ బొంబాయి చేరుకుని 15 ఏండ్ల వయస్సులో అక్కడ నుండి ఓ నౌకలో కూలివానిగా లండన్ ప్రయాణమయ్యారు. ఆ నౌకలో తోటి పిల్లలకు కూలి విషయంలో జరుగుతున్న అన్యాయాన్ని ప్రశ్నించి విజయం సాధించిన ఆయన ఆ తరువాత జీవిత పర్యంతం శ్రమజీవుల పక్షం వహించి పోరుబాట సాగారు.

అమీర్ హైదర్ ఖాన్ పలు ఉద్యోగాలు చేస్తూ వివిధ ప్రాంతాలు తిరుగుతుండగా 1919లో న్యూయార్క్‌లో ఆయనకు గదర్ పార్టీతో పరిచయం కలిగింది. ఆ పరిచయం తరువాత అమెరికాలోని భారత స్వాతంత్ర్య మిత్రమండలిలో చేరి చురుగ్గా పనిచేయడం, జపాన్‌లో ఉన్న విప్లవకారుడు రాస్ బిహారి బోస్‌ను కలిసి విప్లవ కార్యక్రమాల గురించి





చర్చించారు. ఆయన మీద బ్రిటీష్ పోలీసుల కన్ను పడింది. ఆయనను అరెస్టు చేయగా అమెరికన్ నావికుల ప్రమేయంతో బయటపడి తిన్నగా అమెరికా చేరుకున్నారు. అమెరికా చేరుకోగానే కార్మికుల అనుకూల సంస్థ **అమెరికన్ వర్కర్స్ పార్టీ**లో సభ్యత్వం స్వీకరించి, ఆ పార్టీ సహకారంతో రష్యా వెళ్ళారు. అక్కడ కమ్యూనిజాన్ని అధ్యయనం చేస్తూ గడిపిన ఆయన బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడుతున్న స్వదేశీయులతో కలసి సామ్రాజ్యవాద శక్తులను ఎదుర్కొవాలన్న నిర్ణయానికొచ్చారు.

ఆ సమయంలో భారతదేశంలో ఉప్పు సత్యాగ్రహం జరుగుతుంది. ఆ ఉద్యమం లో పాల్గొనేందుకు మాస్కో నుండి 1930 చివరి భాగంలో భారత దేశానికి వచ్చారు. అప్పటికే ప్రమాదకర వ్యక్తుల జాబితాలో చేరిన ఆయన కోసం పోలీసులు వేట ఆరంభించగా వారికి చిక్కకుండా మారువేషంలో బొంబాయి నుండి మద్రాస్‌కు చేరుకున్నారు. మద్రాసు కేంద్రంగా దక్షిణ భారత దేశంలో కమ్యూనిస్టు ఉద్యమాన్ని నిర్మించేందుకు నడుంకట్టారు. ఆ క్రమంలో జాతీయ ఉద్యమంలో చురుగ్గా పాల్గొని సత్యాగ్రహ ఉద్యమంలో జైలుకు వెళ్లిన యువకులు, విద్యార్థుల కోసం అన్వేషిస్తున్న ఆయనకు కంభంపాటి సత్యనారాయణ, పుచ్చలపల్లి సుందరయ్య తారసపడ్డారు. ఆ యువకులను అమీర్ హైదర్ ఖాన్ స్వయంగా కలుసుకుని వారికి కమ్యూనిస్టు ఉద్యమాన్ని పరిచయం చేశారు.

అటు జాతీయోద్యమ కార్యక్రమాలు, ఇటు కమ్యూనిస్టు పార్టీ నిర్మాణ కార్య కలాపాలలో నిమగ్నమైన అమీర్ హైదర్ ఖాన్‌ను **'అత్యంత ప్రమాదకారి'**గా పరిగణించిన బ్రిటీష్ ప్రభుత్వం ఆయనను పలుమార్లు జైళ్ళ పాల్జేసింది. ఒకసారి ఆయన జైలులో ఉన్నప్పుడు సుభాష్ చంద్ర బోస్‌తో పరిచయం కలిగింది. ఆ పరిచయం వారి మధ్యన స్నేహంగా మారింది. బ్రిటీష్ పాలకుల కళ్ళుగప్పి నేతాజీ జపాన్ వెళ్ళినప్పుడు అమీర్ హైదర్ ఖాన్‌తో నేతాజీకి ఏర్పడిన ఆ స్నేహం ఎంతగానో సహకరించింది.

దక్షిణ భారతదేశంలో తన కార్యక్రమాలను ముగించుకున్న అమీర్ హైదర్ ఖాన్ 1945లో స్వస్థలానికి వెళ్ళిపోయారు. స్వగ్రామంలో బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో పాల్గొంటూ వచ్చిన ఆయన స్వరాజ్యం వచ్చాక పూర్తిగా జన్మభూమి సేవలో గడిపారు. 1988లో భారతదేశం వచ్చి కమ్యూనిస్టు మిత్రులను కలుసుకుని దక్షిణ భారతదేశంలో కమ్యూనిస్ట్ ఉద్యమం వికసించిన తీరు తెన్నులను తెలుసుకుని ఆనందించారు. ఆ తరువాత 1992లో మరోసారి భారతదేశం వచ్చి వెళ్ళిన అవిశ్రాంత పోరాట యోధులు అమీర్ హైదర్‌ఖాన్ 1999లో తన స్వగ్రామంలో చివరి శ్వాస విడిచారు. ◆



# ౯౮. డాక్టర్ జైనుల్లాబ్దిన్ అహమ్మద్

## (౧౯౦౯- )

**ప**రపాలకుల పీడన నుండి దేశాన్ని విముక్తం చేయడమే కాకుండా దోపిడి నుండి శ్రమజీవులను విముక్తం చేయాలన్న మహత్తర లక్ష్యంతో జాతీయోద్యమానికి అంకితమైన మహనీయులలో ఒకరు డాక్టర్ జైనుల్లాబిద్దీన్ అహమ్మద్.

1909 అక్టోబర్ 29న సింధ్ ప్రాంతంలోని ఒమర్‌కొట్‌లో జైనుల్లాబిద్దీన్ జన్మించారు. 1924లో ఉన్నత విద్యకోసం అలీఘర్ విశ్వవిద్యాలయానికి వెళ్ళిన ఆయన గ్రాడ్యుయేషన్ పూర్తిచేసాక 1928లో ఇంగ్లాండ్‌లోని 'లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్' నుండి 1935లో డాక్టరేట్ పట్టాను పొందారు.

1936లోఇండియా వచ్చి అటు జాతీయోద్యమం పట్ల ఇటు కమ్యూనిజం పట్ల ఆకర్షితులయ్యారు. బ్రిటీష్ ప్రభుత్వం డాక్టర్ అహమ్మద్‌ను ప్రభుత్వ కళాశాల ప్రిన్సిపాల్‌గా ఆహ్వానించినా జాతీయ భావాలతో ప్రభావితుడైన ఆయన బ్రిటీష్ ప్రభుత్వ ఆహ్వానాన్ని తిరస్కరించారు. ఆయన మనస్సు వలస పాలకులకు వ్యతిరేకంగా సాగుతున్న పోరాటంలో పాలు పంచుకోవాలని, అనంతరం అసమానతలు, అంతరాలు లేని భవ్య భారతదేశ నిర్మాణం కోసం కృషి సాగించాలని నిర్ణయించుకుంది.

ఆ క్రమంలో ఆయనకు ఇంగ్లాండ్‌లో పరిచయమైన హజరా బేగంను 1936లో





వివాహం చేసుకున్నారు. భారత దేశంలో మహిళా ఉద్యమ నిర్మాతలలో ఒకరుగా ఖ్యాతి గాంచిన ఆమెతో కలసి జాతీయ కాంగ్రెస్‌లో పూర్తికాలం పనిచేయడానికి సిద్ధపడ్డారు. 1938 ఉత్తరప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి అయ్యారు. ఆర్థిక వ్యవహారాలలో నిపుణుడైన ఆయనను ఆర్థిక వ్యవహారాల సలహాదారునిగా జవహర్ లాల్ నెహ్రూ నియమించారు. ఆయన బహిరంగంగా వ్యక్తం చేస్తున్న కమ్యూనిస్టు భావజాలం పట్ల విముఖత గల కాంగ్రెస్ నాయకులు కొందరు డాక్టర్ అహమ్మద్‌ను కాంగ్రెస్ కమిటీ నుండి తొలగించమని డిమాండ్ చేసినా నెహ్రూ అందుకు అంగీకరించలేదు.

జాతీయోద్యమం ఊపందుకుని ప్రజలు ఉద్యమిస్తున్న తరుణంలో డాక్టర్ అహమ్మద్ దంపతులు అద్భుతమైన కార్యదక్షత చూపుతూ ముందుకుసాగారు. అందుకు ఆగ్రహించిన బ్రిటీష్ ప్రభుత్వం ఆయనను జైలు పంపింది. ఆయన మీద పలు ఆంక్షలను విధించింది. లక్ష్యసాధనలో ఎటువంటి కష్టమొచ్చినా ఏమాత్రం ఖాతరు చేయని ఆయన మరింత విజృంభించి తన కార్యకలాపాలను కొనసాగిస్తూ ప్రజలలో గుర్తింపు పొందారు.

1943లో భారత జాతీయ కాంగ్రెస్ కంటే భారత కమ్యూనిస్టు పార్టీ పట్ల మొగ్గు చూపిన డాక్టర్ అహమ్మద్ భార్య హజరా బేగంతో కలసి కాంగ్రెస్‌కు దూరమయ్యారు. ఆనాడు కమ్యూనిస్టుపార్టీ మీద అంక్షలున్నాయి. స్వేచ్ఛగా పార్టీ కోసం పనిచేసే అవకాశాలు లేవు. అయినా కష్టనష్టాలను భరించడానికి ఆ దంపతులు సిద్ధమయ్యారు.

భారతదేశానికి స్వాతంత్ర్యం లభించాక శ్రామికులు-రైతుల కోసం అహర్నిశలు పని చేయటం ప్రారంభించారు. కమ్యూనిస్టు పార్టీ మీద నిషేధం ఉన్నా పార్టీ కార్యకలాపాలకు దూరం కాలేదు. ఆ కారణంగా పార్టీలో పలు ఉన్నత పదవులు చేపట్టిన ఆయన 1958లో ఉత్తర ప్రదేశ్ రాష్ట్రం నుండి రాజ్యసభ సభ్యులుగా ఎంపికయ్యారు. ఆతరువాత మరోసారి 1966లో రాజ్యసభ సభ్యులయ్యారు. ఆ తరువాత డాక్టర్ అహమ్మద్ లెజిస్లేటివ్ అసెంబ్లీకి ఎన్నికయ్యి 2001 వరకు కొనసాగారు.

రైతాంగ సమస్యల పట్ల చక్కని అవగాహన కలిగి రైతు సంక్షేమం కోరుకుంటూ పనిచేస్తున్న డాక్టర్ అహమ్మద్ 2001 వరకు అఖిల భారత కిసాన్ సభకు అధ్యక్షులుగా వ్యవహరించారు. ఆర్థిక సమస్యల విశ్లేషణ-వివేచన మీద చక్కని పట్టుగలిగిన ఆయన, భారతీయుల దృష్టికోణం నుండి పరిష్కారాలు సూచిస్తూ పలు పుస్తకాలు వెలువరించారు. ఆర్థిక-సాంఘిక అసమానతలు లేని సమ సమాజాన్ని కోరుకున్న డాక్టర్ జైనుల్లాబిద్దీన్ అహమ్మద్ దంపతులు పండు వయసులో కూడా దశాబ్దాల నాడు నిర్దేశించుకున్న మహత్తర లక్ష్యాలను సాధించే దిశగా అవిశ్రాంత కృషి సాగించారు. ◆

# ౭౭. మీర్ ముష్తాఖ్ అహమ్మద్

## (౧౯౧౫ - )

**జా**తీయోద్యమంలో క్రియాశీలక పాత్రను పోషించిన యోధులు సామాజిక న్యాయం ప్రాతిపదికన మహాత్ముని బాటలో నవభారత నిర్మాణం జరగాలని కూడా ఆకాంక్షించారు. ఆ ఆకాంక్షల సాధనా దిశగా జాతీయోద్యమ కార్యకలాపాలతోపాటుగా నవభారత నిర్మాణ కార్యక్రమాలను జమిలిగా సాగించిన వారిలో మీర్ ముష్తాఖ్ అహమ్మద్ ప్రముఖులు.

1915 ఏప్రిల్ 25న జమ్మూకాశ్మీర్‌లోని సిమ్లాలో ఆయన జన్మించారు. జాతీయ భావాలు గల ఆయన తండ్రి మీర్ అబ్దుల్ సత్తార్ ప్రభుత్వ వ్యతిరేక కార్యక్రమాలలో పాల్గొన్నందున 1921లో అరెస్టయ్యారు. ఆ వారసత్వాన్ని కొనసాగించిన మీర్ ముష్తాఖ్ అహమ్మద్ విద్యార్థిగా నాయకత్వ లక్షణాలను ప్రదర్శించి 1938లో కళాశాల విద్యార్థి సంఘం ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయ్యారు.

ఒకవైపు కళాశాల విద్యార్థి సంఘం నేతగా బాధ్యతలు నిర్వహిస్తూనే, నూతనంగా ఏర్పడిన All India Students Federation సభ్యత్వం స్వీకరించి విద్యార్థి ఉద్యమాలలో చురుకైన పాత్ర నిర్వహించారు. ఆ సమయంలో జవహర్‌లాల్ నెహ్రూ, సరోజిని దేవి, మహమ్మద్ అలీ జిన్నా, యన్.జి.రంగా, బబ్లూభాయ్ దేశాయి, మౌలానా అతావుల్లా బొఖారి తదితర ప్రముఖులతో ఆయనకు సన్నిత సంబంధాలు ఏర్పడ్డాయి.





1940లో ఆరంభమైన శాసనోల్లంఘన ఉద్యమం సమయంలో ఆయన ఉద్యోగం వదిలేసి జాతీయోద్యమంలో ప్రవేశించారు. మాతృదేశసేవలో పూర్తిగా గడపాలని నిర్ణయించుకున్న ఆయన వ్యక్తిగత స్వార్థం, కుటుంబ బంధనాలకు దూరంగా ఉండాలని అవివాహితునిగా ఉండిపోయారు. మహాత్ముని మార్గంలో స్వయంగా నూలును వడికి అవసరమైన బట్టలను తయారు చేసుకుని వాటిని ధరించటం ప్రారంభించారు. ముస్లిమేతర ప్రజానీకం మత మనోభావాలకు విఘాతం కలగకుండేందుకు గోమాంసం తినడం మానేశారు. శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నందుకు ఆగ్రహించిన ప్రభుత్వం సంవత్సరం జైలు శిక్షను విధించి రావల్పిండి జైలుకు పంపింది. 1942నాటి క్విట్ ఇండియా ఉద్యమంలో చురుగ్గా పనిచేసినందుకు మరోమారు 22 మాసాల జైలుశిక్ష అనుభవించారు. ఆ సందర్భంగా జైలులో ఖైదీలు అనుభవిస్తున్న దుర్భర పరిస్థితుల నుండి వారిని విముక్తం చేసేందుకు సత్యాగ్రహం చేపట్టి విజయం సాధించారు.

1947లో స్వరాజ్యం సిద్ధించింది. ఆ ఆనందంలో ఎంతో సేపు నిలువలేదు. మత కలహాలు, భారత విభజన ఆయనను కలచివేశాయి. ఆనాటి కల్లోల సమయంలో మీర్ ముష్తాఖ్ అహమ్మద్ ఢిల్లీలో ప్రత్యేక మేజిస్ట్రేట్‌గా కులమతాల ప్రసక్తి లేకుండా సమన్యాయం ప్రసాదించడంలో, మతసామరస్యం కాపాడటంలో కీలకపాత్ర నిర్వహించారు.

చిన్నతనం నుండి సామాజిక న్యాయం లక్ష్యంగా ఎదిగిన మీర్ ముష్తాఖ్ అహమ్మద్ సామ్యవాద భావాల వైపు మొగ్గుచూపుతూ కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ స్థాపనలో ప్రధాన పాత్ర పోషించారు. ఆ పార్టీ పక్షాన ప్రజాప్రతినిధిగా ఎన్నికయ్యి బాధ్యతాయుతంగా పనిచేశారు. ఆ తరువాత పలు పదవులు చేపట్టి నిర్వహించారు. ఇందిరా గాంధీ ఎమర్జన్సీని ప్రకటించినందుకు నిరసనగా కాంగ్రెస్ పార్టీని విడిచిపెట్టారు. అత్యాయకపరిస్థితిని తీవ్రంగా విమర్శించి ప్రభుత్వాధినేతల ఆగ్రహానికి గురయ్యారు. ఆ తరువాత మరో పార్టీలో చేరకుండా ప్రజల సమస్యల పరిష్కారం కోసం, భాషా-సంస్కృతుల పరిరక్షణ కోసం, మత సామరస్యాన్ని కాపాడేందుకు మహాత్ముని బాటలో చివరికంటా సాగారు.

కవి-రచయితగా, చక్కని కవితలు-రచనలతో ఉదాత్త భావనలను వెల్లడించిన ఆయన సాహిత్యరంగంలో కూడా మంచి గుర్తింపు పొందారు. బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో ఆయన పాల్గొన్నా, వ్యక్తిగతంగా వారిపట్ల ఎటువంటి శత్రువైఖరిని అవలంభించ లేదు. మంచిని మంచిగా చెడును చెడుగా చూడాలంటూ ప్రజాజీవితాలలో గుణాత్మక మార్పులకు ఆంగ్లపాలకులు ఏవిధంగా తోడ్పడింది సాధికారికంగా వివరిస్తూ తన రచనలలో మీర్ ముష్తాఖ్ అహమ్మద్ ధన్యవాదాలు తెలిపారు. ◆



# 100. షేక్ మౌలా సాహెబ్

## (1927-)

**భా**రత స్వాతంత్ర్యసంగ్రామ చరిత్రలో సంచలనాత్మక ఘట్టమైన **'పరిటాల రిపబ్లిక్'** ప్రకటన సందర్భంగా పరిటాల రిపబ్లిక్ జెండాను తొలిసారిగా వినువీధుల్లో ఎగురవేసి **పరిటాల రిపబ్లిక్ పతాక వీరుడు**గా ఖ్యాతిగాంచిన యోధులు షేక్ మౌలా సాహెబ్.

ఆంధ్రప్రదేశ్‌లోని ప్రస్తుత కృష్ణాజిల్లా కంచికచర్ల మండలంలో 'వజ్రాలదిన్నె' గా పేర్గాంచిన పరిటాల గ్రామంలో షేక్ మీరాసాహెబ్, మొహమ్మద్‌బీ దంపతులకు 1927లో మౌలా సాహెబ్ జన్మించారు. గ్రామంలోని పాఠశాలలో ఫోర్తు ఫారం వరకు చదువుకున్న ఆయన చదువు మానేసి కట్టెలు కొడుతూ కుటుంబానికి ఆధారమయ్యారు. తెలుగు, ఉర్దూ భాషలు తెలిసిన మౌలా స్వతంత్ర ఆలోచనలు గల బాల్య మిత్రుల సహచర్యంలో ఆనాడు సాగుతున్న స్వాతంత్ర్య సంగ్రామం పట్ల ఆసక్తి చూపారు.

అది 1947 సంవత్సరం. భారతదేశమంతటా స్వేచ్ఛా పవనాలు వీస్తున్నా నైజాం నవాబు పాలన వలన పరిటాల ఖానత్ తాలూకా స్వేచ్ఛాగాలులు పీల్చలేని పరిస్థితి. స్వతంత్ర భావాలు గల పరిటాల ప్రజలు అస్వతంత్రులుగా ఉండలేకపోయారు. **మాకొద్దు తెల్ల దొరతనం** స్థానంలో **మాకొద్దు నిజాం దొరతనం** అంటూ నినదిస్తూ పరిటాల ఖానత్‌లోని ఏడు గ్రామాలలోని ప్రజలంతా ఏకమై మౌలా సాహెబ్ మిత్రులు మాదిరాజు దేవరాజు నాయకత్వంలో స్వతంత్రం ప్రకటించుకున్నారు. ఆ మహత్తర సంఘటనలో





20ఏండ్ల షేక్ మౌలా గుర్తుండిపోయే సాహసోపేతమైన పాత్ర నిర్వహించారు.

నైజాం సంస్థానంలో భాగమైన పరిటాల ప్రాంతంలో భారత జాతీయ కాంగ్రెస్ పతాకాన్ని ఎగుర వేయడం రాజ ద్రోహం. అది భయంకర నేరం. జాతీయ పతాకాన్ని ఎగురవేస్తే మూడు సంవత్సరాల జైలు శిక్షను పాలకులు అమలు చేస్తున్నారు. పరిటాల వీరులు జాతీయ పతాకాన్ని ఎగురవేయాలని సంకల్పించి, నిజాం విధించే శిక్షలను పోలీసుల దాష్టికాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ మీమాంసలో పడ్డారు. ఆ సమయంలో షేక్ మౌలా సాహెబ్ ముందుకు వచ్చి నిర్భయంగా పరిటాల గ్రామ కచ్చేరి మీద జాతీయ పతాకమైన మువ్వన్నెల జెండాను ఎగురవేసి స్వాతంత్ర్యసమరయోధులు తరుచుగా పాడే **దూర్ హటో దునియా వాలో** పాటను పాడారని రచయిత 2002 ఏప్రిల్ 21న చేసిన ఇంటర్వ్యూలో మాదిరాజు దేవరాజు వెల్లడించారు. ఆ పతాకావిష్కరణతో పరిటాల రిపబ్లిక్ సర్వసత్తాక స్వతంత్ర పాలన ప్రారంభమై 18 నెలలపాటు సాగింది.

పరిటాల రిపబ్లిక్ ఏర్పాటు, పతాకావిష్కరణ విషయం తెలుసుకున్న నైజాం నవాబు జాగీర్దార్ పరిటాల మీద దాడిచేశాడు. జాగీర్దార్ దృష్టిలో భయంకర నేరం చేసిన మౌలాకు మతపెద్దల నుండి తాఖీదులు వచ్చాయి, మత పంచాయితి పెట్టి మౌలాకు వ్యతిరేకంగా తీర్మానం చేశారు. మౌలా కుటుంబాన్ని సాంఘిక బహిష్కరణకు గురిచేశారు. ఈ దాష్టికాలకు, అవమానాలకు మౌలా ఏమాత్రం చలించలేదు. ఆయన మీద ఎంతటి ఒత్తిడిలు వచ్చినా లొంగకుండా పరిటాల రిపబ్లిక్ కార్యక్రమాలలో తన సహచరుడు, పరిటాల రిపబ్లిక్ అధ్యక్షులు మాదిరాజు దేవరాజుతో కలసి నడిచారు. ఈ విషయంలో మౌలా మతం గాని, ఆయన మత మనోభావాలు గాని పరిటాల రిపబ్లిక్ సహచరుల నుండి మౌలా సాహెబ్‌ను వేరుచేయలేకపోయాయి.

చివరకు పరిటాల రిపబ్లిక్ వ్యవహారం మహాత్మాగాంధి దృష్టికి వెళ్లింది. ఆయన ఈ వ్యవహారాన్ని చూడాల్సిందిగా సర్దార్ పటేల్‌ను కోరారు. ఈలోగా 1948 సెప్టెంబర్‌లో నైజాం సంస్థానం ఇండియన్ యూనియన్‌లో విలీనం కావటంతో పరిటాల రిపబ్లిక్ కూడా ఇండియన్ యూనియన్‌లో భాగమైపోయింది. పరిటాల రిపబ్లిక్ యోధుల ఆకాంక్ష నెరవేరింది. అంతటితో షేక్ మౌలా సాహసం సుఖాంతమైంది.

ఈ నాటికి కూడా షేక్ మౌలా సాహెబ్ ఆనాటి సంఘటనలు గుర్తు తెచ్చుకుంటూ తన కష్టం మీద కుటుంబాన్ని పోషించుకుంటూ పేదరికం పొత్తిళ్ళలో బ్రతుకుతున్నారు. పరిటాల రిపబ్లిక్ వీరోచిత పోరాటం విశేషాలను సవివరంగా తెలుపుతూ **దూర్ హటో దునియా వాలో** పాటను మళ్ళీ మళ్ళీ ఉద్వేగభరితంగా విన్పిస్తూ ఆనందిస్తున్నారు. ◆

# ఆధార గ్రంథాలు



## ఆంగ్ల గ్రంథాలు :


1. The Indian Mutiny (1857-58), Ed. GW Forrest, Low Price Publications,Calcutta, 2003
2. Muslims in India, Vols I & II, Jain Naresh Kumar, Manohar Publication, Delhi 1979.
3. Freedom Movement and Indian Muslims, Shantimoy Ray, People's Pub lishing House Pvt. Ltd., New Delhi. 1983.
4. History of Freedom Movement in India - Tarachand, Four Vols., Govt. Pub lications, New Delhi.
5. Collected Works of Mahathma Gandhi, Govt. Publications, Govt. of India, New Delhi.
6. Who is Who Indian Martyrs - Dr. P.N. Chopra, Govt. of India Publications.
7. Prominent Muslim women in india (Bibligraphical Dictionary)- Al Kabir Al Kausar, Life and Light Publications, New Delhi, 1982.
8. Eminent Muslim Freedom Fighters, G. Allana, Low price Publications, Delhi 1993.
9. India's Struggle for Independence 1857-1947, Bipan Chandra and Others Penguin Books, 1997
10. Freedom Fighters Remember - Naveen Joshi, Govt. of India Publications.
11. India Wins Freedom, Maulana Abul Kalam Azad, Orient Longman 1995, Delhi.
12. Souvenir, Published by Institute of Objective Studies, New Delhi, 1995.
13. Understanding the Muslim Mind- Rajamohan Gandhi, Penguin Books,1987.
14. History of India, E. Marsden, Mac Millan & Co. Ltd., London, 1944.
15. The Muslim Situation in India, Ed. Iqbal A. Ansari, Sterling Publishers Pvt., Ltd., 1990.
16. Wahabi And Farazi Rebels of Bengal - Narahari Kaviraj, People's Publishing House, 1982.
17. Muslims in India - S. Abul Hasan Ali Nadwi, Academy of Islamic Research and Publications, Lucknow, 1980.







18. Who's Who of Freedom Struggle in A.P. Vols. I, II, III - A.P. Govt. Publications, 1983.
19. 1857 the Great Rebellion, Ashok Mehatha.
20. 20 Great Women of India, Ed. by AP Sarma, Prasant, New Delhi, 2003
21. A Concise History of The Indian People, H.G Rawlinson, OUP, 1950
22. The Indian Mutiny, G B Malleson, London, 1906.
23. A Survey of Indian History, K M Panikkar, Bombay, 1977
24. An Advanced History of India, RC Majumdar, Macmillan, Madras,1996.
25. Aurangzeb And Tipu Sultan, Dr. BN Pande, IOS New Delhi, 1996
26. Eighteen Fifty Seven, Surendra Nathsen, Govt. of India Publications, 1957
27. Highlights of the Freedom Movement in AP, Dr. Sarojini Regani, 1972
28. History of Bengal, Edited by Jadunath Sarkar.
29. History of British India, James Mill.
30. History of Freedom Movement in India, RC Majumdar, Calcutta, 1962
31. History of The Deccan, 2Vols. , GDE Gribble, New Delhi, 1990
32. How India wrought for Freedom, Annei Besant, 1915
33. How India Struggled for Freedom, Gopal Ram, Bombay, 1967
34. India’s Struggle for Independence, Dr. Bibin Chandra, Penguin s Books, New Delhi, 1997
35. Indian Muslims : A Political Boigraphy, Gopal Ram, Bombay, 1959
36. Indian Muslims, M. Mujeeb, New Delhi, 1967
37. Indian Muslims, Ed. by Dr. Asghar Ali Engineer, Delhi, 1985
38. Kerala Muslims, Ed. Dr Asghar Ali Engineer, Ajantha Publications,1995
39. Mopilla Muslims of Kerala - Ronald E Miller, Orient Longman, Madras, 1976
40. Muslim India, Md. Nomani. Kitabistan, Allahabad, 1942
41. Muslim Politics in Sindh (1938-1947), Md. Qasim Soomro, Pakisthan,1989
42. Muslim Rule In India, V D Mahajan, 1970
43. Muslims and Freedom Movement In India, K. Chabuey, Allahabad, 1990
44. Muslims and India’s Freedom Movement, Shan Muhammad, IOS, 2002
45. Rise of Muslims in Indian Politics, Rafiq Zakaria, Bombay, 1986
46. Role of Indian Muslims in Struggle for Freedom, Ed. by PN Chopra,1979
47. Role of Muslims in the National Movement, Mujafar Iman, Delhi, 1987
48. Saiyed Ahamed Shahid, Mohiuddin Ahmed, AIRP, Lucknow, 1980
49. Strom Over Srirangapatnam, P. Fernandaz
50. The Communal Triangle In India, Ashok Mehatha Ect., Allahabad,1942
51. The Discovery Of India, Jawahar Lal Nehru,1982
52. The Fakirs and Sannyasi Uprisings, Atis K. Dasgupta, New Delhi, 1992
53. The Great Mutiny India 1857, Christopher Hibbert, Penguin, 1980

54. The Indian Musalmans, W.W Hunter, Calcutta,
55. The Legend Makers- Some Eminent Muslim Women of India,
56 Gouri Srivastava, CPC, New Delhi, 2003
57. The Muslims of British India, P Hardy, Cambridge, 1972
58. The Politics of a Popular Uprisings -Bundelkhand in 1857, Tapti Roy, OUP 1984
59. The Role of Minorities In Freedom Struggle - Ed. Dr. A. Ali Engineer, 2006
60. The Seopy Mutiny and the Revolt of 1857- R.C.Majumdar, Calcutta,1957
61. The Sword of Tipu, Bhawan S. Gidwani, Allied Publishers Ltd., 1990
62. The Wahabi Movement in India, Qeyammudin Ahamed, Calcutta, 1966
63. Tipu Sultan, Prof. B.Shaik Ali, National Book Trust, India, H1995
64. Titu Mir, Mahaswetha Devi, Seagull Books, Culcutta, 2000
65. Mohammad Ali Jinnah, Matlubul Hasan Sauyid, Lahore, 1945.
66. The History of National Congress, B.Pattabhi Seetharamiah, Madras, 1935.
67. The Last Moghal, William Dalrymple, Penguin, 2006.
68. The Indian Mutiny, Saul David, Penguin, 2003.
Ect.,

**తెలుగు గ్రంథాలు :**

01. భారతదేశ స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర, కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం, విజయవాడ, 1984.
02. తెలంగాణా పోరాటంలో స్త్రీల వీరోచిత పాత్ర, పుచ్చలపల్లి సుందరయ్య, ప్రజాశక్తి బుక్ హౌస్, హైదరాబాదు, 1999.
03. స్వతంత్ర భారత స్వర్ణోత్సవ సావనీర్–రాయలసీమలో స్వాతంత్ర్యోద్యమం, స్వతంత్ర భారత స్వర్ణోత్సవ సావనీరు కమిటి, అనంతపురం, 1998.
04. పశ్చిమగోదావరి జిల్లా స్వాతంత్ర్యోద్యమ చరిత్ర, మంగళంపల్లి చంద్రశేఖర్, 1992.
05. ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ, సంపాదకులు : కొడాలి ఆంజనేయులు, తెలుగు అకాడమీ, హైదరాబాదు, 1978.
06. భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లింలు, సయ్యద్ నశీర్ అహమ్మద్, ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్, 1999.
07. స్వాతంత్ర్యోద్యమంలో కమ్యూనిస్టు దేశభక్తులు, సంపాదకులు : పరకాల పట్టాభి రామారావు, విజయవాడ.
08. స్వాతంత్ర్య సమర చరిత్ర, ముక్కామల నాగభూషణం, విజయవాడ, 1990





09. 1857 స్వరాజ్య సంగ్రామం, వి.డి.సావర్కార్, నవయుగభారతి, హైదరాబాద్, 2001.
10. సత్యశోధన లేక ఆత్మకథ, మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ, తెలుగు సేత : వి. రాధాకృష్ణమూర్తి, నవజీవన్, ఆహమదాబాద్, 1993.
11. భారత స్వతంత్ర పోరాటం, బిపన్ చంద్ర, ప్రజాశక్తి, హైదరాబాద్, 2006.
12. తోడేళ్ళ పాలుచేశారు, హిందీమూలం : ప్యారేలాల్, తెలుగు సేత : జి కృష్ణ, గాంధీ సాహిత్య ప్రచురణాలయం, హైదారాబాద్, 1969.
13. అబుల్ కలామ్ ఆజాద్, అర్షమల్సియాని, భారత ప్రభుత్వ ప్రచురణలు, న్యూఢిల్లీ, 1983.
14. తెలుగు తీర్పు, కె.శ్రీనివాసరావు, ప్రజాశక్తి ప్రచురణలు, హైదరాబాద్, 2003.
15. ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గాలు, యం. సత్యనారాయణ.
16. మనకు తెలియని మన చరిత్ర (తెలంగాణా రైతాంగ పోరాటంలో స్త్రీలు), స్త్రీశక్తి సంఘటన, హైదరాబాద్, 1986.
17. తెలంగాణా పోరాట స్మృతులు, ఆరుట్ల రామచంద్రారెడ్డి, డాక్టర్ ఆరుట్ల కమలాదేవి – రామచంద్రారెడ్డి ట్రస్టు, హైదరాబాద్, 2005.
18. తెలంగాణా వైతాళికులు, యం.యల్. నరసింహరావు, కాకతీయ విజ్ఞాన సమితి, హైదరాబాద్, 1976.
19. తెలుగువెలుగులు, మోనికా బుక్స్, హైదారాబాద్, 2002
20. ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం, మార్క్స్ అండ్ ఏంగిల్స్, ప్రగతి ప్రచురణాలయం, మాస్కో, 1987
21. ప్రాచీన లక్నో, ఉర్దూ మూలం : అబ్దుల్ హలీం షరర్, తెలుగు అనువాదం : దాశరధి, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, న్యూఢిల్లీ, 1971.
22. భారత స్వాతంత్ర్యోద్యమం : ఆంధ్ర ప్రదేశ్ ముస్లింలు, సయ్యద్ నశీర్ అహమ్మద్, ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్, ఉండవల్లి సెంటర్, గుంటూరు జిల్లా, 2001.
23. 1857 : ముస్లింలు, సయ్యద్ నశీర్ అహమ్మద్, తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్, హైదరాబాద్. 2008
24. షహీద్–యే–ఆజం అష్ఫాఖుల్లా ఖాన్, సయ్యద్ నశీర్ అహమ్మద్, ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్, 2002

25. మైసూరు పులి : టిపూసుల్తాన్, సయ్యద్ నశీర్ అహమ్మద్, ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్, 2004

26. భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం ప్రజాపోరాటాలు, సయ్యద్ నశీర్ అహమ్మద్, తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్, హైదరాబాద్, 2007.

27. భారత స్వాతంత్రోద్యమం : ముస్లిం మహిళలు, సయ్యద్ నశీర్ అహమ్మద్, తెలుగు పబ్లికేషన్స్, హైదారాబాద్, 2006.

**హిందీ గ్రంథాలు :**

01. హిందూస్థానీ ముసల్మానోంకా జంగ్–యే–ఆజాది మే హిస్సా, (హిందీ) – సయ్యద్ ఇబ్రహీం ఫిక్రీ, భారత ప్రభుత్వం ఆర్థిక సహాయంతో ప్రచురణ, న్యూఢిల్లీ, 1999.

02. భారత్‌కి స్వాతంత్ర సంగ్రామం మేఁ ముస్లిం మహిళావోంకా యోగ్‌దాన్ (హిందీ), డాక్టర్ ఆబెదా సమీయుద్దీన్, ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఆబ్జెక్టివ్ స్టడీస్, న్యూఢిల్లీ, 1997.

03. మేరే జీవన్ కీ కుచ్ యాదేఁ (హిందీ), డాక్టర్ జడ్.ఎం. అహమ్మద్, భారత కమ్యూనిస్ట్ పార్టీ, లక్నో, 1997.

04. ముస్లిం మహిళారత్న్ (హిందీ) ఆధ్యాపక్ జుహూర్ బక్ష్, స్వర్ణ జయంతి, న్యూఢిల్లీ, 1998

05. మౌలానా అబ్దుల్ కలాం ఆజాద్ (హిందీ) కె.సి. యాదవ్, హోప్ ఇండియా పబ్లికేషన్స్, గుర్‌గావ్ఁ, హర్యానా, 2004

06. క్రాంతికారీ మహిళాయేఁ (హిందీ), అశ్రాని హోరా, భారత ప్రభుత్వ ప్రచురణలు, న్యూఢిల్లీ, 1998.

07. భారత్ కె నారీరత్న (హిందీ), భారతప్రభుత్వ ప్రచురణలు, న్యూఢిల్లీ, 1998.

08. అవధ్ కి బేగం, (హిందీ) డాక్టర్ సుధా త్యాగి, భారత ప్రభుత్వ ప్రచురణలు, న్యూఢిల్లీ, 2000.

**కన్నడ గ్రంథాలు :**

01. భారత స్వాతంత్ర్య సంగ్రామదల్లి ముస్లిమర పాత్ర, (కన్నడ) ఖుద్దం పబ్లికేషన్స్, కర్నాటక, 1999.






## రచయిత ఇతర రచనలు

### ముద్రితాలు

**01. భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం మహిళలు**

**02. భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లింలు**

**03. భారత స్వాతంత్ర్యోద్యమం : ఆంధ్ర ప్రదేశ్ ముస్లింలు**

**04. భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం ప్రజాపోరాటాలు**

**05. షహీద్-యే-ఆజం : అష్ఫాఖుల్లా ఖాన్**

**06. మైసూరు పులి : టిపూ సుల్తాన్**

**07. భారత స్వాతంత్ర్యసంగ్రామం : ముస్లిం యోధులు - 1**

### అముద్రితాలు

**01. 1857 : ముస్లింలు**

**02. భారత స్వాతంత్ర్యసంగ్రామం : ముస్లిం యోధులు - 2, 3**

**03. భారతీయ ముస్లిం సమాజం : అపోహలు-వాస్తవాలు**

**04. చరిత్ర సృష్టించిన ముస్లిం మహిళలు**

**05. భారతీయ ముస్లింలు - స్థితిగతులు**

**07. మాతృభూమి సేవలో చరితార్థులైన ముస్లిం ముద్దుబిడ్డలు**

**08. చరితార్థులు (ఆల్బం)**

(1757 నుండి 1947 వరకు బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో పాల్గొన్న ముస్లిం యోధుల, స్వాతంత్ర్యోద్యమంలోని ప్రధాన సంఘటనల చిత్రాలు, ఫోటోలతో కూడిన అల్బం)

